

తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయంతో ముద్రించబడినది

# విషయసూచిక

నమో దేవాధి దేవాయ శఙ్ఖచక్ర గదాభృతే ।
నమో నిత్యాయ శుద్ధాయ వేంకటేశాయ తే నమః ॥

# 1. పురాణములు

భారతీయ సంస్కృతి స్వరూప స్వభావాలను సమగ్రంగా తెలుసుకోవాలంటే పురాణ అధ్యయనం చాలా ముఖ్యము. ఈ పురాణములను శ్రీవ్యాసమహర్షి రచించినట్లు తెలుస్తోంది. 'అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీ సుతః' అనే వచనము కూడా ఈ అర్థాన్నే తెలియజేస్తుంది.

## 1.1. పురాణ శబ్దము

పురాణ శబ్ద మెట్లు ఏర్పడినదో పాణిని మహర్షి ఇట్లు చెప్పెను.

పురాభవమ్ (ప్రాచీన కాలంలో జరిగినది) అనే అర్థంలో 'సాయం చిరంప్రాహ్ణేప్రగేఅవ్యయేభ్యష్ట్యుట్యులౌ తుట్ చ' (4-3-23) అనే సూత్రం ద్వారా పురా శబ్దానికి 'ట్యు' ప్రత్యయంచేసి, తరువాత దానిపై 'తుట్' ఆగమంగా వచ్చినందు వల్ల పురాతన శబ్దం ఏర్పడుతుంది.

ఇంతేకాకుండా పాణిని రచించిన 'పూర్వకాలైక సర్వజరత్పురాణ నవ కేవలాః సమానాధికరణేన' (2-1-49) 'పురాణ ప్రోక్తేషు బ్రాహ్మణ కల్పేషు (4-3-105) అనే ఇంకో రెండు సూత్రాలలో పురాణ శబ్దాన్ని ఉపయోగించాడు.

## 1.2. పురాణ లక్షణము

పురాణం పంచ లక్షణమని అమరసింహుడు ఇట్లు వివరించాడు.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।** (శ్రీమద్భాగవత-
**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్ ॥** పురాణపరిశీలనం)

సృష్టి స్థితి లయలతో కూడినది సర్గ అని, కల్పానంతరము జరుగు పునస్సృష్టిని ప్రతిసర్గ అని, ఋషుల సంతానపరంపరను వంశమని స్వాయంభువాది చతుర్దశ మనువుల చరిత్రను మన్వంతరమని, సూర్యచంద్ర రాజుల చరిత్రను వంశానుచరితమని అమరసింహుడు పురాణ లక్షణమును వివరించాడు.

## 1.3. పురాణ భేదాలు

పురాణాలు రెండు విధాలుగా ఉన్నాయి. అవి మహా పురాణాలు, ఉప పురాణాలు. పురాణములు పదునెనిమిది దేవీభాగవతము అష్టాదశ మహా పురాణములను ఇట్లు పేర్కొన్నది.

మద్వయం భ ద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయమ్ ।
అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥

మద్వయం = మత్స్య, మార్కండేయ పురాణములు; భ ద్వయం = భాగవత భవిష్య పురాణములు; బ్రత్రయం = బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త పురాణములు; 'వ' చతుష్టయం = విష్ణు, వరాహ, వామన, వాయు పురాణములు. అ = అగ్నిపురాణము; నా = నారదపురాణము; ప= పద్మపురాణము; లిం = లింగపురాణము ; గ= గరుడపురాణము; కూ = కూర్మ పురాణము; స్కా = స్కాందపురాణము.

ఈ పదునెనిమిది మహా పురాణములలో చెప్పక విడిచిన విషయములను సంశయించు వారి సందేహములను నివారించుటకు మరల పదునెనిమిది ఉపపురాణములను రచించాడు అవి.

1. సనత్కుమారము 2. నారసింహము 3. నారదీయము 4. శైవము 5.దౌర్వాసము 6. కాపిలము 7. మానసము 8. ఔశనసము 9. వారుణము 10. కాళికము 11. సాంబము 12. నందికృతము 13. సౌరము 14.పారాశరము 15. ఆదిత్యము 16. మాహేశ్వరము 17.శ్రీమద్భాగవతము 18. యోగవాశిష్ఠము.

ఈ మహా పురాణములు, ఉప పురాణముల వివరములు దేవీ భాగవతములో ప్రథమస్కంధము 3వ అధ్యాయమున కలవు.

ఇందు విష్ణుదేవుని ప్రధానముగా వర్ణించునవి సాత్త్విక పురాణములనియు, బ్రహ్మను వర్ణించునవి రాజస పురాణములనియు, శివుని వర్ణించునవి తామస పురాణములనియు చెప్పబడుచున్నవి.

## 1.4. పురాణం పంచమో వేదః

పురాణములు మిత్రుని వలె ఏదో ఒక కథను ప్రవచించి దాని ద్వారా "ఇది చేయవలసినది" – 'ఇది చేయకూడనిది' అని తెలుపుతుంది.

వేదాలలో చెప్పబడిన అంశాలు చాలావరకు నిగూఢంగా ఉంటాయి. ఎట్లనగా 'పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వతః" అనే వేదమంత్రం. ఒక మనిషితోటి మనిషికి సహాయం చేసి దాని ద్వారా తన జన్మను సఫలం చేసుకోమని బోధిస్తున్నది.

'మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని" అనే మంత్రం సమస్త ప్రాణులను మిత్రభావంతో చూడాలని నిర్దేశిస్తున్నది. ఇటువంటి విషయాలు సామాన్యునికి కూడా అర్థం అయ్యే విధంగా ఉపదేశం చేయడానికి పురాణాలు ఉద్భవించాయి. నాలుగు వేదాలతో సమానంగా పురాణములు 'పంచమో వేదః అని అయిదవ వేదంగా కీర్తింపబడుతున్నది.

## 1.5. పురాణ ప్రతిపాదిత విషయాలు

సామాన్య దృష్టితో చూచిన పురాణాలలో ప్రతిపాదితమైన విషయాలను ఈవిధంగా సంగ్రహంగా భావించవచ్చు.

> ఋషి దేశ మహావీర చరితాన్య వతారకాః ।
> లాజా విధివ్రతా, స్తీర్థా నామ్నాం సాహస్ర మేవచ ॥
> ఋషి రాజ్ఞాం వంశసూచీ, యుగా స్సృష్టిశ్చ ద్వాదశ । (కూర్మపురాణం)
> సామాన్యతః పురాణేషు, విషయాః ప్రతిపాదితా ॥ పుట. 24

ఋషులు, దేశాలు, మహావీరుల చరిత్రలు, అవతారకథలు, యజ్ఞాలు, ఆచరింపవలసిన విధులు, వ్రతాలు, తీర్థాలు, ఋషుల రాజులవంశాదికాలు, యుగాలు, సృష్టి క్రమము అనే పంద్రెండు విషయాల వర్ణన సామాన్య దృష్టితో చూడగా పురాణాలలో ఉండాలని పెద్దలు తెలుపుతున్నారు.

**1.6. పురాణ శ్రవణ ప్రయోజనము**

పురాణములు ఇహలోక పరలోక సౌఖ్యములను కలిగించునవి. ఎవడు పురాణములను ఎల్లప్పుడూ భక్తియుక్తుడై వినునో వాని బుద్ధి నిర్మలమై ఎల్లప్పుడూ ధర్మమునందాసక్తి కలిగియుండును. కావున ధర్మార్థ కామ మోక్షముల ఫలములను పొందగోరువారు తప్పక పురాణములను వినాలి.

**యథా పాపాని పూయంతే గంగా వారి విగాహనాత్ ।** (వాయుపురాణం)
**తథా పురాణ శ్రవణాద్ దురితానాం వినాశనమ్ ॥** (95–86)

గంగానదిలో స్నానం చేయుటచే పాపాలు నశిస్తాయి. అలాగే పురాణ శ్రవణంచే కష్టాలు దూరం అవుతాయి. అని భారతీయుల నమ్మకము.

పురాణములను వినుట వల్ల తనలోనున్న అరిషడ్వర్గములు, శోక-మోహములు తొలగి జ్ఞానము కలుగును.

**2. ఇతిహాసము :**

ఇతి – హ– అస్మిన్ అస్తీతి = ఇతిహాసః ; 1. ఇతిహాసము అనగా – ఇతి + హ + ఆస = ఈవిధంగా జరిగెను కదా అన్నది ఇతిహాసమనే మాటకు అర్థము.

2. పూర్వ రాజుల కథల్ని తెలిపేది ఇతిహాసము.

3. నిదర్శన పూర్వకంగా ధర్మాన్ని ఉపదేశించేది ఇతిహాసము.

4. ఇతిహాసమంటే వేదార్థ ప్రతిపాదకమగు గ్రంథము.

రామాయణమును 'వేదః ప్రాచేతదాసీద్ సాక్షాద్రామాయణాత్మనా' అని, భారతమును 'భారతః పంచమోవేదః' అని ఉద్ఘాటించుటచే శ్రీమద్రామాయణ, మహాభారతములు వేదతుల్యములు.

ఈ రామాయణ, మహాభారతములు రెండునూ వేరువేరు యుగాలలో జరిగిన మానవగాథలలో నుంచి, సృష్టిలోని ధర్మ స్వరూపాన్ని మనకు సాక్షాత్కరింపచేస్తాయి. రామాయణ, మహాభారతముల గూర్చి సంక్షిప్తముగా

తరువాత అంశములో వివరించబడింది. ఇతిహాసము మానవవంశ చరిత్రను నిరూపించును.

## 2.1. ఇతిహాస లక్షణము

> ధర్మార్థ కామ మోక్షాణాం ఉపదేశ సమన్వితమ్ । (కావ్య మీమాంస వివృతి)
> పూర్వ వృత్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే ॥

ధర్మార్థ కామ మోక్షములు ఉపదేశములతో కూడినది. పూర్వము జరిగిన కథావృత్తమును ఇతిహాసమని చెప్పుచున్నారు.

## 2.2. ఇతిహాసమును గూర్చి కవుల వ్యాఖ్యానము

1. అభినవ గుప్తపాదుడు : "ఏవం ప్రకారాః ప్రత్యక్ష పరిదృశ్యమానాః అగమికార్థాః కర్మఫల సంబంధ స్వభావాః యత్ర ఆసతే తేన ఇతిహాసేన" ... అభినవ గుప్తపాదుడు తన నాట్య శాస్త్ర వ్యాఖ్యానంలో కర్మఫల సంబంధ స్వభావం గల ఆగమికార్థాలు ఎందులో ప్రత్యక్ష పరిదృశ్యమానాలౌతుంటాయో అదే ఇతిహాసమని పేర్కొన్నాడు.

2. విద్యారణ్య సాయణాచార్యులు : 'దేవాసురాస్సయుం యత్తా ఆసన్' అని పూర్వం జరిగినదట అన్నట్లు పూర్వ ప్రసిద్ధ వృత్తాలను చెప్పేది 'ఇతిహాస'మని తమ వేదభాష్యంలో చెప్పారు.

3. రాజశేఖరుడు :

> పరక్రియా పురాకల్ప ఇతిహాస గతిర్ద్విధా । .. (కావ్యమీమాంస)
> స్యాదేక నాయకా పూర్వా ద్వితీయ బహునాయకా ॥

అని కావ్యమీమాంసా కర్త రాజశేఖరుడు పేర్కొన్నాడు. ఇతిహాసం ప్రవర్తిల్లే విధానాన్ని బట్టి రెండురకాలుగా ఉంటుంది. ఒకటి పరక్రియ. ఒకే నాయకుడు కలిగినది పరక్రియ. దీనికి రామాయణము లక్ష్యము.

రెండవది పురాకల్పం. అది బహునాయకం. ఇందుకు మహాభారతము లక్ష్యము.

4. అమరసింహుడు : 'ఇతిహాసః పూర్వ వృత్తమ్ అని అమరసింహుడు చెప్పాడు. 'ఇతిహాసః' – ఇతి హ పారం పర్యోపదేశ ఆస్తే అస్మిన్ అన అధారే ఘఞ్.

ఇతిహాసం రచనా ప్రణాళిక వేరు. ఇది సృష్టి క్రమాన్ని నేపథ్యంలో ఉంచుకొని మానవుడికి ప్రాధాన్యమిచ్చి అతనిచుట్టు కథలను అల్లుతుంది. ఇలా మానవగాథలను దర్శించి వ్రాశారు కాబట్టే వాల్మీకి వ్యాసుల, రామాయణ భారతాలు సార్వకాలికాలు, సార్వజనీనాలు అయినాయి.

## 2.3. ఆదికావ్యము – శ్రీమద్రామాయణము

ఆదికవి వాల్మీకి మహర్షి రచించిన శ్రీమద్రామాయణము ఆదికావ్యముగను, ఇతిహాసముగను పరిగణిస్తున్నారు.

> వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే ।
> వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥

పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడు దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుడుగ అవతరింపగానే పరమ పురుషతత్త్వ వర్ణన ప్రధానమైన వేదము శ్రీమద్రామాయణముగా అవతరించింది.

రామాయణములో ఏడుకాండలు వున్నాయి. అవి 1. బాలకాండ, 2. అయోధ్యా 3. అరణ్య 4. కిష్కింధా, 5. సుందర, 6. యుద్ధ, 7. ఉత్తరకాండలు ఈ ఏడు కాండల్లో 24 వేల శ్లోకములు వున్నవి.

## 2.4. రామాయణ ప్రాశస్త్యం

> **కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ ।**
> **పౌలస్త్య వధ మిత్యేవం చకార చరిత వ్రతః ॥** (బాలకాండ 4–7)

శ్రీరామచంద్రుని ఆదర్శ చరిత్రమును వర్ణించుటచే ఈ మహాకావ్యము

శ్రీమద్రామాయణమనియు, సమస్త నారీలోకమునకు తన సౌశీల్య సచ్ఛారిత్రముచే ఆదర్శభూతమై సకల సద్గుణములకును నిలయమైన సీత పవిత్ర చరిత్రను వర్ణించుటచే 'సీతాయాశ్చరితం' అనియు, దీన సాధ్వీ సాధు జనులను బాధించుటయే వృత్తిగా స్వీకరించి లోక పీడనము గావించుచు అధర్మ మార్గమున సంచరించిన రావణుని వధను వర్ణించుటవలన 'పౌలస్త్య వధ' అనియును వ్యవహరిస్తున్నారు. రామాయణమును శరణాగత శాస్త్రమని చెప్పుదురు.

**యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।**
**తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి ॥** (బాలకాండ 2-36)

"కొండలు ఎంతకాలము నిలచియుండునో, నదులు ఎంతకాలము ప్రవహించునో, అంతకాలము రామాయణ కథ లోకములో ప్రచారమున నుండునని వరమిచ్చి బ్రహ్మ అంతర్హితుడయ్యాడు. ఇటు బ్రహ్మ వరముచే లభించిన దివ్యదృష్టిగల వాల్మీకి నోటినుండి ఆవిర్భవించిన రామాయణము కేవల కథా మాత్రమే కాక వేదార్థ ప్రతిపాదకము అగుటలో సంశయము లేదు. అందుచేతనే ఇది... "ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్" ఒక్కొక్క అక్షరము మహాపాతకములను నశింపజేయ జాలినది" అని పెద్దలు ప్రశంసించిరి.

## 2.5. శ్రీమన్మహాభారతము

వ్యాస భారతమునకు జయ[1] గ్రంథమని పేరు. ఆత్మ విజయమే యిందలి ప్రతిపాద్య విషయమని గ్రంథనామమే సూచించుచున్నది. సంఖ్యా సంకేత విద్యను

1. జయం : జయ అనగా భారతాఖ్యానమని అర్థము. అష్టాదశ పురాణములను, రామచరిత్రమును, సమస్తమైన పంచమ వేదమనెడి ప్రసిద్ధిపొందిన మహాభారతమున్ను, జయ అను పేరుతో విద్వాంసులు చెప్పుచున్నారు. అదేవిధముగా విష్ణుధర్మములను, సనాతనములైన శివధర్మములను జయ అను పేరుతో విద్వాంసులు వ్యవహరించు చున్నారు. భవిష్యపురాణ వచనము వలననూ నాలుగు విధములైన ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థములు ఈ భారతముచే పుష్కలముగా వృద్ధినొందుచున్నవి గాన ఇచట జయ అనగా మహాభారతమని అర్థము.

అట్టి 18 సంఖ్య జయభావ సూచకము.

"కాదినవ-టాదినవ - పాదిపంచ- యాద్యష్ట" అను క-ట-ప-యాది సూత్రము ననుసరించి వర్ణమాలలోని 'జ-య' అను అక్షరములకు 8-1 అంకెలు సంకేతములగును. "అంకానాం వామతో గతిః" అను సంఖ్యా సూత్రము ననుసరించి 8-1 అంకెలు 18 అగును.

అందుకే ఈ పదునెనిమిది (18) భారతపర్వములకు, 18 గీతాధ్యాయములకు సూచకము. భారతము మానవుని మనోజయమునకు సంబంధించినది కావున వ్యాసుడు దీనికి జయేతిహాసమని పేరుపెట్టాడు.

> నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
> దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్ ॥ (ఆదిపర్వం)

నారాయణుని, జీవులలో ఉత్తముడైన నరుని, సరస్వతీ దేవిని, వ్యాసుని నమస్కరించి జయమని పేరుగల భారతేతిహాసమును పలుకవలసింది.

భారత భాగములకు పర్వములని పేరు. "పిపర్తీతి పర్వన్" (పౄ పాలన పూరణ యోః) అను కోశ నిరుక్తిం బట్టి వస్తు రక్షాపూరకమగు దానిని పర్వమందురు. పర్వశబ్దము అగ్ని త్రయీ వేదమునకుచెందింది.

ఇవి అగ్నిపర్వములు భారతము అగ్ని విద్య కనుక నిందలి భాగములకు పర్వములని పేరు. వ్యాసుడు మహాభారతమును 18 పదునెనిమిది [2]పర్వములుగా సంగ్రహించాడు.

ఈ జయ కథను వేదవ్యాసుడు తన శిష్యుల ద్వారా వివిధ లోకాలలో వ్యాపింపజేశాడు. దేవలోకమున చెప్పుటకై నారదుని, పితృలోకమున చెప్పుటకై

---

2. 18 పర్వాలు - 1. ఆదిపర్వము, 2. సభా 3.అరణ్య 4.విరాట 5.ఉద్యోగ 6. భీష్మ 7.ద్రోణ 8. కర్ణ 9. శల్య 10. సౌప్తిక 11. స్త్రీ 12. శాంతి 13.అనుశాసనిక 14.అశ్వమేధ 15.ఆశ్రమవాస 16. మౌసల 17.మహాప్రస్థానం 18. స్వర్గారోహణ పర్వాలు.

దేవలుని, గరుడ గంధర్వ యక్ష రాక్షస లోకములందు చెప్పుటకై శుకుని, మనుష్య లోకమున జనమేజయునకు చెప్పుటకై వైశంపాయనుని పంపారు.

**2.6. మహాభారతం లేఖకుడు గణపతి**

వ్యాసమహర్షి భారతగ్రంథము బుద్ధిస్థముగా జేసికొని దీనిని శిష్యులకు అధ్యాపనము చేయుట యెట్లని ఆలోచించుచుండగా, అది గ్రహించి బ్రహ్మ ప్రత్యక్షముకాగా, ఆ విషయములను సంగ్రహముగా చెప్పి ఈ గ్రంథమునకు లేఖకుడు మాత్రము ఇక్కడ లేడని చెప్పగా, అంతట బ్రహ్మ గ్రంథమును వ్రాయుటకు గణపతిని స్మరించుమని చెప్పి వెళ్ళాడు. అపుడు వ్యాసుడు గణపతిని స్మరించాడు. అంతట వ్యాసుని యెదుట గణపతి ప్రత్యక్షము కాగా, గణపతి పూజించి గణపతితో...

**లేఖకో భారతస్యాస్య భవ త్వం గణనాయక ! (మహాభారతము–**
**మయైవ ప్రోచ్యమానస్య మనసాకల్పితస్య చ ॥ ధర్మసూక్ష్మ దర్శనం)**

గణనాయకా ! నాచే చెప్పబడు ఈ భారతాభ్యాసమునకు నీవు లేఖకుడవు కమ్ము. అని వ్యాసుడు కోరగా, అంతట గణపతి వ్యాసునితో...

**శ్రుత్వైతత్ప్రాహ విఘ్నేశో యది మే లేఖినీక్షణమ్ ।**
**లిఖితో నావతిష్ఠేత తదాస్యాం లేఖకోహ్యహమ్ ॥**

నేను వ్రాయునపుడు నాకలము క్షణమైనను ఆగకుండెడి పద్ధతిని నీవు చెప్పగలిగిన నేను వ్రాసెదను. అపుడు వేదవ్యాసుడు నీవు అర్థము చేసికొనుచు వ్రాసిన యెడల నేనట్లే చెప్పెదనెను. అని ఇలా ఆ యిరువురి ప్రతిజ్ఞలతో మహాభారతరచన సాగినది.

వ్యాసుడు తన కవితాధారకు ఒకక్షణము అడ్డురాగా గణపతికి అర్థము కాకుండునట్లొక్క శ్లోకమును చెప్పును.

గ్రంథ గ్రంథిం తథా చక్రే ముని ర్గూఢం కుతూహలాత్ । (మహాభారతం-
సర్వజ్ఞో౽పి గణేశో యత్ క్షణమాస్తే విచారయన్ ॥ ధర్మసూక్ష్మ దర్పణం)

అలా వ్యాసుడు గణపతిని ఆపుట కొరకై గ్రంథమందు గూఢమైన గ్రంథులను విలాసముగా కల్పించాడు. గూఢం అనగా ఒకటి అర్థము కాగా ఆ పదమునకు మరొక అర్థము వచ్చును. సర్వజ్ఞుడైన గణేశుడే వ్రాయుటనాపి ఆ శ్లోకముల అర్థము తెలుసుకొనుటకు క్షణకాలము ఆలోచింపవలసివచ్చెను. అట్టి శ్లోకములే 8800 వాని యర్థము దురవగాహమని వ్యాసమహర్షియే చెప్పాడు.

అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతాని చ । (మహాభారతం-
అహంవేద్మి శుకోవేత్తి సంజయో వేత్తి వా న వా ॥ ధర్మసూక్ష్మ దర్పణం)

ఇట్టి మహాభారతమున 8800 శ్లోకములున్నవి. ఆ శ్లోకముల అంతరార్థమును గ్రహించుట నాకు తెలుసును, శుకునకు తెలుసును, సంజయునకు తెలుసునో తెలియదో నాకు సంశయమని వ్యాసులే చెప్పినారు.

## 2.7. కవిత్రయ భారతము

1. క్రీ.శ. 11వ శతాబ్దమున చాళుక్య రాజకులతిలకుడగు రాజరాజ నరేంద్రుడు వైదికమతోద్ధరణ చేయ సంకల్పించి భారత కథను తెలుగున నన్నయార్యుని వేడాడు. ఆ కోరిక మేరకు ఆయన ఆస్థాన కవియు, సకలవిద్యా విశారదుడును, వాగనుశాసనుడును, ఉభయ భాషా కవితారచనాశోభితుడును అగు నన్నయ భారతమును ఆరంభము నుండి అరణ్యపర్వము నాలుగవ ఆశ్వాసము నందలి శారదరాత్రులు అను పద్యము వరకు భారత రచన చేశాడు.

2. పదమూడవ శతాబ్దమున మనుమసిద్ధి ప్రభువునకు మంత్రియు, దండనాథుడును అగు తిక్కన విరాటపర్వము మొదలుకొని తక్కిన పదేను పర్వములు ఆంధ్రీకరించాడు.

3. పిమ్మట పదునాలుగవ శతాబ్దమున ఎఱ్ఱన పూనుకొని అరణ్య-పర్వ శేషమును అసమాన ప్రతిభతో పూర్తిచేశాడు.

సంస్కృత వాఙ్మయమున సంస్కృత భారతమునకు ఎట్టి స్థానమో, ఆంధ్ర సారస్వత ప్రపంచమున కవిత్రయ భారతమునకు అట్టి విశిష్ట స్థానము గలదనుట నిర్వివాదాంశము.

**2.8** మహాభారత ప్రాశస్త్యము

చత్వార ఏకతో వేదాః భారతం చైక మేకతః ।
సమాగతైః సురర్షిభిః తులామారోపి తం పురా ॥

మహత్త్వేచ గురుత్వే చ ధ్రియమాణం యతోఽధికం ।
మహత్త్వాద్భారత్వాచ్చ మహాభారతముచ్యతే ॥

చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యధికం యదా ।
తదాప్రభృతి లోకేఽస్మిన్మహా భారతముచ్యతే ॥

(మహాభారతము – ధర్మసూక్ష్మ దర్శనం, పుట. 135)

వేదములు లోకమున ధర్మవిజ్ఞానములు వేద ప్రతిపాదిత ధర్మ విజ్ఞానము మహాభారతమున నుండుటచే దానికి వేదత్వము సిద్ధించింది. అందుకే పంచమవేదమని ప్రసిద్ధిచెందింది. అంతేగాక నాలుగువేదములలో వ్యాప్తి నొందియున్న ధర్మ విజ్ఞానసారము మహాభారతమున రాశీభూతమై యున్నది. దేవర్షులు ఒకసారి త్రాసులో ఒక ప్రక్క నాలుగువేదములను మరొక ప్రక్క మహాభారతమును ఉంచి తూచిరి. మహత్వ గురుత్వములందు వేదముల కంటె మహాభారతమే ఎక్కువగా తూగుటచే అది సార్థక నామమైనదని మహాభారతముననే చెప్పబడింది.

పంచమ వేదమనగా, నాలుగు వేదముల కంటె భిన్నమైనది అని కాదు. చతుర్వేదములలోని సారాంశమంతయు గ్రహించి ఆఖ్యాన ఉపాఖ్యానముల ద్వారా

సులభముగా ధర్మ వేదాంతాది తత్త్వములను బోధించెడి నూతన వేదమనియే భావము.

> ధర్మేచ అర్థే చ కామే చ మోక్షే భరతర్షభ ।
> యది హాఽస్తి తదన్యత్ర యన్నే హాఽస్తి నతత్ క్వచిత్ ॥ ఆదిపర్వం.62-53

ధర్మార్థకామమోక్షములను గూర్చి భారతమునందేది కలదో అదే ఇతరత్ర కలదు. ఇందులో లేనిది మరెక్కడా లేదు.

ఈ మహాభారతం పురుషార్థ చతుష్టయము గురించి, మానవ ధర్మములను గురించి సోదాహరణముగా వర్ణించు ఈ బృహద్ గ్రంథమును 'మానవ ధర్మశాస్త్రమని' పెద్దలు చెప్పెదరు. ఇక నన్నయ్యగారు భారతమును గూర్చి....

సీ. 'ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీత శాస్త్రంబని కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని యైతిహాసికు లితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురా సముచ్ఛయంబని, మహిఁగొని యాడుచుండ,

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరుగుచుండఁజేసె భారతంబు"

(ఆదిపర్వం. 1-32)

ఈ మహాభారతం ధర్మ శాస్త్రంబుగా, వేదాంత గ్రంథముగా, నీతిశాస్త్రముగా, మహాకావ్యముగా, అలంకారశాస్త్రముగా, ఇతిహాస కావ్యముగా, పురాణముగా ప్రఖ్యాతిగాంచింది.

'యన్న భారతే తన్న భారతే'... భారతమున లేనిది భారతదేశముననే లేదు. ఈ ప్రకారమగు అనుపమఖ్యాతి నార్జించినదీ మహాభారతము.

తిక్కన సోమయాజియు...

'వేదములకు, అఖిలస్మృతి వాదములకు, బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను తామాదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్'

(విరాటపర్వం 1-4)

ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థముల నిర్ణయమును గూర్చి శ్రుతి స్మృతి పురాణములకు భేదాభిప్రాయమేర్పడినప్పుడు ధర్మనిరూపణము చేయదగు ప్రమాణ గ్రంథము మహాభారతమే.

ఈవిధంగా ఆర్ష వాఙ్మయానికి అంతటికీ మూదల (ప్రమాణం) అయి ఉండటం మహాభారతం ప్రత్యేకత.

మహాభారతము పంచమవేదమని ప్రసిద్ధి కెక్కింది. పంచమవేదమనగా నాలుగు వేదములకంటె భిన్నమయినది అని కాదు. చతుర్వేదములలోని సారాంశమంతయు గ్రహించి, ఆఖ్యాన ఉపాఖ్యానముల ద్వారా సులభముగ ధర్మ - వేదాంతాది తత్త్వములను బోధించెడి నూతన వేదమనియే భావము.

## 3. శ్రీమద్భాగవతము

త్రికాలజ్ఞాన సంపన్నులైన వేదవ్యాసమహర్షి, ఋగ్యజుస్సామ అథర్వణములని వేద విభజన గావించి, ఉపనిషత్సారభూతమగు వేదాంత తత్త్వమును 555 బ్రహ్మ సూత్రములుగా సూత్రీకరించాడు. లక్ష శ్లోక పరిమితమైన మహాభారతమును రచించాడు. పురాణములను రచించినా ఆయనకు మనోవ్యాకులత కలిగింది.

నిరంతరం భగవద్ధ్యాన తత్పరుడిగా యున్నను వ్యాసునకు మనశ్శాంతి కలగ లేదు. మనశ్శాంతి పొందడానికి ఏం చేయాలా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. అపుడు అక్కడికి నారద మహర్షి వచ్చాడు. వ్యాసుడు ఆయనను అర్ఘ్య పాద్యాలతో సత్కరించి ఆ తర్వాత వ్యాసుడు నారదుడితో తన మనసులోని చింతను చెప్పాడు. అందుకు నారదుడు స్పందిస్తూ ధర్మాలను గురించి ఎంత చెప్పినా శ్రీహరి మహిమను వర్ణించకపోతే అవన్నీ వ్యర్థమే అవుతాయి.

పురాణేతిహాసాలలో ప్రసంగవశంగా మాత్రమే భగవంతుడిని కీర్తించావు. ప్రధానంగా ఆయన విశేషాలను ఎక్కడా కీర్తించలేదు. అందుకే ఇంతటి అశాంతి అని అన్నాడు. ఆ అశాంతి పోవడానికి శ్రీ మహావిష్ణువు లీలా విశేషాలు అధికంగా ఉండే మహాభారతాన్ని రచించమని నారదుడు వ్యాసుడికి బోధించాడు. వ్యాసుడు నారదుడి ఆదేశానుసారం బదరికాశ్రమానికి వెళ్ళి భాగవతాన్ని రచించాడు. 12 స్కంధములు కల్గిన భాగవతాన్ని తన కుమారుడైన శుకుడి చేత చదివించాడు. ఆ శుకయోగి పరీక్షిన్మహారాజుకు ఏడు రోజులపాటు భాగవతాన్ని వినిపించి ఆ రాజుకు చిత్తశాంతి కలిగేలా జేశాడు.

## 3.1. పోతనభాగవతము

సహజ పాండిత్యం కలిగిన బమ్మెర పోతన (క్రీ.శ. 1400-60) మధ్య ప్రాంతంలో జీవించాడు. దేవర కొండరాజ్యంలో నివసించిన పోతన వ్యవసాయం చేస్తూ హాలికుడిగా జీవనప్రస్థానం సాగించాడు. కవిసార్వభౌముడైన శ్రీనాథుని బావమరిది అని ప్రతీతి. సహజపాండిత్యుడని బిరుదు. ఆంధ్రమహాభాగవతంతో పాటు భోగినీదండకం, వీరభద్రవిజయం రాశాడు. మహాభాగవతం ఆయన కీర్తికి పరాకాష్ఠ. పోతన ఆత్మీయాంశమైన భక్తి భావం భాగవతంలో మెండుగా కనిపిస్తుంది. పిల్లలనుంచి పెద్దల వరకు పండితుల నుండి పామరుల వరకు ప్రీతి పాత్రమైన కావ్యము భాగవతము. ఇక పోతన వినయ నయసంపత్తికి యీ క్రింది పద్యం అద్దం పడుతుంది.

> **భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైన, తమ్మి చూలికైన,**
> **విబుధ జనుల వలన విన్నంత, కన్నంత తెలియ వచ్చినంత తేటపరతు.**
>
> (భాగవతము)

## 3.2 భాగవత ప్రాశస్త్యము

'భ' అంటే భక్తి; 'గ' అంటే జ్ఞానము; 'వ' అంటే వైరాగ్యము; 'త' అంటే తత్త్వము ; 'ము' అంటే ముక్తి అని యుందురు. భక్తి, జ్ఞాన, వైరాగ్య

తత్త్వ ముక్తులతో కూడినది గనుక భాగవతమును 'మోక్షశాస్త్రమని' అంటారు.

**నిగమ కల్పతరోర్గలితఫలం, శుకముఖాదమృత ద్రవసమ్మితమ్ ।**
**పిబత భాగవతం రసమాలయం, ముహురహో రసికా భువిభావుకాః ॥**

**(భాగవతం)**

రసజ్ఞులగు భక్తులారా! ఈ భాగవతము, వేదమను కల్పవృక్షము పండిన పండు వంటిది. శ్రీ శుకదేవుడను చిలుక ముఖముతో సంబంధము కలుగుట వలన ఇది పరమానందమయమగు అమృతముతో పరిపూర్ణమైనది. ఈ పండునందు టెంకె మొదలయిన వదలదగిన అంశము ఏమాత్రమును లేదు. ఓ రసజ్ఞులారా ! రసరూపమగు ఈ పండును మోక్షము లభించు వరకు మరల మరల ఆస్వాదించుడు.

భాగవతమంటే ఒక పురాణగ్రంథము కాదు. జ్ఞాన వైరాగ్య తత్త్వములలో భగవంతుని పొంది జ్ఞాన ప్రకాశంలో వెలిగించే గ్రంథరాజము భాగవతము.

**శ్రీ మద్భాగవతం పుణ్యమాయురారోగ్య పుష్టిదమ్ ।**
**పఠనాచ్ఛ్రవణాద్ వాపి సర్వపాపైః ప్రముచ్యతే ॥ (భాగవతము)**

ఈ పవిత్ర భాగవత పురాణము ఆయుస్సును, ఆరోగ్యమును, పుష్టిని, ఇచ్చుచున్నది. దీనిని పఠించుటవలనను, శ్రవణము చేయుట వల్ల, మానవుడు పాపములన్నింటి నుండి విడువబడుచున్నాడు.

## 4. కాలం – మన్వంతర కాలము

అరువది విఘడియలతో ఒక ఘడియ. అరువది ఘడియలతో ఒక (రోజు) దినమగును. (లేక) 7 1/2 ఘడియలు ఒక జాము. ఎనిమిది జాములు ఒకపగలు, ఒకరాత్రి. ముప్పది దినములు ఒక మాసము. అట్టి పంద్రెండు మాసములు ఒక సం॥ము. ప్రతి మాసములో మొదటి 15 రోజులు శుక్ల పక్షము. తరువాత 15 రోజులు కృష్ణ పక్షము.

యుగములు నాలుగు అవి 1.కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు.

| | | |
|---|---|---|
| 1.కృతయుగ ప్రమాణం | – | 17,28,000 సం॥లు |
| 2.త్రేతా యుగ ప్రమాణం | – | 12,96,000 సం॥లు |
| 3. ద్వాపర యుగ ప్రమాణం | – | 8,64,000 సం॥లు |
| 4.కలియుగ ప్రమాణం | – | 4,32,000 సం॥లు |
| | | 43,20,0000 సం॥లు |

43,20,000 సంవత్సరాలు అయితే ఒక మహాయుగం. 71 మహాయుగాలు ఒక మన్వంతరం. 71 మహాయుగాలకు అంటే 3086, 71428 సం॥ల 6 నెలల 25 రోజుల 42 గడియలకాలాన్ని ఒక మన్వంతరం[3] అంటారు. ఒక్కొక్క మన్వంతర కాలమున ఒక్కొక్క మనువు పాలన చేస్తాడు.

ఇలా 14 (పదునాలుగు) మనువులు, ఒక్కొక్కరూ డెబ్బై ఒక్క మహాయుగాల కాలంపాటు సృష్టిని పరిపాలిస్తారు. మనువు మనువుకూ మధ్యకాలంలో సృష్టి, ప్రళయం సంభవించి సర్వశూన్యమై పోతుంది.

ఇలాంటి పదునాలుగు మన్వంతరాలు 432 కోట్ల మనుష్య సం॥లు ఇది బ్రహ్మదేవునికి ఒకపగలు దీనికి 'ఉదయకల్పం' అని పేరు. ఇందులో బ్రహ్మాదుల సృష్టి జరుగుతుంది. ఇంతేకాలం బ్రహ్మదేవునికి రాత్రి. దీనికి 'క్షయకల్పము' అనిపేరు. ఈ సమయంలో సంకర్షణ అగ్ని భూర్భువస్సువర్మహార్లోకాలు దగ్ధం అవుతాయి. దీనినే నైమిత్తిక ప్రళయం అంటారు.

---

3. మన్వంతరం – మన్వంతరం మనుర్దేవా మనుపుత్రా సురేశ్వరాః ।
ఋషయోఽంశావతారాశ్చ హరేః షడ్విధముచ్యతే ॥

మనువు, మనుపుత్రులు, దేవతలు, ఋషులు, అంశావతారాలు, ప్రసిద్ధ సంఘటనలు జరిగిన విషయాలు చెప్పినపుడు దానిని 'మన్వంతరం' అంటారు.

ఉదయ కల్పం, క్షయ కల్పం రెండూ కలిస్తే బ్రహ్మకు ఒక అహోరాత్రం అవుతుంది. దీనికే 'కల్పం' అని పేరు. కల్పం అనగా – 2060 మహాయుగముల కాలము.. ఇలాంటి 360 కల్పాలు బ్రహ్మదేవునికి ఒక సం॥ము. ఇలాంటి 100 సం॥లు బ్రహ్మదేవునికి పర అయుర్దాయము. దీనికి ఒక 'మహాకల్పం' అని, దీనినే ముక్తికాలమని అంటారు. ఈ మహాకల్పం తరువాత వచ్చే ప్రళయాన్ని ప్రాకృతిక ప్రళయము అంటారు.

## 4.1. మన్వంతరం – సప్తర్షులు – దేవతాగణం – దేవాధిపతి

| మన్వంతరం | సప్తర్షులు | దేవతాగణం | దేవాధిపతి |
|---|---|---|---|
| 1. స్వయంభు | మరీచి, అంగిరసుడు, అత్రి, పులహుడు, క్రతువు పులస్త్యుడు వసిష్ఠుడు. | యాములు అను దేవతలు. | రోచనుడు |
| 2. స్వారోచిష | ఊర్జమహర్షి,దత్తుడు, స్తంభుడు, ప్రాణుడు, బృహస్పతి, నిశ్చ్యవనుడు కశ్యపుడు. | పారావతులు, తుషితులు, సుపర్వగణాలు. | విపశ్చితుడు |
| 3. ఔత్తమి | వసిష్ఠుని ఏడుగురు కొడుకులు, రజస్సు, గోత్రుడు ఊర్ధ్వబాహువు, సవనుడు అనఘుడు, సుతపసుడు శుక్రుడు. | సుధాములు, సత్యులు శివులు, పదర్శనులు వశవర్తులు గల దేవతా గణాలు. | సుశాంతుడు |
| 4. తామస | జ్యోతిర్మయుడు, పృథువు, కావ్యుడు, చైత్రుడు, అగ్ని వనకుడు, పీవరుడు, నరుడు. | హరిగణాలు సత్య గణాలు సుధీగణాలు. | శిబి |

| | | | |
|---|---|---|---|
| 5. రైవత | హిరణ్యరోముడు, వేదశ్రీ, ఊర్ధ్వబాహువు, వేదబాహువు, సుధాముడు పర్జన్యుడు, మహాముని. | అమిత అభూత రజులు వైకుంఠులు సుమేధులు | విభుడు |
| 6. చాక్షుష | సుమేధ మహర్షి, విరజుడు, హవిష్మంతుడు, ఉత్తముడు, మధు, అతినాముడు, సహిష్ణుడు. | ఆద్యులు,ప్రసూతులు భవ్యులు, పృథగులు, లేఖులు, కాలాంతరాన ఎనిమిదేసి గణాలు కలిగాయి. | మనోజవుడు |
| 7. వైవస్వత | వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి జమదగ్ని, గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు. | ఆదిత్యులు, వసువులు, రుద్రులు మొదలైన దేవగణాలు. | ఓజస్వి |
| 8. సూర్యసావర్ణి | దీప్తిమంతుడు, గాలవుడు, పరశురాముడు, కృపాచార్యుడు అశ్వత్థామ వ్యాసుడు. | సుతపస్వులు అమితాభులు, ముఖ్యులు ఈ మూడుశాఖలు ఇరవై ఒక్క ఉప శాఖలుగా విస్తరిస్తుంది. | బలి |
| 9. దక్షసావర్ణి | సవనుడు, ద్యుతిమంతుడు భవ్యుడు, వసువు, మేధాతిథి, జ్యోతిష్మంతుడు, మేధాతిథి, జ్యోతిష్మంతుడు, సత్యుడు. | ద్వాదశగణాన్వితులైన పారులు, మరీచి గర్భులు, సుధర్ములు షట్త్రింశతి గణాలతో దేవలోకం అలరారుతుంది. | అద్భుతుండు |
| 10. బ్రహ్మసావర్ణి | హవిష్మంతుడు, సుకృతుడు, సత్యుడు, తపోమూర్తిగల నాభాగుడు, అపరతి మౌజుడు, సత్యకేతుడు. | విశుద్ధులు, సుధాములనే పేరుగల దేవతలు. | శాంతమహాబలి |

| | | | |
|---|---|---|---|
| 11. ధర్మసావర్ణి | అగ్నితేజుడు, వపుష్మంతుడు వృషుడు, ఘృణి, ఆరుణి హవిష్మంతుడు, అనఘుడు. | కామగులు, నిర్వాణరతులు, విహంగములు గల దేవతాగణాలు. | |
| 12. రుద్రసావర్ణి | తపస్వి, సుతపసుడు, తపోమూర్తి, తపోరతి, తపోధృతి తపోద్యుతి, తపోధనుడు. | హరితులు, రోహితులు, సుకర్ములు, తారులు, సుమనులు అని ప్రత్యేక దశకాన్వితులైన దేవగణాలు. | రుద్రదాముడు |
| 13.రౌచ్యసావర్ణి | నిర్మోహుడు, తత్త్వదర్శి నిష్ప్రకమ్ప్యుడు,నిరుత్సుకుడు ధృతిమంతుడు, అవ్యయుడు సుతపసుడు. | త్రయస్త్రింశద్విశాళి లతోసుధర్ములు, సుకర్ములు 99గణాలు మహాసంఖ్య కలిగి అలకారుతుంది. | దివస్పతి |
| 14. భౌత్యసావర్ణి | అగ్నిబాహుడు, శుచి, శుక్రుడు, మాగధుడు, అగ్రీధుడు, ముక్తుడు జితుడు. | చాక్షుషులు, పవిత్రులు కనిష్ఠులు, బ్రాజికులు వచోవృద్ధులను దేవగణాలు. | శుచి |

---

## 5. సప్త సంఖ్య

'సప్త' అనగా ఏడు. సంఖ్యా శాస్త్రం ప్రకారం '7' అను సంఖ్యకు విశేష ప్రాధాన్యత ఉంది. '7' అను సంఖ్యకు కేతువు అధిపతి'. '7' అను సంఖ్యను భగవంతుని సంఖ్యగా నమ్ముతారు. ఎందుకంటే భగవంతునియందు ఏడు ముఖ్యమైనవి కానవచ్చును. అవి 1. చక్రము (సుదర్శనము), 2. శంఖము (పాంచజన్యము) 3. గద (కౌమోదకి), 4. ఖడ్గము (నందకము), 5. శార్ఙ్గము

(ధనస్సు) 6. ఇతడు ధరించు కౌస్తుభము, 7. వక్షః స్థలమునందలి మచ్చ శ్రీవత్సము.

### 5.1. అష్టాదశ విజ్ఞాన సోపానములలో సప్త సంఖ్య

అష్టాదశ విజ్ఞానసోపానములలో సప్తసంఖ్య, విశిష్టమైనది. విశ్వములో సప్త సంఖ్య కల్గిన విషయాలు మనకు కొన్ని గోచరిస్తున్నాయి. అవి.

1. **సప్త మోక్షదాయక పురములు :**

**అయోధ్యా మథురా మాయా కాశీకాంచీ హ్యవంతికా ।**
**పురి ద్వారావతి, జ్ఞేయః సప్తైతే మోక్షదాయికా ॥** గ.పు.2-49-114

అయోధ్య, మధుర, మాయాపురం, (హరిద్వారం) కాశీ, కంచి, అవంతి, ద్వారక ఈ ఏడు పురములు మోక్షప్రదమైనవి.

2. **సప్త పరశురామ క్షేత్రాలు :** ఉడిపి, పళని,కుంభాసి, కోటేశ్వర, శంకనారాయణ, గోకర్ణం, కొలూర్ (మూకాంబిక)

3. **సప్త స్వరములు మరియు అధిష్ఠాన దేవతలు :** షడ్జమం (స) అగ్ని ; రిషభం (రి) బ్రహ్మ ; గాంధార (గ) సరస్వతి ; మధ్యమం(మ) శివుడు ; పంచమం (ప) విష్ణువు ; ధైవతం (ద) వినాయకుడు ; నిషాదం (ని) సూర్యుడు.

4. **సప్త వారములు :** భాను (ఆది) వారం ; ఇందు (సోమ) వారం ; భౌమ (మంగళ) వారం ; సౌమ్య (బుధ) వారం ; బృహస్పతి (గురు) వారం ; భృగు (శుక్ర) వారం ; మంద (స్థిర) వారం ; దీనినే శనివారమని చెప్పెదరు.

5. **సప్త మహర్షులు :** కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వశిష్ఠుడు,జమదగ్ని.

6. **సప్త పదార్థములు :** ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము.

7. సప్తమండలము : వాయుమండలము, వరుణమండలము, చంద్రమండలము, సూర్యమండలము, నక్షత్రమండలము, అగ్ని మండలము, జ్యోతిర్మండలము.

8. సప్తమాతృకలు : బ్రాహ్మీ, మహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మహేంద్రీ, చాముండీ.

9. సప్త సూర్యపుత్రులు : యముడు, శని, సావర్ణి, వైవస్వతుడు, అశ్వనీదేవతలు, కర్ణుడు, సుగ్రీవుడు.

10. సప్త సముద్రములు : లవణ,క్షీర,జల,దధి,ఘృత,ఇక్షు,సుర సముద్రములు.

11. సప్తకులపర్వతములు : హిమవంతము, నిషధము, వింధ్యము, మాల్యవంతము, గంధమాదనము,హేమకూటము, పారియాత్రము.

12. సభా సప్తాంగములు : కవీశ్వరులు, విద్వాంసులు, పౌరాణికులు, పూర్వకథలు చెప్పెడివారు, పాఠకులు, హాస్యకారులు, గాయకులు.

13. సప్తావరణ : అండకోశో శరీరేస్మిన్ సప్తావరణ సంయుతే అని భాగవతం (2-1-25) చెప్తోంది. దీనికి పృథివ్యావరణ తతః ఆప్తేజో వాయ్వాకాశాహంకార మహత్తత్వాదీని సప్త' అని శ్రీధర వ్యాఖ్యానంలో చెప్పబడినది. దీనినే పోతనగారు ధరణి సలిల తేజస్సమీరణ గగనాహంకార తత్త్వంబులని యేడు సప్తావరణంబులచే నావృతంబగు (భాగ.2-11) అని తెనిగించాడు. అండపిండ బ్రహ్మాండాలని అంటున్నాం వీటన్నింటికీ పొరలు యేడే, తల్లి గర్భంలోనూ శిశువు ఏడు పొరలు మధ్య పవళించి యుంటాడు.

14. సప్తగిరులు : శ్రీవేంకటేశ్వర సుప్రభాతమునందు ఏడుకొండల పేర్లను తెలియజేయబడినది.

శ్రీ శేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రి ముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయ వసతే రనిశం వదంతి
శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ శ్లో. 15

15. సప్త అధోలోకములు : అతలము, వితలము, సుతలము, తలాతలము, రసాతలము, మహాతలము, పాతాళము.

16. సప్త ఊర్ధ్వలోకములు : భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము.

17. సప్త ధాతువులు : బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరం, సత్తు, సీసము.

18. సప్త ధాతువులు : శుక్లం, మాంసం, ఎముకలు, చీము, చర్మము, మెదడు, శోణితము.

19. సప్త ద్వీపములు : పుష్కరద్వీపము, శాకద్వీపము, క్రౌంచద్వీపము, కుశద్వీపము, శాల్మలద్వీపము, పక్షద్వీపము, జంబూద్వీపము.

20. సప్తగణాలు : ఋషులు, గంధర్వులు, నాగులు, అప్సరసలు, యక్షులు, రాక్షసులు, దేవతలు.

21. సప్త యజ్ఞములు : అగ్నిష్టోమము, అశ్వమేధము, బహు సువర్ణకము, రాజసూయము, గోమేధము, వైష్ణవము, మహేశ్వరము.

22. సప్త ధాన్యాలు : వ్రీహులు, యవలు, పెసలు, కొఱ్ఱలు, గోధుమలు, మినుములు, శనగలు.

23. సప్త నదులు : గంగ, యమున, సరస్వతి, గోదావరి,కృష్ణ, నర్మద, కావేరి.

24. సప్త సింధూనదులు : ఇండస్, జీలం, చినా, రవి, బీస్, సట్లజ్, సరస్వతి, సింధూ నది కారణంగా సింధూ అను శబ్దమే హిందూ అని వ్యవహరించిరి.

25. సప్తాంగములు : స్వామి, అమాత్యుడు, మిత్రములు, ధనాగారము, రాష్ట్రము, దుర్గము, సేనవిపరీతమ్.

26. ఋషులు ఏడు విధములు : బ్రహ్మర్షి దేవర్షి మహర్షి పరమర్షి కాండర్షి శ్రుతర్షి, రాజర్షి

27. సప్తమోక్ష తీర్థములు : స్వామిపుష్కరిణి, ఆకాశగంగ, పాపవినాశనము, పాండుతీర్థము, కుమారధారికా తీర్థము, తుంబర తీర్థము, కృష్ణతీర్థము.

## 5.2. సప్త చిరంజీవులు

సప్తచిరంజీవులు ఎవరెవరో పురాణవచనము ద్వారా తెలుస్తున్నది.

అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః । (మహాభారతము
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥ ధర్మసూక్ష్మదర్శనము)

అశ్వత్థామ, బలిచక్రవర్తి, వేదవ్యాసుడు (కృష్ణద్వైపాయనుడు) హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు, పరశురాముడు అను వారు సప్త చిరంజీవులు.

ఈ సప్తచిరంజీవులను గూర్చి పూరాణేతిహాసముల ఆధారముగా వారి వృత్తాంతమును కూలంకుషముగా తదుపరి చాప్టర్ నుండి వివరించబడింది.

# 6. అశ్వత్థామ

ద్రోణాచార్య, కృపికి ఈశ్వరానుగ్రహముచే జన్మించినవాడు అశ్వత్థామ. అశ్వత్థామ రుద్రాంశసంభూతుడు. ఇతడు సప్తచిరంజీవులలో ఒకడు.

## 6.1. అశ్వత్థామ జననము

భరద్వాజ మహర్షి గంగానది ఆవిర్భవించిన పవిత్ర ప్రదేశంలో నిరంతర నిష్ఠాపరుడై ఏకాగ్రధ్యానంతో తపమాచరిస్తున్నాడు. ఒకనాడు ఆ మహర్షి గంగానదిలో స్నానమాచరించుచుండగా, అదే సమయంలో ఘృతాచి అనే అప్సరస జలక్రీడలాడి ఒడ్డునకు రాగా అంతలోనే పెనుగాలి వీచడంతో ఆమె ధరించిన వస్త్రం ప్రక్కకు తొలగింది. ఆ అప్సరస అవయవసౌష్ఠవం తిలకించిన భరద్వాజ మహర్షి మనోనిగ్రహం సడలి మరుక్షణంలోనే రేతః పాతం జరిగింది. భరద్వాజుడు ఆ అమోఘవీర్యం అత్యంత జాగరూకతతో సంగ్రహించి ద్రోణమనే యజ్ఞ పాత్రికలో భద్రపరిచాడు. మరికొంతకాలానికి ఆ ద్రోణ గర్భం విడివడి బృహస్పతి అంశతో 'ద్రోణ' అను కుమారుడు జన్మించాడు. ద్రోణమనగా యజ్ఞ పాత్ర. ఆ పాత్ర యందు ఉద్భవించాడు గనుక 'ద్రోణ' అను పేరు అతనికి సార్థకమయ్యెను.

ద్రోణుడు అగ్నివేశుని శుశ్రూష వల్ల ఆగ్నేయాస్త్రమే గాక అనేక శస్త్రాస్త్రాల ప్రయోగోపసంహార రహస్యాలవగాహన చేసుకొన్నాడు. మరికొంతకాలానికి తన పితృదేవుని అనుమతితో కృపాచార్యుని సహోదరి కృపిని వివాహమాడి గృహస్థాశ్రమం స్వీకరించాడు.

ద్రోణుడు పరమేశ్వరుని గురించి నియమనిష్ఠలతో తపమాచరించగా, అతని తపస్సుకు సంతసించి పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకోమన్నాడు. అంతట ద్రోణుడు ఈశ్వరా! ఓటమి నెరుగనివాడూ, అజేయ బలపరాక్రమశాలి, మహాయోధుడూ, అతిరథుడూ, నీ యంశతో కూడిన ఒక పుత్రుణ్ణి అనుగ్రహించు అని ప్రార్థించాడు ద్రోణుడు. పరాత్పరుడు అట్లే యగుగాక!

అని వరము ప్రసాదించి అంతర్హితుడయ్యాడు. అనతికాలంలోనే ఆ దంపతులకు అశ్వత్థామ జన్మించాడు. జన్మించీ జన్మించగానే ఆ శిశువు ఉచ్చైశ్రవ శబ్దముతో సమానమయిన గంభీర కంఠస్వరంతో రోదించాడు.

అంతట అశరీరవాణి..

అశ్వస్యేవాస్య యత్ స్థామ నదతః ప్రదిశో గతమ్ ॥ (ఆదిపర్వం)
అశ్వత్థామైవ బాలోయం తస్మాన్నామ్నా భవిష్యతి । (130-49)

భూమిపై అవతరించగానే అశ్వ స్వనంతో రోదించడం వల్ల ఈ శిశువు ఇప్పటినుంచి అశ్వత్థామ నామధేయంతో సుప్రసిద్ధుడు కాగలడని ఆదేశించింది. కృపీ ద్రోణాచార్యులు ఆ అద్భుతానికెంతో సంతోషించి తమ వంశం పునీతమయినదని భావించి ఆనందించారు.

## 6.2. ఆదిపర్వము

అశ్వత్థామ ఆనాటి కానాటి కొంచెం పెరిగి పెద్దవాడయినాడు. ఒకనాడు భరద్వాజ ఆశ్రమ పరిసరంలో కలవారి పసిపిల్లలు కొందరు ఆవుపాలు తాగడము చూచి అశ్వత్థామ గూడ తనకు అటువంటి పాలుకావాలని మొండి పట్టుపట్టాడు.

మరల ఒకరోజు ఆవుపాలకోసమై అశ్వత్థామ ఒకనాడు అదే పనిగా గొంతెత్తి ఆక్రోశించడం గమనించి ఇరుగుపొరుగు తాపసకుమారులు కొందరు వరి పిండి నీళ్ళలో కలిపి ఆవుపాలని నమ్మించి అశ్వత్థామకు యిచ్చారు. ఆ బాలుడైన అశ్వత్థామ ఆ తెల్లని నీళ్లన్నీ ఒక్క చుక్కయినా మిగలకుండా తాగివేసి, ఆపైన మరి ఆనందం పట్టలేక ఆహా! నేను ఈవేళ ఆవు పాలు త్రాగినానని పలుకుతూ ఆవేశంతో అదేపనిగా నృత్యం చేశాడు.

అశ్వత్థామ తన తండ్రి వద్దనే వేదవేదాంగములను, ధనుర్వేదమును అభ్యసించాడు. కౌరవ, పాండవులు గూడ ద్రోణాచార్యుని వద్ద ధనుర్విద్యాభ్యాసం చేశారు. అర్జునుడు తన సహాధ్యాయులందరిలోను అధికుడై గురుదేవుని

మన్ననలందుకొన్నారు. కాని ఆ విషయం అశ్వత్థామకు ఏ మాత్రము రుచించలేదు. ధనుర్వేద పాండిత్యంలో అర్జునునికన్న తానే గొప్పవాడిని కావలెనని పరమాభిలాష.

**6.3. విరాటపర్వము**

అజ్ఞాతవాసమున నున్న పాండవులను గుర్తించదలచి కౌరవులు సమాలోచన చేయగా, అపుడు కర్ణుడు ప్రగల్భాలు పలుకగా అంతట కృపాచార్యుడు కర్ణుని మందలించి తన మనోభిప్రాయమును కౌరవులకు తెలియజేశాడు. తరువాత అశ్వత్థామ కోపముతో కర్ణుని ఉద్దేశించి

**న చ తావజ్జితా గావో న చ సీమాన్తరం గతాః ।**
**న హాస్తినపురం ప్రాప్తాస్త్వం చ కర్ణ వికత్థసే ॥ 50-1 శ్లో**

**సంగ్రామాంశ్చ బహూన్ జిత్వా లబ్ధ్వా చ విపులం ధనమ్ ।**

**విజిత్య చ పరాం సేనాం నాహుః కించన పౌరుషమ్ ॥50 -2**

కర్ణా ! మనమింకను గోవులను పూర్తిగా వశపరచుకొనలేదు. శత్రువుల పొలిమేరలను దాటలేదు. హస్తినాపురమును చేరలేదు. నీవేమో ప్రగల్భాలు పలుకుచున్నావు. అనేక యుద్ధములు చేసియు, గొప్పధనమును సాధించియు, శత్రుసేనను రూపుమాపియు బుద్ధిగలవారు పౌరుషమును చాటుకొనరు.

పరమాత్ముడు నాలుగు వర్ణముల వీరికి తగిన పనులను ఏర్పాటు చేశాడు. వేనితో ధనములను పొందవచ్చునో ఏ పనులు చేసిన చెడ్డదో చెప్పెదను వినుము. వేదములను అధ్యయనము చేసి, యజ్ఞములను చేయించుటయో ,తాను స్వయముగా చేయుటయో బ్రాహ్మణునకు కర్తవ్యము. క్షత్రియుడు విల్లుచేపట్టవలెను. అతడు యజ్ఞము చేయవచ్చునుగాని చేయింపరాదు. వైశ్యుడు ధనమార్జించి వేదమున చెప్పిన కర్మములను చేయవలెను. శూద్రుడు మూడు వర్ణముల వారియందును శుశ్రూష చేయవలెను.

ప్రాప్య ద్యూతేన కో రాజ్యం క్షత్రియ స్తోష్టుమర్హతి ।
తథా నృశంస రూపోஉయం ధార్తరాష్ట్రశ్చ నిర్ఘృణః ॥ 50 -8

ద్యూతములో రాజ్యమును గెలిచిన క్షత్రియుడు స్తుతికర్హుడా? ఈ ధృతరాష్ట్ర పుత్రుడా విధముగా క్రూరుడు సిగ్గులేని వాడు.

నీవు ఎప్పుడైన, ఎక్కడైన అర్జునునిగాని, నకులునిగాని, సహదేవుని గాని గెలిచితివా? ధర్మరాజు గాని, బలవంతులలో భీముడుకాని నీకు ఎన్నడైన ఏ యుద్ధముననైన ఓడెనా? ఓ కర్ణా! రజస్వలయై ఏకవస్త్రముతో నున్న ద్రౌపదిని ఏయుద్ధమున గెలిచి సభకీడ్చితివి? ఆనాడు విదురుడేమనెనో స్మరింపుము.

యథాశక్తి మనుష్యాణాం శమమాలక్షయామహే ।
అన్యేషామపి సత్త్వానామపి కీట పిపీలకైః ।
ద్రౌపద్యాః సంపరిక్లేశం న క్షన్తుం పాండవో ఉర్హతి ॥ 50-14

మనుష్యులే కాదు. పురుగులు చీమలు కూడ శక్తియున్నంత మేరకు ఓర్పు వహించుట చూచుచున్నాము. కాని మీరు ద్రౌపదికి పెట్టిన దుఃఖమును పాండవులు క్షమింపరానిది.

ధృతరాష్ట్ర కుమారులను రూపుమాపుటకై అర్జునుడు అవతరించాడు. ఆ అర్జునుడు దైవమును దైవ బలముతో ఎదుర్కొంటాడు. అస్త్రబలమును అస్త్రబలముతో త్రిప్పి కొట్టును. అతనికి సాటి ఎవ్వరు. ఇదిగో నీమామ తెలివిగలవాడు. క్షత్ర ధర్మమున పండితుడు కపట ద్యూతమున నేర్పుగలవాడు. గాంధారరాజు శకునియే ఇచట యుద్ధమాడవలెను. సభలో మేనమామతో కూడి జూద మెట్లాడితివో యిప్పుడుట్లే యీ శకుని రక్షింపగా యుద్ధము చేయుము. ఈ యోధులు వారి కోరిక మేరకు యుద్ధము జరుగుగాక! నేను మాత్రము అర్జునునితో యుద్ధమాడను. పశువులకై విరాటుడు వచ్చినచో అతని తోడనే కదా మనము పోరాడవలసిందని చెప్పాడు. అపుడు భీష్ముడు అశ్వత్థామ ఆలోచన మంచిదని చెప్పి, ఓ అశ్వత్థామా! నీవును ద్రోణాచార్య కృపాచార్యులను జరిగిన

దానంతటిని క్షమింపవలెను. ఇది మనలో భేదము పొందుటకు తగిన సమయము కాదు. మనమందరము అర్జునునితో పోరాడవలెనని పలుకగా అంతట అశ్వత్థామ భీష్మునితో...........

> నైవ న్యాయమిదం వాచ్యమస్మాకం పురుషర్షభ ।
> కింతు రోషపరీతేన గురుణా భాషితా గుణాః ॥ 51-14
> శత్రో రపి గుణా గ్రాహ్యా దోషా వాచ్యాగురోరపి ।
> సర్వథా సర్వయత్నేన పుత్రే శిష్యే హితం వదేత్ ॥ 51-15

ఓ మహానుభావా! మా యీ న్యాయబద్ధమైన మాటను నీవు నిందింపరాదు. గురువు రోషముతో కూడినవాడై అర్జునుని గుణములను కీర్తించాడు. శత్రువే అయినను గుణములను గ్రహింపవలెను. గురువే అయినను వాని దోషములను నిందింపవలెను. అన్నివిధాల ప్రయత్నములచే పుత్రుని విషయమున, శిష్యుని విషయమున హితమును పలుకవలెనని పలుకగా, అంతట చివర దుర్యోధనుడు అందరిని శాంతింపచేసి ఉత్తరగోగ్రహమునకు సంసిద్ధులను చేశాడు.

### అశ్వత్థామతో అర్జునుని పోరాటము

అర్జునుడు వాయువేగముతో దూకుడుగా వచ్చి అశ్వత్థామను నిలువరించాడు. దేవేంద్ర వృత్రాసురుల పోరాటమేమో అన్న భ్రాంతి కలిగించింది. అర్జునుడు ప్రయోగించిన బాణపరంపరలకు అశ్వత్థామ కొంత అయినా చెక్కుచెదరక ఒకే ఒక బాణంతో అర్జునుని వింటినారిని ఛేదించాడు. వారిరువురు పోరాటమును జూచి దేవతలు  ఆశ్చర్యము చెంది ఇప్పటివరకు ఈ తీరులో అర్జునునెదిరించి పోరాడిన వీరులు కురుసైన్యములో మరెవ్వరునూ లేరని అశ్వత్థామను ప్రశంసించారు.కర్ణుడు తన వింటినారిని ఆకర్ణాంతం లాగి ధనుష్టంకారము చేయగా, అశ్వత్థామను వదలి అర్జునుడు కర్ణునితో పోరు సలిపి జయించాడు.

### 6.4. ఉద్యోగపర్వము

**భీష్ముడు అశ్వత్థామను ప్రశంసించుట :**

ఉద్యోగపర్వమున రథాతిరథులను వర్ణించి చెప్పునపుడు భీష్ముడు అశ్వత్థామను గూర్చి ఉద్యోగపర్వమున నిట్లు చెప్పినాడు.

**ద్రోణ పుత్రో మహేష్వాసః సర్వానేవాతి ధన్వినః ।**
**సమరే చిత్ర యోధీ చ దృఢాస్త్రశ్చ మహారథః ॥ 167-3**

ద్రోణుని కొడుకు అశ్వత్థామ గొప్ప ధనుర్ధరుడు. మహా ధనుష్కుల నందరిని మించువాడు. ఆశ్చర్యము కల్గునట్లు యుద్ధం చేయువాడు. చెక్కు చెదరని అస్త్రవిద్య కలవాడు మహారథుడు. అర్జునునివలెనే ధనస్సునుండి వదలిన ఈతని బాణములు కూడ కలిసి ఒక్కటిగా పోవును.

**నైష శక్యో మయా వీరః సంఖ్యాయతుం రథసత్తమః ।**
**నిర్దహేదపి లోకాంస్త్రీనిచ్ఛన్నేష మహారథః ॥ 167-5**

**క్రోధస్తేజశ్చ తపసా సంభృతో ఆశ్రమవాసినామ్ ।**
**ద్రోణేనానుగృహీతశ్చ దివ్యైః అస్త్రైరుదారధీః ॥ 167-6**

**దోషస్త్వస్య మహానేకో యేనైవ భరతర్షభ ।**
**న మే రథో నాతిరథో మతః పార్థివసత్తమః ॥ 167-7**

ఈతని తరగతిని నిర్ణయించుట నాకు అశక్యము. కోరినచో నీతడు మూడు లోకములను దహించి వేయగలడు. క్రోధము, తేజస్సు తపస్సు కలిగిన అశ్వత్థామకు ద్రోణుడు దివ్యాస్త్ర సంపద అనుగ్రహించెను. కాని ఇతనిలో ఒక మహా దోషమున్నది. అందువల్ల ఇతడు రథియో, అతిరథుడో నేను చెప్పలేకున్నాను.

ఈ అశ్వత్థామ ఆయుష్మంతుడు. ఇతనికి సమానుడు రెండు సేనలలోను లేడు. ఏకాకియై దైవసైన్యమును గూడ జయింపగలడు. అరచేయి శబ్దము

చేతనే పర్వతములను ఛేదించగలడు. మంచి శరీర సౌష్ఠవము గలవాడు. లెక్క లేనన్ని సుగుణములు గలవాడు. తేజసంపన్నుడు. యముని వలె సహింపరానివాడు. క్రోధము నందు ప్రళయాగ్ని కల్పుడు. ఇతడు మహాభారత యుద్ధము యొక్క చివరి భాగమును పూర్తి చేయును.

### 6. 5. భీష్మపర్వము

భీష్మపర్వము ఐదవరోజున అశ్వత్థామకు అర్జునునకు జరిగిన ద్వంద్వ యుద్ధములో అర్జునుడు వేసిన బాణముకు, అశ్వత్థామ కవచము భిన్నమై శరీరము రక్తసిక్తమయ్యెను. అయినను అశ్వత్థామ ఏ మాత్రము వ్యథ చెందక అర్జునునిపై బాణప్రయోగము చేయుచు భీష్మ రక్షణార్థమై నిలిచాడు.

అట్లు మహాద్భుతముగా పోరాడుచున్న అశ్వత్థామను వీరులందరు ప్రశంసించిరి. కృష్ణార్జునులతో నిలిచి యుద్ధము చేయగలవాడు అశ్వత్థామయే అని వారు తలచిరి. అర్జునుడు గూడ అందరు వినుచుండగా అశ్వత్థామను ఈవిధముగా ప్రశంసించాడు.

"ఈ నా ఆచార్య పుత్రుడు, తండ్రి నుండి అనేక అస్త్రములను ప్రయోగోపసంహారపూర్వకముగా నేర్చినవాడు. విశేషించి బ్రాహ్మణుడు కాబట్టి నాకు పూజనీయుడు." ఇట్లు తలచి అర్జునుడు, అశ్వత్థామపై దయజూపి, అతనిని విడిచి ఇతరులతో యుద్ధము చేయుటకు పోయాడని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధ విషయములు తెలియజేశాడు.

భీష్మపర్వమున ఏడవరోజు జరిగిన యుద్ధములో శిఖండి[4] అశ్వత్థామ

---

4. శిఖండి : ఈమె పూర్వజన్మమున అంబ. ఈమె శివునిగూర్చి తపమాచరించగా, పరమేశ్వరుడు సంతసించి ఏమి వరముకావాలో కోరుకోమనగా అంతట ఆమె భీష్ముని చంపునట్లుగ ఆమె వరమిమ్మని కోరినది. జన్మాంతరమున నీవు ద్రౌపదరాజునకు శిఖండి అను నామముతో కూతురువై పుట్టి కుమారుడువై భీష్ముని మరణము కలిగింతువని శివుడు చెప్పెను.

భ్రూమధ్య భాగమునందు మూడు బాణములతో కొట్టాడు. అట్లు లలాటమునందు గ్రుచ్చుకొనిన మూడుబాణములతో అశ్వత్థామ మూడు బంగారు శిఖరములతో ప్రకాశించుచున్న మేరుపర్వతము వలె శోభిల్లాడు.

తరువాత అశ్వత్థామ క్రోధముతో ఒక క్షణములో శిఖండి యొక్క ధ్వజ, సారథి, తురగ, శస్త్రములను అనేక బాణములతో ఛేదించి పడగొట్టాడు. తరువాత శిఖండి హతాశ్వమైన రథమునుండి ఎగిరి దుమికి ఖడ్గహస్తుడై గ్రద్ధ వలె యుద్ధరంగ మంతట తిరిగాడు. తరువాత అశ్వత్థామ శతచంద్ర శోభితమైన శిఖండి డాలును అతని ఖడ్గము ఖండించి నిశిత శరములతో శిఖండిని కొట్టాడు. అట్లు బాధితుడైన శిఖండి సాత్యకి[5] రథ మెక్కిపోయాడు.

**అశ్వత్థామ - నీలుల యుద్ధము:**

భీష్మపర్వమున ఎనిమిదవరోజు జరిగిన యుద్ధములో దుర్యోధన అశ్వత్థామలు, భీమసేనుని పీడించుట చూచి అభిమన్యుడు మరియు నీలుడు కౌరవవీరులపై దాడి చేసిరి. నీలుడు భీమునకు పరమ మిత్రుడు. అతడు పూర్వము నుండియే అశ్వత్థామను ద్వేషించేవాడు. కాబట్టి అతనిని ఎదిరించాడు. పూర్వము దేవతలకు కూడ భయంకరుడు, మూడు లోకములను భయపెట్టిన విప్రచిత్తిని ఇంద్రుడు గొట్టినట్లు నీలుడు బాణముతో అశ్వత్థామను గొట్టి గాయపరచాడు.

అప్పుడు రక్తసిక్తుడై బాధపడిన అశ్వత్థామ నీలుని చంపుటకు కమ్మరిచే పదును చేయబడిన భల్లములతో నీలుని నాలుగు రథాశ్వాలను, సారథిని, ధ్వజమును, మరియొక భల్లముతో నీలుని యెదపైన కొట్టాడు. ఆ దెబ్బతో నీలుడు బాధచేత రథములోనే మూర్ఛిల్లాడు. అలా మూర్ఛిల్లిన నీలుని చూచి ఘటోత్కచుడు అశ్వత్థామపైకి ఉరికాడు. ఇతర రాక్షసవీరులు కూడ వారి ననుసరించగా, అశ్వత్థామ తన పైకి వచ్చుచున్న రాక్షసులను సంహరించాడు.

---

5. సాత్యకి : శిని కుమారుడైన సత్యకి పుత్రుడు ఇతనికే యుయుధానుడను పేరు గలదు. శ్రీకృష్ణునితో కలసి యుండువాడు. ఇతను పాండవులకు హితుడు.

మరికొంతమంది రాక్షసులు అతనికి భయపడి విముఖులై పోవుచుండుట చూచి ఘటోత్కచుడు క్రుద్ధుడై మాయను సృష్టించి అశ్వత్థామను మూర్ఛిల్లజేశాడు. అని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధ విషయములు తెలియజేశాడు.

భీష్మపర్వమున ఎనిమిదవ రోజు జరిగిన యుద్ధములో అశ్వత్థామ సాత్యకి ధనస్సును రెండుగా ఖండించాడు. అప్పుడు సాత్యకి మరియొక ధనస్సును తీసుకొని అరువది బాణములతో అశ్వత్థామ బాహువులపై, ఎదపైనను కొట్టాడు. దానితో అశ్వత్థామ పీడితుడై ధ్వజదండము పట్టుకొని రథముపై కూలబడి మూర్ఛిల్లాడు. అశ్వత్థామ కొంతసేపటికి తేరుకొని ఒక బాణముతో సాత్యకి రథ ధ్వజమును ఛేదించాడు. సాత్యకి పీడిస్తున్న అశ్వత్థామను విడిపించదలచి ద్రోణాచార్యుడు సాత్యకిని తీక్ష బాణముచే కొట్టాడు. అప్పుడు సాత్యకి అశ్వత్థామను విడిచి ద్రోణునితో యుద్ధము చేసెనని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధవిషయములను తెలియజేశాడు.

అశ్వత్థామ భీమసేనుని సఖుడగు నీలున్ని, మరియు ఘటోత్కచుని కుమారుడైన అంజనీపర్వుని సంహరించాడు. తరువాత ఘటోత్కచుడు సహస్ర సైన్యమును వధించి ద్రుపద పుత్రులను సంహరించాడు. కృపాచార్యుడు కర్ణుని నిందించి పాండవులను ప్రశంసించగా, అపుడు కృపుని నాలుక కోసెదనని కర్ణుడు పలికినాడు. అంతట కోపంతో అశ్వత్థామ కర్ణుని వధింతునని చెప్పుచు వానిపై లంఘించాడు. అతికష్టం మీద దుర్యోధనుడు వారిద్దరిని నివారించాడు.

**6.6. ద్రోణపర్వము**

అర్జునునకు దుర్యోధనునకు జరిగిన కురుక్షేత్ర[6] యుద్ధములో అర్జునుడు

---

**6. కురుక్షేత్రము :** ఇది తానేశ్వరము. ఇది ప్రజాపతి ఉత్తరవేది అనియు సమస్త దేవతలు ఇందు పరిష్వంబులు అగు సత్రంబులు ఆచరించిరనియు ప్రసిద్ధి. కురురాజు ప్రదేశము దున్నుటచే దీనికి ఈ నామము కలిగెను. ఇచ్చోటనే కౌరవపాండవులకు భారత యుద్ధము జరిగింది.

దుర్యోధనుని కవచధారణమును తెలుసుకొని అపుడు వాని మీదకు ఉత్తమమగు ఆంగీరసాస్త్రమును ప్రయోగించాడు. అశ్వత్థామ దానిని బ్రహ్మాస్త్రముచే మధ్యలోనే ఛేదించాడు.

> తచ్ఛృత్వా ద్రోణ పుత్రస్తు నిధనం పితురాహవే ।
> తలం తలేన నిష్పిష్యదన్తైః దన్తానుపాస్పృశత్
> నిః శ్వసన్నురగో యద్వల్లోహితాక్షో௨భవత్తదా ॥ 193-70

ద్రోణపుత్రుడు అశ్వత్థామ యుద్ధమున తన తండ్రి చనిపోయిన వృత్తాంతమును విని భుజములను చరచుచు దంతములను పటపట కొరుకుచు సర్పము వలె బుసకొట్టుచు మిక్కిలి క్రోధోద్దీపితుడయ్యాడు.

పాంచాలుని ఘాతుక చర్యకు అశ్వత్థామకు అసహ్యమయి సుయోధనా! దీనికంతటికి ప్రధాన హేతువు నిత్య సత్యవ్రతుడు ఆ ధర్మనందనుడు. తగిన దారుణ ప్రతీకారంతో ఆ గురుద్రోహిని దండించి, సంహరించినప్పుడు గాని నా చిత్తక్షోభ ఉపశమించనేరదు.అంతేకాదు హరితో బాటు ఆ పాండవేయుల నందరిని నా బాణపరంపరలతో నిశ్శేషంగా నిర్దహించి వేయగలను. ఇదే నా ప్రతిజ్ఞ.

ఆ ప్రకారంగా ఘోర శపథం చేసి సుయోధనా! మా తండ్రి చిరకాలం నారాయణ దేవుని గూర్చి ఘోరతపస్సు ఆచరించి మహనీయాస్త్రము ఒకటి సంపాదించుకొన్నాడు. అదే నారాయణాస్త్రము. ఆ మహితాత్ముడు ఆదరంతో నాకు ఆ దివ్యాస్త్రం ప్రసాదించాడు. వెంటనే నేను పాండవుల నాశనము కొరకు నారాయణాస్త్రము ప్రయోగిస్తాను.

> నహి జానాతి బీభత్సు స్తదస్త్రం న జనార్దనః ।
> న భీమసేనో న యమౌ న చ రాజా యుధిష్ఠిరః ॥ 195-29
> న పార్షతో దురాత్మా௨సౌ న శిఖండీ న సాత్యకిః ।
> యదిదం మయి కౌరవ్య సకల్పం స నివర్తనమ్ ॥ 195-30

ఆ అస్త్రము అర్జునుడు గాని, జనార్దనుడు గాని, భీమసేనుడుగాని, ధర్మరాజు గాని దుర్మార్గుడగు ఈ పార్షదుడుగానీ శిఖండిగాని, సాత్యకిగాని ఎవరికిని తెలియదు.

నేను ఆ అస్త్రప్రయోగంతో శత్రువులందరిని భస్మ రాసులుగా మార్చి అఖండ విజయశ్రీతో నీ సమక్షం చేరుకోగలను. అనతికాలంలోనే నీవు ఆ మహాద్భుతం తిలకించగలవు. అని పలికి యుద్ధమునకు బయలుదేరాడు.

యుద్ధరంగమున అశ్వత్థామ నియమనిష్ఠతో యథావిధిగా అభిమంత్రించిన నారాయణాస్త్రం ప్రత్యర్థిసేనపై ప్రయోగించాడు. అంతే ఆ అస్త్రము మహాగ్ని జ్వాలలతో పాండవేయుల అక్షౌహిణుల నన్నింటిలోను యథేచ్ఛగా విజృంభించింది. పాండవేయులు వివిధ అస్త్రాల ప్రయోగాలతో ఎదుర్కొన్నా అంతకన్న అత్యంత భీకర స్వరూపంతో వారినందరిని భస్మీపటలం చేస్తున్నదీ ఆ నారాయణాస్త్రం. అపుడా ధర్మరాజు ఓ మహావీరులారా! మీరందరూ రణరంగం వీడిపొండి. సహోదరులతో పాటు ఇక నేను ఈ నారాయణాస్త్రం దహనజ్వాలలో ప్రవేశించగలను.

నివార్య సైన్యం బాహుభ్యాం వాసుదేవ స్తదాబ్రవీత్ ।
శీఘ్రం న్యస్యత శస్త్రాణి వాహేభ్యశ్చావరోహత ।
ఏష యోగోఽత్ర విహితః ప్రతిషేధే మహాత్మనా ॥ 199-36

అపుడు వాసుదేవుడు తన బాహువులచే వారించుచు ఇట్లు పలికాడు. ఓ సైనికులారా! మీరందరును మీ ఆయుధములను విడిచి మీమీ వాహనముల నుండి దిగి తలవంచి నిలబడండి. దీనిని ఎదుర్కొనుటకు ఇదే ఉపాయము. మీరిట్లు నిరాయుధులై భూమిమీదనున్న మిమ్మల్ని ఈ అస్త్రము సంహరించదు.

వారు వాసుదేవుని వాక్యమును విని వారి దివ్యమగు అస్త్రములను వదలిపెట్టి వారి వాహనములగు రథములనుండి, గుర్రములనుండి దిగి భూమి యందుండి శ్రీహరిని శరణుపొందిరి. భీమసేనుడు మాత్రము మిక్కిలి

సంతోషముతో నేను ఈ ద్రోణపుత్రుని అస్త్రమును నా బాణములచే వారించగలను అని పలికి రథముతో కూడినవాడై అస్త్రము వద్దకు వెళ్ళాడు. వెంటనే కృష్ణార్జునులు రథమునుండి దూకి భీముని రథమునుండి భూమిమీద పడవేసిరి. వారుణాస్త్రమును ప్రయోగించి అస్త్రమునుండి భీముని సంరక్షించిరి. అంతట ఆ నారాయణాస్త్రము శాంతించింది. పిమ్మట దిక్కులు విదిక్కులన్నియు నిర్మలములైనవి.

పాండవసేన మళ్ళీ విజృంభించగా, దుర్యోధనుడు అశ్వత్థామను ,సమీపించి ఆర్యా! మరొక్క మారు ప్రయోగించు నారాయణాస్త్రం అన్నాడు. అది విని అశ్వత్థామ దుర్యోధనా! ఈ మహాస్త్రం పునః ప్రయోగం సర్వథా నిషిద్ధము. ఒకవేళ ముందు వెనుక ఆలోచించక ప్రయోగించిన యెడల అది మరలి వచ్చి ప్రయోగించినవాడినే నిశ్శేషంగా నిర్మూలించి వేయగలదు. ఈ అస్త్రం ప్రసాదించిన సమయంలో నారాయణదేవుడు ఈవిధంగా నా తండ్రిగారిని అనుశాసించాడు.

క్రోధముతో అశ్వత్థామ కృష్ణార్జునులపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించాడు. మహాస్త్రము ఏదయినా క్షణంలో నేలపై కూల్చివేయగల బ్రహ్మాస్త్రమును అర్జునుడు సంస్మరించి అభిమంత్రించి వెనువెంటనే అశ్వత్థామ ఆగ్నేయాస్త్రం పై ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రముతో ఆగ్నేయాస్త్రం శాంతించింది.

**తతో ద్రౌణి ర్ధనుస్త్యక్త్వా రథా త్ప్రస్కంద్య వేగితః ।**
**ధిగ్ధి క్సర్వమిదం మిథ్యేత్యుక్త్వా సంప్రాద్రవద్రణాత్ ॥** 201-47

అంతట అశ్వత్థామ ధనస్సును విడిచి మిక్కిలి వేగముతో రథమునుండి దూకి ఇదంతయు అబద్ధము. ఛీ! అని పలుకుచు యుద్ధము నుండి పరుగెత్తుకొని పోయాడు.అంతలోనే అశ్వత్థామకు వేదవ్యాసుడు ఎదురురాగా నమస్కరించి వ్యాసునితో మునీంద్రా!.....

**సర్వ ఘాతి మయా ముక్తమస్త్రం పరమ దారుణమ్ ।**
**కనేమౌ మర్త్య ధర్మాణౌ నావధీత్ కేశవార్జునౌ ॥** 201-54

నేను అన్నిటిని సంహరించు మిక్కిలి భయంకరమగు నారాయణాస్త్రము ప్రయోగించాను. అది ఏకారణము వల్ల మనుష్యధర్మము గల కృష్ణార్జునులను చంపలేదు. సురాసుర గంధర్వాది పరాక్రమవంతులనయినా ఆగ్నేయాస్త్ర జ్వాలలకు ఆహుతులై పరితపించవలసినదే గదా! అటువంటి మహనీయాస్త్రం నేడు ఎందుచేతనో కృష్ణార్జునులను నిర్దహించలేక బ్రహ్మాస్త్ర ప్రయోగంతో విస్తీ జస్మమై నేలపై కూలింది. దీనికి కారణమేమిటో తెలియక నేను ఆందోళన పడుతున్నానని విన్నవించాడు.

అప్పుడు వ్యాసులవారు అశ్వత్థామా! శ్రీహరి ఒకప్పుడు మైనాక పర్వతముపై కేవలం గాలి ఆహారంతోనే సంతృప్తుడై పరమేశ్వరుని గూర్చి 60 వేల సంవత్సరములు కఠోర తపస్సు చేశాడు. ఆ తపస్సుకు సంతసించి పరమేశ్వరుడు, విష్ణుదేవా! ఏమి వరం కావలెనో కోరుకొనుము అని చెప్పగా అంతట ఆ శ్రీహరి నాకు అనన్య సామాన్య ప్రభావం ప్రసాదించవలెనని వేడుకొన్నాడు. అపుడు పరమేశ్వరుడు శ్రీహరితో........

మత్ప్రసాదాన్మనుష్యేషు దేవగంధర్వయోనిషు ।
అప్రమేయ బలాత్మా త్వం నారాయణ భవిష్యసి ॥ 201-80 శ్లో

శ్రీమన్నారాయణా! నా అనుగ్రహమువల్ల నీవు మనుష్యులందు, దేవ గంధర్వులయందును సాటిలేని బలపరాక్రమములు గలవాడవవుతావు.

నీవు యుద్ధమును పొందినచో నాకంటె కూడ అధిక పరాక్రమము పొందెదవు. నా ఈ దాటరాని మాయను స్వీకరించుము. ఈవిధముగా ఆ నారాయణుడు పూర్వము వరములను పొందినాడు. ఆ వరములే ఇప్పుడు వాసుదేవార్జునులు సంహరింపబడకుండుటకు కారణమని తెలుసుకొనుము.

అశ్వత్థామా! నీవునూ అపార తపస్సంపన్నుడవే! ఆయా విద్యా రహస్యాలు తెలిసినవాడవే! అయినా నీవు ఏమాత్రము ఆ నరనారాయణులతో సరిపోల జాలవు. దీనికి ఒక హేతువు ఉన్నది. పూర్వజన్మలో విశుద్ధమైన విశద వ్యుత్తికతో

నీవు ఒక మనోజ్ఞ ప్రతిమ నిర్మించి అత్యంత నిర్మలభక్తితో, వేర్వేరు పూజా విధానాలతో ఆ ముక్కంటిని ఆరాధించావు. అయితే పూర్వకాలంలో వారిరువురు లింగాకారంతో ప్రతిమనుప్రతిష్ఠించి, ప్రపూర్ణ భక్తి పారవశ్యంతో ఆ దేవాధిదేవునికి ఎల్లపుడు పూజలు చేసి ధన్యులు అయినారు. ప్రతిమ ఆరాధనం కన్న లింగార్చన అత్యధిక ఫలప్రదమని విజ్ఞులు ఆదేశిస్తున్నారు. అందుకనే వారిద్దరు నీకంటె అధిక తేజోవంతులయినారు. ఇదే హేతువుచే ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా యుద్ధరంగంలో ఆ మహనీయులను ఓడించజాలవు. పూర్వ ఫలితాల తారతమ్యం నీవు అనుభవించకతప్పదని తెలియజేసి అదృశ్యుడయ్యాడు.

### 6.7. కర్ణపర్వము

ద్రోణాచార్యుడు అస్తమించిన పిదప అశ్వత్థామ తన యావచ్ఛక్తి వినియోగించి, మరికొంతసేపు శత్రువులను ఎదుర్కొని యుద్ధం కొనసాగించిన పిదప ఈనాటికి ఇక యుద్ధం చాలించవలసినదని సైనికులకు ఆదేశించి దుర్యోధనుని సాన్నిధ్యం చేరుకొన్నాడు.

దుర్యోధనుడు అందరిని ఆహ్వానించి కొలువులో మనకి ఇక కర్తవ్యము ఏమని గురుపుత్రుని వైపు జూచి ప్రశ్నించాడు. అశ్వత్థామ అంతట కొంత ఆలోచించి మహీశ్వరా! నిరంతరాదర ధోరణి, పరమోత్సాహము, ఆపత్పరం పరలలో అచంచలమైన మహనీయధీరత, మెళకువలు ఆకళించుకొన్న నీతి పద్ధతి దైవసాహాయ్యం లభించిన నృపాలకులకు అఖండ విజయం లభించగలదని విజ్ఞులు ఆదేశిస్తున్నారు. ఈ చతురంగబలానికి కర్ణుని సైన్యాధిపత్య పట్టాభిషేకం నిర్వర్తించిన యెడల శత్రువులను అవలీలగా జయించగలము. తరువాత అశ్వత్థామ వచనానుసారం దుర్యోధనుడు కర్ణునకు సర్వసైన్యాధిపత్య పట్టాభిషేకం చేశాడు.

పాండ్యరాజు కర్ణుని, సైన్యమునంతను యమునివలె సంహరించు చుండగా, అంతట అశ్వత్థామ పాండ్యరాజుతో హోరాహోరిగా పోరాడి అరు

బాణములు ప్రయోగించి అతని భుజములను, అతని శిరస్సును ఛేదించాడు.

మరల అశ్వత్థామ యుధిష్ఠిరుని, సాత్యకిని, ఉప పాండవులను ఎదుర్కొని తీవ్రముగ పోరాడుచుండగ ధర్మరాజు వానితో ఇట్లనెను. అశ్వత్థామా! నీకు కృతజ్ఞత లేదు. నన్నే చంపవలెనని ప్రయత్నించుచున్నావు. బ్రాహ్మణుడు చేయవలసినవి 'తపము, దానము, అధ్యయనము. నీవు క్షత్రియుని వలె ధనువును సజ్యము చేయుచున్నావు. నీవు చూచుచుండగానే నేను కౌరవులను జయిస్తాను. ఈ వాక్యములను విని ఇవి యుక్తము, న్యాయములైనందున, మౌనముగా విని, తరువాత అశ్వత్థామ తీవ్రముగా పోరుసలిపి యుధిష్ఠిరుని యుద్ధరంగము నుండి పారిపోవునట్లు చేశాడు.

తన తండ్రి కేశగ్రహణ మొనరించి కంఠము ఖండించిన ధృష్టద్యుమ్నుని[7] వధించనిదే తనకవచమును ఊడదీయనని అశ్వత్థామ ప్రతిజ్ఞ చేశాడు. అతడు కనపడినపుడు వానితో యుద్ధమొనరించి వాని రథమును, ఆయుధములను, అశ్వములను భగ్నమొనరించి వానిని సంహరించుటకై వానిపై లంఘించాడు. అపుడు వానిని రక్షింపమని కృష్ణుడు అర్జునునకు చెప్పగా, అంతట అర్జునుడు, అశ్వత్థామను ఎదుర్కొనగా, అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని విడచి పార్థునితో యుద్ధముచేసి బాణహతుడై దుఃఖితుడయ్యాడు. అంతట సారథి రథమును అవతలకు తోలుకొనిపోయాడు.

**సంధిచేసుకొనుమని అశ్వత్థామ చెప్పుట, దుర్యోధనుడు సమ్మతింపకపోవుట**

కర్ణా! యుద్ధసందర్భములో అర్జునుని వైపు దేవతలు, కర్ణునివైపు అసురులు జయకాంక్షులై యున్నారు. అశ్వత్థామ దుర్యోధనుని హస్తము పట్టుకొని యిట్లనెను.

---

7. **ధృష్టద్యుమ్నుడు** : ఇతడు ద్రుపదుని కొడుకు. ద్రౌపది తోబుట్టువు. ఇతడు భారత యుద్ధమునందు పాండవులకు దళవాయి అయి వుండెను. ఇతడు అగ్ని అంశమున జన్మించెను.

ప్రసీద దుర్యోధన శామ్య పాండవైరలం విరోధేన ధిగస్తు విగ్రహమ్ ।
హతోగురుర్బ్రహ్మ సమో మహాస్త్రవిత్తథైవ భీష్మప్రముఖామహారథాః ॥

అహంత్వవధ్యో మమచాపిమాతులః ప్రశాధిరాజ్యం సహ పాండవైశ్చిరమ్।

ధనంజయః శామ్యతి వారితో మయా జనార్దనో నైవ విరోధమిచ్ఛతి ।
యుధిష్ఠిరో భూతహితే రతస్సదా వృకోదర స్తద్వశగస్తథాయమౌ ॥

నచేద్వచః శ్రోష్యసి మే నరాధిప ధ్రువం ప్రతప్తాసి హతోఽరిభిర్యుధి ।
నివారయిష్యామి చకర్ణమప్యహం యదాభవాన్సప్రణయో భవిష్యతి ॥
(కర్ణపర్వం 88-21,22,23)

ఓ దుర్యోధనా! విరోధము మాని పాండవులతో సంధిజేసికొనుము. భీష్మద్రోణ ప్రముఖులు హతులయినారు. నేనును, కృపాచార్యుడును మరణింపనివారము. నీవు పాండవులతో కలిసి రాజ్యమునుభవింపుము. అర్జునుని నేను నివారింపగలను. శ్రీకృష్ణునకు విరోధమిష్టముగాదు. ధర్మజుడు భూతదయకలవాడు. భీమసేన, నకుల, సహదేవులు ధర్మరాజానువర్తులు.

నామాట నీవు వినకున్న యెడల తప్పక శత్రుహతుడవై పరితపింతువు. నీవు శాంతించిన యెడల నేను కర్ణుని శాంతింపజేయగలను. ఆ మాటలు విన్న దుర్యోధనుడు అశ్వత్థామా! అర్జునుడు కర్ణుని జయింపలేడు. నా వైరానుబంధమును దలచుకొను పాండవులు గూడ నన్ను విశ్వసింపరు. కర్ణుని యుద్ధమునుండి విరమింపుమని చెప్పుట యుక్తము గాదు. శ్రమపడియున్న అర్జునుని కర్ణుడు వధింపగలడని పలికి పాండవులతో సంధిజేసికొనుటకు నిరాకరించాడు.

## 6.8. శల్యపర్వము

కర్ణుడు కురుక్షేత్రమున పాండవులతో పోరాడి అర్జునుడు చంపగా, కౌరవులు కురుక్షేత్రానికి సమీపాన సరస్వతీ నదీతీరానికి చేరారు. అక్కడ

సుయోధనుడు అశ్వత్థామను సమీపించి, నువ్వు నాకు గురు సముడవు. ఇపుడు మనసేనావాహినికి సేనాపతిగా ఎవరిని స్వీకరించాలో చెప్పు, అనగా అంతట అశ్వత్థామ.

కౌరవేశ్వరా! యుద్ధ నైపుణిలో, మహనీయ బలశౌర్య సంపత్తిలో అత్యద్భుత శస్త్రాస్త్ర ప్రయోగ పాండితిలో, ధైర్య సమగ్రతలో మద్రేశ్వరునితో సరిపోల్చగలవారు ఈ జగతిలో వేరెవ్వరున్నారు? కనుక ఈ మహీపతి ఇక సర్వ సైనాధీశ్వరునిగా అభిషేకించవలసినది. అదియునుగాక నీయెడల స్నేహము వల్ల తన సహోదరి తనూజులయిన పాండునందనులను విడిచి వచ్చిన మద్రేశ్వరుని కంటె మనకు అత్యంత ఆత్మీయులైన లోకారాధ్యులు ఎవ్వరున్నారు? అలనాడు కార్తికేయుని తమసేనానిగా ఎన్నుకొని, అమరేశ్వరులు దైత్యులను సునాయాసంగా జయించారు. అదేవిధంగా మనము ఈ పరాక్రమనిధి ఆధిపత్యంతో అజయ్యులమై విజృంభించి పాండవేయులను నిర్మూలించవచ్చును.

పిమ్మట దుర్యోధనుడు పవిత్ర నదీజలాలతో శల్యుని[8] అభిషేకించి జయ జయ ధ్వానాలు చేశారు. అశ్వత్థామ అపర రుద్రుని వలె విజృంభించి యుద్ధం సాగిస్తున్నాడు. ధర్మరాజు వదిలిన బాణాల ధాటికి శల్యుడు మూర్ఛపోగా అశ్వత్థామ వానిని రణరంగానికి దూరంగా తీసుకువెళ్ళాడని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధవిశేషాలు తెలియజేశాడు.

భీమునిచే పరాజయము పొందిన దుర్యోధనుడు కొన ప్రాణములో నుండగా, అప్పటికి కృతవర్మ, కృపాచార్య, అశ్వత్థామలు చేరుకొని నేలకూలిన దుర్యోధనుని చూచి, అశ్వత్థామ ధరణీశ్వరా! రాజులు ఎల్లప్పుడు జేజేలు అర్పించి సేవించిన నీవు ఇప్పుడు కేవలము ఏకాకివై, అసహాయుడవై అలమటిస్తున్నావు కదా! మహోన్నతసింహాసనం పై అధివసించిన నిన్ను ఆ విధాత ఈనాటికి

---

8. **శల్యుడు :** ఇతను మద్ర దేశాధిపతి. మద్ర రాజు కుమారుడు. పాండురాజు భార్య అయిన మాద్రి ఇతని సోదరియే. సంహ్లాదుడే శల్యుడుగా జన్మించాడు.

ఈవిధంగా ధూళిలో కూర్చొను గదా! ఇచ్చట మన సైన్యాధిపతులు ఎవ్వరు కానరేమి? ఆ చతురంగబలాలు ఏమయి పోయినవి. ఆ వింజామరాల్లు, శ్వేత ఛత్రాలు గోచరించవేమి? నీకు ఎంతటి దురవస్థ సంఘటిల్లినది. భీష్మ ద్రోణులు ఎల్లప్పుడు నీకు ఆనందం కల్గించారు. వికర్ణుడు, కర్ణుడు, దుశ్శాసనుడు ఒక క్షణమయినా నీ సాన్నిధ్యం విడిచిపెట్టలేదు. వారు ఒక్క పర్యాయమయినా ఇచ్చటికి రారేమి? విధి బలీయమైనది. కదా! కౌరవేశ్వరా! ఇక నేను ఏమి చేయగలను. అని విలపించగా అంతట కొనప్రాణంతో ఉన్న దుర్యోధనుడు మానవులకు ఇట్టి దుర్గతి ఆ దుర్విధి విధించినదే కదా! అని పలికి కొంతసేపటికి అశ్వత్థామ తేరుకొని దుర్యోధనునితో...

> ఇష్టా పూర్తేన దానేన ధర్మేణ సుకృతేన చ ।
> అద్యాహం సర్వపంచాలాన్ వాసుదేవస్య పశ్యతః ॥
> సర్వోపాయైర్హి నేష్యామి ప్రేతరాజనివేశనమ్ ।     శల్యపర్వం 65-36

నా యిష్టాపూర్తములచేతనూ, దానముచేతనూ, ధర్మముచేతనూ పుణ్యముచేతనూ,ఒట్టుపెట్టుకొనుచున్నాను. నేనిప్పుడు వాసుదేవుడు చూచుచుండగా పాంచాలురందరును అన్ని ఉపాయములచే యమసన్నిధికి పంపగలను.

అప్పుడు దుర్యోధనుడు ఓ కృపాచార్య! జలముతో నిండిన కలశమును వెంటనే తీసుకొని రమ్ము.

> మమాజ్ఞయా ద్విజశ్రేష్ఠ ద్రోణపుత్రోఽభిషిచ్యతామ్ ।
> సైనాపత్యేన భద్రం తే మమ చేదిచ్ఛసి ప్రియమ్ ॥ 65-41

నాకు ప్రియమును చేకూర్చ నీవు కోరుచో, నా ఆజ్ఞచే ఈద్రోణ పుత్రుని అశ్వత్థామను అభిషేకించుము. అని పలికాడు.

దుర్యోధనుని వాక్యము విని కృపాచార్యుడు రాజాజ్ఞచే అశ్వత్థామను

సేనాపతిగా అభిషేకించాడు. ఈవిధంగా అభిషేకింపబడిన అశ్వత్థామ దుర్యోధనుని కౌగలించుకొని తనసింహనాదముచే అన్ని దిక్కులనూ దద్దరిల్లచేయుచూ వెళ్ళిపోయాడు.

### 6.9. సౌప్తికపర్వము

అశ్వత్థామ, కృతవర్మ, కృపాచార్యుదును వీరు ముగ్గురు ఒక న్యగ్రోధ వృక్షమును చేరిరి. కృతవర్మయు కృపాచార్యుదును నిద్రచే నావరింబడి నేలమీద నిద్రించారు. కాని అశ్వత్థామ మాత్రము నిద్రించక మేల్కొని శాత్రవ సంహారము-ఎలా సాగించాలా! అని ఆలోచిస్తూ సేనాశిబిరాలకు దూరంగా ఒక వటవృక్షం మీద గుడ్లగూబ విశృంఖలంగా పక్షి సంహారం చేయడం కనిపించింది. ఈ గుడ్లగూబ నాకొక సదుపదేశం ప్రసాదించింది. అయ్యో! ఈ ఉపాయం పూర్వం నాకిది తెలియకపోయెనే. ఇక పగవారినందరిని నిర్విశేషంగా నిర్మూలించి వేయగలను. అని లోలోపల నిశ్చయించుకొని అంతలోనే తనలోతాను ఈ ప్రకారంగా ఆలోచించుకున్నాడు.

పాండవేయులనందరిని బంధుమిత్రులతో, పుత్రులతో బాటు అవలీలగా సంహరించెదనని, ఇతః పూర్వమే నేను దుర్యోధనుని సమక్షంలో శపథం చేశాను. అయితే వారందరు అనన్య సామాన్య పరాక్రమ భయంకరులు. ఇందువల్ల నేను అసహాయ శూరుడనై వారితో తలపడి పెనుపోరాటం కొనసాగించరాదు. అది ఏ మాత్రము సముచిత పద్ధతి కానేరదు. ఒకవేళ నేను ఈనాడు పాండవేయులను సంహరించక రేపు అది నిర్వహించిన యెడల దుర్యోధనుడు ఇంతలోనే పరలోకం చేరుకోగలడు. అప్పుడు నా పరాక్రమం విని ప్రశంసించగలవారు ఎవ్వరు ఉండబోరు గదా! అంతేకాక శత్రుసంహార సమయంలో న్యాయాన్యాయ వివేచనకూడదని, ఎటువంటి సాధనం చేతనయినా శత్రుసంహారం ప్రారంభించవలెనని శాస్త్రాలు ఏకగ్రీవంగా ఆదేశిస్తున్నది గదా!

కనుక యిప్పుడు నాకీ ఉలూక మార్గం శ్రేష్ఠం అనుకుని ప్రక్కనే

నిద్రపోతున్న మహారథికులిద్దరినీ, మేలుకొలిపి ఇట్లు పలికెను.

శూరాగ్రేసరులారా! పదకొండు అక్షౌహిణులకు అధిపతియైన దుర్యోధనుడు అసహాయశూరుడై భీమునితో గదాయుద్ధం చేసిన సమయంలో మనము ఆ దుర్యోధనుని సాన్నిధ్యంలో లేకపోయినాము. భీముడు గదా యుద్ధంలో న్యాయపద్ధతిని విడిచి దుర్యోధనుని సంహరించాడు. పరాక్రమవంతులైన వీరులు ఎన్నెన్ని విధాల పోరాడినా విజయం సాధించలేకపోయినారు కదా! అని అశ్వత్థామ ఆ ప్రకారంగా మాట్లాడి, ఈ ఆపద సమయంలో మరి కర్తవ్యమేమో సత్వరమే వివరించవలసినదని అంజలి ఘటించి వేడుకొన్నాడు.

అంతట కృపాచార్యుడు దుర్యోధనుని కారణముగానే ఇదంతా జరిగింది. తదుపరి కర్తవ్యమేమిటో ధృతరాష్ట్ర, గాంధారి, విదురులను సంప్రదించి, వారు నిశ్చయించిన మార్గమే సర్వథా సముచితమని ఉపదేశించాడు.

**అశ్వత్థామ ఆత్మవిశ్వాసము**

కృపాచార్యుని మాటలు వినిన అశ్వత్థామ కోపంతో ఈ సమయంలో నాకు దుఃఖం తొలగించగల మార్గమొకటి స్ఫురిస్తున్నది. అది ఏమనగా ప్రాచీనకాలంలో ప్రజాపతి ప్రజలను సృష్టించిన పిదప బ్రాహ్మణునికి దమము, క్షత్రియునికి తేజము, వైశ్యునికి దక్షత, శూద్రునికి ఈ వర్గాలకు అనుకూలమయిన ప్రవర్తన అనుసరించదగిన సద్గుణాలను విధించెనని మీకు తెలియును కదా! శాంతప్రకృతి లేని విప్రుడు, తేజస్వి కాని క్షత్రియుడు, దక్షత లేని వైశ్యుడు, అనుకూలత లేని శూద్రుడు లోకనిందితులై అప్రతిష్ఠ పాలవుతున్నారు. అయితే నేను విప్రవంశంలో జన్మించినా కేవలం దురదృష్టం వల్లనే క్షత్రియ ధర్మం స్వీకరించాను. యుద్ధభూమిలో నా తండ్రిని ఒకానొక నీచుడు దుఃఖావేశ సమయంలో శిరస్సు ఖండించి సంహరించాడు. కావున ఆ పాపాత్మునితో పాటు పగవారినందరిని నేను అనతికాలంలోనే సంహరించవలెనని సంకల్పించు కొన్నాను.

పాండవేయులు అస్త్రశస్త్రాలు, వివిధ వాహనాలు విడిచి సుఖశయ్యపై నిద్రించి యుంటారు. వారి సంహారానికి ఇదే తరుణమని నేను ఆలోచించుకొనుచున్నాను. విజయాహంకారముతో మదించి మైమరచిన శాత్రవులను అందరిని నిశ్శేషంగా సంహరించి పిశాచ కోటికి అమందానందం కలిగించగలను. చతురంగబలాలనన్నిటినీ ముక్కలు ముక్కలుగా ఖండించి నేలపై కూల్చి వేయగలను.

నా తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుని వధించక పోయిన యెడల నా లోలోపల రగులుతున్న పగ చల్లారగలదా? అదేవిధంగా పాండవేయులను అందరిని సంహరింపక పోయిన యెడల నాకు ఆత్మ సంతృప్తి చేకూరగలదా? పగవారినందరిని సంహరించినపుడే నాకు కొంత నిర్మలత లభించగలదు. అంతేకాని నాకు ఇంకొక మార్గం కానరాదు. ప్రస్తుతం నేను అనుసరించవలసినది ఇదే పద్ధతి.

కృపాచార్యుడు అశ్వత్థామ మాటలను విని అశ్వత్థామా! నువ్వు బాగా అలసియున్నావు? నిద్రపో, సూర్యోదయం కాగానే మనముగ్గురము వెళ్ళి కావలసిన కార్యం నెరవేరుద్దాం అని కృపాచార్యుడు శాంతి వాక్యాలు పలుకగా, ఆ మాటలు విని అశ్వత్థామ ఆచార్యా! ఆగ్రహావేశంతో మైమరచిన వానికి, అర్థ చింతాసక్తునికి, భయాందోళితుడు అయినవానికి, కాముకునకు నిద్ర వస్తుందా? నా తండ్రి మరణమును తలచుకొని మిక్కిలి దుఃఖంతో పరిపరివిధాల మదనపడుతున్నాను. అదీగాక దుర్యోధనుని అభీష్టం నెరవేర్చవలెనన్న తొందరపాటు నన్ను ముమ్ముందుకు ఉరికిస్తున్నది. మరి నేను ఒక్క క్షణకాలమయినా నిద్రించగలనా? లోకులందరు దుర్యోధనుని పరాజయము, పాండవేయుల అభ్యున్నతి వేవిధాల అభివర్ణిస్తున్నప్పుడు అది సదా నా హృదయం దహిస్తున్నది. అయ్యో! నాకు ఇంకెక్కడిది నిద్ర అంతేగాక! కృష్ణార్జునులు యుద్ధరంగమున నిలబడితే వారిని ఓడించడం మన తరంకాదు. కనుక

ఏవిధంగానైనా పగవారిని రూపుమాపి వేయవలెనని నిశ్చయించుకొన్నాను. ప్రత్యర్థి శిబిరంలో గల శూరులు అందరు మైమరచి నిద్రిస్తున్న సమయంలో నేను అనాయాసంగా వారిపైపడి సంహరించవలెనని నిశ్చయించుకొన్నాను. ప్రస్తుతం నాకు ఇంతకన్న వేరొక్క పౌరుషమార్గం కానరాదు అని పలికి ఆచార్యా! నిద్రామిషతో నన్ను ఈ ప్రయత్నం నుండి మరలించెవలెనని ఆలోచిస్తున్నావు. నీ వంటి వానికి ఇది న్యాయమేనా?

అశ్వత్థామ మాటలు వినిన కృపాచార్యుడు మరల సముచిత హితోపదేశం ప్రసాదించాడు. అశ్వత్థామా! ఆయుధహీనునీ, వాహనశూన్యునీ, శరణాగతునీ, రణరంగదూరునీ, చంపడం నీతి కాదని తెలియదా! అంతేకాక వారంతా నిద్రలో వుంటారు. నిద్ర చావుకి మారుపేరు. అటువంటి పీనుగులను చంపడం నీవంటి అస్త్ర విదుడికి ధర్మం కాదన్నాడు కృపాచార్యుడు.

కృపాచార్యుల హితోపదేశం వినినా అశ్వత్థామ తనసంకల్పాన్ని విస్పష్టంగా వ్యక్తీకరించాడు.

ఆచార్యా! నీవు అన్నది అక్షరశః యథార్థమే! నాకు ఉపదేశించదగిన అర్హత నీయందు ఉన్నది. ఇందువల్ల సముచితమయిన హితం ప్రసాదించావు. కాని ధర్మం మాట ఎత్తవద్దు. భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనులను వారు ధర్మంగా సంహరించారా? అర్జునుడు హస్తం ఖండించిన పిదప ప్రాయోపవేశంతో ప్రశాంతచిత్తుడయిన భూరిశ్రవసున్ని సాత్యకి క్రూరాతిక్రూరుడై సంహరించిన తీరు మన సైనికులు ఎల్లరు పరిశీలించినారు గదా!

అయితే నీవు వారిని ఎప్పుడు నిందించలేదు. ప్రస్తుతం నన్ను మాత్రమే దూషిస్తున్నావు. ఇప్పటికిప్పుడు భీముడు చేసిన ఊరుభంగం మాట ఏమిటి? నా తండ్రిని సంహరించినానన్న దురహంకారవేశంతో విర్రవీగుతున్న ధృష్టద్యుమ్నుడు, శిఖండి మొదలుగాగల ఆ పాపాత్ములను అందరిని కేవలం దుష్ట మార్గంలోనే సంహరించి వేయువలెనని సంకల్పించుకొన్నాను. ఇందువల్ల

నాకు కీటక జన్మం సంప్రాప్తించినా మేలే అని భావిస్తున్నాను. అంతేకాని నా నిశ్చయమును మార్చుకోలేను. ఈ విషయమై ఇక నన్ను ఎవరూ అడ్డుకోజాలరురని పలికి రథం అధిరోహించి బయలుదేరాడు. ఇక గత్యంతరం లేక కృతవర్మ కృపాచార్యులును రథం అధిరోహించి అశ్వత్థామను అనుసరించిరి. ముగ్గురు త్రేతాగ్నుల వలె ప్రకాశిస్తూ రథాలు పాండవ శిబిరాలవైపు నడిపారు.

అశ్వత్థామ పాండవ శిబిర ద్వారమును సమీపించుచుండగా...

**తత్ర భూతం మహాకాయం చంద్రార్క సదృశ ద్యుతిమ్ ।**
**సోఽపశ్యద్ద్వార మాశ్రిత్య తిష్ఠంతం లోమహర్షణామ్ ॥ 6-3**
**వసానం చర్మ వైయాఘ్రం మహారుధిర విస్రవమ్ ।**
**కృష్ణాజినోత్తరాసంగం నాగయజ్ఞోపవీతినమ్ ॥ 6-4**

అచట సూర్యచంద్ర సమానంగా ప్రకాశిస్తున్న మహాకాయం కలిగిన భూతము పాండవ శిబిర ద్వారమునాశ్రయించి దానిని కాపుడుచున్నది. ఆ భయంకరమగు భూతము వ్యాఘ్రచర్మమును ధరించి సర్పముతో యజ్ఞోపవీతముగా గలిగి వున్నది.

కోరలచే భయంకరమైన ముఖము గల తెరువబడిన నోరుగల త్రిశూలధారియగు ఈశ్వరుని చూచాడు. ఆ ఈశ్వరుని ముక్కు చెవులనుండి, ముఖము నుండి, రోమకూపములనుండి శంఖచక్రగదాపద్మ శార్ఙ్గాది ఆయుధములను ధరించిన హృషీకేశులు వెలువడుచుచున్నారు. అశ్వత్థామ అట్టి ఈశ్వరుని చూచి ఏమియు జంకక దివ్యాస్త్రములను వరంవరలుగా ప్రయోగించాడు. కాని అది బాణములన్నింటిని మ్రింగినది. మరల శక్తి, ఖడ్గము, తోమరసమూహము, గదాయుధం ఆ భూతంపై ప్రయోగించాడు. కాని ఆభూతము వాటిని మ్రింగి విఫలం చేసి హేళనగా నవ్వి అవహసించినది.

అప్పుడు అశ్వత్థామ తనలోతాను ఆలోచించుకొన్నాడు. కృపాచార్యుని హితోపదేశాలు ఏమాత్రము లక్ష్య పెట్టకపోతిని. గోబ్రాహ్మణులను, బాలకులను,

ఆచార్యులను, మోహావిష్టులను, అంగనలను, భయపడి శరణన్న వారిని, అస్త్ర శస్త్ర ప్రయోగాలతో సంహరించరాదని ధర్మశాస్త్రవేత్తలు ఆదేశిస్తున్నారు. నేను వారి అనుశాసనం పెడచెవిని బెట్టి కేవలం దుర్బుద్ధితో అణచివేయవలెనని సంకల్పించి, అసుర వృత్తి స్వీకరించాను. అందువల్ల ఆపత్పరంపరలేకాక కార్యసిద్ధి సాక్షాత్కరించగలదా! ఒకవేళ ధైర్యంతో ముందడుగు వేసినా నన్ను ఈ భూతం ప్రాణాలతో బ్రతికి బయట పడనీయగలదా? అని తనలో అనుకొని మరల ఆత్మనిగ్రహంతో ఆ మహేశ్వరుని సేవించిన యెడల ఈ ఆపద క్షణంలో దూరంగా తొలగిపోగలదని తలచాడు. అశ్వత్థామలో ఒక విశిష్ట గుణం ఉంది. అదే రుద్రభక్తి వెంటనే అశ్వత్థామ నిరాయుధుడై దిగి భూమిపై ఆసీనుడై మనసారా ఈశ్వరుని ధ్యానించి శరణువేడాడు.

నేనిక స్థాణువు, ఉగ్రుడు, శివుడు, శర్వుడు,ఈశానుడు, అయిన పరమేశ్వరుని నా హృదయాంతరాళంలో నిలిపి ఆత్మబలి సమర్పించగలను. ఆ మహేశ్వరుడు ఆదేశించిన తీరులోనే సంచరించగలను. అదే ఇక పరమసుఖం ప్రసాదించగలదు. లోకాధినాయికా! నాకు ఈ భూతమొక పరమ ప్రతిబంధక మైనది. నేను ఈ మహాపద అధిగమించి అవతలికి చేరుకొన్న యెడల అనేక ప్రాణుల బలి సమర్పణతో నిన్ను అర్చించి అమందానందం కలిగించగలను.

అశ్వత్థామ ఆ ప్రకారంగా ఆత్మార్పణ చేసే సంకల్పంతో రుద్ర ప్రార్థన చేయగా, బంగారు వేదిక ఒకటి సాక్షాత్కరించింది. చిత్ర విచిత్ర వేషధారులైన, భయంకరాకారులైన ప్రమదగణాలు, భూతములు అశ్వత్థామ భయంకర పరాక్రమమును చూడవలెనని సంకల్పించి అచటికి వచ్చి అతనికి అలజడి కలిగించవలెనని వివిధ వికృత ఆకారాలతో మిక్కిలి భయంకరులై గర్జించారు.

అంతట అశ్వత్థామ నిశ్చల ధైర్యంతో నిలబడి త్రినేత్రుని స్మరించుకొని దేవాధిదేవా! నాకు ఈ తరుణంలో కర్తవ్యమేమో విస్పష్టమై గోచరించలేదు. ఇందువల్ల నీకు ఆత్మోపహారం సమర్పించవలెనని నిశ్చయించుకొన్నాను.

కరుణించి వెంటనే శాత్రవ సంహారశక్తి ప్రసాదించవలసినదని వేడుకొన్నాడు. అంగిరస వంశంలో జన్మించిన ఈశరీరం అగ్నిలో ప్రగాఢభక్తితో పరమేశ్వరునికి ఆహుతిగా సమర్పించగల భాగ్యం నాకు ఈనాడు సంప్రాప్తించినది. కృతార్థుడనయినాను అని భావించి, త్రినేత్రుని స్మరించి నమస్కరించి ఘన సమాధిలో ప్రవేశించి ఒకే ఒక దూకుతో ఆ మహనీయాగ్ని జ్వాలలో ఆత్మార్పణం గావించాడు.

అవిధంగా అగ్నిలో ప్రవేశించినా ఏమీ కాలేదు. ధైర్యంగా నిలబడిన అశ్వత్థామను చూచి పరమేశ్వరుడు ప్రత్యక్షమై సంతోషముతో అశ్వత్థామా! ఏమి కావలెనో కోరుకొనుము. వరము ప్రసాదిస్తున్నానని పలుకగా, అంతట అశ్వత్థామ పరమేశ్వరునికి సాష్టాంగప్రణామములాచరించి నమస్కరించి, భక్తితో నిలుచున్నాడు. పిమ్మట ఆ శంకరుడు...

యథావదాహమారాద్ధః కృష్ణేనాక్లిష్ట కర్మణా ।
తస్మాదిష్ట తమః కృష్ణాదన్యో మమ న విద్యతే ॥ 7-63 శ్లో

అశ్వత్థామా! నేను శ్రీకృష్ణునిచే విద్యుక్తముగా ఆరాధింపబడితిని గాన వానికంటె నాకు మిక్కిలి ఇష్టమైన వాడు లేడు.

శ్రీకృష్ణుని యందలి గౌరవముచే ఈపాంచాలురను రక్షించుచుంటిని, కాని వీరు మృత్యువుచే ఆక్రమింపబడియున్నారు. ఇపుడు వీరికిక జీవితము లేదు.

అంతేగాక నీ ధైర్యమెట్టిదో పరిశీలింపవలెనని నిశ్చయించి, అనేక మాయాకారాలతో నీకు ఎంతో అలజడి కలిగించాను. అయినా నీవ అచంచలుడవై నాకు ఆత్మోపహారం సమర్పించావు. ఇక శ్రీకృష్ణ ఉపకార ప్రయత్నం పరిసమాప్తమయింది. పాంచాలరాజు కుమారులందరికి ఆయుష్షు తీరినది అందరు నేడు తప్పక పరలోకం చేరుకోగలరు. నా అనుగ్రహ భాగ్య సంపాదించుకొన్న నిన్ను ఎంతటి వారయినా క్షణకాలము అడ్డుకోజాలరు.

ఏవముక్త్వా మహాత్మానాం భగవానాత్మనం స్తనుమ్ ।
ఆవివేశ దదౌ చాస్మై విమలం ఖడ్గముత్తమమ్ ॥ 7-66 శ్లో

ఈవిధముగా పలికి ఆ పరమేశ్వరుడు అశ్వత్థామకు ఒక ఖడ్గం ప్రసాదించి అదేక్షణంలో తిరిగి ఆ వీరాగ్రణి శరీరంలో తేజోరూపంతో ప్రవేశించాడు.

అశ్వత్థామ రథం అధిరోహించి పాండవ శిబిరాల వైపు నడుపగా కృతవర్మ, కృపాచార్య అశ్వత్థామను అనుసరించారు. పాండవేయ శిబిర ద్వారం వద్దకు రాగానే కృతవర్మ కృపాచార్యులను అచటనే నిలవమని అశ్వత్థామ ఖడ్గం గ్రహించి పరమానందంతో మొదట ధృష్టద్యుమ్నుని నివాస భవనం సమీపించి, రథం దిగి త్రినేత్రునికి నమస్కరించి దేవాధిదేవా! నీకు ఇప్పుడు అనేక ప్రాణుల బలి సమర్పణతో అపూర్వ పూజావిధి నిర్వర్తించవలెనని సంకల్పించుకొన్నాను. ఆదర దృష్టితో అది స్వీకరించి ప్రసన్నుడవై నన్ను అనుగ్రహింతువు గాక! అని ప్రార్థించి, ధృష్టద్యుమ్నుని శిబిరమును ప్రవేశించి, నిద్రించుచున్న వానిని కాలితో తన్ని లేపాడు. ధృష్టద్యుమ్నుడు కన్నులు తెరిచే సమయంలో వాని జుట్టు పట్టి ఈడ్చి నేలపడగొట్టి మోకాలితో కుమ్ముతూ ధనుస్సుకున్న అల్లెత్రాడు విప్పి వాని కంఠంచుట్టూ త్రిప్పి, పశువును చంపినట్లు చంపాడు. అలానే ఉత్తమౌజునీ, యుధామన్యునీ, చిత్రవధ చేసి, శిబిర సమీపంలో వున్న గజబలాన్ని చిత్రహింసపెట్టి, తనకెదురు వచ్చిన శిఖండినీ, ఉపపాండవు[9]లనూ, వారికి తోడు

---

9. ఉపపాండవులు : ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు వీరు ద్రౌపది యందు క్రమముగా ధర్మజ భీమార్జున నకుల సహదేవుల వల్ల జన్మించిరి. వీరు పూర్వ జన్మమున విశ్వదేవతలు. హరిశ్చంద్రుని భార్య యగు చంద్రమతిని విశ్వామిత్రుడు త్వరగా నగరము నుండి వెడలి పొమ్మని దూషించుచూ బాధించుచుండుట చూచి ఇట్టి నిర్దయుడైన మునికి పుణ్యలోకమెక్కడిది యని విశ్వామిత్రుని గూర్చి తమలో తాము చెప్పుకొనిరి. ఆ మాటలు విశ్వామిత్రుడు విని కోపముతో శపించాడు. ఆ విశ్వదేవతలే ఉపపాండవులుగా జన్మించిరి.

వచ్చిన సైనికులనూ సంహరించాడు.

ఈవిధముగా ఆ కాళరాత్రి యందు పాండవశిబిరమును రెట్టింపు చీకటిని చేసి సంహరించుచుండగా, భయపడి జీవితాశచే శిబిరమునుండి పరుగెత్తి వచ్చుచున్న వారలను శిబిర ద్వారముననున్న కృపాచార్య, కృతవర్మలు సంహరించిరి. అంతట అశ్వత్థామ కోపము చల్లారక ఆ శిబిరమునకు మూడు ప్రక్కల నిప్పంటించాడు. కొంతమంది వారివల్ల చనిపోగా మరికొంతమంది అగ్నికి అహుతయ్యారు.

ఈవిధముగా సర్వసంహారమొనర్చి తెల్లవారుజామున అశ్వత్థామ, కృపాచార్య కృతవర్మలు దుర్యోధనుని వద్దకు వెళ్ళి దుఃఖముచే వారు ముగ్గురును బిగ్గరగా విలపించారు. పిమ్మట అశ్వత్థామ తేరుకొని దుర్యోధనునితో...

దుర్యోధన జీవసి త్వం వాక్యం శ్రోత్రసుఖం శ్రుణు ।
సప్త పాండవతః శేషా ధార్తరాష్ట్రాస్త్రయో వయమ్ ॥
తే చైవ భ్రాతరః పంచవాసుదేవోఽథ సాత్యకిః ।
అహంచ కృతవర్మా చ కృపః శారద్వత స్తథా ॥
ద్రౌపదేయా హతాః సర్వే ధృష్టద్యుమ్నస్య చాత్మజాః ।
పాంచాలా నిహతాస్సర్వే మత్స్యశేషం చ భారత ॥
కృతే ప్రతికృతం పశ్య హతపుత్రా హి పాండవాః ।
సౌప్తికే శిబిరం తేషాం హతం స నరవాహనమ్ ॥ 9-48,49,50

దుర్యోధనా! జీవించియున్నావు గనుక నీకు సంతోష వార్త చెప్పెదను వినుము. పాండవ పక్షములో పాండవులు సాత్యకి, శ్రీకృష్ణుడు అను ఏడుగురును కౌరవపక్షములో కృపాచార్య కృతవర్మలు, నేను అను ముగ్గురును మిగిలాము. మిగిలిన వారందరిని రాత్రి నిద్రించుచున్నపుడు సంహరించాయని చెప్పాడు.

అప్పుడు కొనప్రాణముతో యున్న దుర్యోధనుడు ఆ ప్రియవచనమును విని స్మృతి తెచ్చుకొని అశ్వత్థామా! కృప, కృతవర్మ సహితుడవైన నీవు నాకు

చేసిన మేలు భీష్మద్రోణ కర్ణులు గూడ చేయలేదు. ఆ ధృష్టద్యుమ్న శిఖండులు హతులైనారు కనుక ఇప్పుడు నేను ఇంద్రునితో సమానుడని తలచుచున్నాను. అని సంతోషముతో పలికి దుర్యోధనుడు శరీరము విడిచాడు.

ఉపపాండవులకు కాలం తీరిందన్న సంగతి కృష్ణునికి తెలుసు. కనుకనే ఆ రాత్రి పాండవులను మరొక చోట నిలిపి వేశాడు. తెల్లవారే సరికి ఈ వార్త పాండవులకు తెలిసింది. అప్పటి కప్పుడే నకులుడు ఉపప్లావ్యం వెళ్ళి ద్రౌపదినీ, యితర స్త్రీ జనాన్ని రథం మీద తీసుకువచ్చాడు. ద్రౌపదీదేవి పుత్రశోకం నిండిన గుండెతో విలపించింది. అశ్వత్థామకు శిరశ్ఛేదం చెయ్యకపోతే ప్రాయోపవేశం చేసుకుంటాను అంది.

అంతట ధర్మనందనుడు, ద్రౌపదితో, గురుపుత్రుడు ఏ అడవికో పోయి వుంటాడు. వెతికి చంపినా నీకెలా తెలుస్తుందని చెప్పగా అప్పుడు ద్రౌపది, ఆ దురాత్మునికి సహజమయిన శిరోమణి ఉంది. అది తెచ్చి యిస్తేచాలని భీమసేనుని దగ్గరగ వెళ్ళి వీరశిరోమణీ! సుక్షత్రియ ధర్మంతో సత్వరమే నీవు ఆ పాపిని అనుసరించి పోయి సంహరించి, లోలోపల రగులుతున్న క్రోధాగ్నిని చల్లార్చి నన్ను బ్రతికించవలసినదని వేడుకొన్నది. ఆ ద్రౌపది వాక్యము విని నకులుని సారథిగా చేసుకొని భీమసేనుడు ద్రోణపుత్రుని సంహరించుటకు వేగముగా బయలుదేరి వెళ్ళాడు.

అపుడు కృష్ణుడు, ధర్మనందనునితో భీముడొక్కడే అశ్వత్థామతో పోరాడుటకు పరుగెత్తుచున్నాడు. వానివద్ద బ్రహ్మ శిరోనామకాస్త్రము కలదు. అది అందరిని దహింపవేయగలదు. వెంటనే మనమందరము అతనిని అనుసరించి పోయి యుద్ధరంగంలో తోడ్పడవలసియున్నది. ఎందుకంటే ద్రుపదుని నుండి పరాభవమును పొంది దుఃఖించుచున్న ద్రోణుని చూచి బృహస్పతి దేవలోకమునుండి వచ్చి ఆ మణిని ద్రోణాచార్యునకిచ్చాడు. ఎవడు ఆ మణిని ధరించునో వానికి దుఃఖముగాని, దారిద్ర్యముగాని, ఆకలిగాని,

రోగముగాని కలుగదు. ఆ మణిని ఇప్పుడు అశ్వత్థామ ధరించియున్నాడు గాన దుఃఖమును పొందుటలేదు. ద్రోణాచార్యుడు తన యుద్ధాంతిమదినమున ఆ మణిని అశ్వత్థామకిచ్చాడు. దానిని ధరించియుండుటచే అశ్వత్థామ ఇంతవరకు సుఖముగానున్నాడు.

అశ్వత్థామ ఈశ్వరానుగ్రహంతో జన్మించినాడు. అతడు చిరంజీవి దివ్య శస్త్రాస్త్రవేత్త, బ్రహ్మశిరోనామకాస్త్రం స్వాధీనమయినదనీ, అందువల్ల ముల్లోకాలు అవలీలగా నిర్దహించి వేయగలననీ, అహంకరిస్తున్నాడు. మీరు అరణ్యములో నివసిస్తుండగా, ఒకనాడు అశ్వత్థామ మా రాజధాని చేరుకొన్ని, యాదవకుమారులతో వినోదించిన పిదప ఏకాంతంలో నా సాన్నిధ్యం చేరుకొని కృష్ణా! మా తండ్రి తపోనిష్ఠకు సంతసించి అగస్త్య మహాముని బ్రహ్మ-శిరోనామకాస్త్రం ప్రసాదించాడు. మాతండ్రి నాకు అది అనుగ్రహించాడు. అది నేను ఇప్పుడు నీకు అర్పించగలను. దానికి ప్రత్యామ్నాయంగా చక్రాయుధం నాకు ఈయవలసినదని వేడుకొన్నాడు. నాపై ప్రతిస్పర్థతోనే అతడు ప్రార్థించాడని గ్రహించి, ఆ భావాన్ని పైపైకి ఏ మాత్రము వ్యక్తం కానీయక నీ చక్రాయుధము, కోదండము, గద, ఖడ్గము అతని ముందుంచి వీనిలో ప్రయోగించగల అస్త్ర మేదయినా సరే స్వీకరించుము. నీ మహనీయ అస్త్రం నాకు అక్కరలేదు. కోరి అడిగినదెట్టి అమూల్య వస్తువయినా వెనువెంటనే ప్రసాదింపవలెనే కాని ప్రత్యామ్నాయ స్వీకరణ పురుషార్థ పద్ధతికాదు కదా! అని ప్రోత్సహించాను.

తరువాత అశ్వత్థామ సుదర్శనాయుధం కావలెనని కోరుకున్నాడు. నేను అనుమతించగా, అతడు ఎడమచేతితోను, కుడిచేతితోను లేవకుండుటచే రెండు చేతులను కలిపి చక్రమును ఎత్తబోయాడు. కాని దానిని కదల్చలేకపోయాడు. అపుడు కృష్ణుడు, అశ్వత్థామా! రుక్మిణీ దేవితో బాటు 12 సం॥లు బ్రహ్మచర్య వ్రతం కొనసాగించి ఈ చక్రాయుధం సంపాదించుకొన్నాను. నాకత్యంత ప్రియుడైన అర్జునుడే దీని నడుగలేదు. సరే! నీవు ఎవరితో యుద్ధమును కోరి

దీని వేదితివని కృష్ణుడడుగగా, నీతో సంకల్పించి నేను ఈ తీరులో వేడుకొన్నాను. అని తెలియజేసి సిగ్గుతో తిరిగి వెళ్ళిపోయినాడు.

కావున ధర్మనందనా! అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రం. ప్రయోగించిన యెడల భీమునకు ఆపద ఏర్పడగలదు. కాని దానిని మానవులపై ప్రయోగించిన యెడల నీకు అశుభం జరుగునని ద్రోణాచార్యులు చెప్పియున్నారు. కాని, ఆవేశ స్వభావుడయిన అశ్వత్థామకు నిగ్రహం లేదు. అందుచే మనం భీముని రక్షించుకోవాలి. అని పలికి సహదేవుని, సాత్యకిని శిబిర రక్షణలో వుంచి రథం మీద ధర్మరాజుని అర్జునుని ఎక్కించుకొని భీముని అనుసరించారు.

అప్పటికే భీమసేనుడు భాగీరథీ నదీతీరాన వున్న వ్యాసమహర్షికి నమస్కరించి అశ్వత్థామ కోసం అన్వేషిస్తున్నాడు. దేహమంతా విభూతి పూసుకొని, తపోదీక్షలో వున్న అశ్వత్థామ కనిపించగానే బాణం సంధించి భీముడు... ఓరీ కపటచిత్తుడా! చాలించు నీతపస్సు అని పలుకుచుండగా, అశ్వత్థామ భీముని చూచి, వెనువెంటనే అతనిని అనుసరిస్తున్న ధర్మార్జునులను గమనించి, వారు అందరు మహాస్త్రవేత్తలని గ్రహించుకొని, గత్యంతరం లేక బ్రహ్మ శిరోనామకాస్త్రం స్మరించి కంటకమయమైన తృణ మొకటి చేపట్టి, దానిపై ఆ అస్త్రదేవతను ఆహ్వానించి. అపాండవమగుగాక! అని ఎలుగెత్తి గర్జించి ప్రత్యర్థులపై ప్రయోగించాడు.

అంతట ఆ బ్రహ్మశిరోనామకాస్త్రము విశ్వమునే దహింపజేయునట్లు అగ్నిజ్వాలలు వెదజిమ్మగా వెనువెంటనే శ్రీకృష్ణుడు అర్జునా! ఇది బ్రహ్మశిరోనామకాస్త్రము, వేరొక అస్త్రమేదీ దీనిని ఎదుర్కొని ప్రతిఘటింపజాలదు. ఇందువల్ల తిరిగి నీవు ఇదే విధమయిన బ్రహ్మసిరోనామకాస్త్రం ప్రయోగించి దీనిని కూల్చి నీతోబాటు సోదరులను ఆదుకొని రక్షించవలసినదని హెచ్చరించాడు. వెంటనే అర్జునుడు ద్రోణాచార్యుని స్మరించి, మంత్రోచ్ఛారణతో బ్రహ్మశిరోనామకాస్త్రం తన వింట అనుసంధించి, మొదట అశ్వత్థామకు

ఏవిధమైన ఆపద కలుగకూడదని అతివినీతుడై అభ్యర్థించి, నాకు సహోదరులకు శుభమగు గాక! దీనితో అశ్వత్థామ ఘోరాస్త్రం శాంతించుగాక! అని పలికి వెనువెంటనే ప్రయోగించాడు. విశ్వమంతా అల్లకల్లోలం కాగా, ప్రాణికోటి విపరీత ప్రాణాపాయ భీతితో ఆక్రోశించినవి.

అంతలోనే నారద, వేదవ్యాసులు జగత్తును సంరక్షింపవలెనని తలచి, అర్జున అశ్వత్థామల మధ్యభాగంలో నిలిచి వీరులారా? విశ్వంలోగల మహాస్త్రవేత్తలు ఎన్నడైనా మానవులపై బ్రహ్మశిరోనామకం ప్రయోగించినారా? మీకు ఇది న్యాయమేనా? అని హెచ్చరించారు. అర్జునుడు అంతలోనే ఆ మహర్షులకు నమస్కరించి మహర్షులారా! ఒక అస్త్రంతో వేరొక అస్త్రం శాంతింప జేయవలెనని తలచి నేను అది ప్రయోగించాను. కాని వేరొక భావము కాదు అని పలికి మరుక్షణంలోనే తన మహనీయాస్త్రం మరలించి ఉపసంహరించాడు. ఆ అస్త్రమును ఉపసంహరించుట దేవతలకును దుష్కరమైనది. బ్రహ్మచర్యవ్రతము కలవానికంటె ఇతరుడు దానిని మరలింపజేయలేడు. అంతట ఆ మహర్షులు అర్జునుని అనేకవిధాల అభినందించారు.

అటువిమ్మట అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రం మరలించి ఉపసంహరింపవలెనని ప్రయత్నించి అసమర్థుడై వేదవ్యాసుని చూచి మహాత్మా! భీముడు కేవలం దురన్యాయ పద్ధతిలో దుర్యోధనుని సంహరించి నాకు ఎంతో అవమానం కలిగించాడు. అంతమాత్రం చేత శాంతించక నన్ను చంపవలెనని సంకల్పించి, ఆగ్రహావేశంతో పరాక్రమించాడు. పరాభవంవల్ల, ప్రాణభయం వల్ల అవివేకినై, ముందు వెనుక ఆలోచించక నేను ఈ మహాస్త్రం ప్రత్యర్థులపై ప్రయోగించాను. ఇందువల్ల ఇది తప్పక పాండవేయుల సంతానం సమస్తము నిర్దహించివేయక మానదు అని పలికెను.

అప్పుడు వేదవ్యాసుడు గురుపుత్రా! బ్రహ్మశిరోనామకాస్త్రం మరియొక అస్త్రంచే ఉపశమించిన యెడల ఆ దేశంలో 12 సం॥లు పాటు అనావృష్టి

దోషం ఏర్పడగలదు. అందుచేతనే మేము చెప్పగానే అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించుకొన్నాడు.

కావున నీవు గూడ యావచ్ఛక్తి వినియోగించి ఏదోవిధంగా దీనిని ఉపసంహరించవలసినది అపుడు నీవును సుఖించెదవు. కేవలం ధర్మమార్గం తలపోసి జయం స్వీకరణ అలక్ష్యం చేసిన అర్జునుడు ఇందువల్ల పరమానంద భరితుడై తన నిజవాసం చేరుకోవలసి ఉన్నది. కనుక నీ శిరోమణిని ఈతనికి అర్పించి మారు మాటాడక మరలిపోవలసినది. ఇది సమీచీనమైన సంధిమార్గము. నీకు ఇందువల్ల తప్పక శుభం చేకూరగలదు. అని పలికాడు.

ఆ మాటలను విని అశ్వత్థామ వ్యాసునితో మహాత్మా! ఈ అస్త్రమును మరల ఉపసంహరించుటకు నాకు సామర్థ్యము లేదు. ఈ శిరోమణి వల్ల సర్పభయంగాని, దేవదానవభీతిగాని, ఆకలి, తృష్ణ రోగముగాని నన్ను అంటనేరదు. కనుక నేను ఈ రత్నం వీరికి ఈయజాలను. అయినా హితువు ఆలకించి ఇది నీకు అర్పిస్తున్నాను. ఇక నా మహాస్త్రం పాండవేయపత్నుల గర్భాలనన్నింటిని నిశ్శేషంగా నిర్దహించి సంతృప్తి పొంది శాంతించగలదు. వేదవ్యాసుదు అది విని అశ్వత్థామా! సరే నీవు సంకల్పించినట్లే నెరవేరగలదు. కాని వేరొక దానికి ఆశపడరాదు అని హెచ్చరించాడు. అంతలోనే మరల ఇట్లు సవరించుకొని ఇందువల్ల వారి వంశీయుల రాణుల గర్భాలకు అన్నింటికి నాపలుకు అన్వయించగలదని నిశ్చయించుకొన్నాడు.

అపుడు కృష్ణుడు అశ్వత్థామా! పాండవేయ పౌత్రుల భార్యల గర్భాలలో ఏదో ఒక్కటి అయినా సంరక్షించి పాండవ వంశం శాశ్వతంగా లోకంలో ప్రతిష్ఠించవలెనని నిశ్చయించుకొన్నాను. ఇది మిక్కిలి న్యాయమైన పద్ధతి. మారు మాటాడక దీనికి అంగీకరించవలసినది. అని పలుకగా అపుడు అశ్వత్థామ..కృష్ణునితో కృష్ణా! నేను ఎందుకు ఆవిధంగా సంరక్షించవలెను. నా అస్త్రానికి నిర్దిష్ట లక్ష్య నిర్ణయమేల? విరాట నందన ఉత్తర గర్భం

పరిరక్షించవలెనని ఆలోచిస్తున్నావు. అని పలుకగా, అపుడు కృష్ణుడు బాలఘాతకుడైన అశ్వత్థామను ఇలా శపించాడు.

**తస్మాత్త్వమస్య పాపస్య కర్మణః ఫలమాప్నుహి ।**
**త్రీణి వర్షసహస్రాణి చరిష్యసి మహీమిమామ్ ॥**
**పూయశోణిత గన్ధీ చ దుర్గకాన్తార సంశ్రయః ।**
**విచరిష్యసి పాపాత్మ సర్వవ్యాధి సమన్వితః ॥ 16-12,13**

కావున ఈ పాపకర్మకు ఫలమును పొందుము. నీవు సర్వ వ్యాధులతో కూడినవాడవై, చీము, రక్తము వాసనకలవాడవై దుర్గమమైన కాంతార ప్రదేశములందు నివశించుచు ఈ భూమిమీద 3వేల సం॥లు సంచరించగలవు.

నీవు చూస్తుండగానే ఆ పరీక్షిత్తు వయస్సును పొంది వేదవ్రతముల నాచరించి కృపాచార్యుని నుండి సర్వాస్త్రములను పొంది ఈ భూమండలమున ధర్మాత్ముడై 60 సం॥లు భూమినేలగలడు. ఓ ద్విజాధమా! నా తపోవీర్యమును, సత్యమహిమను చూడుమని పలికాడు.

అపుడు వ్యాసుడు, అశ్వత్థామతో నా మాటలు కూడా లక్ష్యపెట్టకుండా ఈ పాపకర్మను చేశావు. కృష్ణుడు పలికినట్లే దుఃఖమును పొందెదవుగాక! అని శపించాడు. నా నుండి దూరంగా తొలగిపో అని గర్జించగా, అయినా అశ్వత్థామ ఏ మాత్రము పశ్చాత్తాప పడక, మునీంద్రా! నీవును సదా మానవులలోనే నివసింతువు గాక! అని శపించి నేను ఇక నీ సాన్నిధ్యంలోనే నివసించగలను. అని పలికాడు.

ఈవిధముగా శ్రీకృష్ణునిచే నిందింపబడి దుఃఖముతో అశ్వత్థామ తన పాపకృత్యమును తలచి ఇది సహవాస దోషమునకు ఫలమని నిట్టూర్పు విడుచుచూ, మహాత్ములగు పాండవులకు తన మణినిచ్చి అచటి వారందరు చూచుచుండగా వికల మనస్కుడై వనమునకు వెళ్ళి పోయాడు. రత్నము పోవుటచే అప్పటినుండియు మిక్కిలి సర్వవ్యాధి పీడితుడయ్యాడు. అంతవరకు మణి తనవద్ద

నుండుటచే కృష్ణ శాపమును పొందలేదు. పిమ్మట పాండవులు కూడ ద్రౌపదీదేవిని సమీపించి భీముడు ద్రౌపదితో దేవీ! - అశ్వత్థామ బ్రాహ్మణుడగుటచే, గురుపుత్రుడను గౌరవముచే విడిచిపెట్టాము. అతడు మణిచే వియోగమును పొందినాడు. అస్త్ర సన్యాసము చేశాడు. ఈవిధముగా పలికి భీమసేనుడు ద్రౌపదికి ఆ మణిని యివ్వగా అంతట ద్రౌపది అశ్వత్థామ మీ గురుపుత్రుడు నాకు గురువు. మీరు యుక్తముగా ఆచరించి నాక్రోధమును చల్లార్చారు. ఈ మణి ధర్మరాజు తన శిరస్సున ధరించుగాక! అంతట ధర్మరాజు ఆమణిని తీసుకొని తన శిరస్సున ధరించుకొన్నాడు.

### 6.10. అశ్వత్థామ వ్యక్తిత్వము

సప్త చిరంజీవులలో అశ్వత్థామ ముఖ్యుడు.

ద్రోణాచార్యునకు కృపికీ జన్మించిన ఏకైక సంతానం అశ్వత్థామ.

**మహాదేవాంతకాభ్యాం చ కామాత్ క్రోధాచ్చ భారత ।**
**ఏకత్వముప పన్నాగాం జజ్ఞే శూరః పరంతపః ॥**
**అశ్వత్థామా మహావీర్యః శత్రు పక్ష క్షయావహః ॥** (మహాభారతము)

అశ్వత్థామ ఈశ్వరాంశ సంభవుడు. ఈశ్వరుడు, యముడు, కామము, క్రోధము ఏకత్వము పొందగా పుట్టినవాడు శూరుడు వీరుడు శత్రుంజయుడు అయినవాడు అశ్వత్థామ అని భారతమునందు చెప్పబడింది.

అశ్వత్థామ ఇంద్రునితో సమానుడు వీర్యమున కార్తవీర్యునితో సమానుడు బుద్ధియందు బృహస్పతితో సమానుడు. తేజమున అగ్నితో సమానుడు గాంభీర్యమునందు సముద్రము వంటివాడు. క్రోధమున కోదెత్రాచువంటివాడు. రథికులలో ఉత్తముడు. యుద్ధమునందు కోపించిన యముని వంటి వాడు. యుద్ధమునందు ద్రోణుని యంతటివాడు.

అశ్వత్థామ యందు బ్రాహ్మణధర్మం వ్యక్తమయినప్పటికీ, ఇతనిలో

రజోగుణం ఎక్కువ. తండ్రి హస్తినకు చేరడంతో ఆ రజోగుణానికి రాచరికంతో సహవాసము అబ్బింది. క్రమంగా అతణ్ణి బ్రాహ్మణ ధర్మం నుంచి ప్రక్కకు లాగింది. రాజకుమారులతో కూడి అశ్వత్థామ తాను కూడా క్షత్రియుని వలె ప్రవర్తించసాగాడు. యుద్ధాల్లో యథేచ్ఛగా పాల్గొన్నాడు. అర్జునుడితో సాటిగా విలువిద్య నేర్చుకున్నాడు.

ధర్మాధర్మాలు తెలిసికూడా ద్రోణుడి లాగానే దుర్యోధనుడి వైపే నిలిచాడు. కురుక్షేత్ర మహాసంగ్రామంలో అధర్మ పక్షాన నిలిచిన ఇతనికి ద్రోణుడికి ఉన్నపాటి వివేకం కూడా లేదు. యుద్ధంలో బలబలాలు తేల్చుకుందామనుకున్నాడు. తప్ప, ధర్మాధర్మాలు అతడికి స్ఫురణలో లేవు. కాని అశ్వత్థామలో ఒక విశిష్టమైన గుణము వుంది అదే రుద్రభక్తి.

ఈ కలియుగము తరువాత వచ్చు చివర ద్వాపరమున అశ్వత్థామ వ్యాసుడై వేదవిభజన చేస్తాడు. ఇపుడు సప్తమ మన్వంతరము జరుగుచున్నది. రాబోయే అష్టమ మన్వంతరములో గాలవుడు, దీప్తి మంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, ఋష్యశృంగుడు, వ్యాసభగవానుడు సప్తర్షులయ్యెదరు. ఇపుడు వారి వారి ఆశ్రమములో యోగనిష్ఠులై యున్నారు.

## 7. బలిచక్రవర్తి

ప్రహ్లాదుని కుమారుడైన విరోచనుని కుమారుడు బలిచక్రవర్తి. ఇంద్రరాజ్యమును బలాత్కారముగా గ్రహించినవాడు మరియు భుజబలానికి పేరుపొందినవాడు, కావున బలి అనే పేరు అతనికి సార్థకమై ప్రసిద్ధమైంది.

### 7.1. భాగవతములో బలిచక్రవర్తి

హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. విరోచనుని కుమారుడు బలిచక్రవర్తి. ఈ బలిచక్రవర్తి తన దానవ గణాలతో భార్గవులను (శుక్రాచార్యుని) ఆశ్రయించి, శుభముహూర్తాన విశ్వజిద్యాగం ఏ విఘ్నమూ లేక యథావిధిగా పూర్తి చేశాడు. ఆ యజ్ఞం ఫలితంగా హోమకుండం నుంచి అగ్నిహోత్రుడు సంతోషంతో దివ్యరథంతో సింహపతాకాన్ని దివ్యశక్తి గల విల్లు, అభేద్యకవచాన్ని, ధనుర్బాణాలను బహూకరించాడు.

తాత ప్రహ్లాదుడు వచ్చి ఎన్నడూ వాడని తామరపూదండ ప్రీతిగా మనుమని కంఠాన వేసి విజయోస్తు అని దీవించాడు. గురువైన శుక్రాచార్యుడు తెల్లని శంఖం యిచ్చాడు. ఆ దివ్య వస్తువులు పరమభక్తితో పరిగ్రహించి బలి గురువు పాదాలకు నమస్కరించాడు. ఇలా బలి శాంతచిత్తుడై వేదవేత్తలను వివిధ దానాలతో తృప్తి పరచాడు. వారి ఆశీస్సులను పొందాడు.

దైత్యులకు దేవతల వలన కార్యావరోధములు అనేక బాధలు గలుగుచుండెను. పూర్వము నుండి వైరముండటముతో ఇంద్రుని పదవీ భ్రష్టుని చేయుటకై సమయం చూసి బలి దేవేంద్రుని మీదికి దండెత్తాడు. అసుర బలాలను చూసి దేవేంద్రుడు బృహస్పతిని చేరి యోచించగా, అంతట బృహస్పతి దేవేంద్రునితో - ఇది యుద్ధానికి సమయం కాదని, శత్రువు చాలా బలంగా వున్నప్పుడు వైదొలగడం మంచిదనీ, మళ్ళీకాలం కలసివచ్చినపుడు విజయం సాధింపవచ్చుననీ, చెప్పగా పిమ్మట ఆచార్యుని అభిమతానుసారం దేవగణాలు

కామరూపాలతో స్వర్గలోకమును విడిచివెళ్ళారు. బలి స్వర్గలోకమును ఆక్రమించుకున్నాడు. శుభముహూర్తంలో గురువులు దీవిస్తుండగా, ఇంద్ర సింహాసనం అధిష్ఠించాడు. ముల్లోకాలకు ప్రభువయినాడు బలిచక్రవర్తి.

పిమ్మట గురువైన శుక్రాచార్యుడు సత్యం, ఆత్మగౌరవం, దైవభక్తి, దానగుణం మరియు అహింస అనే ఈ ధర్మ పంచకాన్ని వంచన లేక పాలిస్తూ ఉండు అని బోధించి బలిచక్రవర్తిచే నూరు అశ్వమేధయాగాలు యథావిధిగా చేయించాడు. తన రాజ్యంలో దరిద్రుడుండరాదనే నియమంతో బలిచక్రవర్తి అనేకానేక దానాలతో సర్వప్రజలకూ సంతోషము కలిగించాడు.

అయితే దేవతల తల్లి అదితి తన బిడ్డలకు కల్గిన దుస్థితి చూచి విచారిస్తూంటే, ఆమె భర్త కశ్యపుడు ఒకనాడు ధ్యానసమాధి వీడి వచ్చి, అదితిని ఓదారుస్తూ అదితీ! ఇదంతా ఆ శ్రీహరి మాయ. దానినెవ్వరూ తప్పించలేరు. ఆ దౌర్భాగ్య దశ తొలగి నిత్య సౌభాగ్యదశ నీకూ నీసంతతికి కలగాలంటే ఒక ఉపాయం చెప్తున్నాను వినుము. 'పయో భక్షణం' అనే వ్రతం ఉంది. దానిని నిశ్చలమైన నియమంతో ఆవుపాలునే ఆహారంగా తీసుకొని, పన్నెండు రోజులు చెయ్యాలి. దానికి మంత్రం ఉంది. ఆ మంత్రానికి అధిదేవత విష్ణువు. ఆ శ్రీహరిని సేవిస్తే ఆ భగవంతుడు అనుగ్రహిస్తాడు. అని పలికి నారాయణసేవా వ్రత విధానం బోధించాడు.

అంతట అదితి నియమ నిష్ఠలతో ఆ శ్రీహరి సేవావ్రత విధానమును ఆచరించగా, పదమూడవరోజున శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై ఆమె కోరిక ప్రకారం సుఖశాంతులు ప్రసాదించడానికి అంగీకరించాడు.

దానవ సంహారం కంటే వారిని నిర్వీర్యులను చేసి దేవతలకు అధిపత్యం యిచ్చే సంకల్పంతో అదితి గర్భాన ప్రవేశించి శుభగ్రహాలు, శుభస్థానాలలో నుండగా, అభిజిల్లగ్నమున శ్రావణ శుద్ధ ద్వాదశినాడు పగలు పన్నెండు గంటలకు ప్రభవించాడు. దేవతలు పుష్పవర్షం కురిపించారు.

అటుపిమ్మట వామనుడు ఆయుధాలు, అలంకారాలూ కలిగిన తన దివ్య రూపాన్ని వదలి కపట బ్రహ్మచారిగా మారు రూపాన్ని పొందినాడు. అతనికి వామనుడని పేరు పెట్టారు. తరువాత వామనునికి వడుగు చేయడానికై కశ్యప ప్రజాపతిని ముందుంచుకొని మునీంద్రులు తగిన కార్యకలాపాలు జరిపారు. వామనునికి సూర్యుడు గాయత్రి మంత్రాన్ని బోధించినాడు. బృహస్పతి జన్నిదాన్నీ కశ్యపుడు ముంజదర్భల మొలత్రాడునూ, అదితి కౌపీనాన్ని, భూదేవి నల్లని జింక చర్మాన్నీ, చంద్రుడు దండాన్నీ, ఆకాశం గొడుగునూ, బ్రహ్మ కమండలాన్నీ సరస్వతీదేవి జపమాలనూ, సప్తర్షులు పవిత్రమైన దర్భలనూ యిచ్చినారు. కుబేరుడు వామనునికి భిక్షాపాత్రను ఇచ్చినాడు. జగన్మాత పార్వతీదేవి ప్రత్యక్షమై అక్షయం అంటూ ఆ బ్రహ్మచారికి నిండైన భిక్ష పెట్టింది. బ్రహ్మర్షులు వామనుని ఆదరంగా ఆశీర్వదించినారు. తరువాత వారు వేదమంత్రాలను చదువుతూ, వెలిగే అగ్నిహోత్రంతో ఉత్సాహంతో హోమం చేసినారు.

పిమ్మట వామనుడు దాతలను గూర్చి బ్రాహ్మణులను అడుగగా వారు వామనునితో వామనా! ధనమిచ్చే దాతలున్నారు. బ్రాహ్మణులు కోరిన సంపదలను పొందుతున్నారు. కానీ ఆ దాతలలో బలిచక్రవర్తితో సమానమైన మహాదాతలేడు. అతడు శుక్రాచార్యుని అనుమతితో నూరు గొప్ప యాగాలు చేసినాడు. అతనిని అడిగితే నీకు గొప్ప సంపద సమకూరుతుందని పలికారు.

వామనుడు లోకాలకు మేలు కలిగించడానికై బలిచక్రవర్తిని దానమడగడానికి సంకల్పించి, తల్లిదండ్రుల అనుమతి పొంది మంచి ముహూర్తంలో బయలుదేరి నర్మదానదిని దాటి దానికి ఉత్తర తీరంలో ఉన్న బలిచక్రవర్తి యాగశాలను సమీపించగానే, అక్కడున్నవారు గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తున్న వామనుని చూచి వారు ఇట్లనుకొనిరి.

శంభుండో హరియో పయోజభవుడో చండాంశుడో వహ్నియో
దంభాకారతవచ్చె గాక, ధరణిన్ ధాత్రీ సురుండెవ్వడీ

శుంభద్ద్యోతనుడీ మనోజ్ఞ తనుడంచున్ విస్మయ భ్రాంతులై,
సంభాషించిరి బ్రహ్మచారి గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

(భాగవతము 8-533)

ఆ సభలోని వారు వామనుని చూచి శివుడో! విష్ణువో! బ్రహ్మయో! సూర్యుడో! అగ్నియో! ఈ మారువేషంతో వచ్చి యుండవచ్చు. ఇంత తేజస్సు కలిగిన బ్రహ్మచారి ఎవరై యుంటారని అనుకుంటూ ఆశ్చర్యంతో భ్రమపడి రహస్యంగా గుసగుస లాడారు.

ఆ వామనమూర్తి వేదం చదువుతున్న వారితో కలిసి వేదం చదివాడు. మరికొందరితో నవ్వుతూ వారిని పలకరించాడు. మరికొందరితో వాదోపవాదాలు చేశాడు. ఇలా అందరినీ పలుకరిస్తూ బలిచక్రవర్తిని సమీపించి అతని చూచి ఇట్లా అన్నాడు.

ఇతడే దానవచక్రవర్తి! సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయప్రవర్తి! గతలోభస్ఫూర్తి, నానా మఖా
వ్రత దాన ప్రవణానువర్తి! సుమనోరామా మనోభేదనో
ద్ధత చంద్రాతపకీర్తి! సత్యకరుణ ధర్మోల్లసన్మూర్తిదాన్.

( భాగవతము8-543)

ఇతడేనా రాక్షస చక్రవర్తి! అష్టదిక్పాలుర గర్వాన్ని తొలగించినవాడు యితడే! అణు మాత్రమైనా లోభంలేని చక్రవర్తి యితడే! అంతేకాదు అనేకానేక యజ్ఞ యాగాదులొనర్చి, ఆ యాగాంతాల్లో మహత్తర దానయోగ చక్రవర్తీ యితడే! అంతేకాదు. సత్య-దాన-దయా-ధర్మాలు మూర్తీభవించిన చక్రవర్తీ యితడే! అని పలికి మరియు స్వస్తి వాక్యాలు పలికి నీకు శుభమగుగాక! అని దీవించాడు.

అప్పుడు బలిచక్రవర్తి వామనునితో ఓ బ్రహ్మచారీ! నీ పేరేమిటి? ఎవరివాడవు?నీ నివాసమేది? నీ రాకవల్ల నా వంశము, జన్మమునూ, యజ్ఞమును పవిత్రమైనవి. నీకేమి కావలెనో కోరుకొనుము.

బలిచక్రవర్తి అడిగిన ప్రశ్నకు వామనమూర్తి ఆ చక్రవర్తితో ఓ రాజా! నా ఉనికి యిదీ అది అని ఎలా చెప్పేది. ఒక చోటనకుండా అంతటా నిండి వుంటాను. నేనెవ్వరివాడనని చెప్పను. నాయంతటి వాడిగా నడవనేర్తును. నానడవడి ఇది - అని చెప్పలేను. మూడు విధాలా పోతుంటాను. అని పలికి, ఆ వామనుడు చివరగా తన మనస్సులోని కోరిక బలిచక్రవర్తికి ఇట్లు తెలియజేశాడు.

> "ఒంటివాడ నాకు నొకటి రెండడుగులు మేర యిమ్ము పొమ్ముమేర యొల్ల,
> గోర్కెదీర బ్రహ్మకూకటి ముట్టెద దానకుతుక సాంద్ర! దానవేంద్ర!"
>
> (భాగవతము 8-566)

రాక్షసరాజా! నీవు నాకు ఏవేవో ఇవ్వాలని కుతూహలపడుతున్నావు. నేను ఒంటరివాణ్ణి. నాకు పొమ్ములూ, భూములూ అక్కరలేదు. మూడడుగుల నేల మాత్రమివ్వు. దానితో తృప్తిపడి బ్రహ్మానందం పొందుతాను. అని పలుకగా, అప్పుడా బలిచక్రవర్తి వామనునితో బ్రాహ్మణోత్తమా! నీవు పసిబాలుడవు. అడుగుట కూడా నీకు చేతకాదు. భూమి ఖండమంతా అడిగావా? ఏనుగులూగాని, గుఱ్ఱాలు గాని, స్త్రీలను గాని కోరినావా? ఇంతటి రాక్షసచక్రవర్తి, మూడడుగులు ఇవ్వలేనా? అని అనగా అపుడా వామనుడు ఓ రాజా! గొడుగో, జందెమో, కమండలమో, మొలత్రాడో, దండమో, నాక్కావాలి?, ఎందుచేతనంటే నేను బ్రహ్మచారిని కనుక భూములు, యేనుగులు, వామాక్షులు, గుఱ్ఱాలు యెందుకు? నాక్కావలసిన మూడడుగులు నీవీయ గలిగితే అదే నాకు బ్రహ్మాండమౌతుంది.

> త్రిభిః క్రమైః అసంతుష్టో ద్వీపేనాపి న పూర్యతే ।
> నవవర్ష సమేతేన సప్తద్వీప వరేచ్ఛయా ॥ (భాగవతము 8వ స్కంధం)

మూడడుగుల భూమితో సంతృప్తి పొందనివానికి నవవర్షయుక్తమగు ఒక ద్వీపమునిచ్చినను అతడు సంతోషింపడు. ఏలయనగా, అతడు

ఏడుద్వీపములను పొందవలెనను కోరిక కలిగియుండును. పైవిధంగా పలికిన వామనునికి మూడడుగుల భూదానం చేయడానికి బలిచక్రవర్తి సంసిద్ధుడయ్యాడు.

అది చూసి శుక్రాచార్యుడు, మహారాజా! ఈ బ్రహ్మచారి ఎవరనుకుంటున్నావు? సాక్షాత్తు వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణమూర్తి వామనరూపంలో వచ్చి నిన్ను మూడడుగులు యాచిస్తున్నాడు. నీవు మూడడుగులు దానం చేసిన యెడల ఒక పాదంతో భూవలయం, రెండవపాదంతో ఊర్ధ్వ లోకాలు ఆక్రమిస్తాడు. దానమిస్తానని యివ్వకపోతే నరకం సిద్ధిస్తుందని అనుకుంటున్నావా? దానం చేసి సర్వనాశనం అయ్యేస్థితి వస్తే అది దానమే కాదన్నారు ప్రాజ్ఞులు. సర్వనాశనం అయ్యే దశలో ఆడినమాట తప్పితే అసత్య దోషం లేదు.

ఆ. వారిజాక్షులందు వైవాహికములందు, బ్రాణవిత్తమాన భంగమందు,
చకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు, బొంకవచ్చు నఘము పొందదధిప!
(భాగవతము 8-585)

పై సందర్భములలో అబద్ధం చెప్పవచ్చు. దానివల్ల పాపం రాదు. వచ్చినవాడు శ్రీమహావిష్ణువు అని శుక్రాచార్యుడు మేలుకోరి చెప్పగా, అప్పుడా బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు.

గురుదేవా! యీ రాజ్యం శాశ్వతమా ? యీ శరీరానికి అపాయం లేకుండా ఉంటుందా? అని పలుకుతూ చివరగా గురువుతో...

నిరయంబైన నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన, కులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్ హరియైన, నీరజ భవుండ సౌభాగ్యవంతుడైన నౌ,
దిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్"
(భాగవతము 8-593)

గురుదేవా! నాకు నరకము రానీ, బంధనరానీ, యీ భూదేవి

నిర్మూలింపబడనీ, దుర్మరణమే రానీ, నా రాక్షసకులం అంతమందనీ, నిజముగా యివన్నీ రానిమ్ము యేమి జరిగినా కానీ, హరియే కాదు. హరుడైనా, బ్రహ్మదేవుడైనా నన్నడగడానికి వచ్చి అడిగినప్పుడు మాత్రం యిస్తానని చెప్పిన నానోటికి తిరుగులేదు. మీరు వేయి చెప్పండి నేను వినను.

ఇలా వామనునికి దానమివ్వడానికే కుతూహలమపడుతున్న బలిచక్రవర్తిని చూచి అతనిపై శుక్రాచార్యుడు కోపగించుకున్నాడు.నా ఆజ్ఞ మీరినావు. కాబట్టి త్వరలో పదభ్రష్టడవై పోతావు. అని శాపమిచ్చినాడు. గురువుగారి శాపానికి బలిచక్రవర్తి బాధపడలేదు. అతడు అసత్య మార్గాన్ని అవలంబించలేదు. ఇంతలో బలిచక్రవర్తి ఇల్లాలు వింధ్యావళి కలశంతో నీళ్ళు తీసుకురాగా, బలిచక్రవర్తి వామనుని పాదపద్మములను కడిగి, పూజించి....

"విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ
వేదప్రామాణ్య విదే త్రిపాద ధరణీం దాస్యామి"

పరమాత్మునకు ప్రీతికలుగుగాక! అని పలికాడు.

ఆ సమయంలో నీళ్ళధార పడకుండా శుక్రాచార్యుడు కలశం రంధ్రానికి అడ్డుపడి ఆపివేసినాడు. ఆ సంగతి తెలుసుకొని వామనుడు దర్భకొనతో పొడిచినాడు. దానివల్ల శుక్రునికి ఒక కన్ను పోయింది. అటు తరువాత ఆటంకం లేకుండా బలిచక్రవర్తి ధారపోసినాడు. బలిచక్రవర్తి అందించిన దాన ధారను వామనుడు స్వీకరించినాడు. మాయా బ్రహ్మచారి బలిచక్రవర్తితో ఇలా అన్నాడు. 'భూమిని దానమిచ్చిన వానికీ, దానిని ప్రీతితో తీసుకొన్న వానికీ పాపాలు నశించిపోతాయి. వారు సంతోషంగా స్వర్గలోకంలో నూరేండ్లు విహరిస్తారు. అందువల్ల ఏ దానమూ భూదానానికి సమానం కాదు. భూదానమిచ్చిన నీకు రెండు లోకాలలోనూ కీర్తి మరియు పుణ్యమూ కలుగుతుంది. ఈ మూడడుగులూ ఇస్తే మాకు మూడు లోకాలూ ఇచ్చినట్లే అని పలుకగా అంతట బలిచక్రవర్తి సంతోషంగా భూదానం చేసినాడు.

బలిచక్రవర్తి వామనుడికి భూమిని ధారాదత్తం చేయగానే గ్రహాలు, మునీంద్రులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నర, యక్ష దేవతలు, నాగులు వీరంతా బలిచక్రవర్తి త్యాగాన్ని గొప్పగా కీర్తించారు. ఆకాశంనుంచి పుష్పవర్షం కురిసింది. దేవదుందుభులు మోగాయి. దానాన్ని తీసుకోగానే వామనుడు

**ఇంతింతై, వటుడింతయై మరియు దానింతై నభోవీథిపై**
**నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై**
**నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.**

(భాగవతము 8 –622)

తొలుత కొద్దిగా మాత్రమే పెరిగాడు. క్షణకాలం తరువాత ఆకాశం అంత ఎత్తు ఎదిగాడు. ఇక ఆ తరువాత చంద్రమండలాన్ని ధృవమండలాన్ని అతిక్రమించి సత్యలోకం వరకూ ఆక్రమించాడు. అలా అనుక్షణం పెరుగుతున్న ఆ వామనమూర్తికి సూర్యబింబం మొదట గొడుగులా ఉంది.

ఆ తరువాత శిరోరత్నంలా, చెవికుండలంలా,కంఠాభరణంలా, బంగారు భుజకీర్తిలా,చేతికి పెట్టుకునే కంకణంలా మారింది. మరికొద్ది సేపటికే మొలతాడు గంటలా, ఆ వెనుకకాలి అందెలాగా, చివరకు పాదాలకింద ఉండే పీఠంలాగా అయింది. అంటే సూర్యమండలంపై దాకా శ్రీమహావిష్ణువు వ్యాపించాడు. ఇలా విష్ణువు వామన స్వరూపాన్ని విడిచిపెట్టి త్రిగుణాత్మకమైన విశ్వరూపాన్ని ధరించి భూమి, ఆకాశం, దిక్కులు, సముద్రాలు, సకల ప్రాణిసమూహం తానై క్రమక్రమంగా భూలోకాన్ని దాటి భువర్లోకాన్ని అతిక్రమించి సువర్లోకం, మహర్లోకం,జనలోకం, తపోలోకం, సత్యలోకం కూడా దాటి విశ్వమంతా తానయ్యాడు. ఆయన పాదాలకింద రసాతలలోకం, పాదాల మీద భూలోకం, నడుము దగ్గర పర్వతాలు, తొడల దగ్గర ఇంద్రసేన మరుద్గణాలు. నాభిదగ్గర ఆకాశం, పొట్టదగ్గర సప్త సముద్రాలు, వక్షస్థలం దగ్గర నక్షత్రసమూహాలు,

హృదయంలో ధర్మం, మనస్సులో చంద్రుడు, వక్షఃస్థలంలో లక్ష్మి, కంఠంలో సమస్త వేదాలు అలా వామనమూర్తి సర్వమూ తానై విశ్వరూపుడై విరాజితుడయ్యాడు. విష్ణువు అభిప్రాయాన్ని తెలుసుకొని గరుడుడు బలిచక్రవర్తిని వరుణపాశాలతో బంధించినాడు. పిమ్మట మహావిష్ణువు బలిచక్రవర్తితో ఓ దనుజేంద్రా! మూడడుగుల నేల ఇస్తానంటివి. భూలోకమూ, చంద్రసూర్యులదాకా ఉండే స్థలమూ నాకు ఒక అడుగైనది. స్వర్గలోకం ఒక అడుగైనది. ఇక మూడవ అడుగుకు ఎక్కడుంది చోటు అని పలుకగా, బలిచక్రవర్తి ప్రసన్నమైన ముఖంతో వామనునితో ఇట్లా అన్నాడు.

ఆ. సూనృతంబుగాని నుడియదు నా జిహ్వ బొంకజాల, నాకు బొంకులేదు
నీ తృతీయ పదము నిజము నా శిరమున నెలవుసేసిపెట్టు నిర్మలాత్మ!
(భాగవతము 8-643)

ఓ పుణ్యాత్ముడా! నా నాలుక సత్యాన్నే పలుకుతుంది. దానికి తిరుగులేదు. అసత్యం పలుకదు. నాలో అసత్యం అనేది లేదు. నీ మూడవపాదాన్ని శాశ్వతంగా నా తలపై పెట్టు.అని పలుకుతుండగా పరమ భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు స్వామికి నమస్కరించి స్వామీ! నీవు వానికి మొదట ఇంద్రపదవి ఇచ్చినావు. ఆ పదవి అజ్ఞానానికి అహంకారానికి మూలకారణమైనది. అటువంటి పదవిని విడిపించి వానికి గొప్ప ఉపకారమే చేసినావు.

ఆ సమయంలోనే బలిచక్రవర్తి భార్య వింధ్యావళి విలపిస్తూ దయామయా! లక్ష్మీపతీ! 'నాకు పతిభిక్షపెట్టు' అంటూ ముల్లోకాలకూ ప్రభువైన వామనమూర్తిని వేడుకొన్నది.

తరువాత బ్రహ్మదేవుడు వచ్చి వామన మూర్తితో ఇట్లా అన్నాడు. ఓ దేవదేవా! జగన్నాథా! బలిచక్రవర్తి గొప్పదాత. ఇతడు నీకు తన ధనమంతా ఇచ్చినాడు. ఇతడు శిక్షింపదగినవాడు కాదు, దయచూపదగినవాడు. ఇతని భయాన్ని పోగొట్టి బంధవిముక్తిణ్ణి చెయ్యి. అని పలికాడు.

బ్రహ్మ మాటలు విని భగవంతుడు ఇట్లా అన్నాడు.

ఎవనిపై నేను దయ చూపాలనుకొంటానో అటువంటి వాని సంపదనంతా అపహరిస్తాను. ఎవడు ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటాడో అటువంటి వానిని నేను ప్రీతితో కాపాడుతాను. అని పలికి మరల

శా. బద్ధుండై గురుశాపతప్తుడయి బాంధవ్రాతత్యక్తుడై
సిద్ధైశ్వర్యము గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పడు
ద్బుద్ధుండై యజమాయ్యమాయ గెలిచెం బ్రహ్మాండశీలండల్పుడే

(భాగవతము 8-662)

ఈ పుణ్యాత్ముడు బంధింపబడినాడు. గురువు శాపం వల్ల పరితాపానికి గురియైనాడు. బంధువులనుండి విడువబడినాడు. ప్రాప్తించిన అధికారాన్నీ ఐశ్వర్యాన్నీ గోల్పోయి పేదవాడైనాడు. అయినా నిర్మలంగా ఉన్నాడు. సత్యాన్నీ దయనూ, సన్మార్గాన్నీ వదలకుండా ఉన్నాడు. జ్ఞానియై గెలవడానికి సాధ్యం కాని మాయను గెలిచినాడు. ఇతడు సావర్ణి మనువు కాలంలో దేవతలకు ప్రభువై దేవేంద్రుడవుతాడు. ఊహించడానికి వీలుకాని ఆ పదవికి నేనే పిలిపిస్తాను, దయతో కాపాడుతాను. అంతవరకూ విశ్వకర్మ నిర్మించిన సుతల లోకంలో దానవుల సేవలు అందుకొంటూ ఐశ్వర్యంతో పెంపొందుతావు. అని పలికి ప్రహ్లాదునితో నాయనా! ప్రహ్లాదా! నీవు నీ మనుమనితో పాటు నీ వారితో పాటు సుతల లోకానికి వెళ్ళు. నేను గదాహస్తుడనై వచ్చి మిమ్ములను కాపాడుతాను. అక్కడ మీకు ఏ కష్టమూ కలగదని అనుగ్రహించాడు. పిమ్మట భగవంతుడు ఋత్విక్కుల నడుమ సభలో కూర్చున్న శుక్రాచార్యునితో – ఆచార్యవర్యా! బలిచక్రవర్తి యాగానికి లోపమేమీ రాకూడదు. ఈ యజ్ఞంలో మిగిలిన కార్యాన్ని నీవు నెరవేర్చు. ఆగిపోయిన యజ్ఞ కార్యాలు మీవంటి బ్రహ్మవేత్తల వల్ల సఫలమవుతాయి. అని చెప్పగా, ఆ భగవంతుని ఆజ్ఞను

పరిపాలించదలచి శుక్రాచార్యుడు బలి యజ్ఞమును పూర్తి చేశాడు.

బలిచక్రవర్తి ఆజ్ఞ నెరవేర్చని దనుజులు దండార్హులని శాసించాడు. బలికెట్టి భంగపాటును లేకుండ బలివాకిట తానే కావలిగా యున్నాడు. పాతాళలోకమున నున్న బలితో యుద్ధము చేసి వానిని జయింపవలెనని రావణుడు ఆ లోకమునకు వెళ్ళాడు. బలి యతని చూచి రావణా! రమ్ము అని తన తొడపై కూర్చుండబెట్టుకొని నీవు వచ్చిన పని యేమి? యని అడిగాడు. రావణుడు తావచ్చిన పని చెప్పలేక నిన్ను విష్ణుమూర్తి మాయ చేసెనని వింటిని వాడెచ్చట నున్నాడో తెల్పుము అని పలుకగా నీవు మొదటి ద్వారము కడ జూచిన యతడే విష్ణువని బలి విష్ణు మాహాత్మ్యమును తెలిపాడు. (భాగవతం)

బలి దగ్గరకు దేవకి కోర్కెపై కృష్ణబలరాములు, కంసునిచే చంపబడిన శిశువుల నామెకొకసారి చూపుటకై సుతలమునకు వచ్చిరి. వారిని బలిసేవించి ప్రార్థించాడు. వారు తాము వచ్చిన పని చెప్పి అతని అనుమతిని గైకొని అందున్న శిశువులను భూలోకమునకు తీసికొనివచ్చిరి.

ఈ కథాసారాంశం పరిశీలిస్తే నిస్స్వార్థ త్యాగగుణం, విష్ణుభక్తి ఈ రెండూ ఉండబట్టే విష్ణువంతటి వాడిని తన ఇంటిముందు కావలివాడిగా ఉంచుకోగలిగాడు బలిచక్రవర్తి. అంటే భగవంతుడు అలా నిస్స్వార్థంగా వ్యవహరించేవారిని, దానగుణం, త్యాగగుణం ఉండేవారిని నిత్యం అనుగ్రహిస్తుంటాడని తెలియజెప్పడమే ఈకథాంశంలోని సారాంశం.

**7.2. బలిచక్రవర్తి వ్యక్తిత్వము**

బలిచక్రవర్తి దైత్యవంశంలో జన్మించినప్పటికి మహా గొప్పదాత.

**శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః ॥**
**వక్తా దశ సహస్రేషు దాతా భవతి వా నవా ॥ (నీతి శ్లోకము)**

వందమందిలో శూరుడొక్కడుంటాడు. వేయిమందిలో పండితుడొక్క

డుంటాడు. పదివేలమందిలో వక్త ఒక్కడుంటాడు. లక్షల మందిలో దాత ఒక్కడుంటే ఉంటాడు. లేకపోతే లేడు. దానగుణ వైశిష్ట్యమది.

ఆచంద్రతారార్కమైన, కల్పాంతర ధ్రువమైన ప్రవిమలమైన కీర్తిని పొందటానికి కారణం అతని దానశీలమే. దానానికి త్యాగం పరాకాష్ఠ. అట్టి త్యాగం వలన 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' - మనము చేసే నిత్య నైమిత్తిక యజ్ఞయాగాది కర్మలవలనగాని, మననంతానం వలనగాని, ధనం వలనగాని, అమృతత్వం లభించదు. ఒక్క త్యాగం వల్ల మాత్రమే అది సాధ్యమవుతుంది. అంటున్నది కైవల్యోపనిషత్తు.

సాక్షాత్తు శ్రీమహావిష్ణువు వామనుడైవచ్చి బలిచక్రవర్తిని సమీపించి మూడడుగులు నేల దానమివ్వమని యాచించాడు. 'విత్తం చ సంపాద్య మేరుతుల్యం దానేన తద్బుద్ధి తృణేన తుల్యం' ధనం బంగారు కొండలాగా విలువైనది కనుక దానిని మేరు పర్వతమంత సంపాదించాలి. దానం చేసే సమయంలో మాత్రం గడ్డి పరకలాగా భావించి దానం చేయాలి. అట్టి బుద్ధితో బలిచక్రవర్తి వామనునికి మూడడుగులు దానం చేశాడు.

బలిచక్రవర్తిలో నిస్వార్థ త్యాగగుణం, నిష్కల్మష భక్తి, సత్యవాక్కు ఇట్టిగుణాలు ఉండబట్టే విష్ణువంతటివాడిని తన ఇంటి ముందు కావలివాడిగా ఉంచుకోగలిగాడు బలిచక్రవర్తి. అంటే భగవంతుడు అలా నిస్వార్థంగా వ్యవహరించేవారని దానగుణం, త్యాగగుణం ఉండేవారిని నిత్యం అనుగ్రహిస్తాడు. అందుకే శ్రీహరి చిరంజీవియైన బలిచక్రవర్తిని సూర్యసావర్ణి మనువుకాలంలో ఇంద్రపదవిని అధిష్ఠిస్తాడని అనుగ్రహించాడు.

## 8. వేదవ్యాసుడు (కృష్ణద్వైపాయనుడు)

ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే ।
జాతః పరాశరాద్యోగీ వాసవ్యాం కలయా హరేః ॥

మూడవదియగు ద్వాపరయుగము అంతము కాబోయే సమయములో పరాశరమహర్షి వల్ల ఉపరిచరవసువు కుమార్తె అగు సత్యవతి యందు శ్రీహరి అంశావతారమైన జ్ఞానియగు వ్యాసమహర్షి జన్మించాడు.

### 8.1. ఆదిపర్వము

### 8.1.1. వేదవ్యాసుని తల్లి సత్యవతి (మత్స్యగంధి) జననము

చేది దేశమును వసువను రాజు ప్రజారంజకంగా పరిపాలిస్తూ ఉండేవాడు. వసురాజు ఒకనాడు వినోదముగా వేటాడుటకై అడవికి వెళ్లాడు. అచ్చట దివ్యమైన ఆశ్రమాన్ని చూచి తన అస్త్రశస్త్రములను విడిచి తపమాచరించాడు. దేవేంద్రుడు తన దేవతాబృందముతో అతని వద్దకేగి రాజా! నీవు దయామూర్తివై వర్ణాశ్రమ ధర్మములను పాటించి రాజ్యమును పరిపాలించుచుంటివి. ఇప్పుడు నీవు తపమాచరించుటకు కారణమేమి? నీ పరిపాలనకును, నీ తపమునకును మెచ్చాను. నీవు నేటినుండి నాతో స్నేహభావమున ఉండుము. నీకు నవరత్న ఖచితమైన బంగారు విమానము, ఎప్పుడూ వాడిపోవునటువంటి ఇంద్రమాల మరియు ధర్మ రక్షణార్థం వంశీ దండమును ప్రసాదించి అంతర్హితుడయ్యాడు.

వసురాజు ఆనాటినుండి దివ్యమైన విమానమును అధిరోహించి ఉపరిలోకములు సంచరించుటచే ఆ రాజును ఉపరిచరవసువు అని పిలువసాగిరి. ప్రతి సం॥ము దేవేంద్రునిచే నీయబడిన వస్తువులకు ఇంద్రోత్సవములకు యుత్సవము చేయుచుండెడివాడు. ఆ ఉత్సవములకు రుద్రుడు, ఇంద్రుడు మొదలగు దేవతలు సంతోషించుచుండిరి. దానివల్ల జనులకు ఆయుర్వృద్ధియు,

సంతానవృద్ధియు, సంపత్సమృద్ధియు గలుగుచుండెడిది.

ఈవిధముగా ఉపరిచర వసువు[10] దేవేంద్రుని సంతసింపజేసి వరమును పొందాడు. ఆ వరప్రభావమున ఆ రాజుకు అయిదుగురు కుమారులు జన్మించారు. వారిలో బృహద్రథుడు మహారథికుడుగా ప్రఖ్యాతుడయి మగధ దేశానికి చక్రవర్తి అయ్యాడు. అలాగే మణివాహన ప్రత్యగ్రహ, యదు, మావెల్ల అనువారిని గూడ నాలుగు రాజ్యాలకు అధిపతులను చేశాడు.

తన రాజధానీ నగర సమీపమములో శుక్తిమతీయను నది ప్రవహించుటకు కోలాహలమను పర్వతము అడ్డుపడినది. అంతట ఉపరిచర వసువు తన పాదముతో ఆ పర్వతమును కాలితో తన్ని ఆ నదికి మార్గము ఏర్పరచాడు. శుక్తిమతి దానికి ప్రత్యుపకారముగ వసుపదుడను బాలుని, గిరిక అను బాలికను ప్రసాదించింది. ఆ రాజు వసుపదుని తన సేనాపతిగ నియమించి, గిరికను తన భార్యగా పరిగ్రహించాడు.

ఒకరోజు అతని పితృదేవతలు వసువుతో వసువా! నీ భార్యయగు గిరిక రజస్వల యైనపుడు ఆమెకు మృగమాంసము ఆహారముగా పెట్టమని

---

**10. ఉపరిచర వసువు పూర్వ జన్మ వృత్తాంతము**

దేవలోకమున ఒకప్పుడు యాగము జరుగుచుండెను. ఆ యజ్ఞమున పశ్వాలంభన విషయమున దేవతలకును, ఋషులకును వివాద మేర్పడినది. దేవతలు మేకను హోమము చేయవలసినదని బ్రాహ్మణులకు చెప్పిరి. అజ అనగా – ఛాగమే. (అనగా మేకయే) వేరొక పశువు కాదు అని వారి సిద్ధాంతము. కాని ఋషులీ అభిప్రాయముతో ఏకీభవింపలేదు. ధాన్యములచే యజ్ఞముల యందు హోమము చేయదగినదని వేదశ్రుతికలదు. అందువలన 'అజా' అను పేరు గల బీజములే హోమము చేయదగినవి. మేకను చంపుట తగదు. కాని వసువను వాడు దేవతల మతమునే ఆశ్రయించి పక్షపాతముచే మేకయే హోమము చేయదగినదని సిద్ధాంతీకరించాడు. అందుచే ఋషి శాపమున వసువు భూలోకమున జన్మించాడు.

జెప్పారు. అంతట బుతిమతియైన తన భార్యకు మృగమాంసమును తెచ్చి యిచ్చుటకై వసువొకనాడు అడవికేగి అచ్చటగూడ తన ప్రియురాలినే తలచుకోగా, అతనికి రేతః పతనమయ్యింది. ఆ రేతస్సును వృథా కాకూడదని తలచి భద్రముగా ఒక ఆకు దొప్పలో నుంచి, ఒక డేగకిచ్చి తన భార్య అయిన గిరిక కిమ్మని చెప్పి పంపాడు. ఆ డేగ తీసుకొని వెళ్ళుచుండగా, మరియొక డేగ మాంసమని భ్రమించి, దానితో పోరాడినది. అంతట ఆ దొప్ప పట్టుజారి యమునానదిలో పడింది.

పూర్వము బ్రహ్మదేవుని శాపము వల్ల యమునానదిలో అద్రికయను అప్సర స్త్రీ ఆడచేపయై యున్నది. ఆ చేప వసువు వీర్యములోని రెండు బిందువులను మ్రింగి వెంటనే గర్భమును ధరించింది. నవమాసముల పూర్తియైన పిదప పదవమాసమున ఆ చేపను బెస్తవాడొకడు వలవేసి పట్టి దాని ఉదరమును కోయగా ఒక పుత్రుడు, ఒక పుత్రిక ఉద్భవించిరి. అద్రిక చేప జన్మమును విడిచి దేవతాస్త్రీయై స్వర్గలోకమునకు వెళ్ళినది. బ్రహ్మదేవుని వచనానుసారముగా శాపవిమోచనము పొందింది. వారు ఆ శిశువులను వసువుకు సమర్పించారు. వసువు ఆ పుత్రుని మాత్రము గ్రహించి 'మత్స్యరాజు' అను నామముతో పిలువబడి మత్స్య దేశాధీశుడై ధర్మముగా రాజ్యమేలుచున్నాడు. కన్యకను మాత్రము దాశరాజునకిచ్చి పెంచమన్నాడు. ఆమెయే సత్యవతి[11]. మీన గర్భంలో జన్మించడం వల్లను, మత్స్య గంధం వల్ల ఆ బాలికకు 'మత్స్యగంధి' అని వేరొక

---

**11 సత్యవతి పూర్వజన్మ వృత్తాంతము**

ఈమె మరీచి నందనులగు పితృగణముల మానస కన్యకగా పుట్టి, తన పితరులచే నిర్మితమగు అచ్ఛోదమను సరోవర తీరమున సహస్ర దివ్యవర్షములు తపస్సు చేసి పితరుల మెప్పింపగా వారు దివ్యాలంకార భూషితులై దర్శనమిచ్చిరి. అంతట ఆమె తన తండ్రులలో మావసుడు అనువానిని తనపతిగా కోరినది. ఈవ్యభిచారముచే ఆమె యోగభ్రష్టయై స్వర్గమునుండి క్రిందికి పడెనుగాని భూమినంటక భూమిమధ్యమున నిలచినది. ఆమె కోరికను మావసుడు తన మనసును చలింపనీయకుండటం చేసి ఆ కార్యము ప్రవర్తిల్లిన దినము అమావాస్య అని పిలిచిరి. పితృసంబంధమగునది కావున ఆ దినము పితరులకు

నామము ఏర్పడింది.

**సాతు సత్యవతీ నామ యత్స్యమాత్యభి సంశ్రయాత్ । (ఆదిపర్వం)**
**శుశ్రూషార్థం పితుర్నావం వాహయంతీం జలే చ తామ్ ॥(63-69)**

సత్యవతి పేరు గల మత్స్యగంధి తండ్రికి శుశ్రూష చేయుచు నదియందు నావను నడుపుచున్నది.

**8.1.2 వేదవ్యాస జననము**

మహాత్ముల జన్మవృత్తాంతము చిత్రవిచిత్రములుగా నుండును. వ్యాసుని జన్మ చరిత్రమును అట్టిదే. బ్రహ్మ మానస పుత్రుడగు వశిష్ఠులవారి మనుమడు పరాశరుడు. ఇతడు అఖండ జ్ఞానం సంపాదించాడు. ముఖ్యంగా ఖగోళ జ్ఞాన ప్రియుడై గొప్ప జ్యోతిషశ్శాస్త్రవేత్తగా పరిణమించాడు. పరాశరహోర అనే అత్యద్భుతమైన జ్యోతిశ్శాస్త్రాన్ని రచించాడు. పరాశరుడు నిత్యం జ్యోతిశ్చక్రాన్నీ దానిలోని గ్రహచారాదికాల్ని ఎల్లప్పుడూ లెక్కగడుతుండేవాడు. ఆయా గ్రహగతుల వల్ల భవిష్యత్తులో జరగబోయే వింతలు తెలుసుకోగలడు.

ఒకనాడు పరాశరమహర్షి తీర్థయాత్రార్థమై సంచరిస్తూ యమునా తీరం చేరుకొన్నాడు. నియమనిష్ఠలతో కఠోర తపమాచరించి బ్రహ్మర్షి అయినా, ఆ సమయంలో ఆ ముని ఆత్మ నిగ్రహం సడలింది. ఒకే వస్త్రం ధరించి అనతి

---

ముఖ్యము. ఆ దినమునందు వారలకు చేసెడు స్వల్పక్రియలైనను వారు అక్షయములుగ భావించి తృప్తి చెందుదురు. అట్లు అచ్ఛోద తలక్రిందుగా పడి పితరులనందరిని వినుతించి నా వ్యభిచారమును మన్నించి, నాకు మరల గతులు కలుగునట్లు కరుణింపుడని వేడగా ఆ పితరులు ఆమెను జూచి నీవిపుడు దేవతలు చేసెడు కర్మఫలములను అనుభవించుమంది 28వ ద్వాపరమున మీన యోనియందు పుట్టి సత్యవతి అను పేరుతో పిలువబడి, మొదట పరాశర మహాముని తేజమున వ్యాసమహామునిని కని పిదప శంతనుని భార్యవై విచిత్ర వీర్యుడు, చిత్రాంగదుడు అను నిరువురు పుత్రులను పొంది, కడపట అచ్ఛోద అను పుణ్యనదివి, అయ్యెదవని చెప్పి అంతర్హితులయిరి.

దూరంలో నావ నడుపుతూ క్రమక్రమముగా తన సమీపానికి చేరుకుంటూ ఉన్న సత్యవతి అతిలోక సౌందర్యం సందర్శించగానే పరాశరునకు ఆమెపై మోహము కల్గింది. ఆ యువతి దాశవంశంలో జన్మించిన కన్యకాదనీ వసు రాజన్యుని కుమార్తెయనీ, తన దివ్యదృష్టి వల్ల మున్ముందుగానే గ్రహించుకొన్నాడు. ఆ పరాశర మహర్షి ఇట్లు అనుకున్నాడు.

జ్యోతిశ్చక్ర చాలనం రీత్యా విష్ణు సన్నిభుడైన పుత్రోదయానికి నిషేక సమయం చేరువలోనే యుంది. కాని ఎలా అని ఆలోచిస్తున్నాడు. దాశ కన్యక సిగ్గుతో తలవంచుకొని, కడగంటి చూపులతో ఆ తపోనిధిని చూసింది. ఆ పరాశరుడు తన మనసులోని కోరికను తెలియజేశాడు. అప్పుడామె ఋషివర్యా! ఆ తీరం అవతల మానవసంచారం గోచరిస్తున్నది కదా! అని చెప్పగా, పరాశరుడది గ్రహించి తపోబలంచే తమచుట్టు దట్టమైన పొగమంచు కల్పించాడు.

> యేన దేశః స సర్వస్తు తమోభూత ఇవాభవత్ ।   (అదిపర్వం)
> దృష్ట్వా సృష్టం తు నీహారం తత్సతం పరమర్షిణా ॥ 63-74

ఆ ప్రదేశమంతా కనుచూపు మేరలో సర్వత్ర గాఢాంధకారమే అలముకొన్నట్లు భాసించింది. మత్స్యగంధి ఆ పరమాద్భుత సృష్టికి ఆశ్చర్య చకితురాలై, మరింత సిగ్గుతో ఇలా అన్నది.

మునివర్యా! నేను కన్యకను. అదియును గాక! మాతండ్రి ఆధీనురాలను. పైగా మీనగంధిని, కన్యాత్వానికి భంగం కలిగిన పక్షంలో ఇక నేనే ముఖం పెట్టుకొని మా ఇంటికి వెళ్ళగలను? ఒకవేళ ఎలాగో గృహం చేరుకొన్నా అక్కడ ఎంతకాలమని నివసించగలను? తామీ విషయాలన్నీ ఆలోచించి నిర్ణయించ వలసిందని ప్రార్థిస్తున్నాను.

ఆ మాటలు విని పరాశరుడు సంతోషించి ఓ చిన్నదానా! నన్ను ఆనందింపజేసిన యెడల నీ కన్యాత్వానికి ఏ విధంగాను భంగం కలగదు. ఈవిషయంలో నీవే మాత్రము భయపడనక్కరలేదు. ఇకమీదట నీ శరీరం ఈ

క్షణం నుంచీ ఒక యోజనం మేరవరకు కస్తూరి పరిమళాలు వెదజల్లును. నీకీవిధమైన వరం గూడా ప్రసాదిస్తున్నాను. ఏమత్స్యగంధి కప్పటినుంచి గంధవతీ అని, యోజనగంధీ అని ప్రఖ్యాత నామధేయాలు ఏర్పడ్డాయి.

నిత్యజ్యోతిర్వ్యాప్త చింతనాపరుడైన ఆ పరాశర మునీంద్రుడు తలచుకున్న ముహూర్తానికి

**పరాశరేణ సంయుక్తా సద్యోగర్భం బభూవసా ।**
**జజ్ఞే చ యమునాద్వీపే పారాశర్యః సవీర్యవాన్ ॥ 63-84**

పరాశరముని సాంగత్యం వల్ల సత్యవతీదేవి సద్యోగర్భం ధరించి యమునానదీ ద్వీపంలో అప్పటికప్పుడే తేజస్సాలియగు వ్యాసుని ప్రసవించింది. జన్మిస్తూనే పెరిగి పెద్దవాడై స్వతస్సిద్ధంగానే మహాజ్ఞాని అయినాడు. నీలమేఘశ్యామ శరీరుడైన ఆ మహర్షికి కృష్ణ నామధేయం సహజంగానే ఏర్పడింది. యమునానది ద్వీపంలో జన్మించడంచే ద్వైపాయనుడన్న నామము కలిగింది. ఆ ప్రకారంగా కృష్ణద్వైపాయనుడయినాడు.

అనంతరం వేదవ్యాసమహర్షి కృష్ణాజినము, కపిలజటలు, దండం కమండలములు ధరించి జాజ్జ్వల్యమాన రూపంతో జనని సత్యవతికి సాష్టాంగ నమస్కృతులర్పించి, అత్యంత వినయంతో అంజలి ఘటించి,

**స మాతరమనుజ్ఞాప్య తపస్యేవ మనో దధే । (ఆదిపర్వం)**
**స్మృతోఽహం దర్శయిష్యామి కృత్యేష్వితి చ సోఽబ్రవీత్ ॥ 63-85**

అతడు తల్లి అనుమతిని పొంది తపస్సు చేయుటయందే మనోనిశ్చయము కలవాడై, అమ్మా! అవసరమగు కార్యములయందు నీవు స్మరించినచో నీకు దర్శనమిచ్చెదనని విన్నవించాడు. అలా ఆమె అనుమతి పొంది సమస్త లోకాలకు సదా శుభపరంపరలు కలిగించవలెనని సత్సంకల్పంతో సాంద్రారణ్యంలో ఒక ఏకాంత ప్రదేశంలో తపోదీక్ష వహించాడు. ఆ సాత్త్వవ

తేయుడే కృష్ణద్వైపాయనుడు (వేదవ్యాసుడు).[12]

యుగయుగానికీ ధర్మదేవత కొక్కొక్క పాదమే. లుప్తమై పోతున్నదనీ, క్రమక్రమంగా మానవాళికాయుర్దాయము, శక్తిసామర్థ్యాలు నన్నగిల్లి పోతున్నాయనీ గ్రహించి వారిని అనుగ్రహింపగోరి వ్యాసమహర్షి వేదరాశి యావత్తు నాలుగు విధాలుగా విభాగం చేశాడు. అంతేకాక అష్టాదశపురాణాలు, పంచమవేదమై ప్రఖ్యాతివహించిన భారత సంహితను రచించాడు.

> వేదనధ్యాపయామాస మహాభారత పంచమాన్ ।
> సుమంతుం జైమినిం పైలం శుకంచైవ స్వమాత్మజమ్ ॥ ఆదిపర్వం
> ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయనమేవచ ॥ 63-89,90 శ్లో.

---

12. వ్యాసుని పూర్వ జన్మ వృత్తాంతము

మహాభారతమందలి శాంతిపర్వము 350 వ అధ్యాయమున వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు వేదవ్యాస పూర్వజన్మ వృత్తాంతము ఇట్లు చెప్పెను. ఓ రాజా! సృష్టికర్త బ్రహ్మదేవుడు వేదమును ఉచ్చరించుచు 'భో' అను శబ్దము ధ్వనింపచేయగా, అప్పుడు అపాంతరతమా అనుపేరు గల వాక్నుండి కుమారుడు ఉద్భవించాడు. అతడు భూతభవిష్యవర్తమానములను తెలిసిన వాడును, సత్యవాక్కు గలవాడును, దృఢమైన వ్రతము గలవాడును అయ్యాడు. తనకు నమస్కరించిన కుమారుని గూర్చి బ్రహ్మదేవుడు ఓ బుద్ధిమంతుడా! వేదములను చెప్పుట నీవల్ల శ్రవణము చేయదగియున్నది.

వైవస్వత మన్వంతరమున కురువంశీయులగు భారత రాజులు పుట్టగలరు. వారు గొప్పవారై, లోకమునందు ప్రసిద్ధినొందిన వారునుకాగలరు. నీనుండి పుట్టిన వారలకు విరోధము సంభవించును. వసిష్ఠ మహర్షి నుండి పరాశరుడను మహర్షియు సంభవింపగలడు. వానిని నిమిత్తముగా చేసుకొని పుట్టి నీవు భారతమును రచింపగలవు. ఈవిధముగా సరస్వతీ కుమారుడైన అపాంతరతమ ఋషిని గూర్చి బ్రహ్మదేవుడు చెప్పగా, ఆవిధముగా బ్రహ్మ అనుగ్రహముచే అపాంతరతమ ఋషియే హరియంశచే మరల వ్యాసుడుగా అవతరించాడు. ఈవిధముగా విష్ణువే సత్యవతీదేవియందు కృష్ణద్వైపాయనుడుగా, పరాశరమహర్షి వల్ల జన్మించాడు.

శ్రేష్ఠుడగు ఆ ద్వైపాయనమహర్షి సుమంతుని, జైమినిని, పైలుని, తన కుమారుడగు శుకుని, వైశంపాయనుని మహాభారతముతో గూడిన పంచ వేదములను అధ్యాపనము చేయించాడు.

## 8.1.3. వేదవ్యాస మహిమచే ధృతరాష్ట్ర పాండురాజ, విదురుల జననము

ఇంద్రపదవిని అధిష్టించిన నహుషుని కుమారుడు యయాతి. ఆయన కుమారులలో కనిష్ఠుడయిన పూరువు కారణంగా పురువంశం ఏర్పడింది. ఈ వంశంలో జన్మించినవాడే ప్రతిశ్రవసుడు. ప్రతిశ్రవసుకి జన్మించినవాడు ప్రతీపమహారాజు, ఈతనిభార్య పేరు సునందాదేవి. వీరికి చాలాకాలం వరకు సంతానం కలగలేదు. అపుడు దంపతులిద్దరు సంతానాపేక్షతో తీర్థయాత్రలు చేయగా, అపుడు వారికి శంతనుడు, దేవాపి, బాహ్లీకుడు అను ముగ్గురు పుత్రులు కలిగారు. ఒకరోజు ప్రతీపుడు గంగానది తీరాన తపస్సు చేసుకొనుచుండగా, గంగాదేవి అతని అందాన్ని చూసి మోహించింది. స్త్రీ ఆకారం దాల్చి ప్రతీపుని సమీపించి తనను వివాహమాడమని కోరింది. నాకు వివాహమైంది నిన్ను వివాహం చేసుకోలేనని చెప్పాడు. అయినా గంగ వినలేదు. గోముగా వచ్చి ప్రతీపుని తొడమీద కూర్చుంది. దీనికి ఆయన ఆగ్రహించి పుత్రుడు కూర్చోవలసిన చోట కూర్చున్నావు. నా పుత్రునకు భార్యవుకమ్ము. అని శపించాడు. ఈ శాపవశాత్తు శంతనుని గంగాదేవి వివాహమాడింది. వీరి కుమారుడే భీష్ముడు గంగాదేవికి జన్మించిన కారణాన గాంగేయుడని కూడా పేరు.

శంతనమహారాజు సత్యవతిని చూచి మోహించి విచారగ్రస్తుడై యుండగ తండ్రి విచారము తీర్చదలచినవాడై దేవవ్రతుడు(భీష్ముడు) దాశరాజు వద్దకు వెళ్ళి సత్యవతిని శంతన మహారాజు కిమ్మని కోరగా, దాశరాజు నీవు జ్యేష్ఠ పుత్రుడవై ఉండగా సత్యవతిని సంతానమునకు రాజ్యాధికారముండదు గదా? అని చెప్పగా అప్పుడు భీష్ముడు... ఈ సత్యవతియందు కలుగు సంతానము రాజు కాగలడని. పలికి మరల భీష్ముడు దాశరాజుతో...

రాజ్యం తావత్పూర్వమేవ మయాత్యక్తం నరాధిప ।
అపత్యహేతోరపిచ కరిష్యేఽ_ద్య వినిశ్చయం ॥ 100–95 శ్లో

సత్యవతి వివాహమునకై ఇదివరకే రాజ్యమును త్యజించాను. ఇపుడు నా సంతానము వల్ల నీకు భయం లేకుండా ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఓ దాశరాజా! ఇది మొదలు నాకు బ్రహ్మచర్యమే ఆశ్రయము కాగలదని. అని ప్రతిజ్ఞ చేశాడు.

ఆ శంతన మహారాజు సత్యవతులకు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అను ఇద్దరు కుమారులు జన్మించారు. చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధము చేసి మరణించాడు. విచిత్రవీర్యుడు రాజై, కాశీరాజు కుమార్తెలయిన అంబిక అంబాలికలను వివాహమాడి రాజ్యమును పరిపాలించుచు సంతానము లేకయే మరణించాడు. ఆ సమయమున సత్యవతి భీష్మునితో నీవు సర్వధర్మవిదుడవు. ఈ భరతవంశము నామీద ఆధారపడియున్నది. నిన్నొక కార్యమందు నియోగించుచున్నాను. నీవట్లు చేయదగినవాడవు. నాపుత్రుడు నీ సోదరుడైన విచిత్రవీర్యుని భార్యలు పుత్రార్థినులై యున్నారు. వంశవృద్ధికై నీవు వారలకు సంతతి కల్గింపుము. లేక రాజ్యమందైనను అభిషిక్తుడవుగమ్ము అని పలుకగా, అపుడా భీష్ముడు తన ప్రతిజ్ఞను విడువలేను అని పలికి, అనాదిగా వస్తున్న సంప్రదాయం ప్రకారం పూజ్యులైన బ్రాహ్మణోత్తముల్ని పూజించి వారిద్వారా అంబికా అంబాలికాల క్షేత్రాలనుంచి సంతానమును పొందుదామని ధర్మమైన మార్గాన్ని తల్లికి సూచించాడు. అపుడు సత్యవతి వ్యాసుని వృత్తాంతము తెలియజేసి, స్మరించడముతో వ్యాసులవారు ప్రత్యక్షమైనాడు.

భీష్ముడంతట భూసురులతోను, పురోహితులతోను కలిసి ఆ ఋషీంద్రునికి అర్ఘ్య పాద్యాదులతో యథావిధిగా పూజలాచరించాడు.

పిమ్మట సత్యవతి కుమారుడైన వ్యాసునితో,... కుమారా! నీవు భరతవంశాభివృద్ధి కొరకు, ప్రజారక్షణ కొరకు దేవరధర్మ ప్రకారం విచిత్రవీర్యుని భార్యలకు సత్సంతతి అనుగ్రహింపవలసి ఉన్నది. దీనికి నీవు అంగీకరించవలెను.

అంతట వ్యాసుడు అంగీకరించి అంబిక, అంబాలికలకు ఒక నియమం విధించాడు. అమ్మా! దేవర న్యాయం ధర్మ సమ్మతమే అని పలికి క్షణకాలం ఆలోచించి ఈ విధంగా ఉపదేశించాడు.

వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్టమిహ యన్మయా ।
సంవత్సరం యథాన్యాయం తతః శుద్ధే భవిష్యతః ॥ 105-42

ఆ రాజు భార్యలు ఇచ్చట నాచే చెప్పబడిన వ్రతమును యథాన్యాయముగా సంవత్సర మాచరింతురేని పరిశుద్ధులవుతారు. అట్లుకాక

యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతురకాలికః । (ఆదిపర్వం)
విరూపతాం మే సహతాం తయోరేతత్పరం వ్రతమ్ ॥ 105-46
యది మే సహతాం గన్ధం రూపం వేషం తథా వపుః । (ఆదిపర్వం)
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్ ॥ 105-47

అమ్మా! నాచే సోదరునకు అకాలికముగ పుత్రుడు అనుగ్రహింప వలెనని అంబిక అంబాలికలిరువురు ఒక్క నియమం అవలంబించవలెను. నా రూపమును, వేషమును, శరీర గంధమును సహించి ఆ యువతు లిరువురు నన్నెంతో అనురక్తితో సేవించవలెను. ఇప్పుడిక ఇదే వారికొక కఠిన నియమం కాగలదు. ఇపుడే అంబిక విశిష్టయగు గర్భమును పొందుగాక! నా కలయికను కోరుచున్నదియై నా రాకను నిరీక్షించుగాక! అని వ్యాసుడు అంతర్హితుడయ్యాడు.

### ధృతరాష్ట్ర జననము

అనంతరం సత్యవతీదేవి అంబికను సమీపించి రాజకుమారీ! వేదవ్యాసుని అనుగ్రహం వల్ల నీకిక కుమారుడు ఉద్భవించబోతున్నాడు. క్షేత్రంలో జన్మించిన వాడే సుపుత్రుడని వేదవేత్తల నిర్ణయం. దేవర పద్ధతి ధర్మసమ్మతమే. దీనికి నీవెంత మాత్రం సంకోచించనక్కరలేదు. నేటి రాత్రి దేవర న్యాయంతో వ్యాసమహర్షి సన్నిధికి విచ్చేసినపుడు నీవెంతో అనురక్తితో సేవించవలెను. నీవు బ్రహ్మణ్యుని రాకకై అనుక్షణము నిరీక్షించవలెను.

అంతట అంబిక శుచి స్నాతయై,చక్కగా అలంకరించుకొని శయ్యా భవనంలో వ్యాసభగవానుని రాకకై నిరీక్షించుచున్నది. అదే సమయంలో వేదవ్యాసుడు ఆ ఏకాంత మందిరంలో ప్రవేశించాడు.

**తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే ।**
**బభ్రూణిచైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీన్యమీలయత్ ॥ 106 –5**

ఆ అంబిక దీపికాకాంతిలో ఆ తేజశ్శాలి కపిలవర్ణమగు జటలను, ప్రకాశించుచున్న నేత్రములను, దీర్ఘములైన కనుబొమ్మలను, గడ్డములను, చూచి నేత్రములను మూసికొనెను.

తల్లి ఆజ్ఞ ప్రకారం ఆ మహర్షి ఆ అంబికకు స్వకీయ సాంగత్య భాగ్యం అనుగ్రహించాడు. అనంతరం సత్యవతీదేవి సన్నిధికి మరలివచ్చి వ్యాసుడు :

**నాగాయుత సమప్రాణో విద్వాన్ రాజర్షి సత్తమః ॥**
**మహాభాగో మహావీర్యో మహాబుద్ధిర్భవిష్యతి । (ఆదిపర్వం)**
**తస్యచాపి శతం పుత్రా భవిష్యంతి మహాత్మనః ॥**
**కిం తు మాతుంస వైగుణ్యాదన్ధ ఏవ భవిష్యతి । 106–8,9,10**

అమ్మా! 10 వేల ఏనుగుల బలము కలవాడును, విద్యావంతుడును, గొప్ప అదృష్టవంతుడును, గొప్ప బుద్ధికలవాడునగు రాజర్షి పుట్టగలడు. వానికి నూర్గురు మహాత్ములగు పుత్రులు కలుగగలరు. కాని తల్లి లోపమువల్ల అంధుడుగా జన్మించగలడు. ఇతడే ధృతరాష్ట్రుడు.

**పాండురాజు జననము**

ఆ మాటలను విని సత్యవతి దుఃఖించింది. నాయనా! అంధనరపతి కౌరవ కులశ్రేష్ఠుడు కాజాలడు గదా! కనుక అంబాలికకు ఒక కుమారుని అనుగ్రహింపవలసిందని వేడుకొన్నది. ఆ మునీంద్రుడు ఆ అభీష్టానికి అనుమతించి ఆనాటిరాత్రి అంబాలిక భవనంలో ప్రవేశించాడు. ఆ అంబాలిక

వేదవ్యాసుని సమున్నత నీల శరీరం సందర్శించి ఆమె భయముతో తెల్లబోయింది. పారాశర్యుడు ఆ సుందరిని అనుగ్రహించి, మరికొంత సేపటికి యథాప్రకారముగా సత్యవతి సమీపించి అమ్మా! అంబాలిక తనయుడు అత్యద్భుత శక్తి శౌర్యవంతుడై కౌరవ వంశవర్ధనుదు కాగలడు. అయితే

యస్మాత్ పాండుత్వమాపన్నా విరూపం ప్రేక్ష్య మామిహ ।(ఆదిపర్వం)
తస్మాదేష సుతస్తే వై పాండురేవ భవిష్యతి ॥ 106-17

అయితే అంబాలిక నన్ను చూచి దిగ్భ్రాంతిపడి వెలవెల బోయింది. అందువల్ల ఆ కుమారుడు ధవళ శరీరుడై పాండురాజు నామధేయంతో ప్రఖ్యాతుడు కాగలడు.

అనంతరం కొంత కాలానికి అంబికకు జన్మించిన పుత్రునకు ధృతరాష్ట్రుడని, అంబాలికకు జన్మించిన పుత్రునకు పాండురాజని, భీష్ముడు ఆ శిశువుల కిరువురికి జాతకర్మాది జన్మ సంస్కారాలన్నీ యథావిధిగా నిర్వర్తింపజేశాడు. జన్మతోనే దృష్టి విహీనుడైన ధృతరాష్ట్రుని చూచి సత్యవతీదేవి మిక్కిలి దుఃఖించి తిరిగి వేదవ్యాసుని స్మరించింది. తక్షణమే వేదవ్యాసుడు ప్రత్యక్షముకాగా అంతట సత్యవతి వ్యాసునితో నాయనా! అంబికకు జన్మించిన కుమారుడు అంధుడైనాడు గదా! అందువల్ల మరియొక పుత్రుని అనుగ్రహించవలసిందని వేడుకొన్నది.

**విదురుని జననము**

వేదవ్యాసుడు, క్షణమాలోచించి అమ్మా! అంబిక కొంత ఆత్మ సంయమనం అవలంబించి పరిశుద్ధురాలయిన యెడల తప్పక నీకోరిక నెరవేరగలదని అనుగ్రహించాడు.

అంబికకు మరియొక పుత్రుని అనుగ్రహించుటకు రాగా, కాని ఆమె ఆ వ్యాసుని వికృత వేషము, శరీర దుర్గంధము భరింపజాలక అంబిక తన

దాసిని అలంకరించి బంధువులెవరికీ తెలియకుండా అతిరహస్యంగా తన శయన మందిరంలో పవళింపజేసింది. వ్యాసుడు ఆ దాసిని అనుగ్రహించాడు. ఆ తపోనిధి కరుణాకటాక్షం వల్ల ఆ పరిచారిక గర్భంలో మహాధర్మవేత్త అయిన విదురుడు ఉదయించాడు. మాండవ్య మహాముని శాపం వల్ల యమధర్మరాజే ఆ దాసియందు కుమారుడై అవతరించాడు. అంబిక చేసిన వంచనను సత్యవతికి తెలియజేసి, ఆ విదురుని వృత్తాంతమును తెలిపి అంతర్హితుడయ్యాడు.

### 8.1.4. వేదవ్యాసుడు గాంధారిని అనుగ్రహించుట

పాండురాజు కుంతీ[13] మాద్రు[14]లతో శతశృంగ పర్వతాన ఉండగా, ఒకరోజు పాండురాజు ఆజ్ఞానుసారము కుంతీదేవి ఇతఃపూర్వము దుర్వాసమహర్షి[15] ఉపదేశించిన మంత్రాన్ని యథావిధిగా జపించి ధర్మదేవతను ప్రార్థించింది. అంతట కుంతీదేవి అతని దయవలన గర్భం ధరించి సంవత్సర కాలం పూర్తి కాగానే చంద్రుడు జ్యేష్ఠా నక్షత్రంతో కూడి ఉచ్చస్థితిలో ఉండగా సూర్యాదిగ్రహాలు శుభస్థానాలలో ఉండగా, అష్టమినాడు అభిజిన్ముహూర్తములో ధర్మదేవత అంశచే ధర్మరాజు జన్మించాడు.

ధర్మరాజు జన్మించకముందు పూర్వకాలంలో వ్యాసమహర్షి ఒకనాడు ధృతరాష్ట్రభూపతి సన్నిధికతిథిగా వచ్చాడు. మిక్కిలి ఆకలి దప్పికలతో అలసి

---

13. కుంతి : ఈమె భోజుని అభిమాన పుత్రిక. దేవమీఢునకు మారిష యందు పుట్టినది. ఈమె వసుదేవుని చెల్లెలు. ఈమెకు 'పృథ' అని నామాంతరము కలదు. ఈమె పాండురాజు మొదటి భార్య. ఈమె 'సిద్ధి' అంశతో కుంతీదేవిగా జన్మించింది.

14. మాద్రి : ఈమె మద్రరాజు కూతురు. శల్యుని చెల్లెలు. పాండురాజుకు భార్య. ఈమెకు అశ్వనీ దేవతల ప్రసాదము వలన నకుల సహదేవులు అనువారు జన్మించిరి. ఈమె 'బుద్ధి' అంశతో జన్మించింది.

15. దుర్వాసమహర్షి : అత్రికిని అనసూయకును రుద్రాంశమున జన్మించినవాడు. ఇతని సహోదరులు సోముడు, దత్తాత్రేయుడు. ఇతడు మహాకోపి.

సొలసిన ఆ మహనీయునికి ఆ సమయాన గాంధారీదేవి[16] అత్యంత భక్తి శ్రద్ధలతో పరిచర్య లాచరించి గౌరవించింది. ఆ మహాసాధ్వి సేవకెంతో సంతోషించిన వ్యాసమహర్షి ఆ దేవి ప్రార్థనపై నూరుగురు కుమారులు జన్మించగలరని వరం అనుగ్రహించాడు. మరికొంత కాలానికి గాంధారి గర్భం ధరించింది.

**సంవత్సర ద్వయం తం తు గాంధారీ గర్భమాహితమ్ ।**
**అప్రజా ధారయామాస తతస్తాం దుఃఖమావిశత్ ॥** 115-9

గర్భమును ఆమె రెండు సం॥లు ధరించి యుండియు పుత్రోత్పత్తి కాక దుఃఖపడింది. కుంతీదేవికి ధర్మపుత్రుడుదయించిన వృత్తాంతం అదే సమయంలో గాంధారికి తెలిసింది. గాంధారికి ఆ వార్త దుఃఖం కలిగించింది. అటుపిమ్మట గాంధారి ఓర్పు వహింపలేక తన పరిపూర్ణ గర్భంపై హస్త ద్వయంతో అతి కఠినంగా మోదుకొన్నది. గర్భతాడనము వల్ల లోహ ఖండము వలె కఠినమైన మాంసపేశి బహిర్భూతము కాగా రెండు సం॥లు కుక్షి యందుండి తుదకు ఆ రూపములో వెలువడిన మాంసపేశిని పారవేయుటకు గాంధారి యత్నించు నంతలో వ్యాసభగవానుడు తెలిసికొని ప్రత్యక్షమై, మాంసపేశిని జూచి గాంధారీ! ఎందువల్ల నీవింతటి అకృత్యానికి పాల్పడ్డావు? అని ప్రశ్నించాడు. అపుడా గాంధారిదేవి వ్యాసమహర్షితో...

**జ్యేష్ఠం కుంతీసుతం జాతం శ్రుత్వా రవిసమప్రభమ్ ।** (ఆదిపర్వం)
**దుఃఖేన పరమేణేదముదరం ఘాతితం మయా ॥** 115-15
**శతం చ కిల పుత్రాణాం వితీర్ణం మే త్వయా పురా ।**
**ఇయం చ మే మాంసపేశీ జాతా పుత్రశతాయ వై ॥** 115-16

---

16. గాంధారి : ఈమె గాంధార దేశపు రాజైన సుబలుని కూతురు. ఈమె ధృతరాష్ట్రుని భార్య. ఈమె పరమ పతివ్రత. భర్త అంధుడైనందున తానును పరపురుష దర్శనము చేయకూడదు అను నియమముచే ఎప్పుడునూ కన్నులు గంతలు కట్టుకొనియుండును. ఈమె 'మతి' అను దేవతాంశమున జన్మించెను.

మహాత్మా! జ్యేష్ఠుడగు సూర్యునితో సమానమగు కాంతిగల కుంతీసుతుడు పుట్టినాడని విని భరింపరాని దుఃఖముతో నీచే నా గర్భము విచ్ఛిన్నము చేయబడింది. మీరు నాకు నూర్గురు పుత్రులను వరముగా ప్రసాదించిరి.ఆ వరము సందేహించదగినదైనది. నూర్గురు పుత్రులకు బదులు నాకీ మాంసపేశి కలిగింది. అని పలుకగా అంతట వ్యాసుడు, గాంధారిదేవితో...

> ఏవమేతత్ సౌబలేయి నైతజ్జాత్వన్యథాభవేత్ ॥
> వితథం నోక్తపూర్వం మే స్వైరేష్వపి కుతోఽన్యథా ।
> ఘృతపూర్ణం కుండశతం క్షిప్రమేవ విధీయతాం ॥ (ఆదిపర్వం)
> సుగుప్తేషు చ దేశేషు రక్షా చైవ విధీయతాం ।
> శీతాభిరద్భిరష్ఠీలామిమాం చ పరిషించయ ॥ 116-17, 18, 19

ఓ గాంధారీ! నా వరమెప్పుడును వ్యర్థము కానేరదు. ఇది యథార్థము. మాట వరుసకు నైనా అసత్య మెప్పుడును పలుకలేదు. నూరు నేతి కుండలను వెంటనే ఏర్పాటు చేయుము. మంచి సంరక్షణ గల ప్రదేశములయందు వాటిని ఉంచి రక్షించవలసిందని చెప్పి మహర్షి స్వయముగానే ఆ మాంసపేశిని శీతోదకముతో తడిపాడు. అంగుష్ఠ ప్రమాణ భాగములుగా విడదీసి ఒక్కొక్క భాగమును ఒక్కొక్క ఘృత కుంభమునందు పెట్టించి వదిలముగా కాపాడవలసిందని పలికి అంతర్హితుడయ్యాడు.

### 8.1.5. వేదవ్యాసుడు తన తల్లి సత్యవతికి తపమాచరించమని ఉపదేశించుట

హస్తినాపురమున ధృతరాష్ట్రునకు గాంధారి వల్ల వందమంది కుమారులు, ఒక పుత్రిక దుశ్శల జన్మించారు. శతశృంగ పర్వతమున పాండురాజుకు కుంతి, మాద్రుల వల్ల ధర్మరాజాదులు జన్మించి పెరుగుచుండిరి. ఒకనాడు మాద్రీదేవి చక్కగా అలంకరించుకొని యుండగా, పాండురాజు తమకంతో పరవశుడై కౌగలించుకొనబోగా, ఆమె కిందముని శాపమును స్మరించి వలదు వలదని వారించినా పాండురాజు ఆమెను కౌగలించుకోవడంతో

మరికొంత సేపటికే ఆ మహారాజు విగత జీవుడై నేలకూలాడు. మాద్రి సహగమనం చేయగా, శతశృంగ మునీశ్వరులు కుంతీదేవిని, కుమారులను ఓదార్చి, దహన సంస్కారం జరిపించారు. తదనంతరం ఆ మహర్షులు వారియిరువురి అస్థికలను సంగ్రహించి కుంతీదేవి పాండు కుమారులను వెంట బెట్టుకొని కరినగరమువకు ప్రయాణమయ్యారు. హస్తినాపురమునకు చేరుకోగానే భీష్మ విదుర ధృతరాష్ట్రాది కౌరవకులశేఖరులు వారికి ఎదురేగి శతశృంగ తపోనిధులను అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి గౌరవించారు.

తరువాత ఆ మునీంద్రులు విషయమంతా తెలియజేసి, ఆ దంపతుల అస్థికలకు యథావిధిగా పైతృక కర్మలాచరించవలసిందని పలికి అచటనే అంతర్హితులయ్యారు. పిమ్మట వ్యాస భీష్మ ధృతరాష్ట్రుల అనుమతితో విదురుడు ఆ పుణ్యదంపతులకు యథావిధిగా పైతృ కర్మలను ఆచరించి, బ్రాహ్మణులకు అనేక దానధర్మాలు చేశాడు. మృష్టాన్న భోజనాదులతో సమస్త వర్ణాల వారికి సంతృప్తి కల్గించాడు.

త్రికాలవేత్త అయిన కృష్ణద్వైపాయనుడు, ఏంకాంతంలో తీవ్ర మనోవేదనతో కుమిలి కుమిలి విలపిస్తున్న సత్యవతీదేవిని ఓదార్చి తదనంతర కర్తవ్యం ఈ ప్రకారంగా ఆదేశించాడు. అమ్మా! నీకు తెలియని ధర్మాధర్మాలేవీ లేవు గదా! సంసారము అతిచంచలము సంపదలు క్షణికములు.

> అతిక్రాంతసుఖాః కాలాః పర్యుపస్థిత దారుణాః । (ఆదిపర్వం)
> శ్వః శ్వః పాపిష్ఠ దివసాః పృథివీగత యౌవనా ॥ 128–6
> బహుమాయా సమాకీర్ణో నానాదోష సమాకులః ।
> లుప్తధర్మక్రియాచారో ఘోరః కాలో భవిష్యతి ॥ 128–7

సుఖాలన్నీ భూతకాలంతోనే గతించిపోయాయి. ఇక క్షణము క్షణము భయంకరమయిన దారుణాలెన్నెన్నో జరుగనున్నాయి. నానాటికి పాపభూయిష్ఠమైన రోజులు అవసాన కాలాలతో భూదేవి మనోహర

యౌవనోదయం క్రమక్రమంగా స్వప్న ప్రాయమై శేషించి పోగలదు. సమస్త ధర్మకర్మలు నశించిన మహామాయామయిన ఘోరకలి మహకు అనతి కాలంలోనే దాపురించగలదు.

అమ్మా! నీవిక సర్వసంగ పరిత్యాగం చేసి ప్రశాంతారణ్యంలో నిశ్చల తపోనిష్ఠ అవలంబించవలసిందని ప్రార్థిస్తున్నాను. ధృతరాష్ట్ర కుమారులు క్రూరులు. న్యాయాన్యాయ వివేకహీనులు. కారణం లేకుండానే వైరం వహించేవారు. వారి కారణంగా కౌరవవంశానికి కీడు కలుగుతుంది. దానిని ధృతరాష్ట్రుడు తానే అనుభవిస్తాడు. కాబట్టి నీవు ఈ భీకర కురుకుల క్షయం ప్రత్యక్షంగా చూడడం సముచితం కాదు. నీ కోడళ్ల నిరువురిని వెంటబెట్టుకొని త్వరితంగా తపోవనానికి వెళ్ళండని ఉపదేశించి అంతర్హితుడయ్యాడు.

అంతట సత్యవతి, దుఃఖిస్తున్న అంబికకు వ్యాసులవారు తెలియజెప్పిన విషయమంతా తెలియజేసింది. అంబిక ఆపైన అంబాలికా దేవికి ఆ విషయం సంగ్రహంగా వివరించి సత్యవతీదేవి తపశ్చర్యా సంకల్పం తెలియజేసింది.

అనంతరం వారు ముచ్చురు గాంగేయ విదురాదుల అంగీకృతి స్వీకరించి అనతిదూర తపోవనంలో ప్రవేశించి నిరంతర నియమాలతో, నిశ్చలనిష్ఠలతో తపమాచరించి, క్రమక్రమంగా, మరికొంత కాలానికి ఆ పరమపదమే అందుకొన్నారు.

## 8.1.6. వేదవ్యాసుడు పాండవులకు హితోపదేశము చేయుట

పాండవులు ధృతరాష్ట్ర నియోగమున శివుని నివాసస్థానమైన వారణావతరమునకు వెళ్ళి లక్కయింట యందు నివసించియుండిరి. కాని దైవవశమున ఈ లాక్షాగృహము దహనమగునని పాండవులు విదురుని ద్వారా తెలుసుకొన్నారు. రాత్రి సమయమున లాక్షాగృహము సింహ ద్వారముననే భీముడు నిప్పంటించి, తన సోదరులను మరియు కుంతిదేవిని, విదురుని స్నేహితుడైన

ఖనకుడు ఏర్పాటుచేసిన సొరంగ మార్గము ద్వారా గంగానది ఒడ్డున చేరి, గంగానదిని దాటి ఒక మహారణ్యమున ప్రవేశించారు.

భీముడచట హిడింబాసురుని సంహరించి హిడింబను వివాహమాడెను. పిమ్మట పాండవులు శాలిహోత్రుని ఆశ్రమమున గల కొలనుయందు స్నానమాచరించి శాలిహోత్రునిచే పూజింపబడిరి. అదే సమయంలో వ్యాసమహర్షి ఆశ్రమానికిరాగా, ఆ వేదవ్యాసునకు ఆ పాండవులు జననీసహితులై సాష్టాంగ ప్రణామములు ఆచరించారు. అనంతరం అర్ఘ్యపాద్యములిచ్చి సత్కరించి పూజించారు.

అటుపిమ్మట వేదవ్యాసుడు ధర్మరాజా! ధృతరాష్ట్రుడు కొడుకు మాట విని ఇది తగదని చెప్పక, మిమల్ని రాజ్యం నుండి వెళ్ళగొట్టించి కృత్రిమ లాక్షాగృహంలో నివసింపజేసి, గూఢంగా అపకృతికి ఉపక్రమించాడు. దుర్మార్గులను ఎక్కడైనా ఎప్పుడైనా నమ్మకూడదు. అని పలికి ధృతరాష్ట్రుని నిందించి, కౌరవులు తమ దుష్ట ప్రవృత్తికి తగిన శిక్ష అనుభవించగలరని పలికి, మీకు సదుపదేశం ప్రసాదించవలెనని సంకల్పించాను. సకల ధర్మాలు తెలిసిన మీకు బంధువులతో యెడబాటు కలగటం పూర్వజన్మ కృతం దీనికి దుఃఖించవలదు.

కొంతకాలానికి మీరు కూడా బంధువులతో కలిసి ఎప్పటివలె రాజ్యంచేస్తారు. ఇది శాలిహోత్రముని తపఃప్రభావంచే ఏర్పడిన సరోవరం. దీని నీళ్ళు త్రాగిన వాళ్ళకు ఆకలి దప్పికలుండవు. ఈ చెట్టు కూడా చలి, గాలి ఎండ, వానలనుండి మిమ్మల్ని కాపాడుతుంది. ఇక్కడ ఇతరులకు కనిపించకుండ మీపని నెరవేరే వరకు కొన్నిరోజులుండి, తరువాత 'ఏకచక్రపురానికి పోయి అక్కడ బ్రాహ్మణులతో కలిసియుండి నారాక కోసమై నిరీక్షించవలెను. అని పలికి వేదవ్యాసుడు పాండవులనందరిని కౌగిలించుకొని ఎంతో ఆప్యాయంగా ఆశీర్వదించాడు. విలపిస్తున్న కుంతీదేవిని ఓదార్చి ఓకుంతీ!

జీవత్పుత్రి సుతస్తేఽయం ధర్మనిత్యో యుధిష్ఠిరః ।
ధర్మేణ పృథివీం జిత్వా మహాత్మా పురుషర్షభః ।
పృథివ్యాం పార్థివాన్ సర్వాన్ ప్రశాసిష్యతి ధర్మరాట్ ॥ 156-12
పృథివీమఖిలాం జిత్వా సర్వాం సాగరమేఖలామ్ ।
భీమసేనార్జున బలాద్భోక్ష్యతే నాత్ర సంశయః ॥ 156-13

నీ కుమారుడగు ధర్మరాజు ధర్మాత్ముడు. నారాయణుని భుజాల వంటి నలువురు తమ్ముల బలంచే భూమండలమును ధర్మముచే జయించి, ఆ రాజులనందరిని శాసించి ఈ భూమండలమును పరిపాలించగలడు. ఇందు సంశయము లేదు.

ధర్మరాజు రాజసూయ, అశ్వమేధాది యాగాలు చేసి తాత తండ్రుల రాజ్యం పరిపాలిస్తాడు. కురు వంశాన్నంతటిని పవిత్రం చేస్తాడు. వారి శోకాన్ని ఉపశమింపజేస్తాడు. అమ్మా! ఈ హిడింబ నిజనామధేయం కమలపాలిక. భీమసేనుని సాహచర్య భాగ్యంవల్ల అనతికాలంలో ఈమెకొక కుమారుడు ఉద్భవించగలడు. మిమ్మల్నందరినీ ఆపత్సమయంలో రక్షిస్తాడు. అని చెప్పి వేదవ్యాసుడు అదృశ్యుడయ్యాడు.

### 8.1.7. వేదవ్యాసుడు పాండవులకు ద్రౌపదీ వృత్తాంతమును సంక్షిప్తముగా చెప్పుట

ఆ వ్యాసమహర్షి బోధించిన విధంగా పుణ్యాత్ములైన పాండవులు వినయంతో శాలిహోత్రుని ఆశ్రమంలో దుఃఖం లేకుండా సుఖంగా ఉన్నారు.

శాలిహోత్రుని వద్ద అనేక ధర్మశాస్త్రాలు, నీతిశాస్త్రాలు అభ్యసించి ఆయన దగ్గర సెలవు తీసుకొని విదర్భ, మత్స్య, త్రిగర్త, మొదలగు దేశాలు దాటి ఏక చక్రపురంలో ఒక బ్రాహ్మణుని యింటిలో నివసిస్తూ భిక్షాటనతో జీవనం గడుపుతూ లోకకంటకుడైన బకాసురుని చంపాడు భీముడు.

ఒకరోజు బ్రాహ్మణుడు, పాండవులచే ఆతిథ్యాన్ని పొందాడు. తరువాత వారికి ద్రుపద మహారాజు సంతానార్థియై యజ్ఞంచేయగా, అగ్నికుండమునుండి

ధృష్టద్యుమ్నుడు, ద్రౌపది జన్మించిన వృత్తాంతాన్ని తెలియజేస్తూ, మత్స్యయంత్రం ఛేదించిన వానికి ద్రౌపది నిచ్చి వివాహము జరిపించెదనని ప్రకటించాడు. ఆ స్వయంవరము రోహిణీ నక్షత్రయుక్త పుష్యశుద్ధ అష్టమీతిథి శుభముహూర్తంలో జరగగలదని తెలియజేసి ఆ బ్రాహ్మణుడు బయలుదేరాడు.

తరువాత కుంతీదేవి ఈ ఏకచక్రపురమున ఇంకాఎక్కువ రోజులుండటం మంచిది కాదని పాంచాలపురానికి వెళ్ళుదామని కుంతి అనగానే పాండవులు సరే అనిరి.

ఆ పాండవులు నివసించియున్న యింటివారికి చెప్పి, వారివద్ద సెలవు తీసికొని పాంచాలపురానికి బయలుదేరిన పాండవులకు మార్గమధ్యంలో వ్యాసులవారు ప్రత్యక్షం కాగా, పాండవులు ఆ మునీంద్రునికి నమస్కరించారు. అంతట వ్యాసులవారు... వారితో ధర్మరాజు ఉన్నచోట ధర్మానికి హాని ఉండదు. అయినప్పటికీ ధర్మమే ప్రధానంగా భావించి, నిర్మలమైన మనస్సుతో వినయవంతులై మెలగండి అని పలికి మరల వారితో...

తపోవనమునందు శుభలక్షణములు గలిగి గుణవతియైన ముని కన్య రూపవతియై యుండియు, దురదృష్టవశముచే వివాహము కాక పతికొరకు శంకరుని గూర్చి తపము చేయ సంతుష్టుడై శంకరుడు ప్రత్యక్షమై వరము కోరుకోమన్నాడు. అంతట ఆ మునికన్య పరమేశ్వరునితో...

పతిం సర్వగుణోపేతమిచ్ఛామీతి పునః పునః ॥ (ఆదిపర్వం)
తామథ ప్రత్యువాచేదమీశానో వదతాం వరః ।
పంచతే పతయో భద్రే భవిష్యంతీతి భారతాః ॥ 169-10, 11

పరమేశ్వరా! సర్వగుణాన్వితుడగు పతిని కోరుచున్నానని పునః పునః పలికింది. అపుడు శంకరుడు నీకు భరతవంశోద్భవులగు పంచపతులు ప్రాప్తింతురని చెప్పాడు.

ఆ పరమేశ్వరుని మాటలను విని ఆమె పరమేశ్వరా! నీ అనుగ్రహముతో నేనొక పతినే కోరుచున్నాను. అని పలుకగా, అంతట శంకరుడు 'పతిందేహి' అని నీవు ఐదుసారులు పలుకుటను బట్టి నీకట్టి వరమిచ్చితిని. నీకా పంచపతిత్వము పై జన్మమందు లభించునని పలికాడు. అట్టి వరమును పొందిన ఆ ఋషికన్య ద్రుపద పుత్రికయై జన్మించినది. మీకు పత్నియై నిర్దిష్టమైనది. అని వేదవ్యాసుడు పలికి అంతర్హితుడయ్యాడు.

పాండవులు పాంచాలపురానికి వెళ్ళుతుండగా, మార్గమధ్యంలో బ్రాహ్మణులు, బ్రాహ్మణ రూపములో నున్న పాండవులతో : ద్రౌపదీదేవి స్వయంవరంలో బ్రాహ్మణులకు అపారమైన ధనం యిస్తారని మేము వెళ్ళుతున్నాము. మీరు కూడా స్వయంవరమును చూడటానికి వచ్చేట్లయితే కలసిపోదాం రండి. అని సంభాషించుకుంటూ ఆ బ్రాహ్మణులతో కలిసి పాండవులు వెళ్ళుతుండగా, మార్గమధ్యంలో వ్యాసులవారు ప్రత్యక్షమై పాండవులకు శుభం చేకూరగలదని పలికి అంతర్హితుడయ్యాడు. అనతికాలంలోనే పాండుకుమారులు పాంచాల రాజధానికి చేరుకున్నారు.

స్వయంవరము సందర్భముగా ద్రుపద మహారాజు ఏర్పరచిన మత్స్య యంత్రాన్ని యే మహారాజు కూడా ఛేదించలేకపోయాడు. కాని పాండవ మధ్యముడు అయిన అర్జునుడు మత్స్యయంత్రాన్ని అయిదు బాణాలతో పడగొట్టాడు. పిమ్మట పాండవులు అడ్డు వచ్చిన రాజులను ఓడించి, ద్రౌపదీదేవిని తీసుకొని వెళ్ళి కుంతీదేవితో అమ్మా! భిక్ష తెచ్చితిమని చెప్పారు. ఇంటిపనులలో నిమగ్నమైన కుంతి మీరందరు భిక్షను సమముగా భుజింపుడని చెప్పింది. తరువాత ద్రౌపదీదేవిని చూచి కుంతీమాత అయ్యయ్యో ఒక స్త్రీ అయిదుగురితో సుఖముగా. సంసారము చేయుటెట్లు? అని పలికి, నామాట ఇంతవరకు ఎన్నడూ అసత్యం కాలేదు. ధర్మజా! మీరెప్పుడు నామాట జవదాటరు. కాని యిది లోకవిరుద్ధ మని కుంతి కలత చెందగా, ధర్మరాజు కుంతిని ఓదార్చి అర్జుననితో అర్జునా!

నీవు జయించిన ఈమెను నీవే వివాహం చేసికొమ్ము. అని పలుకగా అంతట అర్జునుడు పెద్దవాడు ఉండగా, చిన్నవాడికి పెళ్ళి కావటం ధర్మ విరుద్ధం. అందుచేత ధర్మజా! నీవే ఈమెను పరిగ్రహించుము. మా నలువురికి సమ్మతమైనది కూడ ఇదే. అని పలుకగా ధర్మరాజు వ్యాసుని మాటలు తలచి పెద్దలమాట ప్రకారం మన ఐదుగురికి ఈమె భార్య కాదగును. పెద్దలమాట వ్యర్థం కాదు గదా! అని తలచాడు.

**8.1.8. వేదవ్యాసుడు ద్రుపదునకు పంచేంద్రోపాఖ్యానము చెప్పుట**

తరువాత ద్రుపద మహారాజు మత్స్య యంత్రం ఛేదించినది పాండవులని తెలుసుకొని అచటకురాగా ధర్మరాజు, ద్రుపద మహారాజుకు అర్ఘ్యపాద్యములిచ్చి సత్కరించి ఓ మహారాజా! మేము రాజవంశీయుల పాండురాజుకుమారులము. నేనీ అందరికీ పెద్దవాడను. వీరు నలుగురు భీమార్జున నకుల సహదేవులు. ఆమె మా మాతృదేవత. మాతల్లి ఆదేశము ప్రకారము మేముయిదుగురము ద్రౌపదిని వివాహమాడవలసి యున్నదని చెప్పగా, దానికి ద్రుపదమహారాజు సమ్మతించక పోవడముతో అదే సమయమున వేదవ్యాసమహర్షి ప్రత్యక్షమైనాడు. అప్పుడు ద్రుపదుడు, వేదవ్యాసునకు నమస్కరించి ఇట్లు విన్నవించుకొన్నాడు.

మహాత్మా! ఈ ధర్మరాజుని ధర్మశాసనం ప్రజలందరు శిరసా వహిస్తున్నారు గదా! అటువంటి జగధాచార్యుడే మేమయిదుగురము ఈ ద్రౌపదిని వివాహమాడవలసియున్నదని నిర్ణయించి ఉన్నాడు. ఆప్తసూక్తి శిరసావహించి ఈవిధంగా వివాహం ఆచరించిన పురాతన, పుణ్యపురుషులెవరయినా ఉన్నారా? ధర్మ సంకర దోష భయం లేకుండా ఈ వివాహ విషయం నిర్ణయించవలసిందని ప్రార్థిస్తున్నాను.

అంతట వ్యాసమహాముని ద్రుపద మహారాజుకు ఈ ప్రకారంగా ఆదేశించాడు. ఓ ద్రుపద మహారాజా! ధర్మతనూజుడు ధర్మ సూక్ష్మ తత్త్వజ్ఞుడు. అట్టి ధర్మరాజు పలుకులెన్నడు సదాచార మార్గం అతిక్రమించవు. ఈ కుంతి

సాక్షాద్దేవతామూర్తి. మాటకైనా ఈ దేవి అసత్యపు మాటలు పలుకదు. విధి విధానము, వీరి అనుశాసనము ఒకే మార్గం అనుసరిస్తున్నవి. కనుక మరి సందేహించక ద్రౌపదిని ఈ అయిదుగురికి సమర్పించి యథావిధిగా వివాహం జరిపించవలెను. ఇది దైవనిర్ణయము. దీనిలో గల పరమ రహస్యం ఆలకించవలెనని కుతూహలం కలిగిన యెడల నీకిప్పుడది సవిస్తరంగా విశదపరుస్తున్నాను అని పలికి వేదావ్యాసుడు ఆ రాజు హస్తం గ్రహించి ఏకాంతంగా వేరొక మందిరానికి తోడుకొనిపోయి ఆ రహస్య వృత్తాంతం యావత్తు ఈవిధంగా వ్యాఖ్యానించాడు.

ఈ ద్రౌపదీదేవి, పూర్వ జన్మమందు 'ఇంద్రసేన' యను పేరుగలది. ఈమె నారాయణుని కుమార్తె ఇంద్రసేన. ఈమె భర్త మౌద్గల్యమహాముని. ఈమె, వృద్ధుడు కుష్ఠరోగి అయిన భర్త మౌద్గల్యునకు మిక్కిలి సేవ చేసింది.ఒకానొకప్పుడు భుజించుచున్న అతని బొటనవ్రేలు ఊడి అన్నములో పడిపోయెను. అయినా ఇంద్రసేన ఏవగించుకోలేదు. పతి భోజనోచ్ఛిష్టం యథాప్రకారంగానే ఎంతో అప్యాయతతో ఆరగించింది. మౌద్గల్యుడు ఆమె పాతివ్రత్యాన్నికెంతో మెచ్చి వరం కోరుకొనుము. ప్రసాదించగలనని అనుగ్రహించాడు.

అంతట ఆమె మహాత్మా! మిక్కుటమయిన కామాభిలాష నిత్యము నన్నెంతో వేదిస్తున్నది. మీరు అపారశక్తి సంపన్నులు యథేచ్ఛగా ఎటువంటి స్వరూపమయినా ధరించగలరు. కనుక ఈ రూపమును విడిచిపెట్టి ఒక్క మారుగా అయిదు మనోజ్ఞమూర్తులు ధరించి అనవరత భోగావేశంతో నన్నానందింప జేయవలసిందని కోరుతున్నాను. అని పలుకగా, అప్పుడు మౌద్గల్యుడు ఆమె కోరిక మన్నించి అయిదు సుందర శరీరాలు స్వీకరించి ప్రగాఢ మన్మథ సౌఖ్యాల అలలలో ఓలలాడించాడు. మేరుకైలాస గిరి శిఖరాలలో స్వేచ్ఛగా విహరించి ఆనందించాడు. అనేక సహస్ర సంవత్సరాల పర్యంతము వేర్వేరు మనోహర ప్రదేశాలలో ఆ ఇంద్రసేనతో కలిసి నిత్యనూతన యౌవనానందం చూరగొన్నాడు. అటుపిమ్మట అపార ఘోరతపమాచరించి ఆ పరబ్రహ్మలో లీనమైనాడు.

ఆ ఇంద్రసేన మరు జన్మలో కాశీ తనూజగా అవతరించింది. ఆమెకు వివాహము కాకపోవడముతో, తన దురదృష్టానికెంతో చింతించి పతికోసమై పరమేశ్వరుని గూర్చి తపమాచరించింది. ధర్మదైవము, వాయుదేవుడు, దేవేంద్రుడు, అశ్వనీదేవతలు ఆ తపస్సుకు సంతోషించి ఆమెతో తమ తమ దివ్య తేజోభాగాలతో భూమిపై అవతరించిన అయిదుగురు వీరవరేణ్యులకు పత్నివి కావలసిందని ఆ రాజకుమారి నర్థించారు.

కాని ఆ కాశీ రాజకుమార్తె నియమనిష్ఠలతో పరమేశ్వరున్ని ధ్యానించి, సాక్షాత్కరింపజేసుకొన్నది. అంతట ఆమె పతి ననుగ్రహించవలసిందని ఒకే తీరులో అయిదు మారులు అర్థించింది. పరమేశ్వరుడు ఆమెపై కరుణించి రాజపుత్రీ! మరు జన్మలోనే 'నీకు అయిదుగురు ప్రాణేశ్వరులు లభించగలరు. అని వరం ప్రసాదించాడు. అంతట ఆ కన్యక పరమేశ్వరా! సతి కొక్కడే పతి కదా! నన్నా ప్రకారంగా అనుగ్రహించడం న్యాయం కాదని వేడుకొన్నది. అప్పుడా పరమేశ్వరుడు అయిదుగురు ప్రాణనాయకులకు అర్ధాంగివయినా నీకే విధంగాను ధర్మగ్లాని కలుగదని పలికాడు.

అంతట అమె పరమేశ్వరా! తమ ఆనతికి తిరుగులేని పక్షంలో ఆ అయిదుగురు హృదయేశ్వరుల సాహచర్య సమయంలోను, ప్రత్యేకంగా నాకు శుశ్రూషాభాగ్యము, కామేచ్ఛా సంతృప్తి, కుమారీత్వసిద్ధి, సౌభాగ్యప్రాప్తి కలిగేవిధంగా అనుగ్రహించవలెను. ఈ వరాలిచ్చిన యెడల నా తపోరాశి పరిపూర్ణంగా ఫలించినదని ఆనందించగలను. అపార వాత్సల్యంతో నా కోరిక నెరవేర్చెదరుగాక! అని ప్రార్థించింది.

అప్పుడా పరమేశ్వరుడు ఆమె కోరిన వరాలన్నీ ప్రసాదించి కాశీ నృపాల పుత్రికా! నీ కోరిక నేరవేర్చుటకై నీవిక శచీపతిని నా సన్నిధికి తోడుకొని రావలసి వున్నది. అచిరకాలంలోనే ఆ స్వర్గాధిపతి ఈ గంగాతీర ప్రదేశానికి వేంచేయగలడు. అని ఆదేశించాడు. అంతట ఆమె ఆ దేవదేవుని ఆనతి ప్రకారం

దేవేంద్రుని రాకకై అనుక్షణము నిరీక్షించినది.

ద్రుపద మహారాజా! అదేసమయంలో పూర్వము నైమిశారణ్యమందు యమధర్మరాజు సత్రయాగదీక్షితుడై యున్నపుడు ప్రజలకు మరణము లేకుండుట జూచి ఇంద్రాది దేవతలు బ్రహ్మనడుగగా అంతట ఆ బ్రహ్మ : దేవతలారా! యమధర్మరాజు సత్రయాగ సమాప్తి జేసిన తరువాత యోగబలముచే అతనికి వేరొక శరీరమేర్పడి మరి మీ వీర్యముచే ప్రవృద్ధమై లోకులకు వినాశహేతువగును. అపుడు మానవులకు మరణము లేకపోవును. అని ఇట్లు భవిష్యద్వృత్తాంతము బ్రహ్మ వల్ల విని ఆ ఇంద్రాదులు స్వస్థలమునకు వెళ్ళుచుండ గంగాజలమున నొక తేజశ్శాలియగు స్త్రీరత్నము గోచరించింది. ఇంద్రుడామె వద్దకు వెళ్ళి చూడగా ఆమె కన్నీటిబిందువులు జలములోపడి కనకమయమైన పద్మమయినది. అది చూచి యింద్రుడు నీవెవ్వతవు? నీవు విలపించుటకు గల కారణమేమి? చెప్పుమనగా నా సంగతి నీకు తెలియదు. నా వెంట రమ్ము అని ఆమె చెప్పగా, ఇంద్రుడామె వెంట వెళ్ళి పర్వతాగ్రమందు ఒక యువకుడు యువతీసహితుడయి పాచికలాడుచు తన రాకను అలక్ష్యము చేస్తున్న ఆ పురుషుని జూచి కుపితుడై, నేనీ భువనమునకు అధిపతిని. ఇది నా అధీనమై యున్నదని పలుకుచు వజ్రాయుధముతో గొట్టుటకు ఉద్యమింపజూచి ఆ పురుషుడు మందహాసము చేసి తన దృష్టి ప్రసారముచే యింద్రుని స్తంభింప జేశాడు.

ఆ పరమేశ్వరుని అక్ష క్రీడ పూర్తియైన పిమ్మట, ఆ స్త్రీతో దర్పితుడై యున్న ఆ యింద్రుని తీసికొని రమ్మని చెప్పగా, ఆమె స్పృశించినంత మాత్రమున శరీరము పట్టుతప్పి యింద్రుడు నేలబడ్డాడు.

అపుడా పరమేశ్వరుడు యింద్రుని మందలించి నీవు లేచి యీ పర్వత గుహకడ్డుగా పెట్టబడిన పర్వతమును తొలగించుము. యీ గుహలో నీవంటి వారున్నారు. వారితో నీవు కూడా కలిసి నుండమని ఆజ్ఞాపించాడు.

**సతద్వివృత్య వివరం మహాగిరే స్తుల్యద్యుతీంశ్చతురోఽన్యాన్ దదర్శ ।**
**స తానభిప్రేక్ష్య బభూవ దుఃఖితః కచ్చిన్నాఽహం భవితా వై యథేమే ॥**
**197-20**

ఇంద్రుడా గిరి గుహను తొలగించగా, తనతో సమానులై యున్న నలుగురిని ఆ గుహలో జూచి, తనకు గూడ నట్టి యవస్థయే వచ్చునని దుఃఖించాడు. ఆపై నీవే పరమేశ్వరుడవని ఈశ్వరుని ప్రార్థించాడు.

అంతట ఆ పరమేశ్వరుడు వారితో మీరైదుగురును మనుష్య జన్మమెత్తవలెను. అందు అసాధారణ కారణములు చేసి అనేకులను వధించి తరువాత మీరు సంపాదించుకొనిన యింద్రలోకమునకు మరల మీరు రాగలరని చెప్పగా. అపుడు పూర్వేంద్రులు పరమేశ్వరునితో...

**గమిష్యామో మానుషం దేవలోకాద్దురాధరో విహితో యత్ర మోక్షః ।**
**దేవాస్త్వ స్మానాదధీరన్ జనన్యాం ధర్మో వాయుర్మఘవానశ్వినౌ చ ॥ 197-27**
**అస్త్రైః దివ్యైః మానుషాన్ యోధయిత్వా ఆగన్తారః పునరేవేంద్ర లోకమ్ ॥**

పరమేశ్వరా! నీ ఆజ్ఞానుసారము మేము మనుష్య లోకమున జన్మింతుము. మమ్ము జననీ గర్భమున ధర్మదేవ, వాయుదేవ, దేవేంద్ర, అశ్వనీ దేవతల ప్రవేశపెట్టునట్లు అనుగ్రహింపుము. మేమచ్చట దివ్యాస్త్రములతో యుద్ధము చేసి కృతకృత్యులమై తిరిగి యింద్రలోకమునకు వచ్చెదము. అని చెప్పగా, అప్పుడు యింద్రుడు తానధికారిగా యున్నందున స్వయముగా గాక శుక్రము ద్వారా తన అంశమును జన్మింపజేయుదునని చెప్పుకొనెను.

**"విశ్వభుక్ భూతధామా చ శిబిరింద్రః ప్రతాపవాన్ ।**
**శాన్తిశ్చతుర్థస్తేషాం వై తేజస్వీ పంచమస్స్మృతః ॥ 197-29**

పూర్వమింద్రపదవి అధిష్ఠించి విరమించిన విశ్వభుక్ భూతధామ, శిబి, శాంతి, అనువారు నలుగురును అప్పటి యింద్రుని యంశమొకటియును గలిసి పంచేంద్రులైరి.

ఆ పంచేంద్రులు కోరుకొనినట్లె సుస్వభావముతో పరమేశ్వరుడు సమ్మతించి యట్లు జన్మించినపుడు వారందరకు లోకకాంత యగు స్వర్గలక్ష్మిని భార్యగా విధించాడు. తరువాత ఆ పంచేంద్రులతో కలసి ఆ పరమేశ్వరుడు నారాయణ సమక్షమునకు వెళ్ళి చెప్పగా, ఆ పురాణపురుషుడునట్లే ఆజ్ఞాపించి పిమ్మట దేవకీరోహిణుల యందు శ్రీకృష్ణ బలరామ స్వరూపములతో ఉద్భవించారు.

ఆ పూర్వేంద్రులే యీ పరాక్రమశాలులయిన పాండవులు. ఆ యింద్రాంశమే యీ యర్జునుడు. వీరికి భార్యగా పరమేశ్వర నిర్దిష్టమైన ఆ స్వర్గలక్ష్మియే దివ్యరూపము గల యీ ద్రౌపదీదేవి యని తెలియజేశాడు. తర్వాత మరల వేదవ్యాసుడు ద్రుపద మహారాజుకు దివ్యదృష్టి ప్రసాదించి, పాండవులు దివ్యములైన పూర్వ దేహములతో కనబడుచున్నారో లేదో చూడుము. అని చెప్పగా, అంతట ద్రుపదుడు దివ్యదేహధారులై, దివ్యతేజస్సులై పట్టు పీతాంబరాదులతో గోచరింప, ద్రుపదుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆ ద్రౌపదీదేవి కూడ మహర్షి చెప్పినట్టి దివ్య రూపముతో గోచరింప వీరికి యీమె అన్ని విధముల పత్ని యగుటకు యోగ్యురాలని ద్రుపదుడు భావించి సంతోషించాడు.

అలా నిశ్చేష్టుడయిన ఆ ద్రుపద మహారాజుకు వేదవ్యాసుడు ఈ ప్రకారంగా సదుపదేశం అనుగ్రహించాడు.

ప్రాచీనకాలంలో నితంతు అను రాజర్షి మహాధర్మాత్ముడై ప్రజలనందరిని కన్న తండ్రివలె పరిపాలించాడు. ఆ రాజుకు సాల్వేయుడు, శూరసేనుడు, శ్రుతసేనుడు, బిందుసారుడు, అతిసారుడు అను అయిదుగురు కుమారులుగలరు. ఆ సహోదరులయిదుగురు కాశీ నరజనపతి కుమార్తె అయిన అజితను వివాహం చేసుకొన్నారు. ఆమె అనన్య సామాన్య సౌందర్యశాలిని. క్రమక్రమంగా నితంతు రాజనందనుల వల్ల అజితకు జన్మించిన పుత్రులు అయిదుగురు వేర్వేరుగా వంశకర్తలై లోక విఖ్యాతులయినారు. మరిన్నీ అదేవిధంగా పరిణయమాడిన

మహాత్ములీ లోకంలో అనేకులున్నారు. కనుక నీవిక సంశయించక ద్రౌపదిని పాండవేయులకయిదుగురికి సమర్పించి యథావిధిగా వివాహం జరిపించవలెను.

పిమ్మట వేదవ్యాసుడు పాండవేయులున్న ప్రదేశానికి వచ్చి ధర్మరాజా! నేడెంతో అనుకూలమైన శుభదినము. రోహిణి సహితుడై సుధానిధి ఆకాశవేదికపై తేజోవంతంగా ప్రకాశిస్తున్నాడు. కళ్యాణోత్సవానికిది మిక్కిలి అనుకూలమయిన శుభసమయము. ఆలస్యము చేయక మీరు అయిదుగురును శీఘ్రంగా రాజకుమారిని వివాహమాడవలెనని పలికాడు.

తదనంతరం రారాజుల సమక్షంలో ద్రౌపదీ పాండవేయుల పరిణయోత్సవం రంగరంగ వైభవోపేతముగా జరిగింది.

## 8.2. సభాపర్వము

### 8.2.1. వేదవ్యాసుడు ధర్మరాజునకు ఉత్పాతముల ఫలితమును సూచించుట

ఒకరోజు నారదుడు ధర్మరాజుతో – ఓ ధర్మరాజా! నీ తండ్రియగు పాండురాజు నీతో చెప్పుమని చెప్పాడు. నీవు యీ భూమండలమును జయించగల సమర్థుడవు. రాజసూయ యాగము చేయమని చెప్పాడు. పై విషయమును ధర్మరాజుకు చెప్పి నారదుడు వెళ్ళిపోయాడు. అప్పుడచటకు వేదవ్యాసుడు రాగా, అంతట ఆ ధర్మరాజు అర్ఘ్య పాద్యములిచ్చి సత్కరించి గౌరవించిన పిమ్మట రాజసూయ యాగము ఎట్లు చేయవలెను. ఆ విధానమెట్లు అని అడుగగా, అప్పుడు వేదవ్యాసుడు 80 వేల మంది బ్రాహ్మణోత్తములు తీసుకురాదగినవారు. సుందరమగు మంటపమొకటి 12 యోజనములు వెడల్పు గలది పాతాళలోకమున గలదు. నేను పాతాళమునకు వెళ్ళి దానిని తీసుకురాగలనని పలికి వేదవ్యాసుడు అంతర్హితుడయ్యాడు.

తరువాత కృష్ణుడు రాగా ధర్మరాజుతో రాజసూయ యాగమును గూర్చి సంభాషించి భీమార్జున నకుల సహదేవులను నలుదిక్కులకు పంపగా, వారు

రాజులను జయించి వచ్చిరి. శుభముహూర్తమున శాస్త్రోక్తముగా రాజసూయ యాగము ప్రారంభమయింది. చివరగా రాజసూయయాగములో శ్రీకృష్ణుడే పూజ్యతముడని భీష్ముడు తలచాడు. ఒక్క శిశుపాలుడు[17] మాత్రము తిరస్కరించి నిందించాడు. అందరూ చూస్తుండగానే శ్రీకృష్ణుడు సుదర్శన చక్రం ప్రయోగించి శిశుపాలుని శిరస్సును ఛేదించాడు. రాజసూయ యాగము సమాప్తమైంది. వ్యాస భగవానులు శిష్యసమేతుడై తన ప్రయాణమును గురించి ధర్మజునకు తెలుపుటకై అతని వద్దకు వెళ్ళాడు. అది ధర్మజుని హృదయమంతయు శంకా సమన్వితమై యున్న సమయము. నారదమునీంద్రులు చెప్పినట్లే రక్తవర్షము, పిడుగుపడుట, తోకచుక్క దివ్యోత్పాతము, భూకంపము మొదలగునవి శిశుపాల వధయందు కనబడినవి గదా! వీటి ఫలితాంశము లెట్లుండునో యన్న బాధ ధర్మజుని పీడించుచున్నది. అందుచేత అతడీ యుత్పాతములకు శాంతి చేయుట అవసరము. వీటిని గురించి సవిమర్శముగ చెప్పువారెవరు? అని విచారించుచుండగా, ఈ విషయములనే తనవద్ద కేతెంచిన వ్యాసమునీంద్రుని పూజించిన పిమ్మట ఈ ఉత్పాతముల ఫలితాంశ మేమియని అడిగాడు. అంతట వ్యాసులవారు ఓ ధర్మరాజా!

> త్రయోదశ సమారాజన్ ఉత్పాతానాం ఫలం మహాత్ ।
> సర్వక్షత్ర వినాశాయ భవిష్యతి విశాంపతే ॥ 46 -11
>
> త్వామేకం కారణం కృత్వా కాలేన భరతర్షభ ।
> సమేతం పార్థివం క్షత్రం క్షయం యాస్యతి భారత ।
> దుర్యోధన అపరాధేన భీమార్జున బలేన చ ॥ 46 -12

ఈ ఉత్పాతముల వల్ల 13 సం॥లు గొప్ప అనర్థము రాగలదు. సర్వ

---

17. శిశుపాలుడు : ఇతడు చేదిదేశానికి రాజు. శ్రీకృష్ణుని మేనల్లుడు. శిశుపాలుని తండ్రి దమఘోషుడు. తల్లి సాత్వతి. సాత్త్వతి శ్రీకృష్ణునికి మేనత్త. ఇతడు పూర్వజన్మలో హిరణ్యకశిపుడు.

క్షత్రియుల వినాశము సంభవింపగలదు. నిన్నే కారణముగా చేసుకొని దుర్యోధనుని అపరాధముచే భీష్మద్రోణుల బలముచే, కాలముచే క్షత్రియ వినాశము సంభవించగలదు.

ఓ ధర్మరాజా! ఆ ఉత్పాతములు కనబడుటే కాదు. నీకొక స్వప్నము కూడ రాగలదు. ఆ స్వప్న మిట్లుండును. వృషభారూఢుడైన రుద్రుడు శూల పాణియై దక్షిణదిశకు పయనము గావించుచు నీకు దర్శనమిచ్చును. రాబోవు ఆపదను గురించి నీవు దుఃఖపడనవసరము లేదు. కాలనియతిని మార్చువారెవ్వరును లేరని చెప్పి వ్యాసమునీంద్రులు శిష్య సమేతముగా కైలాసమునకు పయనించారు.

### 8.3. అరణ్యపర్వము

#### 8.3.1. వేదవ్యాసుడు ధృతరాష్ట్రునకు ధర్మోపదేశము చేయుట

అరణ్యవాసము చేయుచున్న పాండవులను అరణ్యములోనే సంహరింపుట దుష్ట చతుష్టయము పన్నాగము పన్నగా, వీరి కుతంత్రమును వ్యాసభగవానుడు దివ్యదృష్టితో కనుగొని హస్తినాపురికి వచ్చి ఆ ప్రయత్నము నుండి వారిని వారించదలచి, ధృతరాష్ట్రుని ఈవిధంగా మందలించాడు.

> ధృతరాష్ట్ర మహాప్రాజ్ఞ నిబోధ వచనం మమ । (వనపర్వం)
> వక్ష్యామి త్వాం కౌరవాణాం సర్వేషాం హితముత్తమమ్ ॥ 8 -1

ధృతరాష్ట్రా! మహాప్రాజ్ఞాశాలివి నీవు! నా ధర్మోపదేశం శ్రద్ధాభక్తులతో ఆలకించవలసినది. ఇది మీకందరికి శ్రేయస్కరమైన పద్ధతి.

సామ్రాజ్యం కోల్పోయి, అడవులపాలై పరిపరివిధాల కష్టాలనుభవిస్తున్న పాండవేయులందరిని హతమార్చి వేయవలెనని సంకల్పించి నీ జ్యేష్ఠ కుమారుడు చతురంగ సైన్యంతో కదలిపోతున్నాడు. పాండవులు పన్నెండేళ్ళు అరణ్యవాసము, ఒక ఏడాది అజ్ఞాతవాసము యథావిధిగా నిర్వర్తించిన పిమ్మట వారే తిరిగివచ్చి

నీ కుమారులను హతమార్చెదరు. వారి శక్తి తెలిసికూడ నీ కుమారులు రాజ్యకాంక్ష చే వారిని ఇప్పుడు అడవిలో చంపదలిచినాడు. కనుక ఇది అనుచితమని బోధించి నివారించవలెనని పలికి మరల ధృతరాష్ట్రునితో...

ఓ ధృతరాష్ట్రా! నీవు, ద్రోణాచార్యుడు, గాంగేయుడు, విదురుడు ఈ దుష్కృత్యం ఉపేక్షించడం న్యాయం కాదు. పాండవులను చంపబోయి తప్పక వారే తమ ప్రాణములను కోల్పోతారు. ఇపుడు దుర్యోధనుని నీవు ఉపేక్షించినచో నీ వంశము నశించును. ఇది శ్రేయస్కరము కాదు. పాండవులను నీవు చేరదీసినచో క్రమముగా ఇరువర్గములలో స్నేహభావము పెంపొందగలదు. దానివల్ల నీకు శాంతి చేకూరగలదు. నీవు నీ కొడుకులను వారించి కురువంశమును కాపాడుము. ఇది నీ ఒక్కనికే సాధ్యము. ఆ మాటలు విని ధృతరాష్ట్రుడు ఇట్లనెను.

మహాత్మా! నాకీ ద్యూత వ్యవహారం ఏ మాత్రము రుచించలేదు. కాని నేనేమి చేయగలను. ఆ దుర్దైవమే నన్నావిధంగా ప్రేరేపించింది.

> నైతత్ప్రోచ్యతే భీష్మో న ద్రోణో విదురో న చ । (వనపర్వం)
> గాంధారీ నేచ్ఛతి ద్యూతం తత్ర మోహాత్ప్రవర్తితమ్ ॥ 9–2

గాంధారి భీష్మ విదుర కృప ద్రోణాచార్యులు మొదలైన ఆప్తులెవ్వరూ దానికనుమతించలేదు. కన్న కొడుకు మీది మమకారం విడిచిపెట్టలేక అనేకవిధాల మదనపడుతున్నాను. దుర్యోధనుడెంత దుష్టుడైనను పుత్రప్రేమచే అతనిని విడువజాలకున్నాను.

వేదవ్యాసుడు అంతట ధృతరాష్ట్రునకు సదుపదేశం ప్రసాదించాడు. నాయనా! స్నేహాలన్నిటి కన్నా సంతతిపై కలిగే మమకారమే మిక్కిలి గొప్పది. అష్టైశ్వర్య సంపత్తి కలిగినా సంతానభాగ్యం లేనివారికి ఇహలోక ఆనందం లేదు. పుత్రస్నేహం విషయమై వేదాలలో ఒక ఉపాఖ్యానం వినిపిస్తున్నదని ఇంద్ర సురభిసంవాదము తెలియజేశాడు.

ధృతరాష్ట్రా! సురభి యను దేవధేనువు - భూమిని దున్నుచు దుర్బలస్థితిలో నుండి దెబ్బలుతినుచున్న తన పుత్రుని జూచి దుఃఖపడి యింద్రునితో మొరపెట్టుకొంది. అప్పుడు ఇంద్రుడు నీ బిడ్డల్లో కొన్ని మాత్రమే గదా! బాధపడుతోంది. మిగిలినవి బాగానే ఉన్నాయి గదా! ఆ మాటలకు సురభి యింద్రునితో - పుత్రులందరి యందు నాకు సమాన దృష్టియే కాని, ఆపన్నుడైన పుత్రునియందు అధిక దయయని చెప్పినది. ఇలా సురభి తన బిడ్డల యెడ ఆమెకు గల స్నేహాన్ని గమనించిన ఇంద్రుడు వెంటనే వర్షాలు కురిపించి తృణ సమృద్ధి చేశాడు.

ఓ ధృతరాష్ట్రా! ఆ సురభి చెప్పినట్లు నీకు పుత్రులందరి యందును సమబుద్ధియుండవలసినదే. కాని ఆపన్నుల యందు మాత్రము అధిక దయయుండవలెను.

> **యాదృశో మే సుతః పాండుస్తాదృశో మేఽసి పుత్రక ।**
> **విదురశ్చ మహాప్రాజ్ఞః స్నేహాదేత ద్బ్రవీమ్యహమ్ ॥** (వనపర్వం)
> **చిరాయ తవ పుత్రాణాం శతమేకశ్చ భారత ।**
> **పాణ్డోః పంచైవ లక్ష్యన్తే తేఽపి మన్దాః సుదుఃఖితాః ॥** 9-20,21.

నీ మీద నున్న అనురాగముతో చెప్పుచున్నాను. నాకు పాండురాజు నీవు, విదురుడు అను ముగ్గురు సమానులే. నీకు చిరకాలమునకు శతాధిక సుతులు కలిగిరి. పాండురాజునకు గలిగిన వారు అయిదుగురే. వారు నీ పుత్రుల వలె గాక కపటమెరుగని వారు, దుఃఖితులై యున్నారు. వారెట్లు జీవింతురు? ఎట్లు వర్ధిల్లుదురు? అని నా మనస్సు పాండవులను చూచి పరితపించుచున్నది. ధృతరాష్ట్రా! నాకు పాండు పుత్రులెట్టివారో నీ పుత్రులు నట్టివారే. వారు దీనులై యున్నారని యిప్పుడు నా బుద్ధి వారియందు సంసక్తమైనదని ఉపదేశించాడు.

మరల వేదవ్యాసుడు ధృతరాష్ట్రునితో ధృతరాష్ట్రా! పాండవులు నీ కుమారులు సుఖముగా జీవించి కురుకులము వృద్ధిచెందుట నీయభిమతమైనచో

దుర్యోధనుని శాంతపరచి పాండవులతో కలిసి మెలిసి యుండునట్లు చేయుము. అని వ్యాసభగవానుడు ధృతరాష్ట్రునికి ఉపదేశించాడు.

అంత ఆ ధృతరాష్ట్రుడు వ్యాసునితో మహాత్మా! మాకందరకును అదియే అభిమతము. కనుక ఎలాగైనను దుష్టుడైన దుర్యోధనుని శాసింపుము. ఆ మాటకు వ్యాసుడు రాజా! మహాత్ముడైన మైత్రేయ మహాముని పాండవులను చూచి మనను గూడ దర్శించుటకు ఇప్పుడే యిక్కడికి వచ్చుచున్నాడు. ఆయన దుర్యోధనుని శాసించి అతనికి, కులమునకు శాంతికల్గిస్తాడు. ఆయన ఉపదేశించిన విధముగా నడుచుకొనుడు అది వినక ఆయనను పరిహసించి తిరస్కరించినచో నీ పుత్రుని ఆయన శపించగలడు. ఇట్లు చెప్పి వ్యాసభగవానుడు వెళ్ళిపోయాడు. వ్యాసుడు వెళ్ళిన పిమ్మట ధృతరాష్ట్రుడు తన కుమారుడికి తనవంతుగా చెప్పాల్సిన మంచిని చెప్పాడు. అయినా దుర్యోధనుడు వినిపించుకోలేదు. ఇంతలో అనేక తీర్థాలు, క్షేత్రాలు సేవించి పాండవుల యోగక్షేమాలను తెలుసుకుని అక్కడి నుంచి బయలుదేరి మైత్రేయమహర్షి హస్తినకు రానే వచ్చాడు. సభలో పాండవుల బలపరాక్రమాలు తెలియజేసి వారితో వైరం మంచిది కాదని వివరించి చెప్పాడు మైత్రేయుడు. దుర్యోధనుడు ఆ మహర్షి మాటలను పెడచెవిని పెట్టి పైగా ఆయనను అవమానిస్తూ తన తొడలు చరుచుకుంటూ బాహువులు పైకెత్తుతూ నిర్లక్ష్యంగా ప్రవర్తించగా, మైత్రేయుడికి విపరీతమైన కోపాన్ని తెప్పించింది. మైత్రేయుడు మంచికోరి చెబుతూంటే తనను అవమానిస్తూ తొడలు చూపుతూ, చరుస్తూ ప్రవర్తించిన కారణంగా భవిష్యత్తులో జరగబోయే యుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్ట గలడని శపించాడు. అప్పటికీ దుర్యోధనుని బుర్రకు ఏమీ ఎక్కలేదు. ధృతరాష్ట్రుడు మంత్రభయంతో వణికిపోతూ క్షమించి శాపాన్ని ఉపసంహరించుకొమ్మని కోరాడు. అందుకు మైత్రేయుడు శాంతిస్తూ ఇప్పటికీ మించిపోయింది ఏమీ లేదని ధర్మవర్తనులైన పాండవులతో దుర్యోధనుడు స్నేహంగా ఎప్పుడుంటాడో అప్పుడు శాపము ఉపసంహార మవుతుందని చెప్పాడు. అయినా దుర్యోధనుడికి చీమ కుట్టినట్టుగా కూడా అనిపించలేదు.

## 8.3.2. వేదవ్యాసుడు ధర్మరాజుకు ప్రతిస్మృతి మంత్రము ఉపదేశించుట

వనపర్వమున భీమధర్మరాజులు కౌరవుల బలాబలములను గూర్చి సంభాషించు కొనుచుండగా, సత్యవతీ సుతుడు అచటకు రాగా, పాండవులు భక్తిభావంతో ఆ మునీంద్రునికి అర్ఘ్యపాద్యములిచ్చి పూజించారు. తరువాత ఆ వేదవ్యాసుడు ధర్మరాజుకి ఈ ప్రకారంగా ఉపదేశించాడు.

> భీష్మాద్ద్రోణాత్కృపాత్కర్ణాద్ద్రోణపుత్రాచ్చ భారత ।
> దుర్యోధనా న్నృపసుతా త్తథా దుశ్శాసనాదపి ॥ 36 –25 శ్లో
> యత్తే భయమమిత్రఘ్న హృది సంపరివర్తతే ।
> తత్తేహం నాశయిష్యామి విధి దృష్టేన కర్మణా ॥ 36 –26 శ్లో

భీష్మ, ద్రోణ, కృప, కర్ణ, అశ్వత్థామ, దుర్యోధన, దుశ్శాసనాదుల వల్ల నీకు గల భయము ఏదికలదో దానిని విధి దృష్టమైన హేతువుచే నశింప జేయగలను.

నీకిప్పుడొక మహామంత్ర విద్య అనుగ్రహిస్తున్నాను. దీనిని నీవు అర్జునునకు ఉపదేశించవలెను. దీనివల్ల ఆ అర్జునునకు అభీష్టసిద్ధి కలగగలదు. అని పలికి ధర్మరాజును ఏకాంత ప్రదేశానికి తోడుకొనిపోయి ప్రతిస్మృతి నామధేయంతో ప్రసిద్ధమయిన ఒకానొక దివ్యమంత్రమును యథావిధిగా కటాక్షించి, దాని ప్రభావం ధర్మరాజుకు ఈ ప్రకారంగా వ్యాఖ్యానించాడు.

ధర్మరాజా! ఈ ప్రతిస్మృతి విద్యను అర్జునునికి ఉపదేశించిన పిమ్మట ఆ శూరుని తపశ్శక్తి పరాక్రమ ప్రాభవము పూర్వం కన్న వేయిరెట్లెక్కువగా వర్ధిల్లగలవు. అంతేకాదు.

> యామవాప్య మహాబాహుః అర్జునస్సాధయిష్యతి ।
> అస్త్రహేతోః మహేంద్రం చ రుద్రం చైవాభిగచ్ఛతు ॥ 36 –31
> వరుణం చ కుబేరం చ ధర్మరాజం చ పాండవ ।
> శక్తో హ్యేష సురాన్ ద్రష్టుం తపసా విక్రమేణ చ ॥ 36 –32

నీనుండి అర్జునుడు ప్రతిస్మృతి విద్యను పొందినవాడై అస్త్రమును సంపాదించుటకు దేవేంద్రుని, రుద్రుని వరుణ కుబేరుని ప్రసన్నుల చేసికొనుగాక! ఈతడు తపసుచే, పరాక్రమముచే, దేవతలను చూచుటకు సమర్థుడు.

ధర్మజా! పూర్వపు నర-నారాయణులలో నితడు నరుడు. ఇతడు అజేయుడు. ఈవిద్య ద్వారా ఇంద్రరుద్ర దిక్పాలకుల వల్ల అస్త్రములను సంపాదించి ఇతోధికముగా శక్తివంతుడవుతాడు. అని పలికి మరల ధర్మరాజా!మీరు చిరకాలం ఈ అరణ్యంలో నివసించారు. ఇందువల్ల ఫల పుష్పాదులకాకింత కొరత ఏర్పడుతున్నది. పశుపక్షి మృగాలకు మీ ఉనికి వల్ల సదా ప్రాణ భీతితో భయపడుతున్నాయి. ఒకేచోట కలకాలం నివసించరాదు. ఇది ఎటువంటి వారికైనా మనఃక్లేశం కల్గించగలదు. కనుక మీరు ఇంకొక వనములో ప్రవేశించవలసిందని పలికి వేదవ్యాసుడు అదృశ్యుడయ్యాడు.

పిమ్మట పాండవులు బ్రాహ్మణ పుంగవులతో ఒక శుభముహూర్తంలో ప్రయాణమై కామ్యక వనములో ప్రవేశించి నివాసమేర్పరచుకొనిరి. కొంతకాలమునకు ధర్మరాజుడు వ్యాసుని మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని, అర్జునుని ఏకాంతమున తోడుకొనిపోయి భీష్మద్రోణ కృప అశ్వత్థామ వీరు నలువురు దైవ, బ్రాహ్మ, మానుషమను మూడువిధములగు అస్త్ర ప్రయోగములు నేర్చినవారు. వారిని జయించవలెనన్న అట్టి అస్త్రములను పొందవలెనని పలికి ప్రతిస్మృతి మంత్రమును ఉపదేశించి హిమవత్ పర్వతమున తపమాచరించుటకు పంపాడు.

### 8.3.3. వేదవ్యాసుడు ధర్మరాజుకు ముద్గలుని దానమహిమను బోధించుట

పాండవులు ద్వైత వనమునుండి కామ్యక వనమున ప్రవేశించారు. అచట నివాసమేర్పరచుకొని కందమూల ఫలాదులతో జీవనము గడుపుతూ, మాయాజూదముతో తాము పడిన భంగపాటు తలచుకొని దుఃఖించుచుండగా, ఆ సమయమున కృష్ణద్వైపాయనుడు అచట ప్రత్యక్షము కాగా, పాండవులు అర్ఘ్యపాద్యములిచ్చి సత్కరించి గౌరవించారు. దుఃఖితులయిన పాండవులను

చూచి వేదవ్యాసుడు ధర్మరాజుతో ....

> **నాతప్త తపసో లోకే ప్రాప్నువన్తి మహాసుఖమ్ । (వనపర్వం)**
> **సుఖదుఃఖే హి పురుషః పర్యాయేణోపసేవతే ॥ 259 -13**
> **నహ్యానన్తం సుఖం కశ్చిత్ ప్రాప్నోతి పురుషర్షభ ।**
> **ప్రజ్ఞావాంస్త్వేవ పురుషః సంయుక్తః పరయా ధియా ॥ 259 -14**

ధర్మరాజా! తపస్సు చేయనివారు లోకములో మహాసుఖమును అనుభవింపజాలరు. నీవు ధర్మాత్ముడవు నీకు తెలియని ధర్మములు లేవు. పురుషునకు సుఖదుఃఖములు పర్యాయముగా ఒకటి వెంట ఒకటి కలుగుచుండును. ఎవడుకూడా అనంతమైన సుఖమును పొందజాలడు. ఉత్తమబుద్ధిగల జ్ఞానియైన వాడే సుఖ దుఃఖములను గ్రహించగలడు.

సేద్యగాడు ఏ కాలమునకు ఏ పంట పండిన దానితో తృప్తి చెందుతున్నాడు. పంటలు పండినపుడనుభవించుచు, కరువు కాటకములను సహించుచు నుండునట్లే దేహి గూడ తనకు గలిగిన సుఖమును అనుభవించుచు, దుఃఖమును సహించుచున్నాడు. కాలానుగుణముగా సుఖ దుఃఖములు వచ్చుచుండును. అంతమాత్రముతో ధీరుడు చలించకూడదు.

> **తపసో హి పరం నాస్తి తపసా విందతే మహత్ ।**
> **నాసాధ్యం తపసః కించిదితి బుధ్యస్వ భారత ॥ 259 -17**

తపస్సు కన్న మించినది లేదు. తపస్సుచే చాల గొప్ప సుఖశాంతులను పొందవచ్చును. తపస్సుచే సాధింపరానిదేదియు లేదని తెలుసుకొనుము. ఈ జన్మలో చేసిన సుకృతం స్వర్లోకంలో ఫలిస్తుంది. ఆ పుణ్యం వల్ల మానవుడు మరుజన్మలో సౌఖ్యాలనుభవిస్తున్నాడు. అందువల్ల పరోపకారబుద్ధితో సదా దాన ధర్మాలు ఆచరించవలెను.

అంతట ధర్మరాజు వ్యాసునితో మహాత్మా! తపోదానాలలో దుష్కరమయినదేదీ ఈరెండిటిలో దేనివల్ల అత్యధిక ఫలితం లభిస్తున్నదని

యడుగగా, అప్పుడా వేదవ్యాసుడు ధర్మరాజు సంశయాన్ని ఇట్లు నివారించాడు.

ధర్మరాజా! దానము చేయుటకన్న దుష్కరమైన పని మరియొకటి లేదు. దానము చేయుటలో విశేషమేమనగా, న్యాయమార్గములో సంపాదించిన ధనమును పుణ్యకాలములో, పుణ్యదేశములలో సత్పురుషులకు దానము చేయుట యోగ్యము. అన్యాయముగా సంపాదించిన ధనమును, దానము చేసిన వానిని ఆ దానధర్మము నరక భయమునుండి కాపాడజాలదు.

**పాత్రేదానం స్వల్పమపి కాలే దత్తం యుధిష్ఠిర ।**
**మనసా హి విశుద్ధేన ప్రేత్యానన్తఫలం స్మృతమ్ ॥ 259 -34 శ్లో**

పుణ్యకాలములందు సత్పాత్రకు పరిశుద్ధ మనస్సుతో చేసిన దానము స్వల్పమైనను పరలోకములో అనంతఫలమును ఈయగలదని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

పురాతనకాలంలో ముద్గలుడను బ్రాహ్మణుడు సదాశ్రమించి సేకరించిన తూమెడు ధాన్యరాశితో మృష్టాన్నం సిద్ధంచేసి, అతిథులకర్పించి ఆ మహాపుణ్యం వల్ల సామాన్యులెవ్వరు అందుకోలేని ఉత్తమ లోకం స్వాధీనం చేసుకొన్నాడు. అంతట ఆ ధర్మరాజు ముద్గలుని వృత్తాంతమును తెలియపరచమని ప్రార్థించాడు.

అపుడు వేదవ్యాసుడు : ధర్మరాజుతో...ఓ ధర్మరాజా! పూర్వం కురుక్షేత్రంలో ముద్గలుడు అనే ఓ ఋషి ఉండేవాడు. ఆయన ఎంతో ధర్మాత్ముడు, జితేంద్రియుడు. పంటకోసి తీసుకువెళ్ళిన తరువాత పొలంలో కిందపడిన ధాన్యాన్ని ఏరివాటితో జీవనాన్ని సాగించటాన్ని ఉంఛవృత్తితో జీవించడం అంటారు. అలాగే పొలం నుంచి పంట తీసుకొని పోయిన తర్వాత పొలంలో అక్కడక్కడా పడిన ధాన్యపు కంకులను ఏరుకెళ్ళి జీవనాన్ని సాగించటాన్ని శిలా వృత్తి అంటారు. ముద్గలుడు ఇలా శిలా, ఉంఛవృత్తులతో జీవితాన్ని సాగిస్తూ ఆ సంపాదించిన ధాన్యాన్ని కూడా తనకు తనకుటుంబ సభ్యుల కోసం ఆహారంగా కాక 'ఇష్టీకృతం' అనే యజ్ఞాన్ని చేస్తుండేవాడు.

'ఇష్టీకృత' మనగా – పూర్ణిమ అమావాస్యము దినములందు పక్షమున కొకసారి చేయు యజ్ఞము. ఆనాడే ఆ ముప్పురు గూడ భోజనము చేయుచుండిరి. ఈవిధముగ ఆ కుటుంబము వారు పక్షమునకు ఒకసారి పూర్ణిమ అమావాస్యలందు భోజనము చేయుచు తక్కిన దినములందు ఉపవాసము ఉండేవారు.

యజ్ఞం చేసిన తర్వాత అతిథులకు భోజనంపెట్టి ఆ తర్వాత మిగిలినది ఏదైనా ఉంటే దాన్ని మాత్రమే తన కుటుంబ సభ్యులతో కలిసి తింటుండేవాడు. ఇలాంటి ధర్మాత్ముడైన ముద్గలమహర్షిని గురించి దుర్వాసమహర్షి విన్నాడు. ముద్గలుడిని పరీక్షించాలని దుర్వాసుడు అనుకొన్నాడు. ఓసారి ఉన్మత్తుడి వేషంలో పరుషంగా మాట్లాడుతూ ముద్గలుడి దగ్గరకు వచ్చి తనకు ఆహారం పెట్టమని అడిగాడు. ఆ మహర్షి దుర్వాసుడివి సాదరంగా ఆహ్వానించి భోజనం పెట్టాడు. తిన్నంత తిని మిగిలిన ఆహారన్నంతా ఒంటికి పూసుకొని దుర్వాసుడు వెళ్ళిపోయాడు. ఆ రోజున ముద్గలుడి కుటుంబమంతా ఆహారం లేక ఆకలితో మలమల మాడింది. అలా ఆరు పర్యాయములు ఆరు పక్షములకు వచ్చి అన్నమంతయు తినిపోవుచుండెను. ఇంత చేసినను ముద్గలుడు కానీ, అతడి కుటుంబ సభ్యులుగాని ఎవరూ దుర్వాసుడిని ఒక్క మాట కూడా అనలేదు. పైగా ఎంతోశాంతంగా ఆయనకు స్వాగతం పలుకుతూ ఆదరిస్తూ భోజనం పెడుతుండేవారు. ఆ పరిస్థితి దుర్వాసమహర్షిని ఎంతగానో చలింపజేసింది. వెంటనే తానెవరో ముద్గలుడికి తెలియజెప్పి మహాత్మా! మాత్సర్యము లేకుండ దానము చేయుటలో నీతో సమానుడు ఈలోకములో మరియొకడు లేడు. ఆకలి యనునది మహాత్ములకు గూడ ధర్మజ్ఞానము పోగొట్టును. శ్రమచే సంపాదించిన వస్తువును విడుచుట చాల దుఃఖకరమగును. నీవు ఆర్జించిన ఆహారధాన్యము నంతయు పరిశుద్ధమైన మనస్సుతో త్యాగము చేసితివి. నీచేత మేము అనుగ్రహింపబడితిమి. తనకెంతో ఆనందంగా ఉందని ఆ కుటుంబాన్ని ఆశీర్వదించాడు. ఇంతలో స్వర్గలోకం నుంచి దేవదూతలు విమానాన్ని తీసుకువచ్చి

తమతో స్వర్గానికి రమ్మనమని ముద్గలుడిని అడిగారు.

దేవదూతలతో ముద్గలుడు స్వర్గంలో ఎవరుంటారు? ఎలాంటివాళ్ళు స్వర్గానికి వెళతారు? అసలా స్వర్గం ఎక్కడుంటుంది? అని అడిగాడు. తపస్సు చేసేవారు స్వర్గలోకానికి చేరతారని, ధర్మాత్ములు, శాంతులు అక్కడికి చేరుకుంటారని దేవదూతలు చెప్పారు. ముద్గలుడు కూడా యజ్ఞాలు అన్నదానం చేయటం మూలంగా స్వర్గలోక ప్రాప్తి కలుగుతోందని దూతలు అనటంతో అక్కడ తాను ఎన్నాళ్ళు ఉండవచ్చని ముద్గలుడు తిరిగి ప్రశ్నించాడు. అందుకు దూతలు పుణ్యం అయిపోయేదాక అక్కడే ఉండి మళ్ళీ భూలోకానికి చేరవచ్చని అన్నారు. అప్పుడా ఋషి అలాకాకుండా స్వర్గం కన్నా ఇంకా ఉత్తమోత్తమమైన, సర్వోన్నతమైన లోకమేదో చెప్పమని, అక్కడ తాను ఎప్పటికీ ఉండిపోయే మార్గమేదో వివరించమని ఋషి దేవదూతలను కోరాడు. అపుడా దూతలు బ్రహ్మలోకానికి పైన విష్ణుధామం ఉందని అక్కడికి చేరాలంటే ధ్యాన, యోగ, నిష్ఠ, జ్ఞాన యోగాలతో జీవించాలని దూతలు చెప్పారు. దేవదూతల మాటలు విన్న తరువాత ముద్గలుడు తనకు తాత్కాలికమైన సుఖాలనిచ్చే స్వర్గం అక్కరలేదు. అని పలికి దేవదూతలను పంపివేసాడు.

తరువాత ఆ ముని ఏ చోటికి పోయిన తర్వాత శోకము, బాధ, చంచలత్వము ఉండవో ఆ స్థానమును అన్వేషించి, చివరకు శాశ్వతమై, నిత్యమై దోషరహితమైన మోక్ష సామ్రాజ్య సుఖమును పొందాడని ముద్గలుని వృత్తాంతమును తెలియజేశాడు.

మరల వేదవ్యాసుడు ధర్మరాజుతో .....

**తస్మాత్ త్వమపి కేన్తేయ న శోకం కర్తుమర్హసి । (వనపర్వం)**
**రాజ్యాత్ స్ఫీతాత్ పరిభ్రష్టస్తపసా తదవాప్స్యసి ॥ 261-48**
**సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్ ।**
**పర్యాయేణోప సర్పంతే నరం నేమిమరా ఇవ ॥ 261.-49**

పితృపైతామహం రాజ్యం ప్రాప్స్యసిత విక్రమ ।
వర్షాత్త్రయోదశాదూర్ధ్వం వ్యేతు తే మానసోజ్వరః ॥ 261 –60

ధర్మరాజా! అందువలన నీవు కూడా ఇపుడు దుఃఖపడకూడదు. ప్రాప్యమగు రాజ్యమునుండి భ్రష్టుడవైన నీవు తపస్సు చేసి తిరిగి దానిని సంపాదించగలవు. సుఖానంతరము దుఃఖము, దుఃఖానంతరము సుఖము ఒకటి వెంట మరియొకటి వచ్చుచుండును. కావున అజ్ఞాతవాసము పదమూడవ సం॥ము గడచిన తరువాత నీవు నీ పితృపైతామహమైన రాజ్యమును తిరిగి పొందగలవని చెప్పి వేదవ్యాసుడు అంతర్హితుడయ్యాడు.

**8.4. ఉద్యోగపర్వము**

**8.4.1. వేదవ్యాస అనుమతితో సంజయుడు ధృతరాష్ట్రునకు హితము చెప్పుట**

ధృతరాష్ట్రుడు, తనకుమారులు జయించగలరేమో అన్న దురాశతో సంజయా! ఉభయపక్షాల బలాల తారతమ్యము నీవెంతో జాగరూకతతో పరిశీలించావు గదా! చిట్టచివరికి జయలక్ష్మి ఎవ్వరిని వరించగలదని భావిస్తున్నావు? అని ప్రశ్నించాడు. అపుడు సంజయుడు[18] నన్ను పరీక్షించడం వల్ల ప్రయోజనమేమి ఉన్నది? నీ పితృపాదులు వేదవ్యాస మహర్షి ధర్మాధర్మరహస్యవేత్త, ఒకవేళ నీ హృదయంలో అసూయగాని, అజ్ఞానంగాని యున్న యెడల ఆ మహనీయుడు అది నిశ్శేషంగా నిర్మూలించి వేయగలడు. అదియును గాక! నీ ప్రస్తుత సందేహము తొలగించగల సర్వజ్ఞుడు ఆ మహాత్ముడొక్కడే గాక వేరెవ్వరున్నారు? కనుక వెంటనే గాంధారిదేవితో కలిసి ఆ వ్యాసుని స్మరించుము.

అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారితో కలిసి ఆ వ్యాసుని స్మరించిన వెంటనే

---

**18.** సంజయుడు : ఇతడు ఒక సూతపుత్రుడు. ఇతడు సదా ధృతరాష్ట్రుని చెంతనుండి అతని ఉపచారములు చేయుచుండువారు. వ్యాసుని ఆదేశానుసారం సంజయుడు ధృతరాష్ట్రునకు భారత యుద్ధ విశేషములను చెప్పాడు. ఇతడు పురూరవుని వంశస్థుడు.

వారి యెదుట ప్రత్యక్షంకాగా, అంతట వారు సంజయునితో ఆ మహర్షికి ఎదురుగా పోయి అర్ఘ్యపాద్యములిచ్చి సత్కరించి, నమస్కరించి ఆ మహాత్ముని ఆనతికోసం నిరీక్షించారు.

అంతట వేదవ్యాసుడు తన దివ్యదృష్టితో వారి మనోభిప్రాయమును తెలుసుకొని, సంజయుని చూచి నాయనా! ధృతరాష్ట్రుడు అడిగిన విషయం నీవు ఆమూలాగ్రంగా గ్రహించిన మనీషివి. కనుక నీకు ఇటువంటి సమయంలో మౌనం న్యాయం కాదు. సంకోచించక ధృతరాష్ట్రుడు సందేహం తొలగించవలసిందని ఆదేశించాడు.

అంతట సంజయుడు ధృతరాష్ట్రునితో... సర్వేశ్వరా! కృష్ణార్జునుల పరాక్రమము వర్ణించాడు. మరియు పాండవేయుల పరాక్రమమును అభివర్ణించాడు. ఎచ్చటనైతే సత్యము, ధర్మము ఋజుత్వము వెలసియుంటాయో అచటనే విజయము కలుగును. అని పలికి కృష్ణుని వైభవమును తెలియచేశాడు. పిమ్మట ధృతరాష్ట్రుడు తనకుమారుడైన దుర్యోధనునకు యుద్ధం వలదని చెప్పిచూశాడు. అయినా దుర్యోధనుడు వినలేదు. తదనంతరం గాంధారి గూడ దుర్యోధనునితో నాయనా! ఈ యుద్ధం వల్ల ఆయుర్దాయంతో బాటు ఐశ్వర్యము వైభవము త్రుటి కాలంలో నశించిపోగలవు. ఆత్మీయులే కాక బాంధవులందరు పరమపదించగలరు. అని బోధించిననూ అయినా వినలేదు.

పిమ్మట వేదవ్యాసుడు, ధృతరాష్ట్రుని మీద వాత్సల్యంతో కుమారా! శ్రీకృష్ణదేవుని హృదయంలో నీయెడల అత్యధికమైన ఆదరణ, అనురాగము ఏర్పడి ఉన్నవి. పరమ ఆప్తుడు ఈ సూతకుమారుని నీవు ఆ మహనీయుని సన్నిధికి పంపించావు గదా! ఇది నీకొకింత శుభదాయకమయిన కృత్యము. సంజయుడు వాసుదేవుని యథార్థస్థితి గుర్తెరిగిన మనీషి. ఇందువల్ల ఈతని హితవు అనుసరించి శ్రీహరిని ఆశ్రయించవలసింది. ఏకాగ్రచిత్తంతో ఆరాధించిన భక్తులకు ఆ యాదవేశ్వరుడు అతి సులభుడు. అభీష్ట ప్రదాత. కామక్రోధాదుల ఆవేశంతో

ఉన్మత్తులై తమ సిరి సంపదలతో సంతృప్తిపడక అన్యాయమార్గంలో సంచరిస్తున్న దురాత్ములు అతని స్వరూపము ఏ మాత్రము గ్రహించలేరు. కనుక సర్వవిధాల చక్రి పాదపద్మాలాశ్రయించి సామరస్య పద్ధతి అవలంబించి పుత్ర పౌత్రులతో ధన కనక వస్తు వాహనాలతో ఆనందింతువుగాక!

ధృతరాష్ట్రుడు ఆ సదుపదేశం శిరసావహించి ఆ మునివరేణ్యునకు అంజలి ఘటించి మహాత్మా! ఇటుపై నేను తప్పక నీ ఆనతి ప్రకారమే నడుచుకోగలనని విన్నవించాడు. పిమ్మట ధృతరాష్ట్రుడు సంజయుని చూచి సూతనందనా! నాకా వాసుదేవుని నామధేయ పరమార్థం తెలుపవలసిందని వేడుకొనగా, సంజయుడు వాసుదేవ నామ పరమార్థాన్ని తెలియజేశాడు. తరువాత ధృతరాష్ట్రుడు కృష్ణునకు ఇదే నా నమస్కృతి అని తెలిపి వేదవ్యాసులకు నమస్కరించి మహాత్మా! నేనిక ఆ వాసుదేవుని పాదపద్మములను ఆశ్రయించి వినీతుడై మసులుకోగలనని విన్నవించాడు. వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని ఆశీర్వదించి అంతర్హితుడయ్యాడు.

### 8.5. భీష్మపర్వము

#### 8.5.1. వేదవ్యాసుడు సంజయునకు దివ్యదృష్టి యిచ్చుట

కౌరవులు, పాండవులు యుద్ధధర్మములను కట్టుబాట్లను ఏర్పాటు చేసుకొనిరి. పూర్వ పశ్చిమ దిక్కులయందు ఎదురెదురుగా నిలిచియున్న ఉభయపక్ష సైనికులను, త్రికాలజ్ఞుడైన వేదవ్యాస మహాముని చూచి భవిష్యత్తులో జరగబోవు యుద్ధమును, భయంకర పరిణామమును కన్నుల యెదుట చూచుచు హస్తినాపురంలో నున్న ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి ఏకాంతమునందు ఇట్లనెను.

రాజా! నీ పుత్రులకు ఇతర రాజులకు మృత్యుకాలము వచ్చినది. వారు పరస్పరము పోరాడిచచ్చుటకు, చంపుటకు సంసిద్ధులై యున్నారు. వారు కాలవశములో చిక్కుకొని యున్నారు. కాబట్టి వారిని గూర్చి నీవు దుఃఖింపకుము.

యది చేచ్ఛసి సంగ్రామే ద్రష్టుమేతాన్విశాంపతే । (భీష్మపర్వం)
చక్షుర్దదాని తే పుత్ర యుద్ధం తత్ర నిశామయ ॥ 2-6

ఓ పుత్రా! ఈ సంగ్రామమును చూచుటకు నీవు కోరుచో నీకు నేత్రములను ప్రసాదించెదను. దానిని చూడుము.

నీవిక్కడ నుండియే కురుక్షేత్రమునందు జరుగుచున్న యుద్ధమునంతయు ప్రత్యక్షముగా కన్నులకు కట్టినట్లు చూడగలవు. ఆ మాటలు విని ధృతరాష్ట్రుడు వ్యాసునితో....

న రోచయే జ్ఞాతివధం ద్రష్టుం బ్రహ్మర్షిసత్తమ । (భీష్మపర్వం)
యుద్ధమేతత్త్వశేషేణ శృణుయాం తవ తేజసా ॥ 2 -7

ఓ బ్రహ్మర్షిసత్తమా! నేను జ్ఞాతివధను చూడకోరుట లేదు. మీ ప్రభావముచే ఈ సమరమునంతను విశేషముగ వినగలగునట్లు నన్ను అనుగ్రహింపుము.

ధృతరాష్ట్రుని మాట విని వ్యాసమహాముని సంజయునకు వరమునిచ్చుచు ధృతరాష్ట్రునితో రాజా! ఈ సంజయుడు దివ్యదృష్టి కలిగి నీకు యుద్ధ సమాచారమంతయు చెప్పగలడు.

ప్రకాశం వాఽప్రకాశం వా దివా వా యది వా నిశి । (భీష్మపర్వం)
మనసా చింతితమపి సర్వం వేత్స్యతి సంజయః ॥ 2 -11 శ్లో

ప్రకాశముగ జరిగినది. పరోక్షముగా జరిగినది. రాత్రి,పగలు, జరిగినది గాని, వారి వారి మనస్సులో తలచినది అంతయు ఇతడెరుగ గలడు. అంతేగాక ఓ రాజా! ఇతనిని శస్త్రములు ఛేదించవు. శ్రమ బాధించదు. నేను ఈ కురుపాండవుల కీర్తిని లోకమున విస్తరింపజేస్తాను. నీవు దుఃఖించకుము.

రాజా! ఇది దైవవిధి దీనినెవరు కూడా తప్పించజాలరు. కనుక నీవు శోకము చెందకుము. ఏ పక్షమునందు ధర్మము ఉండునో ఆపై జయము సిద్ధించును.

## 8.6. ద్రోణపర్వము

### 8.6.1. పద్మవ్యూహంలో అభిమన్యుడు మరణించగా దుఃఖిస్తున్న ధర్మరాజును వేదవ్యాసుడు ఊరడించుట

ద్రోణాచార్యుడు ఏర్పరచిన పద్మవ్యూహంలో ద్రోణుడు,కర్ణుడు మొదలగు మహారథులచే అభిమన్యుడు[19] సంహరించబడగా, ఆ మరణవార్త విన్న ధర్మరాజు పరిపరివిధాల విలపిస్తున్న తరుణంలో కృష్ణద్వైపాయనమహర్షి అచటకు రాగా ఆ తపోరాశికి ఎదురుగా పోయి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి, నమస్కరించి ఆ మునీంద్రునితో మహాత్మా! నా కారణంగా అభిమన్యుడు పద్మవ్యూహంలో చంపబడ్డాడని పలికి దుఃఖితుడు కాగా, వేదవ్యాసుడు ఆ మాటలను విని ధర్మరాజును ఓదార్చి......

> స్వర్గమేష గతః శూరః శత్రూన్ హత్వా బహూన్ రణే । (ద్రోణపర్వం)
> అబాలసదృశం కర్మ కృత్వా వై పురుషోత్తమః ॥ 52 –10

ధర్మరాజా! యుద్ధరంగమునందు అనేకమంది శత్రువులను సంహరించి ఆ అభిమన్యుడు స్వర్గమును పొందాడు. పరాక్రమవంతుడైన ఆ అభిమన్యుడు కేవలం పసిబాలకుడు కాడు.

ఓ ధర్మరాజా! ఆర్య పుంగవులు ఎవ్వరయినా విపత్పరంపరలకు అలజడి పడి అలమటిస్తున్నారా? అదియును గాక సుర,గరుడ, ఉరగ ప్రభృతి మహామహులనే మృత్యువు ఉగ్రస్వరూపంతో గ్రసిస్తున్నప్పుడు అభిమన్యుని స్వర్లోక గమనానికి ఇంతగా అలజడిపడి పడనేల? అంతేగాక! మరణ విషయంలో ఆ విధి విధానం తప్పించగల వారు ఎవ్వరున్నారు. అనన్య సామాన్య ధైర్యశాలివి. నీకు ఈవిధమయిన దుఃఖోద్వేగము ఏమాత్రము సముచితం కాదు. అపూర్వ

---

**19. అభిమన్యుడు** : అర్జునునికి సుభద్రయందు చంద్రుని అంశమున జన్మించినవాడు. విరాటుని కుమార్తె యగు ఉత్తరను వివాహమాడెను.

నిగ్రహంతో ప్రశాంత చిత్తుడవై, తరువాత కర్తవ్య నిర్వహణకు ఉపక్రమింతువు గాక! అని ధర్మరాజును ఓదార్చాడు.

అపుడు ధర్మరాజు కొంత ధైర్యం తెచ్చుకొని వ్యాసుల వారితో మహాత్మా! ఈ భూమిపై రారాజులు ఎందరో వారి వారి గొప్ప బలపరాక్రమములతో ప్రకాశించారు. వారు ఒక్కరయినా మృత్యు విపత్తునుండి తమ్ము సంరక్షించుకోలేకపోయినారా? మరణము ఎంతటి వారికయినా అనివార్యమేనా? అని ప్రశ్నించాడు. అపుడు వేదవ్యాసుడు ధర్మరాజా! మరణించిన వారి కోసం విచారించడం వివేకుల పనికాదని చెపుతూ ఇతః పూర్వము నారదమునీంద్రులు అకంపన మహారాజుకు వివరించిన మృత్యుదేవతా ప్రభావము, సువర్ణష్ఠీవి చరిత్రను, షోడశ మహారాజుల చరిత్రలను స్థూలంగా వివరించాడు.

కావున ధర్మరాజా! అభిమన్యుడు అసహాయ శూరుడై శత్రువులను సంహరించి, శాశ్వత ప్రతిష్ఠతో స్వర్గ లోకంలో అభీష్ట భోగాలు అనుభవిస్తున్నాడు. అట్టి కులదీపకుని మృతికై నీకు ఈ చింత అనావశ్యకము. అదియును గాక నా ముఖతః పునీతాత్ములయిన రాజుల చరిత్రలు ఎన్నెన్నో ఆలకించావు గదా! ఇందువల్ల సమకూరిన మనోధైర్య వివేకాలతో అచంచలుడవై సుస్థిరుడవై ప్రస్తుత కర్తవ్య నిర్వహణకు ఉపక్రమింతువుగాక! అని పలికి వేదవ్యాసుడు అంతర్హితుడయ్యాడు.

**8.6.2. ఘటోత్కచుని మరణముతో ధర్మరాజు దుఃఖితుడు కాగా వేదవ్యాసుడు ఊరడించుట**

కర్ణుడు దుర్యోధనునితో మరునాడు యుద్ధరంగము నందు అర్జునుని తప్పక సంహరించెదనని అహంకార ఆవేశంతో పలికాడు. కాని శ్రీకృష్ణుని ప్రభావంవల్ల కర్ణుడు దేవేంద్ర ప్రసాదితమైన ఆ మహాశక్తిని ఘటోత్కచునిపై ప్రయోగించి వధించాడు. ఘటోత్కచుని మరణవార్త వినగానే ధర్మరాజు తన సోదరులతో ఘటోత్కచుని గుణగణాలు, కామ్యక వనంలో గంధమాదన యాత్రలో

అతని అత్యద్భుత సాహాయ్యం ప్రస్తుతించి, ధర్మరాజు బోరుబోరున విలపింపగా అప్పుడచటకు వేదవ్యాసుడు రాగా, ధర్మరాజు ఆ మునీంద్రునికి నమస్కరించి నిలబడ్డాడు. అప్పుడు వేదవ్యాసుడు ధర్మకుమారా! దేవేంద్రుడు ఇచ్చిన శక్తి కేవలం కిరీటి సంహారార్థమై రాధేయుడు ఎంతో మెళకువతో తన దగ్గర భద్రపరచుకొన్నాడు. ఒకవేళ అతని సంకల్పమే నెరవేరిన యెడల ఆ ఘోరాపద నీవు ఏమాత్రము సహించనేరవు గదా! ఘటోత్కచ ఆయుర్దాయం నేటితో నిండినది. ఇందువల్లనే రాధేయుని శక్తి మిషతో ఆ శూరుడు అస్తమించి స్వర్లోకం చేరుకొన్నాడు. నీకు ఇందువల్ల శుభమే చేకూరింది, సందేహం లేదు. కావున ఈ దుస్సహదైన్య ధోరణి విడిచి చతురంగ సైన్యాలతో, సహోదరుల తోడ్పాటుతో, ఆత్మీయులతో యుద్ధరంగంలో ప్రవేశించి అపూర్వ పరాక్రమముతో శత్రువులను ఎదుర్కొందువు గాక! సదా నిర్మల ధర్మదృష్టితో ప్రశాంతుడవై వ్యవహరింతువు గాక! సర్వదా ధర్మమున్న నెలవులోనే జయశ్రీ నివసిస్తున్నది. అని చెప్పి ధర్మరాజా! ఇక ఈనాటికి అయిదవ రోజు ప్రారంభంలో విశాల ధరణీ సామ్రాజ్యశ్రీ నిన్ను అవశ్యం వరించగలదని పలికి అదృశ్యుడయ్యాడు.

### 8.6.3. వేదవ్యాసుడు అర్జునునకు పరమేశ్వర మహిమను చెప్పుట

ద్రోణపర్వమున ద్రోణుడు కురుక్షేత్రమునందు సంహరింపబడగా, వేదవ్యాసుడు అర్జునుని సమీపించగా అంతట అర్జునుడు వేదవ్యాసునకు నమస్కరించి మహాత్మా!

> సంగ్రామే న్యహనం శత్రూన్ శరౌఘైః విమలైరహమ్ । (ద్రోణపర్వం)
> అగ్రతో లక్షయే యాన్తం పురుషం పావకప్రభమ్ ॥ 202 -4

నేను నా బాణ సమూహములచే యుద్ధమున శత్రువులను సంహరించితిని నాకు ముందుగా అగ్ని వంటి కాంతి గల ఒకానొక పురుషుడు నాకు కనబడుచున్నాడు.

త్రిశూలమునుంచి వ్యక్తమయిన శూల పరంపరలచే శత్రువుల్ని

సంహరింపబడిన మనుష్యులనందరునూ, నాచే సంహరింపబడిన వారినిగా లోకులు అనుకొనుచున్నారు. ఓ మహాత్మా! ఆ పురుషోత్తముడెవరో నాకు చెప్పుము.

అపుడు వ్యాసుడు అర్జునా! ఆ పురుషోత్తముడు శివుడే అని చెప్పి, నీవు ఆచరించిన తపశ్చర్యకు సంతోషించి, ఆ పరమేశ్వరుడు ఒకప్పుడు నీకు అనేక దివ్యాస్త్రాలను అనుగ్రహించాడు. శత్రుసంహార సమయమున అనుక్షణము నీకు సహాయపడుతున్నాడు.

**ప్రజాపతీనాం ప్రథమం తైజసం పురుషం ప్రభుమ్ ।**
**భువనం భూర్భువం దేవం సర్వలోకేశ్వరం ప్రభుమ్ ॥ (ద్రోణపర్వం)**
**ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరమ్ ।**
**తం గచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరమ్ ॥ 202 – 9, 10**

అర్జునా! ప్రజాపతులలో మొదటివాడును, తేజోవంతుడును, పురుషుడును, సర్వలోకేశ్వరుడును, వరదుడునగు, ఈశ్వరుని నీవు చూచినవాడవైతివి. అట్టి భువనేశ్వరుడును, వరదుడునగు శంకరుని శరణువేడుము. శాంతుడగు ఆ ఈశ్వరునకు నమస్కరించుము.

ఆ ఈశ్వరుడు దక్షప్రజాపతి యజ్ఞమును ధ్వంసమొనర్చినాడు. పిమ్మట ఆ దక్షప్రజాపతి రుద్రునకు విశేషమగు యజ్ఞభాగమును కల్పించాడు. దేవతలందరునూ భయపడినవారై అతనిని శరణువేదారు. ఆ మహేశ్వరుడే త్రిపురాసుర సంహారమును కూడ చేసినాడు. ఈవిధముగా వ్యాసమహర్షి రుద్ర మహిమను ప్రతిపాదించు శత రుద్రీయమును చెప్పి అంతర్ధానమయ్యాడు.

### 8.7. స్త్రీపర్వము

### 8.7.1. వేదవ్యాసుడు ధృతరాష్ట్రునకు కురుక్షేత్ర రహస్యమును తెలియజేయుట

ధృతరాష్ట్రుని కుమారులందరు యుద్ధరంగంలో మరణించగా,

విదురుడు, ధృతరాష్ట్రునకు హితోపదేశము చేసినప్పటికీ, అతనికి దుఃఖము తొలగక పోవడముతో అప్పుడు వ్యాసమహర్షి అచటకు రాగా ఆ ధృతరాష్ట్రుడు నమస్కరించి మహాత్మా! మానవ జన్మము ఎల్లప్పుడు నిరంతర దుఃఖనిలయాలు నరునికి ఇట్టి బ్రతుకు వల్ల దుస్పృహదైన్యంకాని వేరొక్క సత్ఫలితమేమి ఉన్నది? మదీయ ధన ధాన్య సంపత్తి సమస్తము నామ మాత్రావశిష్టమై నశించింది. కుమారులు నూరుగురు యుద్ధభూమిలో మరణించి పరలోకం చేరుకొన్నారు. ఇక నేనేమి చేయగలను? మరినాకు దిక్కెవరు? నావంటి దురదృష్టవంతులు ఈలోకంలో వేరెవ్వరయినా కలరా? అని దుఃఖించగా అపుడు వ్యాసులవారు ఇట్లు పలికెను.

ధృతరాష్ట్రా! నీకు తెలియని ధర్మపద్ధతి ఏమి ఉన్నది. నీతి విశారదుడవయిన నీవు కొంత దుఃఖావేశం విగ్రహించుకొనుము. నీ దుఃఖమును తొలగించవలెనని నీకు హితవు ఉపదేశిస్తున్నాను వినుము. ధృతరాష్ట్రా! జీవలోకము అశాశ్వతమనీ, ప్రాణికి ఎప్పటికయినా మరణము తప్పదని నీకు తెలుసును గదా! కావున నీకు ఈ నిరంతర పుత్రశోకోద్వేగం తగునా? అదియును గాక! కౌరవ పాండవేయుల మధ్య వైరాగ్ని జ్వాల ఏ తీరులో ప్రజ్వరిల్లినదో మొట్టమొదటనుండి నీకు తెలిసిన విషయమే గదా! నీ జ్యేష్ఠకుమారుడే కదా! దీనికంతటికి ప్రధాన కారణము. అయితే దుస్సంఘటన సమస్తము విధి సంకల్పితమే కాని వేర్కొకటి కాదు సుమా! కౌరవజాతి వినాశనం తప్పక సంఘటిల్ల వలసివున్నది. ఇందువల్లనే ఇంతటి ఘోరమారణం కొనసాగింది. దీనిలో వింతయేమి ఉన్నది. అదియును గాక భవదీయ బాంధవులందరు యుద్ధభూమిలో మరణించి శాశ్వత స్వర్గ సౌఖ్యాలు అనుభవిస్తున్నారు. కదా! అటువంటివారి కోసమై నీకు ఇంత చింత ఏల? ఇటువంటి ఘోరాపద సంఘటిల్ల గలదని మున్ముందే గ్రహించుకొన్న వివేకశాలి విదురుడు. అనాడు ద్యూత సమయంలో నీకు అనేకవిధాల న్యాయమార్గం బోధించినా నీవు అది తిరస్కరించలేదా? ఎంతెంతటి వారెవ్వరైనా విధి నిర్ణయం తప్పించుకోగలరా? కనుక ఇకనయినా

నా హితవు ఆలకించి శోకోద్వేగం విడిచిపెట్టుము.

ఎందుకంటే ప్రాచీనకాలంలో దేవేంద్రుని సమక్షంలో నేను ఒకప్పుడు ఒక పరమరహస్యం విని, కానున్నది కాక మానదని మున్ముందే గ్రహించు కొన్నాను. మేలుకోరి నీకు ఇప్పుడు ఆ విషయం వినిపిస్తున్నాను వినుము.

పూర్వకాలంలో నేను ఒకప్పుడు దేవేంద్రుని సభలో నుండగా భూదేవి అచటికి వచ్చి దేవతలను చూచి మహనీయులారా! పరమేష్ఠి సమక్షంలో మదీయ భారం తొలగించవలెనని మీరు ఒకప్పుడు నిశ్చయించుకొన్నారు గదా! అని పలుకగా అపుడు నారాయణ దేవుడు భూమాతా! అనతికాలంలోనే ఓ భూదేవీ! ధృతరాష్ట్రుని జ్యేష్ఠపుత్రుడగు దుర్యోధనుని మూలమున నీ కార్యము చక్కబడును. అతని వల్ల కురుక్షేత్ర[20] యుద్ధములో పృథివీపతులు పరస్పర హతులగుదురు. నీకు భారహరణమగును. నీవు స్వస్థానమునకు వెళ్ళుము అని పలికాడు.

య ఏష తే సుతో రాజన్ లోకసంహారకారణాత్ । (స్త్రీ పర్వం)
కలేరంశః సముత్పన్నో గాంధార్యా జఠరే నృప ॥
అమర్షీ చపలశ్చాపి క్రోధనో దుష్ప్రసాధనః ।
దైవయోగాత్సముత్పన్నా భ్రాతశ్చాస్య తాదృశాః ।
శకునిర్మాతులశ్చైవ కర్ణశ్చ పరమః సఖా ॥

సముత్పన్నా వినాశార్థం పృథివ్యాం సహితా నృపాః ।
యాదృశో జాయతే రాజా తాదృశోఽస్య జనోభవేత్ ॥ 8-30,31,32

ధృతరాష్ట్రా! అట్టి నీ యీ సుతుడు లోకసంహార నిమిత్తముగా కలియంశమున గాంధారీ గర్భమున జన్మించి దుర్లక్షణములు గలిగి యుండెను. దైవయోగమున అతని సోదరులు గూడ అతని వంటివారే పుట్టినారు. శకుని,

---

20. కురుక్షేత్రం : తానేస్వరము. ఇది ప్రజాపతి ఉత్తరవేది అనియు, సమస్త దేవతలు ఇందు శ్రేష్ఠంబులగు యాగములు ఆచరించిరనియు, కురురాజు దీనిని దున్నుట వల్ల కురుక్షేత్ర నామము ఏర్పడింది. ఇచ్చోటనే కౌరవ పాండవులకు భారత యుద్ధం జరిగింది.

కర్ణుడు మొదలగువారందరు లోకనాశనమునకే పుట్టినారు. రాజు గుణదోషము వలె అనుచరులకంటును.

ఆ పాండవులు కించిత్తును అపరాధము చేసి యెరుగరు. నీ పుత్రులు దురాత్ములై లోక హాని కలిగించినారు. మీ కుమారులు ఆచరించిన కృత్తి దానివల్లనే యుద్ధంలో మరణించినప్పుడు మరి నీకు ఈ చింత ఏల? ఇకనయినా ప్రశాంత చిత్తుడవై ధృతరాష్ట్రుడు కొంత తేరుకొన్న తరువాత వేదవ్యాసుడు నాయనా! పాండవేయుల వల్ల నీకు కొంచెము కూడా కీడు కలుగదు. దురాశాగ్రస్తులై నీకుమారులందరు వారి సామ్రాజ్యభాగం స్వాధీనం చేసికొన్నందువల్లనే ఇంతటి ప్రజాక్షయం సంభవించినదని నీకు తెలియును గదా! ఈ హేతువు చేతనే ఆ దివ్య రహస్యం వివరించి నీకు కొంత ఊరట కలిగింపవలెనని సంకల్పించుకొన్నాను. మహాబుద్ధిశాలి అయిన నీవు ఈవిధంగా మాటిమాటికి విలపించుటవల్ల, ధర్మరాజుకు ఎంతయినా విషాదం కలగగలదు. సుమా! ధర్మరాజు అత్యంత వినయంతో నిన్ను అనుసరించి సేవించగలడు. కనుక ఇకనయినా నీవు అతనిపై దయయుంచి, అతని భాగ్యమే మీ భాగ్యమని నిశ్చయించి ప్రశాంతుడవై సుఖింతువు గాక! నా హితవు ఆలకించి జరిగిన దాని కోసం మాటి మాటికి విలపించినందువల్ల ప్రయోజనం లేదని గ్రహించి పుత్రశోకం విడిచి పాండవేయులనే నీ కుమారులుగా భావించి, వారి సేవ స్వీకరించి ప్రజల ప్రశంసలు అందుకొందువు గాక! ఓర్పు వహించి సముచిత కర్తవ్యాలు ఆచరించమని హితపూర్వకమైన మాటలను తెలిపి ధృతరాష్ట్రుని ఓదార్చాడు.

### 8.7.2. వేదవ్యాసుడు గాంధారీదేవిని ఓదార్చుట

యుద్ధమృతులను గూర్చి దుఃఖించుచు, గాంధారి పుత్రశోకముతో నుండగా, అపుడు పాండవేయులు శ్రీకృష్ణుని ముందుంచుకొని గాంధారీదేవిని సమీపించి నమస్కరించారు. అయినా ఆ దేవి కొంతైనా శాంతించక కుమారుల

స్మృతి తలచుకొని మిక్కిలి దుఃఖించి కోపంతో ధర్మరాజును శపించవలెనని సంకల్పించినది. అంతలోనే త్రిలోకవేత్త అయిన వ్యాసమహర్షి అచ్చటికి విజయం చేసి శపించవలదు! శపించవలదు! అని గాంధారీదేవిని అడ్డుకొని తత్కాలోచిత సంభాషణతో ఓదారుస్తూ!

సాధ్వీమణీ! పాండవాగ్రణిపై భవదీయ క్రోధావేశం నివారించవలసింది. ఈ భూపతి పరమ ధర్మాత్ముడు. ఇట్టివానిపై నీకు ఈ దురాగ్రహమేల? నీ జ్యేష్ఠకుమారుడు యుద్ధప్రస్థాన సమయంలో విజయార్థమై జీవించవలసిందని నిన్ను అర్థించినప్పుడు నాయనా! ధర్మము ఎచ్చట కలదో అచ్చటనే జయం వర్ధిల్లుగాక! అని నీవు ఆశీర్వదించలేదా? యుద్ధముతో సంపూర్ణ విజయం పొందుటవల్ల పాండవేయులు పరమ ధర్మాత్ములన్న విషయం విస్పష్ట మయినది గదా! అదియును గాక గతించిన దానికై ఆగ్రహించినందువల్ల ప్రయోజనమేమి? ఉన్నది. ఇకనయినా సౌజన్య ధోరణి అవలంభించిన యెడల లోకం నిన్ను అనేక విధాల వినుతించగలదు. ఆపైన నీవు ఎంతో ప్రశాంత చిత్తురాలవని నేను అభినందించగలను. ఇకనైనా ధర్మదృష్టితో పాండవేయులను అనుగ్రహించి లోలోపల చెలరేగుతున్న దురాగ్రహం నిగ్రహించుకోవలసిందని పలికాడు. అప్పుడామె మహాత్మా! పాండవేయుల యెడల నాకు కొంచైనా అసూయలేదు.

> దుర్యోధనాపరాధేన శకునేః సౌబలస్య చ । (స్త్రీ పర్వం)
> కర్ణ దుఃశాసనాభ్యాం చ కృతోఽయం కురుసంక్షయః ॥
>
> నాపరాధ్యతి బీభత్సుః న చ పార్థో వృకోదరః ।
> నకులః సహదేవశ్చ నైవ జాతు యుధిష్ఠిరః ॥ 14-16,17.

దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునుల దుర్మార్గములచేతనే కులక్షయమైనది. పాండవుల తప్పేమియు లేదు.

నాకు పాండు పుత్రులెట్టివారో నీ పుత్రులును నట్టివారే. కాని పాండవులు దీనులై యున్నారని నీకిప్పుడు వారియెడల జాలి కలుగుచున్నది.

కేవలం దుర్భర దుఃఖోద్వేగం వల్లనే నేను ఇలా మాట్లాడినాను. కుంతీదేవి వలె నేను అందరిని సదా ఆదుకొని సంరక్షించవలసిన దానను కానా? పాండవేయుల అధర్మము ఏమాత్రము తలపెట్టక యుద్ధంలో శత్రువులనందరిని నిర్మూలించారు. ఇందువల్ల ఈ విషయమై నాకు కొంతైనా చింతలేదని వ్యాసునకు విన్నవించుకొన్నది.

## 8.8. శాంతిపర్వము

### 8.8.1. వేదవ్యాసుడు ధర్మరాజుకు శంఖలిఖితోపాఖ్యానము తెలియజేయుట

ధర్మరాజు వానప్రస్థ భిక్షువు వలె బ్రతుకవలెనని నిర్ణయించుకొనగా భీమసేనుడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది కర్తవ్యపాలనను ఉపదేశించినప్పటికి తన నిర్ణయాన్ని మార్చుకోకపోవడముతో, వ్యాసులవారు అచటకు వచ్చి నాయనా! యుధిష్ఠిరా! అర్జునుని మాటలు సత్యమైనవి.

> స్వధర్మం చర ధర్మజ్ఞ యథాశాస్త్రం యథావిధి । (శాంతిపర్వం)
> నహి గార్హస్థ్య ముత్సృజ్య తవారణ్యం విధీయతే ॥ 23 -3

ధర్మరాజా! శాస్త్రమును, విధానమును అనుసరించి స్వధర్మమును ఆచరింపుము. గృహస్థ ధర్మమును వదలి సంన్యాసమును గ్రహించుట నీకు విధింపబడినది కాదు.

దేవతలు, పితృదేవతలు, అతిథులు, సేవకులు గృహస్థుని ఆశ్రయించి బ్రతుకుదురు. రాజా! నీవు వారిని భరింపుము. పక్షులు, పశువులు తదితర జీవములో గృహస్థుల చేతనే పోషింపబడుచున్నవి. ఆ కారణముల వల్ల గృహస్థుడు శ్రేష్ఠుడగుచున్నాడు. ఆ గృహస్థ ధర్మమును నీవు ఇపుడు నిర్వహింపుము. తండ్రి తాతల పరంపరగా వచ్చిన రాజ్యమును ధర్మమును నీవు భరింపవలయును. తపము,యజ్ఞము, విద్య, భిక్షమెత్తుకొనుట, ఇంద్రియములను అదుపున పెట్టుకొనుట ధ్యానము ఒంటరితనమును అలవరచుకొనుట, తృప్తి నందుట,

శక్తికొలది జ్ఞానమును సాధించుట అనేది బ్రాహ్మణునకు సిద్ధిని చేకూర్చునవి.

యజ్ఞము, విద్య పనుల యెడ ఉత్సాహము సంపద విషయమున తృప్తి పడకుండుట, దండమును ప్రయోగించుట తీవ్రస్వభావము, ప్రజలను చక్కగాఏలుట, వేదమునెరుగుట,చక్కగా తపమొనరించుట, మిక్కిలి ఎక్కువగా ధనము సంపాదించుట, దానిని యోగ్యునకు దానమొసగుట ఇవి రాజు చేయవలసిన పనులు.

రాజునకు దండనీతిని మించిన ధర్మం మరొక్కటి లేదు. సుద్యుమ్నుడనే రాజు దండనీతిని అనుష్ఠించుట వలననే మోక్షం పొందాడు. అని పలుకుతూ.. ధర్మరాజా! వినుము. బాహుదానదీ తీరంలో ధర్మమార్గ ప్రవర్తనులైన శంఖుడు, లిఖితుడు అనే పేర్లుకల అన్నదమ్ములైన బ్రాహ్మణోత్తములు ఇద్దరు ఉన్నారు. ఒకసారి శంఖుడు ఇంట లేనప్పుడు లిఖితుడు అక్కడికి వెళ్ళి, ఒక చెట్టున ఉన్న ఆరముగ్గిన పళ్ళను చూచి, ముచ్చటపడి కోసికొని తిన్నాడు. అంతలో అక్కడికి వచ్చిన శంఖుడు ఆ పళ్ళెక్కడివి? అని ప్రశ్నించాడు. దానికి లిఖితుడు ఆచమించి, అన్నకు నమస్కరించి, ఇచ్చటివే జవాబిచ్చాడు. దానికి శంఖుడు అనుమతి లేకుండా పళ్ళు కోయవచ్చా? అది దొంగతనం కాదా? పాపం చేసినట్లు నిర్ధారణఅయింది. రాజుచే శిక్షించబడి పాపాన్ని పోగొట్టుకొనుము. అతడు తన తప్పు తెలిసికొన్నవాడై సరేనని సుద్యుమ్నుడనే రాజును కలవటానికి వెళ్ళి రాజద్వారం వద్ద నిలిచాడు. ద్వారపాలకులు రాజుకు తెలియజేశారు. రాజు లిఖితుడున్న చోటికి వచ్చి వినయంగా "మీరిచ్చటికి ఏ ప్రయోజనాన్ని ఆశించి వచ్చారు? మీరు చెప్పినట్లుగా నడుచుకొంటాను. అని ప్రార్థించాడు. అప్పుడా లిఖితుడు రాజుతో...ఓ సుద్యుమ్న రాజా! నేను చెప్పినట్లు చేస్తానని ఒప్పుకొన్నావు. ఇక మాట తప్పటానికి వీలు లేదని మరవవద్దు. అంటూ గట్టిగా చెప్పి, 'నా అన్న అనుమతి లేకుండా, అతడి చెట్టు పళ్ళు కోసికొని తిన్నాను. అట్లా చేయుటం దొంగతనమే. కనుక నన్ను దొంగలను శిక్షించే తీరులో దండించి పాపరహితుడిని

చేయుము. రాజదండన పొందిన వాడికి యమదండన ఉండదని పెద్దలంటారు. అట్లా చేస్తే నీకు దండధారివై కర్తవ్యం నుండి తొలగిన పాపం అంటకుండా ఉంటుంది. ఆ మాటలు విన్న రాజు మనసులో చాలా బాధపడి ఆ విప్రుడిని ప్రార్థించి, బ్రాహ్మణోత్తమా! నన్ను ఈ విధంగా ఆజ్ఞాపించటం మానుము అని వేడుకొన్నా అంగీకరించకపోవటంతో, సుద్యుమ్నుడు ఆ లిఖితుడి చేతులు రెంటినీ ఖండించి శిక్షించాడు. ఆ లిఖితుడు రాజును ఆశీర్వదించి అన్నగారి వద్దకు వెళ్ళి తన తెగిన చేతులు చూపి, చక్కని దండనను అనుభవించానని చెప్పగా, శంఖుడు సంతోషించి, లిఖితుడా! ధర్మమార్గాన్ని ఎవరూ తప్పకూడదు. కనుక ప్రాయశ్చిత్తం అవసరమైనది. నీ వలన మన వంశమంతా ప్రకాశిస్తున్నది. వెళ్ళి బాహుదానదిలోని పుణ్యప్రదమైన నీటిలో దేవతలకు, మునులకు, పితరులకు తర్పణాలిమ్ము.

సురాపానం, గురుపత్నిని కూడటం, బ్రాహ్మణుడిని చంపటం, బ్రాహ్మణుల ధనము దొంగలించటం ఈ నాలుగు లక్షణాలు కలవారితో ఇష్టంతో కలిసి ఉండటం మహాపాతకాలు. ఈ అయిదు మహాపాతకాలలో ఏ ఒక్కటి చేసినా, ఏ వర్ణస్థుడైనా దండించ తగినవాడే. రాజ దండన పొందినవారు పుణ్యాత్ముల వలె పుణ్యలోకాలకే పోతారు. నీవు సుద్యుమ్న మహారాజుచే దండన పొందావు కనుక నీవు పుణ్యాత్ముడివి. అని పలికాడు. అన్న వచనానుసారము లిఖితుడు బాహుదానదిలో మునుగగానే చేతులు మొలిచాయి. ఆశ్చర్యంతో, ఆనందంతో వేగంగా అన్న దగ్గరకు వెళ్ళి అందంగా ఉన్న తన చేతులను చూపించగా, ఆ శంఖుడు తమ్ముడితో నీవు పరిశుద్ధుడవని పరమాత్మకు తెలిసింది. ఈ పుణ్య కార్యాచరణ వలన సుద్యుమ్నుడు కూడా తన పితరులతో పవిత్రుడయ్యాడు. అని పలికి వ్యాసుడు మరల ధర్మరాజా! నీవు కూడా చక్కగా ప్రజలను పాలించుము. కామ, క్రోధ అహంకారములను విడచి చక్కగా పాలించుము. యుద్ధంలో చంపటం, చనిపోవటం, ప్రజలను పాలించటం, ఉచితమైన రీతిలో దండిచటం శ్రేష్ఠమైన రాజధర్మాలు.

మరల వ్యాసుడు రాజధర్మములు ధర్మరాజుకు బోధించినప్పటికి యుద్ధము చేయుటవలన తనవారందరు మరణించారని దుఃఖముతో తన ప్రాణములను వదలుటకు సిద్ధపడిన ధర్మరాజుని వ్యాసుడు వారించెను.

**8. 8. 2. వ్యాసమహర్షి తన త్రైకాలిక జ్ఞానసిద్ధిని గూర్చి తన శిష్యులకు తెలుపుట**

వేదవ్యాసుడు తాను అఖండ తపస్సు చేసి త్రైకాలిక జ్ఞానమును పొందినట్లు తన శిష్యులతో...

**పరాశరసుత శ్రీమాన్ వ్యాసో వాక్యమథాఽబ్రవీత్ ।** (శాంతిపర్వం)
**మయా హి సుమహత్తప్తం తపః పరమదారుణమ్ ॥**
**భూతం భవ్యం భవిష్యం చ జానీయామితి సత్తమాః ।**
**తస్య మే తప్తతపసో నిగృహీతేన్ద్రియస్య చ ॥**
**నారాయణ ప్రసాదేన క్షీరోద స్యానుకూలతః ।**
**త్రైకాలికమిదం జ్ఞానం ప్రాదుర్భూతం యథేప్సితమ్ ॥**
**తచ్ఛృణుధ్వం యథాన్యాయం హి వక్ష్యే సంశయముత్తమమ్ ।**
**యథావృత్తం హి కల్పాదౌ దృష్టం మే జ్ఞాన చక్షుషా ॥**
(340 – 25,26,27,28)

నేను భూత భవిష్యద్వర్తమాన వృత్తాంతములను తెలిసికొనుటకై దారుణ తపస్సు చేయగా, నారాయణానుగ్రహము వలన త్రైకాలిక జ్ఞానము కోరినట్లు ప్రాప్తించింది. కల్పాదియందేమి జరిగినదో దివ్యదృష్టికి గోచరించింది.

**8. 9. అనుశాసనికపర్వము**

**8. 9. 1. వేదవ్యాసుడు కీటకమునకు ఉత్తమజన్మమును ప్రసాదించుట**

ధర్మరాజు అంపశయ్యపై పడియున్న భీష్ముని సమీపించి పితామహా! యుద్ధరంగమున మృతులయినవారికి ఎట్టి గతి కలుగునో నాకు తెలియజేయుము. జీవిత మరణాలు అత్యంత సుఖదుఃఖ ప్రదాలని ప్రాణికోటి భావిస్తుంది. అయినా అనేకులు యుద్ధరంగంలో తమ ప్రాణాలు తృణప్రాయంగా పరిత్యజించారు.

ఇందువల్లనే నాకు ఈవిధమయిన జిజ్ఞాస కలిగింది. కరుణించి నాసందేహము తొలగించవలసిందని అభ్యర్థించాడు.

అప్పుడు భీష్ముడు ధర్మరాజు మాటలను విని నీవు అడిగిన ప్రశ్న సముచితమే. అయితే కీటక వేదవ్యాస మునీంద్రుల మధ్య జరిగిన వృత్తాంతం విన్న యెడల తప్పక నీకు సందేహము తొలగునని పలికెను. ఆ వృత్తాంతమును ఇట్లు తెలియజేశాడు.

వేదవ్యాసుడు ఒకప్పుడు మార్గమధ్యమున వెళుతుండగా ఒక కీటకము తొందరగా పరుగెత్తుట చూచి దానిని భయకారణమేమని ప్రశ్నించాడు. అంత ఆ కీటకము అయ్యా! ఈ మార్గమధ్యమున వచ్చు బండ్లు, ఆ బండియెడ్లను అదలించువారి కేకలు విని బండి చక్రముల మధ్యపడి చనిపోవుదునని భయమున పారిపోవుచున్నానని పలికింది. అంత అతడు నీవు నికృష్ట కీటకమువు గదా! నీ జన్మము దుఃఖమయము. అది తొలగుటకు నీకు మరణము శ్రేయమే గదా! అని చెప్పాడు.

అంతట ఆ కీటకము మహాత్మా! పురుగులు అన్నిటికి ఇంద్రియ సౌఖ్యమే లేదన్నట్లు చెప్తున్నారు. కాని తమ తమ మార్గాలలో ఇంద్రియ సుఖాలు అనుభవిస్తూనే ఉన్నవి. కనుకనే మృత్యువు మాట స్మరించగానే నాకు ఇంతట భీతి కలుగుతున్నది. నాచే మాటాడించవలెనన్న ఉత్సాహం వల్లనే నీవు ఈవిధంగా ప్రశ్నించి ఉండవచ్చును. అంతేకాని నీకు తెలియనిదేమున్నది.

ఇక నా పూర్వజన్మ వృత్తాంతం నివేదిస్తున్నాను. దయయుంచి వినవలసినది. మహాత్మా! నేను పూర్వ జన్మమున నేనొక శూద్రుడను. ఐశ్వర్యవంతుడను.అయితే మిక్కిలి లోభావేశంతో అన్యుల ధనరాసులను అపహరించాను.అనేక దుర్గుణాలతో కన్నూమిన్నూగానక యథేచ్ఛగా విహరించాను. అయితే మా అమ్మగారును మాత్రము ఎల్లప్పుడు గౌరవముతో ఆరాధించుచున్నాను. బ్రాహ్మణ మాత్రుడు ఒకప్పుడు అతిథిగా విచ్చేసినపుడు

ఆతనికి అపూర్వభక్తితో పూజలు ఆచరించాను. అందువల్లనే నాకీ పూర్వజన్మజ్ఞానం కలిగింది. సత్కర్మవల్ల మంచి ఫలితం కలగగలదని నాకిప్పుడు అవగత మయింది. కనుక కరుణించి పుణ్య కృత్యాల ఆచరణ విశేషాలు ఉపదేశించ వలసినది. నాకు ఇంతకన్న అభిలషించదగినది ఏదీ లేదు.

అంతట వేదవ్యాసుడు కీటకమా! ప్రత్యేకించి నీకిప్పుడు చెప్పవలసిన దేమున్నది. దుష్కర్మలు ఆచరించినందువల్ల పురుగు పుట్టుక సంప్రాప్తించినదని గ్రహించుకొన్నావు. ఇదేవిధంగా సత్కార్యాచరణం వల్ల పూర్వజన్మ సంస్కృతి కలిగినదని గ్రహించుకొన్నావు. ఇది అకళించుకొన్నందువల్లనే నీతో సంభాషణకు ఉపక్రమించాను. ఇక నా అపార తపశ్శక్తి మహిమ వల్ల భవదీయ కీటకత్వం తొలగించగలను. ఈ విషయమై నీవు ఏ మాత్రము దుఃఖించనక్కరలేదు. తపోబలం కన్న మరి మహనీయమైనది ఏదీ లేదు. క్రమక్రమంగా మానవజన్మ స్వీకరించి పుణ్యకర్మలు ఆచరించవలెనని సంకల్పించుకొన్నావు. ఇది నీకు ఎంతో శుభదాయకము. కర్మ భూమిలో ఆచరించిన పుణ్యాపాపకృత్యాల వల్లనే మానవులకు ఉత్తమ అధమ జన్మలయిన దేవతల కీటకత్వాదులు సంప్రాప్తిస్తున్నవి. అటువంటి సుకృత విశేషం వల్లనే నీకు పూర్వజన్మ స్మృతితో బాటు ఆ సందర్శనభాగ్యం సంప్రాప్తించింది. నీకిక అనతికాలంలోనే సమున్నత స్థితి నీచ శూద్ర వైశ్య క్షత్రియ బ్రాహ్మణ జన్మలు ఉత్తర కాలంలో సంప్రాప్తించగలవు. వాటిని నీవు వెనుకటి జన్మలను గూర్చి తెలుసుకొని ధర్మమార్గమున సంచరింపగలవు.

ఆ ప్రకారంగా హితవు ఉపదేశించిన పిదప వ్యాసుడు అమృతమయమైన క్రీగంటిచూపు ఆ కీటకంపై ప్రసరింపజేసి 'శుభం భూయాత్' అని ఆశీర్వదించాడు. ఆ సమయమున లోకంలో గల ప్రాణులన్నీ ఆ మహాత్ముని భూతదయకు సంతోషించి వేదవ్యాసున్ని కీర్తించినవి. అంతట కీటకం భక్తితో ఆముని పాదపద్మములపై శిరస్సు వుంచి నమస్కరించింది. వేదవ్యాసుడు ఆ కీటకమును

అనుగ్రహించి అదృశ్యుడయ్యాడు.

ఆ పురుగు అంతట ఉత్తరోత్తర జన్మలలో ఆ వేదవ్యాసుని మాటలను శిరసావహించి అనేక పుణ్యకర్మలు ఆచరించి భూపాలకుడైనాడు.

అటుపిమ్మట ఒకనాడు ఆ రాజు పరివారముతో వేదవ్యాసుని ఆశ్రమంలో ప్రవేశించి, ఆ ముని పాదపద్మములకు నమస్కరించాడు. అంతట వేదవ్యాసుడు రాజుతో పురుషోత్తమా! ఇక ఈ జన్మలో మునీంద్రులకే పరమ ఆశ్చర్యం కలిగించగల మహనీయ తపశ్చర్యకు ఉపక్రమించిన నీకు అధికమయిన నిర్మలత్వం సంప్రాప్తించగలదు. ఆ విధంగా నిర్మలత్వం సిద్ధించిన యెడల ఉత్తర జన్మలో తప్పక బ్రాహ్మణత్వం సంప్రాప్తించగలదని ఆదేశించి సముచిత మాటలతో పలికి ఆశీర్వదించి పంపాడు.

అంతట ఆ రాజు వేదవ్యాసుని వచనానుసారం ఆచరించగా, ఆ రాజు మరు జన్మమున నద్విజుడై పుట్టి పుణ్యతీర్థయాత్రావరుడై బహు యజ్ఞములొనరించి, కీర్తిని పొంది తుదకు దేవత్వమును పొంది యింద్రునకు ప్రియసఖుడై విలసిల్లాడు. వ్యాసమహర్షి కారుణికత్వ మంతటిది. అతని కృపాకటాక్ష శక్తి యంతటిదని భీష్ముడు ధర్మరాజుకు తెలియజేశాడు.

### 8.9.2 వేదవ్యాస మైత్రేయ సంవాదము

ధర్మరాజు, అంపశయ్యపై పడియుండిన భీష్ముని సమీపించి,

పితామహా! విద్యా తపోదానాలలో అత్యుత్తమయినదేదో నాకు తెలియపరచుము అని అభ్యర్థించగా ధర్మరాజు మాటలు వినిన భీష్ముడు ధర్మజా! వ్యాస మైత్రేయ సంవాదము పునీత గాథ వినిన యెడల నీ సంశయం తప్పక తొలగిపోగలదు. శ్రద్ధతో వినుము అని పలికి ధర్మజా! వ్యాసమహర్షి ఒకప్పుడు వారణాసీ నగరమునకు వెళ్ళి మైత్రేయమహర్షిని సందర్శించాడు. ఆ మహనీయ తపశ్శాలి వ్యాసమహర్షిని చూడగానే భక్తితో ఎదురుగాపోయి, అర్ఘ్యపాద్యాదులు

అర్పించి, పంచభక్ష్య పరమాన్న భోజనంతో సంతృప్తి కలిగించాడు మైత్రేయుడు.

పిమ్మట మైత్రేయమహర్షి వేదవ్యాసులను చూచి మహాత్మా! మీ ముఖ భంగిమలో ఇంతటి అపూర్వ వికాసానికి ఏమి హేతువో నాకు అనతీయవలసినది అని అభ్యర్థించాడు. ఆ మాటలను విని వ్యాసులవారు నవ్వుతూ అతని సందేహం నివారించాడు.

మైత్రేయ మునీంద్రా! తపశ్చర్య వేదాధ్యయనము ఆదిగా గల ధర్మాలు అన్నిటిలో దానం శ్రేష్ఠమని ధర్మజ్ఞులు ఉపదేశిస్తున్నారు. వితరణానికి ఉచితములయిన వస్తువులు అన్నింటిలో అన్నము ప్రశస్తము. అది ప్రాణాధార కనుకనే దానికి అట్టి ఉత్తమత ఏర్పడింది. తపస్సు మనస్సులో గల కల్మషాలు అన్నిటిని నిశ్శేషంగా నిర్మూలిస్తుంది. అయితే విజ్ఞాన స్వరూపమయిన విద్య దానికి అపూర్వమయిన ఆధిక్యం కలిగిస్తుంది. అదిన్నీగాక విజ్ఞాన దీపం వల్ల పరమేశ్వరుని సాక్షాత్కార భాగ్యం లభిస్తుంది. కనుక తపోదానం కన్న విద్యాదానమే ఒకింత అత్యధికమని ఆర్యులసూక్తి.

## 8.10. అశ్వమేధపర్వము

### 8.10.1. వేదవ్యాసుడు అశ్వమేధయాగం చేయమని ధర్మరాజును ప్రోత్సహించుట

ధర్మరాజు పితామహునికి భక్తితో తిలోదకాలు అర్పించి గంగాతీరం చేరుకొన్న పిమ్మట ధర్మరాజు దుఃఖితుడు కాగా, వేదవ్యాసుడు ధర్మరాజును ఓదార్చి ధర్మజా!

> విద్యతే ద్రవిణం పార్థ గిరౌ హిమవతి స్థిరం ।
> ఉత్సృష్టం బ్రాహ్మణై ర్యజ్ఞే మరుత్తస్య మహాత్మనః ॥
> తదానయస్వ కౌంతేయ పర్యాప్తం తద్భవిష్యతి । 13 -21,22

ఓ ధర్మజా! హిమవత్పర్వతమున విశేషమగు ధనము కలదు. మరుత్తుడను మహారాజు యజ్ఞమునందు దానంగా ఈయబడిన ధనమును

బ్రాహ్మణులక్కడ విడిచిపెట్టారు. దానిని తీసుకొనిరమ్ము. నీయజ్ఞమునకు సరిపోవును.

ఇన్నాళ్లనుండి మేము నీకు ఉపదేశించిన హితవులన్నీ కేవలం వరదపాలపోయినవా! ఇంతవరకు నీలో సమ్యగ్వివేచన ప్రాదుర్భవించ లేదు. ఇందువల్లనే నీవు ఈవిధంగా మాట్లాడుతున్నావు. కార్యనిర్వహణలో మానవునికి ఏమాత్రము కర్తృత్వం లేదు. నరుడు ఆ పరమేశ్వర ఆజ్ఞవల్లనే సుకృత దుష్కృత్యాలు ఆచరిస్తున్నాడు. అయినా నీహృదయంలో పాతిత్యశంక తొలగకపోయిన యెడల యాజ్ఞయాగాల సమ్యగాచరణలతో అది నిశ్శేషంగా నిర్మూలించుకోవచ్చును గదా! అశ్వమేధయాగం భూరి దక్షిణలతో యథావిధిగా నిర్వర్తించవలసింది. అంతటితో నీ మనస్తాపం యావత్తు తప్పక నిర్మూలమై పోగలదని హితవు ఉపదేశించాడు.

ఆ మాటలు వినిన ధర్మరాజు అశ్వమేధయాగమునకు కావలసిన ధనం నాదగ్గర లేదు. మరి కర్తవ్యమేమో నాకు అవగాహన లేదు. కనుక కరుణించి నాకు ఈతరుణంలో తగిన హితవు ఉపదేశించవలసినదని అడిగాడు. అపుడు వేదవ్యాసుడు ఆ మాటలను విని, కొంతసేపు ఆలోచించి ధర్మరాజుతో ధర్మరాజా! పూర్వకాలంలో మరుత్తుదన్న భూపతి మహనీయమైన యజ్ఞ మొకటి యథావిధిగా నిర్వర్తించి అవనీసురులకు అత్యధిక ధనరాసులు అర్పించాడు. వారికి అవి మిక్కిలి ఎక్కువైనవి. ఆ భూసురులు అంతట తాము స్వీకరించగా శేషించిన ధనమంతయు ఒకచోట నిక్షేపించి ఈనిధి ఎవ్వరయినా కనుగొని స్వాధీనం చేసుకొన్న యెడల అది వారి సొత్తే కాగలదని ఏకగ్రీవంగా నిర్ణయించారు. నీవు యిక ఆ మహనీయ నిధానం చేజిక్కుంచుకొని యథేచ్ఛగా, వినియోగించ వలసిందని పలికాడు.

ఆ ప్రకారంగా వేదవ్యాసుడు హితోపదేశం చేయగా ఆ ధర్మరాజు వ్యాసుని పాదములకు నమస్కరించి మహాత్మా! తాము ఉపదేశించిన నిక్షేప ప్రదేశమునకు

చేరుకొని, సువర్ణరాశి యావత్తు స్వాధీనం చేసుకొనగలను. కరుణించి అప్పుడు ఇంకొక మారు అచ్చటికి విచ్చేయవలసినది. ఎందుకంటే ఆ పర్వత పరిసర సందర్శన సమయంలో మీ రక్షణ నాకు అత్యావశ్యకము. అని ప్రార్థించి అనుమతి తీసుకొని హస్తినాపురమునకు బయలుదేరారు.

ఒకనాడు హస్తినాపురములో అభిమన్యుని గూర్చి ప్రసంగం రాగా అంతలోనే ఉత్తర బోరుబోరున విలపించగా, ఆ ఉత్తర దుర్భర వేదన గమనించి పాండవులు కూడా దుఃఖితులు కాగా ఆ తరుణంలో వేదవ్యాసమహర్షి అచటికి వచ్చి వారిని మంచి మాటలతో ఓదార్చి అశ్వమేధ యాగం విషయం ప్రస్తావించి అది సత్వరమే నెరవేర్చవలసినదని ఆదేశించి అంతర్హితుడయ్యాడు.

### 8.10.2. వేదవ్యాసుని అనుగ్రహముతో హిమగిరి ప్రాంతమున ధర్మరాజు నిధిని పొందుట

ఆ మునీంద్రుని వచనానుసారం ధర్మరాజు తనసోదరులతో, చతురంగబలాలతో, పురోహితుడై ధౌమ్యమహర్షిని ముందుంచుకొని హిమగిరిని అధిరోహించాడు. అపుడు వ్యాసులవారు పాండవుల యెదుట ప్రత్యక్షము కాగా వారు ఆమునికి నమస్కరించి మహాత్మా! అనంతరం కర్తవ్యమేమో ఆజ్ఞాపించవలసిందని అభ్యర్థించారు. అంతట ఆ మహర్షి ధర్మరాజా! నేటి రాత్రి నియమనిష్ఠలతో దర్భాస్తరణాలపై శయనించిన పిమ్మట రేపు మీరందరు పరమశివ పూజలు ఆచరించవలసియున్నదని వారికి ఆదేశించాడు. పాండవేయులు ఆ ముని మాటలను శిరసావహించి భక్తితో పరమశివ పూజలు చేశారు.

పిమ్మట ధర్మరాజు పారాశర్య ధౌమ్యమహర్షులను ముందుంచుకొని సోదరులతో, పరివారంతో హిరణ్య నిధి ఉన్న స్థలం చేరుకొని ఎర్రని పూలు, గంధం, అక్షంతలు, అపుపాలు, మాంసం ఆదిగాగల పదార్థాలతో ఆయా భుజాతాల కన్నింటికి సంపూర్ణ సంతృప్తి కలిగించి, ధర్మరాజును త్రవ్వమని

ఆదేశించగా, అంతట అచట త్రవ్వగా అపార హిరణ్యరాశి బయల్పడింది.

ఆ విధంగా నిధి సాధించి అది తమకు అర్పించిన వ్యాస మునీంద్రునకు సాష్టాంగ నమస్కారము చేసి, లేచి అంజలిఘటించగా, ఆ మునీంద్రుడు ధర్మరాజు భక్తికి ఎంతో సంతోషించి ధర్మరాజును కౌగిలించుకొని, ఆదరించి సముచిత మాటలు పలికి అంతర్హితుడయ్యాడు.

## 8.10.3. వేదవ్యాసుని సమక్షమున ధర్మరాజు అశ్వమేధ యాగము చేయుట

శ్రీకృష్ణుడు పరీక్షిత్తుని పునరుజ్జీవుని చేయగా అప్పుడు వేదవ్యాసుడు అచటకురాగా ధర్మరాజు శ్రీకృష్ణాది బాంధవులతోబాటు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులతో పూజించి మహాత్మా! నీ అపూర్వానుగ్రహం వల్లనే మేమీ అపారసంపదను సంపాదించుకొన్నాము. దానితో అశ్వమేధ యజ్ఞం యథావిధిగా నిర్వర్తించవలెనని సంకల్పించుకొన్నాము. కరుణించి అనుమతి దయచేయ వలసిందని విన్నవించాడు.

వేదవ్యాసుడు సంతోషముతో ధర్మరాజా! అశ్వమేధయాగం సమస్త పాతకాలను నిమేషకాలంలో నిర్దహిస్తుంది. నీవు అది భూరిదక్షిణలతో సాంగోపాంగంగా నిర్వర్తించి ధన్యుడవై ఇహ పరలోక సౌఖ్యసంపదలు అందుకొందువు గాక! అని అనుమతించాడు. అంతట ధర్మరాజు సంతోషముతో మహాత్మా! కరుణించి అశ్వమేధ యాగదీక్షకు అనువయిన శుభముహూర్తం నిర్ణయించవలసిందని వేడుకొన్నాడు. వేదవ్యాసుడు అంతట పైల, యాజ్ఞవల్క్యమునీంద్రులను ఇరువురిని పిలిచి ధర్మరాజుతో ధర్మరాజా! వారు నేను చైత్ర పౌర్ణమినాడు అశ్వమేధయాగానికి అనువయిన క్రియలు నిర్వర్తించగలము. నీవు ఇప్పుడు పవిత్రమైన అశ్వరాజ పరిశీలనకై విజ్ఞులయిన వారిని వినియోగించవలెను. ఆ అశ్వము అంతటా పర్యటించి నీకీర్తి నలువైపుల వ్యాపింప చేయగలదు. సత్వరమే సర్వసంబరాలు సిద్ధము చేయవలెను. బంగారుతో స్రుక్కు స్రువము ఆదిగా గల యజ్ఞ సాధనలన్నీ నిర్మింపజేయించ

వలసిందని ఆజ్ఞాపించాడు.

అంతట ధర్మరాజు కొన్ని రోజులలోనే యాగమునకు కావలసిన వాటిసన్నిటినీ సిద్ధం చేయించి వేదవ్యాసునకు అర్పించగా అశ్వమును యథావిధిగా సర్వదేశ సంచారానికై పంపించవలసిందని ఆజ్ఞాపించాడు. అంతట ధర్మరాజు వేదవ్యాసునితో మునీంద్రా! అశ్వ సంరక్షణకు అర్హుడెవ్వరో ఆనతీయవలసిందని అడుగగా, అప్పుడు వేదవ్యాసుడు : ధర్మరాజా! గాండీవి అసంఖ్యాక దివ్యాస్త్రవేత్త, అఖిలోక ధైర్యశాలి. అతడు కాక అశ్వ సంరక్షణకు అర్హులెవరున్నారు? అని చెప్పగా, ధర్మరాజు అర్జునుని ఆహ్వానింపజేసి, అర్జునా! దేశదేశాలలో సంచరించదలచిన అశ్వమేధమును అనుక్షణము మిక్కిలి జాగరూకతతో సంరక్షింపవలసిందని చెప్పాడు.

శుభముహూర్తమున వేదవ్యాసుడు యథావిధిగా విడిచిపెట్టిన అశ్వమేధ యాగ అశ్వమును పృథివీ సంచారానికై విడిచాడు. అర్జునుడు ఆ తరుణంలో ధర్మరాజు అనుమతి పొంది దానిని అనుసరించాడు. అలా అనుసరించిన అర్జునుడు త్రిగర్త దేశాధీశులను, సింధు దేశాధిపతిని, బభ్రువాహనుని, గాంధారాధిపతిని జయించాడు. యజ్ఞాశ్వము తిరిగివచ్చిన పిమ్మట, వేదవ్యాసుడు ధర్మరాజు సన్నిధికి పోయి ధర్మరాజా! యాజకులు యాగ ప్రారంభానికనువయిన శుభముహూర్తం సమీపిస్తున్నదని చెప్తున్నారు. నీ యజ్ఞం మహనీయము. ఇక నీకు సమస్త మంగళాలు సమకూరగలవు. అని తత్కాల సముచిత కర్తవ్యం నిర్దేశించాడు.

ధర్మరాజు, ఆ వేదవ్యాసుని వచనానుసారం అశ్వమేధయాగమును సాంగోపాంగంగా యథావిధిగా నిర్వహించాడు. ప్రవర్గ్యము, సవనము ఆదిగా గల అశ్వమేధ క్రతువు ఉపాంగ యజ్ఞాలన్నీ ఏవిధమయిన కొరతలేక యథావిధిగా నెరవేరినవి.

ఆ మహాశ్వమేధ నిర్వహణ సమయంలో పంచ భక్ష్య పరమాన్నాదులు

యథేచ్ఛగా భుజించి సంతృప్తి పొందనివాడు ఒక్కడు కానరాలేదు. వేదపండితులకు, బ్రాహ్మణోత్తములకు సంతృప్తిగా దానధర్మాలు చేశారు. వేదవ్యాసుడు ఆ ప్రకారంగా ధర్మరాజుచే అశ్వమేధం సాంగోపాంగంగా పరిసమాప్తం చేయించి గంభీర స్వరంతో మహాశీర్వచన పరంపరలు అనుగ్రహించాడు. ఆపైన మునీంద్రులే గాక, బ్రాహ్మణులందరు ఆ ధర్మరాజుకు వేదోక్త పరమాశీర్వచనాలు అనుగ్రహించారు.

> **తతో యుధిష్ఠిరః ప్రాదాద్బ్రాహ్మణేభ్యో యథావిధి ।** (అశ్వమేధపర్వం)
> **కోటిస్సహస్రం నిష్కాణాం వ్యాసాయ తు వసుంధరాం ॥**

అంతట ధర్మరాజు బ్రాహ్మణులకు వేయికోట్ల బంగారు కాసులను వ్యాసునకు భూమండలమును దక్షిణగా సమర్పించాడు.

ఋత్విక్ వరేణ్యుడైన ఆ పరమ తపోనిధి అది స్వీకరించి అమందానంద భరితుడై ధర్మరాజా! ఋత్విజుడను అయిన మాకు నీవు ఈ ఇల సర్వము సంపూర్ణ దక్షిణగా సమర్పించావు. ఆహా ఏమి నీ ఔదార్యము. కాని ధర్మరాజా! ఈ ధరణికి అంతటికి వెలకట్టి తగినంత బంగారు రాశి మాకు అర్పించవలసిందని హితవు ఉపదేశించాడు. దానికి ధర్మరాజు అంగీకరించి కోటికోట్ల మాడలొక పెద్ద కుప్పగా పోయించి అది భూమి వెల అని చెప్పి ఆ దివ్య తపోనిధికి అర్పించాడు. అయితే ఆ వేదసంరక్షకుడు ఆ విత్తం యావత్తు వెనువెంటనే ఋత్విజులకు అందరికి ప్రసాదించాడు. తనకు భాగంగా లభించిన హిరణ్యం యావత్తు వేదవ్యాసుడు కుంతీదేవికి ప్రసాదించాడు. అయితే ఆ సాధ్వి అది వెనువెంటనే బ్రాహ్మణులకు ఉదక పూర్వకంగా సమర్పించింది.

యాగం చివరగా ధర్మరాజు సమస్త బాంధవులతో కలిసి అవభృథస్నానం ముగించుకొని వేదవ్యాసునకు సాష్టాంగ ప్రణామములాచరించి, వేవిధాల వినుతించగా, సగౌరవ ప్రసంగంతో వీడ్కొన్న పిదప శిష్య సమూహముతో బాటు ఆ మునీంద్రుడు అంతర్హితుడయ్యాడు.

## 8.11. ఆశ్రమవాసపర్వము

### 8.11.1. గాంధారి ధృతరాష్ట్రుల తపశ్చర్యకు వేదవ్యాస ధర్మరాజులు అనుమతించుట

గాంధారీ ధృతరాష్ట్రులు తమ శేష జీవితాన్ని వనంలో గడపడానికి నిశ్చయించుకొన్నారు. అప్పుడు ధర్మనందనునకు ఎంతయో దుఃఖం కలిగింది. వారితో ధర్మరాజును వనవాసం చేయడానికి సన్నద్ధుడయ్యాడు. అప్పుడు వ్యాసుడు వచ్చి అతికష్టంమీద ధర్మారాజు వనవాస ప్రయత్నాన్ని విరమింపజేసి, ధర్మరాజుతో - ధర్మరాజా! ధృతరాష్ట్రుడు ఆదేశించినట్లు ఆచరించవలసింది. కుమారులందరు మరణించిన ఈ ధృతరాష్ట్రునికి తపశ్చర్యా సంకల్పం కలిగినప్పుడు ఇందులో వింత ఏమి ఉన్నది? గాంధారి ఇన్నాళ్ళు నుండి ఎడ తెగని ఓరిమితో తన లోలోపలి మనోవేదన నిగ్రహించుకొంది. ఇప్పటినుండి ఈ సాధ్వికి ఇక తపశ్చర్యకు ఉపక్రమించవలెనన్న సంకల్పం కలిగింది. మారు మాటడక అరణ్యగమనానికై వీరి అనుమతి అనుగ్రహించవలసింది. నీకు ఈవిధంగా హితవు ఉపదేశించవలెనన్న సంకల్పంతోనే నేను ఇచ్చటికి చేరుకొన్నాను. అని చెప్పగా ధర్మరాజు ఆ మునీంద్రుని మాటలు విని, మునీంద్రా! మాకందరికి పరమాచార్యుడవయినా, ధర్మోపదేష్టవయినా, పరమ దైవతమయినా నీవు ఒక్కడివే కదా! నీహితోపదేశం నేను కాదనగలనా? అని పలికాడు.

అప్పుడు వేదవ్యాసుడు ధర్మరాజా! రణమరణమో, ధృఢ సమాధితో ప్రాణ పరిత్యాగమో, తక్క రాజుకు ఇక వేరొక పరమోత్తమ ధర్మము ఏమి ఉన్నది. వార్ధక్య భారంతో, దారుణ రోగ దుఃఖంతో శయ్యపై ప్రాణపరిత్యాగం సముచితమా? అని ప్రశ్నించగా, అంతట ధర్మరాజు వారి వన ప్రవేశానికి అంగీకరిస్తున్నానని తన అనుమతి వెల్లడించాడు. పిదప వేదవ్యాసుడు అంతర్హితుడై స్వకీయ తపోవనంలో ప్రవేశించాడు.

**8.11.2. వేదవ్యాసుడు ధృతరాష్ట్రుని కుశల ప్రశ్నలడుగుట**

గాంధారీ ధృతరాష్ట్రులు మరియు కుంతీదేవి ఆశ్రమవాస జీవనాన్ని గడుపుచుండగా, ధర్మరాజాదులు కూడ సపరివారముగా సేనలతోవెళ్లి ఆ వనమందే నివసించియున్నప్పుడు, వ్యాసమహర్షి అచట ప్రత్యక్షముకాగా, తత్క్షణంలో ధృతరాష్ట్రుడు ధర్మరాజాదులు మునీంద్రులతో పాటు ఆ తపోనిధికి ఎదురుగా పోయి భక్తి ప్రపత్తులతో అర్ఘ్యపాద్యాదులు అర్పించి నమస్కరించారు.

పిమ్మట వేదవ్యాసుడు ధృతరాష్ట్రుని చూచి నాయనా!

**ధృతరాష్ట్ర మహాబాహో. కచ్చిత్తే వర్తతే తపః ।**
**కచ్చిన్మనస్తే ప్రీణాతి వనవాసే నరాధిప ॥** (ఆశ్రమవాసపర్వము)
**కచ్చి ద్ధృది న తే శోకో రాజన్ పుత్ర వినాశజః ।**
**సంశయచ్ఛేదనార్థాయ ప్రాప్తం మాం విద్ధి పుత్రక ॥**

ధృతరాష్ట్రా! నీకు తపస్సు జరుగుచున్నదా? వనవాస నియమం క్రమక్రమంగా నీకు అలవడుతున్నదా? పుత్ర వినాశన దుఃఖం లోలోపల నిరంతరం దహనజ్వాలవలె వేధించడం లేదు గదా! నేను సంశయ విచ్ఛేదము చేయుటకు వచ్చితినని తెలిసికొనుము.

కుంతీదేవి మీకు అనుదినము ఎనలేని గౌరవంతో పరిచర్యలు ఆచరిస్తున్నదా? మీరు అడవులలో నివసిస్తున్నప్పుడు తాను యిక సామ్రాజ్య భోగాల అనుభవించరాదని నిశ్చయించి వెనువెంటనే అనుసరించింది. ఆ సాధ్వి మంగళ సంకల్పంలో గల ఘనత ఎట్టిదో గుర్తించుకొన్నావా? ఇప్పటికయినా పంచపాండవులను అపూర్వ వాత్సల్యంతో ఆదరిస్తున్నావా? హృదయాంతరాళం నిష్కలమయినదా? విదురుడు దేహం విసర్జించిన తీరు అవగాహన చేసుకొన్నావా? అని అడుగగా ధృతరాష్ట్రుడు ఆ మాటలను విని పరిపూర్ణ భక్తి భావంతో వేదవ్యాస మునీంద్రా! అరణ్యవాసం వల్ల నాకు ఏమాత్రం శ్రమకలగలేదు. పాండవులు శుశ్రూష వల్ల నాకు గాని, గాంధారికి గాని

కొంతయినా పుత్రులను గూర్చి నాకు చింత కలగలేదు. పాండవుల పట్ల నాకు ఎంతో వాత్సల్యం కలిగింది. ఆర్యా! భవదీయ అనుగ్రహం వల్ల మనస్సు నిర్మలంగా ఉంది. ఇంతకంటె నాకు కావలసినదేమున్నది?

అంతలోనే ద్రౌపదీదేవి, సుభద్ర ఆదిగా గల అంతఃపుర స్త్రీలు కొందరు ఆ వేదవ్యాసుని సమీపించి భక్తితో నమస్కరించారు. అంతట ధృతరాష్ట్రుని చూచి నాయనా! అంధులయిన మీ ఉభయుల హృదయాలలో గల దురంత చింత నిర్మూలించవలెనన్న సంకల్పంతో నేనిచటికి చేరుకొన్నాను. ఇక ఏ మాత్రము సందేహించక మీ కోరిక తెలియజేయవలసిందని పలుకగా, అంతట ధృతరాష్ట్రుడు సంతోషముతో ఇట్లు పలికెను. మహాత్మా! భవదీయాగమనమే మహా మంగళకరము. నాకు ఇంత కన్నా కోరుకోదగిన వేరొక శుభమేమి ఉన్నది. మీరు ఆదేశించినందువల్ల నా లోలోపలి కోరిక తెలియజేయుచున్నాను. దుష్టుడైన పుత్రుడు దుర్యోధనుడు పాండుకుమారులను అనేకవిధాల పరాభవించాడు. అంతేకాదు యుద్ధరంగంలో భీష్మద్రోణ కర్ణాది మహామహులు అందరిని పోగొట్టుకోవడమే గాక, రాజుల మరణానికి, కారకుడయ్యాడు. అనేకమంది రాజులు యుద్ధరంగంలో పోరాడి పరలోకం చేరుకొన్నారు. అయితే వారికి ఎట్టి గతులు సంప్రాప్తించినవో, కౌరవ కుమారులు ఏమయినారో అన్నటువంటి చింతమాత్రం నన్ను అనుక్షణము వేదిస్తున్నది. కరుణించి నా యీ దురంత వేదన తొలగించవలసిందని ప్రార్థించాడు.

పిమ్మట 'గాంధారి వేదవ్యాసునికి నమస్కరిస్తూ మునీంద్రా! నా కుమారులు అందరు యుద్ధభూమిలో మరణించి ఇప్పటికి పదియారు సం॥లు గడచినను శాంతి కలుగలేదు. పుత్రశోకముతో నిట్టూర్పులు విడుచుచూ నిద్రించుట లేదు. నీవు తపోబలమున లోకాంతరములను సృష్టింప సమర్థుడవు. ఆయా లోకాలలో నివసిస్తున్న మా సుతులను అందరిని నీవు ఒకే క్షణంలో సాక్షాత్కరింప జేయగలవు. కుంతీదేవి, ద్రౌపది, సుభద్ర, కౌరవకుమారుల నూరుగురు పత్నులు ఆదిగా గలవారు ఇదేవిధంగా తమ ఆత్మీయుల సందర్శనమే

కోరినారు. కనుక మృతులనందరిని నీవు ఒకమారు సాక్షాత్కరింపజేసి మా చింతను తొలగించమని ప్రార్థించింది.

**8.11.3. వేదవ్యాసుడు కుంతీదేవికి కర్ణజననము దోషావహము కాదని చెప్పుట**

పిమ్మట కుంతీదేవి, వేదవ్యాసునితో మహాత్మా! ఇతఃపూర్వము దుర్వాస మహర్షి సేవ వల్ల, అతనినుండి మంత్రోపదేశము పొంది తాను కన్యకగా నున్నపుడే ఆ మంత్రము పరీక్షించదలచి సూర్యుని ఉపాసించితిని. సూర్యుని అనుగ్రహంతో ఒక కుమారుడు జన్మించాడు. బంధువులెవ్వరికి తెలియకుండా ఒక తొట్టిలోవుంచి నీటిలో విడిచాను. ఆనాటినుండి తలచుకొన్నప్పుడల్లా పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నానని వ్యాసులవారికి విన్నవించుకొన్నది.

అపుడు వ్యాసులవారు కుంతీదేవితో ఇలా అన్నాడు.

**అపరాధశ్చ తే నాస్తి కన్యాభావం గతాహ్యసి । (ఆశ్రమవాసపర్వం)**
**దేవాశ్చైశ్వర్యవంతో వై శరీరాణ్యా విశంతి వై ॥ 30 -21**
**సంతి దేవనికాయాశ్చ సంకల్పాత్ జనయంతి యే ।**
**వాచా దృష్ట్యా తథా స్పర్శాత్ సంఘర్షేణేతి పంచధా ॥ 30 -22**
**మనుష్యధర్మో దైవేన ధర్మేణ హి న దుష్యతి ।**
**ఇతి కుంతి విజానీహి వ్యేతు తే మానసో జ్వరః ॥ 30 -23**

**సర్వం బలవతాం పథ్యం సర్వం బలవతాం శుచి ।**
**సర్వం బలవతాం ధర్మః సర్వం బలవతాం స్వకమ్ ॥ 30 -24**

ఓ కుంతీ! యీ కర్ణ జననమందు నీ దోషమేమియు లేదు. నీవు కన్యవు గానే వున్నావు.దేవతలు సకల ప్రభావములు కలవారు. శరీరము నావేశించగలరు. దేవతలు సంకల్పము వలన, వాక్కు వలన, దృష్టివలన, స్పర్శ వలన, రతి వలన, అయిదు విధములుగా సంతతిని పొందగలరు. మనుష్య ధర్మము దైవ సంగత్యముచే దోషమునందదు. సర్వశక్తి సమన్వితులు ప్రభావితులగు దేవతల సంకల్పముతో నీకు పుత్ర జననము దోషావహము కాదని కుంతికి

తెలియజేశాడు.

**8.11.4. వేదవ్యాసుడు గాంధారి ధృతరాష్ట్రుల కోరికను నెరవేర్చుట**

వేదవ్యాసుడు గాంధారిని చూచి గాంధార రాజ తనూజా!

భద్రే ద్రక్ష్యసి గాంధారి పుత్రాన్ భ్రాతౄన్ సఖీం స్తథా ।
వధూశ్చ పతిభిస్సార్ధం నిశి సుప్తోత్థితా ఇవ ॥ 31 -1
కర్ణం ద్రక్ష్యతి కుస్తీ చ సౌభద్రం చాపి యాదవీ । (ఆశ్రమవాసపర్వం)
ద్రౌపదీ పంచ పుత్రాంశ్చ పితౄన్ భ్రాతౄన్ స్తథైవ చ ॥ 31 -2

నీవు నీ కుమారులను, సోదరులను, ఆత్మీయులను పతులతో కలసి యుండెడి కోడండ్రను సుప్తోత్థితుల వలె జూడగలవు. కుంతీదేవి కర్ణుని, సుభద్ర అభిమన్యుని, యాదవులను, ద్రౌపదీ తన ఐదుగురు కుమారులను, తమతమ ఆత్మీయబంధు గణములతో కూడియున్న వారిని జూడగలరు.

ఇంకొక ముఖ్య విషయం నీకు తెలియజేస్తున్నాను. మహాభారతయుద్ధం తప్పక సంఘటిల్ల వలసి ఉన్నది. ఇందువల్ల దేవతలనేకులు భూతలంపై మానవులై అవతరించారు. ధృతరాష్ట్రుడెవరోగాదు - గంధర్వుడే ధృతరాష్ట్రుడు. ఇదేవిధంగా మరుద్గణ స్వరూపుడే పాండురాజు, సాక్షాద్ధర్మదైవతమే ధర్మరాజు, మరుత్ దైవతమే భీమసేనుడు, నరుడే అర్జునుడు, అశ్వనీదేవతలే నకులసహదేవులు కలిపురుషడే సుయోధనుడు, సూర్యుడే కర్ణుడు, చంద్రుడే అభిమన్యుడు బృహస్పతి అంశతో ద్రోణాచార్యుడు రుద్రాంశతో అశ్వత్థామ, ఇలా మొదలగు వారు ఏయే అంశలతో జన్మించారో చెప్పాడు.

యుద్ధమృతులకు ఏ దుర్గతులు కల్గినవోయని చిరకాలము నుండి పరితపించు మీకు గల చింతను తొలగింతును. మీరందరు గంగానది యొద్దకు వెళ్ళండి అచట మృతులనందరిని చూడగలరు. అని చెప్పగా అందరూ క్రమముగా గంగానదిని జేరి, యెప్పుడెప్పుడని చూచుచుండ సాయంకాలము కాగా, కాలకృత్యములు నిర్వర్తించుకొన్నారు. ఆ తరువాత మహాతపశ్శాలియగు

వ్యాసమహర్షి పవిత్రమగు గంగా జలంలో ప్రవేశించి తన తపశ్శక్తిచే యుద్ధమున చనిపోయిన వారినందరినీ ఆహ్వానించాడు.

**తతః సుతుములః శబ్దో జలాంతే జనమేజయ ।** (ఆశ్రమవాసపర్వం)
**ప్రాదురాసీద్యథా పూర్వం కురుపాండవ సేనయోః ॥** 32-6
**తతస్తే పార్థివాస్సర్వే భీష్మద్రోణ పురోగమాః ।**
**ససైన్యాః సలిలాత్తస్మాత్సముత్తస్థుః సహస్రశః ॥** 32 -7

అంతట జల మధ్యమునుండి పూర్వము కురు పాండవసేనల మహాధ్వని వలె కలకల ధ్వని యుద్భవించింది. ఆ తరువాత భీష్మ, ద్రోణులతో కూడిన రాజులందరునూ సైన్యసమేతులై వేలకు వేలు ఉదకము నుండి లేచి బయటకు వచ్చిరి.

అందు ఏ వీరునిది యే వేషమో, యే ధ్వజమో, యే వాహనమో, యే కవచమో, యే ఆయుధమో వాని తోడనే యాతడు కనబడుచుండెను. అందరు దివ్యాంబరధరులు, కుండలాంకృతులు, వైరరహితులు, నిరహంకారులునై యుండిరి. వ్యాసభగవానుడు తపోబలముచే ధృతరాష్ట్రునకు దివ్య దృష్టిననుగ్రహించాడు. అచింత్యమై శరీరమునకు గగుర్పాటు కలిగించెడి ఆ యద్భుతమును జనులు విస్మితులై రెప్పపాటు లేక చూచిరి. ఈ మహాద్భుతం విన్న గాంధారి మహానందంతో పరవశించి తన నేత్రపట్టం తొలగించి, కుమారులనందరిని తిలకించి పరమానంద భరితురాలయినది.

ఇట్లు కురువంశీయులును, ఇతరులైన పార్థివులు, గురుపుత్ర బంధుజనముతో కలిసి ఆనందముతో ఆ రాత్రియంతయు విహరించిరి. ఆ స్త్రీలు తమ తమ పతులతో, సుతులతో, భ్రాతృ పితృ వర్గములతో కలసి పరమానందమును పొందిరి. ఆ విధంగా రాత్రి వారు పరస్పర ప్రేమాను బంధమున ప్రసంగించుకొని వ్యాసమహర్షిని విడిచిపెట్టగా, చూచుచుండ గంగానదియందు మునిగి క్షణములో అందరును అంతర్ధానమైరి. వారందరును

అంతర్ధానమైన తరువాత ధర్మశీలుడగు మహర్షి గంగానదిలో నిలిచి తీరంపై నిలుచున్న క్షత్రియకాంతలను గూర్చి ఇట్లనెను.

> యా యాః పతిక్పరాన్ లోకానిచ్ఛన్తి పరమస్త్రియః । (అశ్రమవాసపర్వం)
> తా జాహ్నవీ జలం క్షిప్రమవగాహన్త్వతంద్రితాః ॥ 33 -19
> తతస్తస్య వచః శ్రుత్వా శ్రద్దధానా వరాంగనాః ।
> శ్వశురం సమనుజ్ఞాప్య వివిశు ర్జాహ్నవీజలమ్ ॥ 33 -20
> విముక్తా మానుషై ర్దేహైః తతస్తా భర్తృభిః సహ ।

ఏ పతివ్రతలు పతిలోకము నపేక్షింతురో వారు ఈ గంగాజలము నందు అవగాహనము చేయుడు. అని పలుకగా, ఆ మాట విని పతిలోకము కోరిన యా పతివ్రతలు శ్వశురడగు ధృతరాష్ట్రుని అనుమతి తీసికొని గంగాజలమందు అవగాహనము జేసి మనుష్యదేహములను విడిచి భర్తృ సాలోక్యమును పొందారు.

ఆ మహాద్భుత సంఘటన గమనించి ఆశ్రమ వాస్తవ్యులు అందరు పరమాశ్చర్య నిశ్చేష్టితులయినారు. పిమ్మట ధృతరాష్ట్రుడు ఆ వేదవ్యాసునకు అత్యంత భక్తితో నమస్కరించి మహాత్మా! నీ కృపా దృష్టి వల్ల నేను కృతార్థుడయినాని విన్నవించుకొన్నాడు. పాండవులు గూడా నమస్కరించగా, వేదవ్యాసుడు అంతర్హితుడయ్యాడు.

## 8.12. మౌసల పర్వం

### 8.12.1. వేదవ్యాసుడు అర్జునుని ఓదార్చుట

అర్జునుడు వేదవ్యాసుని సందర్శనార్థమై ఆశ్రమంలో ప్రవేశించి సముచితాసనంపై సమాసీనుడై యున్న ఆ తపోనిధి పాదములకు నమస్కరించగా, అంతట వేదవ్యాసుడు అతనిని ఎంతో ఆప్యాయతతో లేవనెత్తి ప్రగాఢాదరంతో తన సన్నిధిన కూర్చుండ బెట్టుకొని ముఖ వైఖరి పరిశీలించి, నాయనా! మొట్ట

మొదట నిన్ను గుర్తించలేకపోయినాను సుమా! ఎట్టకేలకు ఇప్పటికి జ్ఞప్తి కలిగింది. ఈవిధంగా మారిపోయినావేమి? ఆగ్రహోన్మాదంతో అవధ్యుల నెవ్వరినయినా సంహరించలేదు కదా? ఇంతటి వైపరీత్యానికి ఏమి కారణము? అని ప్రశ్నించాడు. సవ్యసాచి ఆప్రశ్న విని, వివర్ణ వదనంతో తన మనోవేదనను వ్యక్తీకరించాడు.

మహాత్మా! నా బహిః ప్రాణాల వంటి బలరామకృష్ణులు ఉభయులు పరలోకం చేరుకొన్నారు. అంతేకాదు. ఆపైన యాదవ ప్రముఖులందరు అనతికాలంలోనే పరమపదించారు. వారి స్త్రీ బాల వృద్ధులను అందరిని వెంటబెట్టుకొని తరలివస్తున్న తరుణంలో మార్గమధ్యంలో కొల్లగొట్ట వలెనన్న దుస్సంకల్పంతో బోయలు అసంఖ్యాకులు నన్ను ఎదుర్కొన్నారు. నేను అప్పుడు ఘనతర బాహుశక్తి గర్వంతో వారిని ఎదుర్కొన్నాను. వీరావేశంతో శరప్రయోగాలు ఆరంభించాను. కాని ఆ విషమ పరిస్థితిలో మహాస్త్ర మంత్రం ఒకటి అయినా రవంతయినా జ్ఞప్తికి రాలేదు. అయినను బాణాలు ప్రయోగించాను. కాని అవి వ్యర్థములయినవి.

ఆ కిరాతకులతో ఒకింతసేపు పోరాటం కొనసాగించి కొంతమంది యాదవ గణాలను సంరక్షించగలిగానని వేదవ్యాస మహర్షికి తెలియజేసి మహాత్మా! ఇకనాకు ఏమి కర్తవ్యమో ఆనతీయవలసిందని పలికాడు.

వేదవ్యాసుడు ఆ వృత్తాంతం విని కొంతసేపు ఆలోచించి, అర్జునుని ఓదార్చి అర్జునా! వృష్ణ్యంధక మహారథులందరును బ్రాహ్మణ శాపముచే దహింపబడిరి. ఓ అర్జునా! యిది కృష్ణునకు ఇష్టమైనదే. దేవాంశచే ధర్మ సంరక్షణార్థము పుట్టినవారు వారి స్వస్థానమును పొందిరి. వారిని గూర్చి దుః ఖించకుము. భూభార అవతరణార్థము అవతరించిన వాసుదేవుడు భూభారమును తగ్గించి ఉత్తమమైన వనలోకమును పొందినాడు.

అర్జునా! చోరులచే పీడింపబడిన యే స్త్రీలను గూర్చి నీవు శోకించుచుంటివో ఆ స్త్రీల పూర్వ వృత్తాంతము జెప్పెదను వినుము.

పూర్వము అష్టావక్రమహర్షి[21] జలములో నుండి చిరకాలము తపము చేసాడు. ఆ సమయమున జరిగిన దేవాసుర సంగ్రామములో అసురులను జయించిన దేవతలు మేరుపర్వతమందు మహోత్సవము జరిపారు. ఆ మహోత్సవమునకు రంభా తిలోత్తమాది దేవతా స్త్రీలు వేలకొలది వెళ్ళుచు కంఠమగ్నముగా జలములో నుండి జటాభారమును వహించియున్న మహర్షిని దర్శించి వినయ విధేయతలతో నమస్కరించి స్తుతించి ఆ మహర్షి యెట్లు ప్రసన్నుడగునో అట్లు ప్రశంసించారు. అప్పుడా మహర్షి ప్రసన్నుడై మీకేమి కావలయునో కోరవలసినది. మీకు వరమిచ్చెదనని పలుకగా రంభాతిలోత్తమాదులు నీయనుగ్రహమే మాకు చాలుననిరి. మిగిలిన వారందరును పురుషోత్తముడు శ్రీకృష్ణుడు మాకు పతి యగునట్లు వరమిమ్మని ప్రార్థించారు. అట్లేయగునని ఆ మహర్షి వరమిచ్చి జలమునుండి యావలకు వచ్చునంతట ఆ స్త్రీలు అష్టవక్రముగా నున్న మహర్షి స్వరూపమును జూచి పక్కున నవ్వారు. అదిచూచి మహర్షి కుపితుడై నాది వికృత రూపమని యెంచి నవ్వి నన్ను మీరు అవమానించారు. కనుక నేనిచ్చిన వరమును బట్టి పురుషోత్తముని పత్నులైన మీరు నాయీ శాపము వలన చోరుల చేతులలో పడెదరని శపించాడు. అపుడా స్త్రీలు విచారించి వేడుకొనగా, అదే మార్గముచే మరల మీరు దేవలోకమును పొందగలరని అనుగ్రహించాడు.

---

21. **అష్టావక్రమహర్షి** : ఏక పాదునికి సుజాతయందు పుట్టిన కుమారుడు. ఇతడు గర్భమున ఉండు కాలమున ఎల్లప్పుడు శిష్యులచే వేదాధ్యనము చేయించుచూ ఉండు తన తండ్రితో శిష్యులు నిద్రలేమిం చేసి జడమతులై చదువు తప్పు చదువుచున్నారనని, కోపగించి నీవు అధ్యయనమునకు వక్రముగా పలికితివి. కావున అష్టవక్రుండవై జన్మింపుము అని కుమారునకు శాపమిచ్చాడు.

భారతమున అష్టావక్రుని గూర్చి ... అష్టావక్రుడు తన తల్లిగర్భమున నుండగా తండ్రి వేదాధ్యయనము చేయునపుడు ఎనిమిది సార్లు అపరస్వరము పలికినప్పుడు గర్భంలోనున్న శిశువు ఎనిమిది మెలికలు తిరిగిన కారణముగా అష్టావక్రుడు అను నామము ఏర్పడినది.

కనుక అర్జునా! నీవెంత మాత్రము శోకింపకుము. వారు ఇంద్రలోకమును పొందినారు. ఆ మహర్షి శాపమేగాక వారికి మరియొక శాపము గూడ గలదు. వారు ప్రద్యుమ్నుని చూచి భ్రాంతి పొందుటచే గూడ పూర్వమావిధముగ శపింపబడిరి. కావున అర్జునా!ఈ విషయమున నీవు స్వల్పమయినను దుఃఖించ పనిలేదు. లోకనాథుడగు ఆ విష్ణువుచే అంతయు నిర్వహింపబడింది.

శ్రీహరి తలచుకొన్నంతలోనే, ముల్లోకాలు రూపుమాపి వేయగల సర్వసమర్థుడు, కణ్వాదుల శాపశక్తి నిర్మూలించదలేడా? కనుకనే యాదవులు అందరు ఆవిధంగా పరస్పరము పోరాడి పరలోకం చేరుకొన్నారు. నీవు యుద్ధభూమిలో పోరాడుతున్న సమయంలో సాక్షాత్తు పరమేశ్వరుడు ముమ్ముందుగా శాత్రవ సైన్యాలను అనుక్షణము నిర్మూలించాడు. అదేవిధంగా శ్రీకృష్ణుడు నీ యోగ క్షేమాలు ఎల్లప్పుడు పరిశీలించాడు. అయితే యాదవ రక్షణ సమయంలో నీకు వారు యిరువురి సంరక్షణ తొలగిపోయింది. జగతీ పరిపాలనార్థమై అవతరించిన శ్రీకృష్ణుడు తనకర్తవ్యాన్ని నిర్వర్తించి అజరామరమయిన పరంధామం చేరుకొన్నాడు. దీనికోసమై నీవు ఏమాత్రము చింతించనక్కరలేదు. గొప్ప పరాక్రమశక్తితో, అస్త్ర సంపత్తితో నీవు ఆ శ్రీకృష్ణునకు అండగా నిలిచి, ధరాభార పరిహారణంలో తోడ్పడి కృతకృత్యుడైనావు. ఆయా యుద్ధాలలోని యుద్ధ కౌశలం గమనించి, దేవతలు అమందానంద భరితులయినారు. ప్రయోజనం పరిసమాప్తమయినందువల్ల అస్త్ర సమూహం నిన్ను విడిచిపెట్టినది. బలము, బుద్ధి, పరాక్రమము ఆదిగా గలవన్ని తగిన తరుణంలో అప్రతిహతములై విలసిల్లుతున్నవి. కాని కాల విపర్యాస కాలంలో అవి అన్ని క్షణంలో నశిస్తున్నవి. బుద్ధిమంతులు యిందువల్ల జయాపజయాలకు ఆనందదైన్యాలతో ఉబ్బితబ్బిబ్బయి తల్లడిల్లరు. కావున సమస్తము కాల ప్రభావం వల్లనే జరుగుతున్నది. కనుక ఇక మీరందరు ఇటువంటి వాటిని గూర్చి చింతలు విడిచి నిర్వికారచిత్తులై మహాప్రస్థానాలతో ఉత్తమగతులు పొందెదరు గాక! వేదవ్యాసుని మాటలు విని

అర్జునుడు శోకమోహ వినిర్ముక్తచిత్తుడై, కృష్ణద్వైపాయనమునిని సముచిత గౌరవంతో వీడ్కొని హస్తినాపురమునకెళ్ళి, ధర్మజుని సందర్శించి తన ప్రస్థాన వృత్తాంతమంతయు నివేదించాడు.

### 8.13. వేదవ్యాసుడు - శుకమహర్షి

శుకమహర్షి వ్యాసుని కుమారుడు. పూర్వమొకానొక కాలమున వ్యాసుడు మేరు పర్వతముమీద తపస్సు చేసికొనుచుండగా, ఈశ్వరుడు ప్రత్యక్షమై వరమును కోరుకొమ్మన్నాడు. అందుకాయన పంచభూతములతో సమానుడైన కుమారుడు కావలయునని కోరినాడు. తథాస్తు అని పలికి అదృశ్యుడైనాడు.

ఒకరోజు వ్యాసుడు తపో హోమాగ్నిని సృష్టించదానికై అరణిని మథిస్తూండినాడు. అపుడాయన ఘృతాచియనే అప్సరసను చూచి మోహితుడు కాగా, ఆమె భయపడి మునిని మోసము చేయదలచి ఒక చిలుకగా కామరూపముతో అక్కడనే తిరుగుతూ ఉండినది. దానిని జూచుచు వ్యాసుడు అరణి మథించుచుండెను. అతని చిత్తము మోహాయత్తమగుటచే శుక్రము జారి అరణియందుబడెను. అందుండియె శుకుడు జన్మించాడు. వ్యాసుడీతనికి ఉపనయనము చేసిన సమయమునందు బ్రహ్మ ఈతనికి శుకుడని నామకరణము చేసినాడు.

శుకునకు తండ్రియే గురువు. వేదశాస్త్రములను నేర్చుకొన్న తర్వాత ముక్తికి మార్గము గూర్చి అడుగగా జనకమహారాజు వద్ద వెళ్ళి నేర్చుకోవలసినదిగా ఆజ్ఞాపించాడు. శుకుడు జనకుని యొద్ద కొంత విద్య నేర్చినాడు.

వ్యాసపుత్రుడైన శ్రీ శుకుడు విరాగి, మహాయోగి, సమదర్శనుడు, బ్రహ్మజ్ఞుడు, మాయాతీతుడు, సర్వజ్ఞుడు. ఒకనాడు దేవకన్యలు స్నానాలు చేస్తూ ఉన్నారు. ఆ సమయంలో శ్రీ శుకుడు దిగంబరుడై అటు వెళ్ళటం చూచి కూడా వారు ఏమాత్రం చలింపలేదు. సిగ్గుపడలేదు. చీరలు ధరించలేదు. అలాగే జలక్రీడలాడుతున్నారు. ఇంతలో వ్యాసులవారు శుకా! శుకా! అని తన కుమారుణ్ణి

పిలుస్తూ అటువైపు వచ్చేసరికి ఆ దేవకాంతలంతా ఆయన్ని చూచి ఎంతో సిగ్గుతో వెంటనే తమ తమ చీరల్ని కట్టుకొన్నారు. అప్పుడు చీరలు ధరించకుండా వస్త్రధారియై వచ్చిన వృద్ధుడైన తనను జూచి లజ్జతో వస్త్రాలు కట్టుకొన్న దేవకాంతల్ని చూచి ఆశ్చర్యపడి వ్యాసుడు అందుకు కారణమేమిటని అడిగాడు. అపుడు వారు నీ కుమారుడికి స్త్రీలు పురుషులు అనే భేదభావం లేదు. అంతేకాక ఆయన నిర్వికల్పుడు. మరి నీలో స్త్రీ పురుషభేద భావం ఇంకాపోలేదు. నీకూ ఆయనకూ ఎంతో అంతరముంది అన్నారు.

వేదవ్యాసుడు సకల ధర్మములు చెప్పినప్పటికీ, భారతమును రచించినప్పటికీ, వేద విభజన గావించినప్పటికీ, చింతాక్రాంతుడైయుండగా అపుడు నారదుడు వచ్చి భగవంతుని గుణములను కీర్తించు కథలను తెలుపుము అని పలుకగా, వేదవ్యాసుడు బదరికాశ్రమానికి వెళ్ళి భక్తి పరిపూర్ణమైన తన చిత్తంలో భగవంతుణ్ణి దర్శించాడు. హరిభక్తి అనే యోగం తప్ప మరొకటి ఏదీ లేదని నిశ్చయించి ఏ మహాగ్రంథాన్ని విన్నంత మాత్రంచే సంసారబంధాలు నశించిపోయి జగన్నాథుడైన జనార్దనునిపై అచంచలమైన భక్తి ఆవిర్భవిస్తుందో, అటువంటి లోకకల్యాణకరమైన మహాగ్రంథాన్ని వేదస్వరూపమైన శ్రీమద్భాగవతాన్ని రచించాడు.

ఈవిధంగా మహాభాగవత సంహితను కల్పించి ముముక్షువైన శ్రీశుకునిచే చదివించాడు.

### 8.14. శ్రీ దేవీభాగవతములో వ్యాసుని వివరములు

ప్రతి మన్వంతరమునందు ద్వాపర యుగములు వచ్చుచుండును. ద్వాపరము వచ్చినపుడెల్ల ధర్మాద్వైతమతితో వ్యాసుడు యథావిధిగా పురాణములను ప్రవచించుచుండును. ప్రతి ద్వాపరమందును శ్రీహరియే వ్యాసుడుగ అవతరించి జనులకు హితము చేకూర్చుటకు ప్రతి యొక వేదమును అనేకములగు ఉపభాగములుగ విభజించాడు. ఇపుడు ఏడవ మన్వంతరము

జరుగుచున్నది. ఈ మన్వంతరమందలి 28వ ద్వాపరమున సత్యవతీ సుతుడు వ్యాసుడు వ్యాసపీఠము అలంకరించియున్నాడు. ఇక మీదట 29వ ద్వాపరమున ద్రోణ పుత్రుడగు అశ్వత్థామ వ్యాస పదవినలంకరిస్తాడు. ఇట్లు ఇప్పటికి ఇరవై ఏడుగురు (27) వ్యాసులు వచ్చి వెళ్ళారు. వీరు ప్రతి ద్వాపరమందును పురాణసంహితలు వ్రాశారు.

ప్రథమ ద్వాపరయుగమునందు స్వయంభువు (బ్రహ్మ) చే వేదవిభాగము చేయబడింది. రెండవ ద్వాపరమున ప్రజాపతి మనువు వేదవ్యాసుడయ్యాడు. తృతీయ ద్వాపరమున శుక్రుడు, చతుర్థ ద్వాపరమున బృహస్పతి, పంచమ ద్వాపరమున రవి, ఆరవద్వాపరమున మృత్యువు, ఏడవ ద్వాపరమున ఇంద్రుడు, అష్టమద్వాపరమున వసిష్ఠుడు, నవమ ద్వాపరమున సారస్వతుడు, దశమ ద్వాపరమున త్రిధాముడు, ఏకాదశ ద్వాపరమున త్రివృషుడు, ద్వాదశ ద్వాపరమున భరద్వాజుడు, త్రయోదశ ద్వాపరమున నంతరిక్షుడు, చతుర్దశ ద్వాపరమున ధర్ముడు, పంచాదశ ద్వాపరమున త్రైయారుణి, షోడశ ద్వాపరమున ధనంజయుడు, సప్తదశ ద్వాపరమున మేధాతిథి, అష్టాదశ ద్వాపరమున వ్రతియు, తర్వాత అత్రి, గౌతముడు, హార్యాత్మ, వేనుడు, వాజశ్రవముని, సోమఅముష్మాయణ, తృణబిందువు, భార్గవుడు, శక్తి, జాతకర్ణి తరువాత 28వ ద్వాపరమున కృష్ణద్వైపాయనుడు వ్యాసపీఠమును అలంకరించాడు. ద్వాపరాదులందు వీరిచే నొక్కటిగా నున్న వేదము నాలుగు వేదములుగా విభజింపబడింది. రాబోవు ద్వాపరమున కృష్ణద్వైపాయనుని యనంతరము ద్రోణపుత్రుడగు అశ్వత్థామ వ్యాసుడు కాగలడు.

### 8.15. వేదవ్యాస వ్యక్తిత్వము

సప్త చిరంజీవులలో వేదవ్యాసుడు ముఖ్యుడు. వేదవ్యాసులవారు అవసరము వచ్చినపుడెల్ల ధృతరాష్ట్ర వర్గకును, పాండవుల యొద్దకును వచ్చి హితవు చెప్పుచుండెడివాడు. ఏవిధంగా ప్రవర్తిస్తే మంచిదో వాటిని పాండవులకు

వివరించి, ఒకరకంగా సంరక్షకుడు అయినాడు. దుర్యోధనునికి బుద్ధి చెప్పమని ధృతరాష్ట్రుడు వ్యాసునితో అన్నపుడు వ్యాసుడు తప్పుకొని ఆ పని మైత్రేయుడు చేస్తాడని వెళ్ళిపోయారు. పాండవులెంతగా కావలసినవాళ్లో ధార్త రాష్ట్రులు కూడా వ్యాసునికి అంతగా కావలసినవారే తన మాటను పాండవులు గౌరవిస్తారు గౌరవించినారు కూడా.

కౌరవ పాండవుల యుద్ధ సందర్భములో సాత్యకి సంజయుని పట్టుకొని సంహరించటానికి ఉద్యుక్తుడుకాగా, అప్పుడు వేదవ్యాసుడు వచ్చి సంజయుని చంపవలదని చెప్పి కాపాడాడు. ఈవిధంగా వేదవ్యాసుడు రక్షకుడుగా, భూతభవిష్య వర్తమానాలు తెలిసిన మహోన్నత గురువుగా ఉత్తమ ఋషిగా, అందరి హృదయాల్లో నిలిచియున్నాడు. వ్యాసుడు లోకహితార్థం జీవించటానికి జన్మించాడు.

ధృతరాష్ట్రాదులకు జనకుడగు వ్యాసమహర్షి జనమేజయుని నాటికి కలడాయని సందేహింపనవసరము లేదు. వ్యాసుడు చిరంజీవి గాన నాటికే గాక నేటికి కూడా కలడు. శ్రీశంకరులను, విద్యారణ్యులకును, కాళిదాస మహాకవికిని, తిక్కన సోమయాజికి కూడ కాశీలో దర్శనమిచ్చినట్లు ఆఖ్యాయికలు కలవు. వాటిని కూడ నిష్కారణముగా అప్రమాణమనుటకు వీలులేదు. యోగశాస్త్రమున చిరజీవన సాధనములగు యోగములు కలవు. మహాత్ముడగు వ్యాసుడు చిరంజీవి యగుట ఆశ్చర్యకరము కాదు. ఈ వేదవ్యాసులవారు సూర్యసావర్ణికమను కాలమున సప్తర్షులలో ఇతడొకడగును.

## 9. హనుమంతుడు

వాయు ప్రసాద జననాత్ వాయుపుత్రో నిగద్యసే । (పరాశర సంహిత)
అంజనాగర్భ జననాత్ ఆంజనేయ స్తతో భవాన్ ॥ (పుట. 90)

వాయువు అనుగ్రహముచే పుట్టుట వల్ల వాయుపుత్రుడని, మరుత్తు పుత్రుడు కావున 'మారుతి' అని పిలుస్తారు. అంజనా గర్భమున జనించుటచే ఆంజనేయుడని పిలుస్తారు. మరుత్ అనగా వాయువు.

కేసరి క్షేత్ర జన్యత్వాత్ పుత్రః కేసరిణః కపేః । (పరాశరసంహిత)
హనూవజ్ర ప్రహారార్థి హనూమానితి నామతే ॥ పుట 90

కేసరి సతియందు పుట్టుటచే, వానరుడగు కేసరి పుత్రుడు. హనుమ అనగా దవడ, హనువునందు వజ్రాయుధము తాకినది గాన 'హనుమంతుడని' పేరు సార్థకమయ్యెను.

'హను' శబ్దః జ్ఞాన వాచీ, 'హనుమాన్' మతి శబ్దితః జ్ఞానమను అర్థమును తెలుపు 'హన' అను ధాతువు నుండి పుట్టిన 'హను' అను శబ్దము జ్ఞానమను అర్థమును తెలుపును. ఆ జ్ఞానము సామాన్య జ్ఞానముగాక ఉత్తమ జ్ఞానమైనచో 'హను' ధాతువు ప్రయోగింతురు.

ప్రశస్తౌ హనూ అస్యస్తః ఇతి హనుమాన్. అనగా చక్కని దౌదలు కల్గినవాడు గాన హనుమంతుడు అను నామధేయము సార్థకమయ్యెను.

### 9.1. రామాయణములో హనుమజ్జననము

పుంజికస్థల గొప్ప సౌందర్యము గల అప్సరస. ఆమె శాప వశమున కుంజరుడను వానర శ్రేష్ఠుని కూతురై వానరస్త్రీగా జన్మించింది. కామరూపము కలిగి అంజనయను పేర ప్రసిద్ధయై, కేసరి యను వానరుని వివాహమాడింది. వానర స్త్రీ యైనను సర్వాంగ సుందరి కామరూపము కలది. ఆ అంజన మనుష్యరూపముదాల్చి పర్వతాగ్రమున విహరించుచుండెను.ఆమె వస్త్రము

తొలగుటచే ఆమె సౌందర్యమునకు వాయుదేవుడు మోహితుడై ఆ అంజనాదేవిని తన పొడవైన చేతులతో కౌగిలించుకొన్నాడు. అంతట అమె తొట్రుబాటు నొంది ఎవ్వరు నా పాతివ్రత్యమును చెఱుపగోరుచున్నారు? అని ప్రశ్నించగా, అంజన వాక్యము విని వాయుదేవుడు నేను కీర్తిమతిని పతివ్రతవగు నిన్ను కౌగిలించి, మనస్సుచే నీలో ప్రవేశించితిని. నేను నిన్ను హింసింపను. నీవెంత మాత్రము భీతిల్లకుము.

> వీర్యవాన్ బుద్ధి సంపన్న స్తవ పుత్రో భవిష్యతి ।
> మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః ।
> లంఘనే ప్లవనే చైవ భవిష్యతి మయాసమః ॥ (66-8)

నీకు మహాపరాక్రమశాలియు, బుద్ధిమంతుడు, మహాబలశాలి, మహాధైర్యశాలియగు తనయుడు జన్మింపగలడు. అతడు దాటుటయందును ఆకాశగమనమందును నాకు సాటి కాగలడు. అని చెప్పెను.

వాయుదేవుని మాటలను విని సంతసించి గుహలో వానరశ్రేష్ఠునకు జన్మనిచ్చింది.

ఆ వానరుడు బాలుడుగ వున్నప్పుడే సూర్యుడుదయించుట చూచి అది యొక ఫలమని భ్రమించి దానిని తినగోరి మూడు వందల యోజనములు పైకెగిరి, సూర్యుని తేజమెంత బాధించినను, ఆ బాలుడు వేగముగ అంతరిక్షమును చేరుచుండగా చూచి ధీమంతుడగు యింద్రుడు కోపించి ఆ బాలునిపై వజ్రాయుధమును ప్రయోగించాడు. ఆ వజ్రాయుధపు దెబ్బకు హనుమ పర్వత శిఖరముపై పడగా అతని యెడమ హనువు(దవుడ) విఱిగింది. అందువల్లనే హనమంతుడను పేరు సార్థకమైనది.

సకల ప్రాణులకు ప్రాణాధారియైన వాయుదేవుడు ఆ బాలుని అట్లు కొట్టుటను చూచి మిక్కిలి కోపించి ముల్లోకములను వాయురహితముగా స్తంభింపజేసెను. అప్పుడు ముల్లోకములు క్షోభిల్లగా, దేవతలందరు కోపించిన

వాయుదేవుని ప్రసన్నుని చేసికొనిరి. బ్రహ్మదేవుడు హనుమకు ఏ శస్త్రము వధింపకుండునట్లు వరమిచ్చెను. దేవేంద్రుడును "స్వచ్ఛందతశ్చ మరణం తే **భూయాదితి** వై ప్రభో" ( 66 వ సర్గ) స్వచ్ఛంద మరణము కలుగునట్లు వరము ప్రసాదించాడు.

నా తేజస్సులో నూరవ భాగాన్ని ఆంజనేయునికిస్తున్నాను. ఆ కారణంగా చక్కగా మాట్లాడే నేర్పు – బుద్ధి కుశలత – స్పష్టమైన కంఠస్వరం – ఆరోగ్యమూ ఇతనికి కల్గడమే కాక, శాస్త్రజ్ఞానంలో ఇతనికి సాటి మరెవరూ ఉండరు. ఇతనికి దీర్ఘాయుస్సాన్ని నేను ఇస్తున్నాను. వరుణుని నీళ్ళతోగాని, పాశాలతో గాని చావు వీనికి ఉండదు అన్నాడు సూర్యుడు.

వ్యాధిలేని వరాన్నీ, యమదండం సమీపించలేని వరాన్నీ యముడీయగా,తనగద వలన మరణం ఉండదని కుబేరుడూ, తన ఆయుధాలేమీ ఇతనిపై ప్రయోగించినా అవి పనిచేయవనీ శివుడూ, బ్రహ్మాస్త్రం వల్ల మరణం లేని వరాన్ని దీర్ఘాయుష్యంతో పాటు బ్రహ్మ ఇచ్చారు. ఏ అస్త్ర శస్త్రాలూ ఇతణ్ణి బాధించని వరాన్ని విశ్వకర్మ ఇస్తూ దీర్ఘాయుస్సాన్ని ప్రసాదించాడు కూడ. అంతేగాక బ్రహ్మ కామ రూప, కామ గమనాలనీ, అజేయత్వాన్నీ ప్రసాదించాడు. రామునికి రాక్షస సంహారకాలంలో సహాయ భూతుడౌతాడని కూడ చెప్పాడు. ఈ వరాల బలంతో మదంతో ఋషుల ఆశ్రమాలకు వెళ్ళి నారబట్టలని చించి అగ్నిహోత్రాలని ఆర్పి, పాత్రలను పగులగొట్టి, గంతులు వేస్తూ ఆశ్రమాలను ధ్వంసం చేస్తూంటే మహర్షులంతా నీ బలాన్ని నువ్వు మరచిపోతావు. ఎవరైనా నిన్ను పొగడితే తిరిగి గుర్తు వస్తుందని శాపంలాంటి వరాన్నిచ్చారు.

### 9.2. భవిష్యోత్తర పురాణములో హనుమజ్జననము

పూర్వము కేసరి భార్య అంజనాదేవి సంతానము లేక దుఃఖించుచు మతంగమునిని సమీపించి ప్రార్థించగా, అంతట ముని ఆమెతో పంపానదికి తూర్పుదిశలో అయిదువందల యోజనముల దూరమున భూమిపై

నారసింహాశ్రమము కలదు. దానికి దక్షిణ దిశలో నారాయణాద్రి తీరమున స్వామి తీర్థమునకు ఉత్తర భాగమున క్రోశమాత్ర దూరమున ఆకాశగంగ ప్రసిద్ధమై యలరారుచున్నది. అచట స్నానమాచరించి 12 సం॥లు తపమాచరింపుము. ఆ పుణ్య ఫలితముచే నీకు సద్గుణవంతుడు పుత్రుడు కల్గునని పలికెను. పిమ్మట ఆమె ఆ ముని వచనానుసారము అచటికి వెళ్ళి ప్రతినిత్యము ఆకాశగంగ యందు స్నానమాచరించి తపమాచరించింది. ఇట్లు సంవత్సరము గడచిన వెంటనే మహాబలవంతుడగు వాయుదేవుడు ఆమె భుజించుటకై ఫలము అనుదినము యిచ్చుచుండెను.

అంతట ఒకరోజు వాయువు ఫలములో వీర్యము నుంచి ఆ ఫలమును అంజనాదేవి దోసిలియందుంచగా ఆమె యాకలి గొన్నదై దానిని సామాన్య ఫలముని తలంచి భుజించినది. అనంతరము ఆమెకు గర్భము కలిగెను. వాయువు వలన గర్భము కలిగెనని మునులందరు సంతోషించారు. అనంతరం ఆమెకు పదినెలలు నిండినంతనే బాలకుడు జన్మించినాడు. ఆ బాలునకు మునీంద్రులు హనుమంతుడను నామము నుంచిరి.

'హనూమన్త మిదం ప్రాహుః మునయో వీతకల్మషాః '

9.3. బ్రహ్మపురాణములో హనుమజ్జననము

త్రేతాయుగమున 'కేసరి' యను నొక రాక్షసుడు పుత్రులను కోరి నిర్మల చిత్తుడై, 'పంచాక్షరేణ జప్యేన తోషయామాస శంకరమ్' 'నమః శివాయ' అను పంచాక్షరితో జపించి,శంకరుని ప్రసన్నుని గావించుకొన్నాడు. ఆ రాక్షసునికి శంకరుడు ప్రత్యక్షము కాగానే భక్తితో సాష్టాంగ నమస్కారము చేయగా, అప్పుడు శంకరుడు ధర్మచరితా! నీ తపస్సునకు సంతసించాను వరమును కోరుకొనుము. అని చెప్పగా అంత ఆ కేసరియను రాక్షసుడు.

"పుత్ర మిచ్ఛామి బలినం సమరేష్వ నివర్తినమ్ ।
మహాధైర్యం మహాప్రాజ్ఞం త్వత్తః సన్తుష్టమానసాత్ ॥ 4-58 శ్లో

ప్రసన్న చిత్తుడవగు నీవలన బలవంతుడును, యుద్ధములలో వెనుదీయని వాడును, గొప్ప ధైర్యశాలియు, ప్రాజ్ఞుడునగు పుత్రుడు కలుగునట్లు వరమొసంగుము. అని యడుగగా, పిమ్మట శంకరుడు కేసరీ! నేను ప్రసన్నుడయిననూ, నీకు ఇతఃపూర్వము బ్రహ్మచే పుత్రులు లేకుందునటుల విధింపబడి యుండుట వల్ల నీకు పుత్రుడు కలగడు. కాని నీకు సౌందర్యవతి, యౌవనవతి కన్నియను ప్రసాదించెదను. ఆమెకు నీవు కోరినట్లు పుత్రుడు త్వరలో తప్పక కలుగునని పలికి శంకరుడు అంతర్ధానమయ్యాడు.

పరమేశ్వరుడు ప్రసాదించిన ఆ బాలికకు 'అంజన' యను నామకరణము చేశాడు. ఒకప్పుడు 'కేసరి' యను వానర శ్రేష్ఠుడు, కేసరిని సమీపించి నీకుమార్తెను నాకిచ్చి వివాహము మొనరింపుము అని యడుగగా ఆ రాక్షసేంద్రుడు సంతసించి తన కుమార్తె అయిన అంజనాదేవిని ఆ వానరునకిచ్చి రంగరంగ వైభవోపేతముగా వివాహము జరిపించాడు. కాలము గడుచుచుండగా ఆమె సంతానమును పొంద గోరి నియమ నిష్ఠలతో ఎన్నో వ్రతములను చేసినప్పటికి సంతానము కలుగలేదు.

ఒకరోజు ధర్మదేవత దయతలచి సోదికత్తె రూపమును ధరించి చేతిలో బెత్తమును పట్టుకొని చంటిపాపను చంకనెత్తుకొని సోదియడుగుదురా? యని మాటిమాటికి యడుగుచుండగా, అంజనాదేవి ఆమెను పిలిచి కూర్చుండబెట్టి బంగారు చేటలో ముత్యాల బియ్యమును పోసి సోదికత్తెను తృప్తి పరచిన పిమ్మట నాకు పుత్రుడు కలుగునో కలగదో నాకు నిజమును తెలుపుము అని అడిగింది.

అంత సోదికత్తియు - అమ్మా! నీకు తప్పక నీవు కోరిన పుత్రుడు కలుగుతాడు. నేను నాధర్మముపై ప్రమాణము చేసి చెప్పుచున్నాను. శ్రీవేంకటాచలమున ఏడు వేల సంవత్సరములు తపమాచరించిన తప్పక పుత్రుని పొందగలవని తెలిపి సోదికత్తియ వచ్చిన దారినే వెళ్ళిపోయెను.

పిమ్మట అంజనాదేవి సోదికత్తియ వచనానుసారము శ్రీవేంకటాచలము

నందు ఆకాశగంగ సమీపమున గాలినే భక్షించుచు వాయుదేవున్ని వ్రతములచే సంతసింపజేసింది. ఆ తపస్సుకు మెచ్చి వాయుదేవుడు ఆమెకు ప్రత్యక్షమై రోజుకొక ఫలమును ఆమెకు తినుటకు యిచ్చేవాడు.

ఇలా ఏడువేల సంవత్సరములు జరిగిన పిమ్మట ఈశ్వరుడు పార్వతీ దేవితో కూడి ఆ ఆశ్రమమునకు వచ్చి విహరించుచుండగా అచట రెండు వానరములు కామముతో విహరించి రమించుచుండగా వాటిని చూచి వీరు కూడా వానర రూపములను ధరించి విహరించి ఆ అడవిలో క్రీడించారు. ఆ వీర్యమును వాయువు ఆకు దొన్నెలో నుంచుకొని అంజనాదేవి చేతిలో నుంచాడు. ఆమె దానిని తినునట్టి పదార్థముగా భావించి దానిని భుజించింది. ఆ కారణముగా ఆమె గర్భవతి కాగా, అయ్యో అకారణముగా గర్భవతినైతినే విచారించుచుండగా, ఆకాశవాణి అంజనాదేవితో అమ్మా! నీవు దుఃఖించవలదు. ఇది జరుగ వలసినదే. ఎందుకనగా లోకకంటకుడైన రావణాసురుని సంహరించుటకై శ్రీమన్నారాయణుడు భూలోకమున రఘువంశమున అవతరిస్తాడు. అతని సహాయమునకై బలవంతుడును, యుద్ధములలో వెనుదీయనివాడును, గొప్ప ధైర్యశాలియు, యింద్రియ నిగ్రహము కలిగి అసంఖ్యాక గుణములు కలిగిన పుత్రుడు నీకు కలుగునని పలుకగా ఆ అశరీరవాణి మాటలను విని సంతోషించింది.

ఇట్లు ఆమెకు నవమాసములు నిండగా పదియవ మాసమురాగా సూర్యోదయ కాలమున....

"శ్రావణేమాసి నక్షత్రే శ్రవణే హరివాసరే ।
కుండలోద్భాసి గణ్డాస్త్రం ఉపవీతి సముజ్జ్వలమ్ ॥ 5-43
కౌపీనోద్భాసితం చైవ దీప్యమాన మివశ్రియా ।
ఛిత్రాణం వానరాణాం చై రూపమత్యద్భుతం మహత్ ॥ 5-44
రక్తాస్య పుచ్ఛ మూలస్తు సువర్ణ సదృశ ద్యుతిమ్ ।
అతోఽయం జాత మాత్రోఽపి నితరాస్తు బుభక్షితః ॥ 5-55

శ్రావణ మాసమున శ్రవణా నక్షత్రమున ఏకాదశి తిథియందు కుండలములచే కపోల ప్రదేశములు ప్రకాశించుచుండగా, యజ్ఞోపవీతము మెరయుచుండగా, కౌపీన ధారియై శోభాయుక్తుడై, వానర రూపమును ధరించి, ముఖము తోక మొదళ్ళలో ఎఱుపురంగు, అన్యత్ర బంగారుకాంతి కలిగిన పరాక్రమవంతుడగు పుత్రుని ప్రసవించినది.

ఆకలితో వున్న ఆంజనేయుడు అప్పుడు యెఱ్ఱని రంగుతో విరాజిల్లుతున్న సూర్యమండలమును చూచి ఫలమని భావించి, శ్రీవేంకటాచల పార్శ్వము నుండి ఉదయాద్రి శిఖరముపైకి ఎగిరాడు. అచట సూర్యబింబమును పట్టుకొన ప్రయత్నించగానే చరాచరాత్మక ప్రపంచమంతయు ఆహాకారములు నొనర్పగా, అంత బ్రహ్మ ఆ బాలుని చంపవలెనని కోపముతో బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా, ఆ బాలుడు విలాసముగా తన తోకతో దానిని త్రోసి వేసి స్వస్థత చెందాడు. బ్రహ్మచే విసరబడిన ఆ అస్త్రము నిరాకరింపబడుట చూచి దేవతా సమూహమంతయు ఆశ్చర్యచకితులైరి. హనుమంతుడును సూర్యుని చూచి దుః ఖవంతప్తుడై బ్రహ్మాస్త్రము తగిలినంతనే భూమిపై పడ్డాడు. అంజనాదేవి ఈబాలునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించితిరే అని బోరు బోరున విలపిస్తూండగా దేవతలందరు అచటకు వచ్చి ఆమెను ఊరడించుచు ఇట్లు పలికిరి. అంజనా! నీవు దుఃఖించవలదు. బుద్ధిశాలియగు నీ పుత్రునకు దుర్లభమైన వరములను ప్రసాదించుచున్నాము.

దేవదానవగంధర్వ యక్షరాక్షస సమూహముల చేతను, పిశాచముల చేతను, దేవయోని విశేషముల చేతను యీ హనుమంతుడు చంపబడకుండుగాక! శస్త్రములచేతను, బాణములచేతను చంపబడకుండుగాక! బలము చేతను పాండిత్యము చేతను అందరిని మించియుండవలెననియు, శత్రువుచే నెదిరింప శక్యుడై యుండునని వరములు ప్రసాదించిరి. మరల ఆ బ్రహ్మదేవుడు ఆమెతో అంజనా! నీవు శేషాచలమున తపమాచరించి ముల్లోకములకు మేలు చేయుటకు

పుత్రునకు జన్మనిచ్చితివి గాన ఈ పర్వతము నీ పేరున 'అంజనాచల'ముగా ప్రఖ్యాతిగాంచునని అనుగ్రహించారు.

### 9.4. వరాహపురాణములో హనుమజ్జననము

పూర్వకాలంలో వానర వంశములో పుట్టిన కేసరి మహారాజు కలడు. అతని భార్య అంజన. పతిభక్తి పరాయణురాలు. ఆమె సంతానం కలుగనందుకు విచారించి ఋష్యమూక పర్వతమున ఆశ్రమము ఏర్పరచుకొని తపమాచరించింది. ఒకనాడు అటుగా వచ్చిన మాతంగమహర్షి ఆమె విషయం తెలుసుకొని, ఆమెకు నారాయణాష్టక్షరి మంత్రం ఉపదేశించాడు. భర్త సహాయముతో ఘోరతపమాచరించింది. ఒకనాడు ప్రాతః కాలంలో అంజన స్నానమాడి వస్త్రములు ధరింపు సమయంలో వాయుదేవుడు ఆమెను చూచి మోహించాడు. అంతకుముందు తారకాసురవధార్థము కుమారస్వామిని ఉద్ధరించుటకై దేవతలు ప్రార్థించగా శివుడు తన వీర్యము అగ్నిహోత్రునియందు ఉంచాడు. మహాబలవంతుడయిన వాయుదేవుడు ఆ వీర్యాన్ని అపహరించి తనయందు ఉంచుకొని ఆ వీర్యాన్ని ఆమెయందు ప్రవేశపెట్టాడు. అపర పురుష స్పర్శకు అంజన శపింపబోవ, అతడు ఆమెను శాంతింపజేసి అమృతము తాగిన సుర స్పర్శచే పాతివ్రత్య భంగము జరగదని "ఈశ్వరాంశసంభూతుడు, మహాబలవంతుడయిన పుత్రుడు జన్మిస్తాడని చెప్పి అదృశ్యుడయ్యాడు.

అంజనాదేవి మహానిష్ఠతో తపమాచరించుచూ వైశాఖ బహుళ దశమినాడు పుత్రుని కన్నది. అపుడు ఆకాశవాణి ఇతడు ఆంజనేయుడు అను పేరు గలవాడై, దైవకార్యములనేకము నెరవేర్చి, చిరంజీవిగా వర్ధిల్లుతాడని పలికింది. అంజనా కేసరులు ఆ బాలుని అల్లారుముద్దుగా పెంచుచుండిరి. ఒకనాడు ఆకలితో ఏడ్చుచున్న బాలునికి పండ్లు తెచ్చుటకు అంజన అడవికి వెళ్ళగా బాలుని దృష్టి ఆకాశమందు ఉదయించుచున్న సూర్యుని మీద పడింది. అది ప్రాతఃకాలం అగుటచే అరుణకాంతులు వెదజల్లుతున్న సూర్యుని చూచి

అది పండని భ్రమించి, దానిని తినుటకు ఆకాశంలోకి ఎగిరాడు. ఆ బాలుడికి వేడి తగలకుండా వాయుదేవుడు హిమవంతమైన చల్లగాలులు అతనిపైకి ప్రసరింపజేయుచున్నాడు. అదే సమయంలో తనవైపు వచ్చు బాలుడు ఎవరని తన దివ్య దృష్టితో తెలుసుకొని అతడు శంకరాంశగా జన్మించిన వానరబాలుడిగా గుర్తించి తన కిరణ తీవ్రతను తగ్గించుకొన్నాడు. ఇట్లు బాలుడు సూర్యునిపైకి ఏగి అతని రథముపై ఎక్కి ఆడుకొనుచున్నాడు. ఆ సమయమునందు గ్రహణ కాలము సమీపించగా రాహువు సూర్యుని గ్రహించుటకు రాగా, రథము నందుగల అంజనీసుతుడు ముష్టి ఘాతము ప్రయోగించాడు. ఆ దెబ్బకు తాళలేక రాహువు ఇంద్రునకు తెలియజేశాడు. అంతట ఇంద్రుడు వజ్రాయుధముతో ఆ బాలున్ని కొట్టగా హనువు (చెక్కిలి భాగము) విరిగిపోయింది. బాలుడు క్రిందపడి మూర్ఛిల్లాడు. వాయుదేవుడు ఆ బాలుని ఒక గుహయందు దాచి, ఒక్కసారిగా వాయుప్రసారము స్తంభింపజేసాడు. లోకాలన్నియు స్తంభించిపోగా, ఇంద్రుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి చెప్పగా, బ్రహ్మదేవుడు బాలుని పునరుజ్జీవుని జేశాడు. అపుడు వాయుదేవుడు యథాప్రకారముగా వాయు ప్రసరింప జేశాడు. బ్రహ్మదేవుడు ఇతడు సామాన్యుడు కాడు. దేవకార్యసాధనకై ఉద్ధరించినాడు. కావున మీరు అందరు వరములు ఇచ్చి ఇతనికి శక్తి ప్రసాదింపుడని పలికెను. దేవతలందరు తమ తమ శక్తులను బాలుడికి ప్రసాదించిరి. సూర్యుడు ఇతడికి విద్యాభ్యాసము నేర్పెదనని అనుగ్రహించాడు. ఇట్లు కొంతకాలానికి అంజన ఆంజనేయుని సూర్యుని కడకు విద్యనేర్పడానికి పంపింది. సూర్యుని కడ సకలశాస్త్రములు వేదవేదాంగాలు సమస్త విద్యలు నేర్చిన పిమ్మట గురుదక్షిణ సమర్పించదలచానని చెప్పగా, అంతట సూర్యుడు నీవు త్రేతాయుగ రాక్షస సంహార సమయంలో శ్రీరామునికి సహాయపడగలవు. అప్పటివరకు నా కుమారుడు సుగ్రీవుని కడ మంత్రిగా ఉండవలెనని హనుమంతుని ఆజ్ఞాపించాడు.

### 9.5. శ్రీ శివమహాపురాణములో హనుమజ్జననము

ఒకప్పుడు విష్ణువు ధరించిన మోహినీ రూపమును చూచి శంకరుడు మనోవికారము నొందినవాడై రామ కార్యార్థము స్వవీర్యమును విడిచాడు. అట్టి శివవీర్యమును సప్తర్షులు - శివప్రేరితులై ఒకానొక ఆకులో దాచియుంచి గౌతమ పుత్రికయగు అంజనీదేవి చెవిలో వేయగా ఆమె గర్భవతియై ప్రసవము జెందెను.

**తతశ్చ సమయే తస్మా ద్ధనూమానితి నామభాక్ ।**
**శంభుర్జజ్ఞే కపి తను ర్మహాబల పరాక్రమః ॥** (శివ మహాపురాణం)

అటుపిమ్మట నుసమయమునందు శంకరుడు - గొప్ప బలపరాక్రమములు గల వానర శరీరముతో హనుమంతుడను పేరు గలవాడై అంజనీ గర్భమునుండి జన్మించాడు.

ఒకప్పుడు వేకువజామున అంజనేయుడు సూర్యబింబమును చిన్న పండుగా తలచి మ్రింగివేసాడు. హనుమంతుడు శివాంశసంభూతుడని భావించి దేవతలు ప్రార్థించినందున రవిబింబమును విడచిపెట్టాడు. దేవర్షులు అనేక వరములను అతనికిచ్చిరి. తరువాత హనుమంతుడు సంతోషాతిశయమున తన తల్లిని జేరి సూర్యబింబమును మ్రింగి మరల బయటపరచిన వృత్తాంతము జెప్పగా, అంజనీదేవి సూర్యునివద్ద విద్యలను నేర్చుకొనుమని కుమారునకు సూచించినది.

అటులే హనుమంతుడు సూర్యభగవానుని చెంతకు ప్రతిదినము వెళ్ళుచు పదునెనిమిది విద్యలను నేర్చుకొన్నాడు. పిమ్మట సూర్యదేవుని ఆదేశానుసారము, తల్లి అనుమతి పొంది, సూర్యాంశ సంజాతుడగు సుగ్రీవుని సమీపించాడు.

### 9.6. పరాశర సంహితలో హనుమజ్జననము

పరాశరమహర్షి మైత్రేయ మహర్షికి హనుమజ్జన్మ కథనము చెప్పుచూ మైత్రేయా! విశ్వకర్మకు మహాసాధ్వియగు ఛాయ యను పేరుగల కుమార్తె కలదు.

ఆ విశ్వకర్మ ఆమెను సూర్యునకిచ్చి వివాహము చేసాడు. ఆమె సూర్యుని తేజస్సును సహింపలేకపోయింది. అంతతల్లిచే అడుగబడినదై, పతికడ తానుండలేని రీతిని చెప్పింది. కుమారై మాటలను విని ఛాయాదేవి తల్లి తన భర్తతో చెప్పగా, భార్య మాటను విన్న విశ్వకర్మ సూర్యుని సానబట్టి తక్కువ తేజస్సుకల వానినిగా చేసాడు. సూర్యుని నుండి వేరైన కిరణముల నుండి సువర్చలయను కన్య ఉద్భవించింది. బ్రహ్మాది దేవతలందరును ఆమె సౌందర్యమునకు ఆశ్చర్యచకితులైరి. ఇంద్రాది దేవతలందరు బ్రహ్మ వద్ద కేగి ఓ బ్రహ్మదేవా! ఈమెకు భర్త యెవ్వరు కాగలరు? మాకు చెప్పవలసిందని అడిగారు. అంతట బ్రహ్మ హనుమంతునకు ఈమె భార్యకాగలదని చెప్పగా. వారు బ్రహ్మ అనుమతితో స్వస్థలమునకు వెళ్ళిపోయారు.

ఒకరోజు రాక్షసుల బాధలు తట్టుకోలేక బ్రహ్మ మహేశ్వరులు, ఇంద్రాది దేవతలందరూ వైకుంఠమున కెళ్ళి మహావిష్ణువుకు విన్నవించుకోగా. అంతట శ్రీహరి రాక్షసనాశనము తప్పక జరుగునని పలికి బ్రహ్మేంద్రాది దేవతల తేజస్సులతో తన తేజస్సును సంగ్రహించి ముద్దగా జేసి ఈశ్వరునికిచ్చాడు. దాని నీశ్వరుడు మ్రింగాడు. అంత విష్ణువు దేవతలారా! ఈ తేజస్సు నుండియే బలవంతుడగు వానరుడు ఉద్భవించగలడు.

కొంతకాలము గడచిన పిమ్మట పరమేశ్వరుడు పార్వతీదేవితో గూడి శ్రీవేంకటాచలము నందు విహరించుచుండగా రతి యందిష్టము కల్గి ఆడుకొను కోతి జంటను చూచారు. సర్వజ్ఞుడగుట వలన పరమేశ్వరుడు, పార్వతీదేవి అభిప్రాయము తెలిసికొనినవాడై కపి రూపము ధరించినవాడై కపిరూపము ధరించిన మంగళరూపయగు పార్వతీదేవితో కలిశాడు.

ఆ మహనీయుడగు శివుడు వేయిసంవత్సరములు ఆమెతో క్రీడించినవాడై విష్ణువుచే నీయబడిన తేజస్సును ఆ పార్వతీదేవి గర్భమునందు ప్రవేశపెట్టి రతి చాలించాడు. ఆ తేజస్సును భరింపలేనిదై పార్వతి దానిని అగ్ని

యందుంచినది. అగ్నిదేవుడు గూడ దానిని దాల్ప అశక్తుడై వాయువునందు ప్రవేశపెట్టాడు.

అగ్నే చిక్షిప తత్తేజః పార్వతీ ధారణాక్షమా । (పరాశర సంహిత)
సచాప్య శక్త స్తద్వాయౌ నిక్షిపన్ విసర్గహా ॥ పుట. 88

ఆ సమయమున కేసరి భార్యయగు వానరజాతి అంజనాదేవి గొప్ప బలవంతుడగు పుత్రుని కోరినదై ఇంద్రియములన్నింటిని నిగ్రహించినదై తపస్సు చేసినది. ఆమె యందనుగ్రహము కలవాడై వాయువు ప్రతిదినము ఫలమును అర్పించుచు ఒకప్పుడు తినుటకై ఆమె చేతిలో నీ తేజస్సును అర్పించాడు. ఆమె దానిని ఫలమనుకొని భక్షించింది. అనతికాలములోనే ఆమె గర్భము దాల్చగా, తనపాతివ్రత్యమునకు భంగము కల్గినే యని భయపడగా, ఆ అంజనతో ఆకాశవాణి ఓ అంజనాదేవీ ! నీకు వ్రత భంగమేమియు కాలేదు. దుఃఖింపవలదు. భగవదనుగ్రహము వల్ల నీ గర్భమున గొప్ప వ్యక్తి పుట్టగలడు.

వైశాఖేమాసి కృష్ణాయాం - దశమీ మందసంయుతా ।
పూర్వప్రోష్ఠ పదాయుక్తా - తథా వైధృతి సంయుతా ॥ పు. 89

వైశాఖ మాసమున కృష్ణపక్షమున దశమీ తిథి శనివారముకాగా పూర్వాభాద్రా నక్షత్రము వైధృతీ యోగము కలనాటి మధ్యాహ్న సమయమున అంజన పుత్రుని కనెను. అతడు మహాబలసంపన్నుడు, మిక్కిలి శక్తి కలవాడు, విష్ణుభక్తి తత్పరుడు, సమస్త శుభలక్షణములు కల్గియున్నాడు.

అటుపిమ్మట నాలుగైదు రోజులలో వచ్చిన అమావాస్యనాడు తల్లిని చూచి ఆ బాలుడు ఆహారము పెట్టవలసిందని అడిగాడు. అప్పుడామె కుమారా! ఎక్కడైన బాగుగ పక్వమునకు వచ్చిన పండు లభించిన తినుము అని పలుకగా, అందులకు ఆంజనేయుడు ఆనందించినవాడై వేగముగా ఆకాశమున కెగిరి ఉదయించుచున్న బాలసూర్యుని ఫలమనుకొని పట్టుకొన్నాడు. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధమునెత్తి ఆ బాలునిపై విసిరాడు. తన రోమముతో

వజ్రాయుధమును వ్యర్థపరచగా, మరల బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. దానిని కూడా ఆంజనేయుడు వ్యర్థపరచగా, అంతట బ్రహ్మాదిదేవతలు ఆంజనేయుని ప్రార్థించగా సూర్యుని విడిచాడు. ఈ ఆశ్చర్య విషయము గ్రహించిన ఇంద్రుడు ఏమరపాటుగనున్న బాలుడగు ఆంజనేయుని దవడపై వజ్రాయుధముతో కొట్టాడు. వెంటనే అతడు శిలాతలమున పడగా, మూర్ఛనందిన పుత్రుని చూచి వాయువు మిక్కిలి కోపమునందినవాడై అందరి దేహములందలి వాయువులను నిగ్రహించాడు. జగత్తంతయు చైతన్యము కోల్పోయింది.

అంతట బ్రహ్మ విష్ణు, ఈశ్వరుడు, ఇంద్రాది దేవతలు, గంధర్వులు సిద్ధులు, మహర్షులు సైతము వచ్చి వాయువును గూర్చి దేవతలకే లభ్యముగాని వరములు ప్రసాదించెదమని ప్రార్థించిరి. దీర్ఘాయువును, బలమును, పరాక్రమమును, ఆరోగ్యమును, బుద్ధిని, విద్యలను, తపస్సును, తేజస్సును, వాక్పటుత్వమును, ప్రసన్నతను, చతురతను, ధైర్యమును, వైరాగ్యమును, విష్ణుభక్తిని, ఏ అస్త్రముతోను సమస్తదేవ గణ రాక్షస గణములతోను జయింపబడని శక్తిని ఇంకను పలురకముల శుభప్రదములగు వరములను ప్రసాదించి దేవతలు అదృశ్యులైరి.

మహాదేవుడు రుద్రుని తేజస్సు వలన దేవతల తేజస్సును మించిన ఈశ్వర తేజో దార్ఢ్యవంతుడవు. పార్వతీ గర్భమున సంభవించుటచే పార్వతీ గర్భుడను పేరుగలవాడవు, అగ్నిచే ధరింపబడుటవలన అగ్ని గర్భుడను పేరు గలవాడవునైదువు. అని స్తుతించిరి.

ఖరాసురుడనే రాక్షసుని వధించటానికి శివకేశవులు పందెం వేసుకున్నారు. ఓడినవారు గెలిచిన వారికి దాస్యం చేయాలి. శివుడు ప్రయత్నించి విఫలుడు కాగా విష్ణువు కృతకృత్యుడైనాడు. పరమేశ్వరుడు తన నిజరూపంతో విష్ణువుకు దాస్యం చేయుటకు వీలులేదు. కనుక పరమేశ్వరాంశ ఆంజనేయుని రూపంలో శ్రీరామావతారంలో శ్రీరామునకు దాస్య చేశాడు.

## 9.7. కిష్కింధాకాండ

రామలక్ష్మణులు సీతను అన్వేషించుచు పంపాతీరమున నుండగా సుగ్రీవుడు చూచి తనను చంపుటకై వాలిచే పంపబడినవారని భయపడి ఒకచోట నిలువక మనసు తల్లడిల్లి దిగులు చెందగా అపుడు హనుమ .......

"సంభ్రమ స్త్యజ్యతామేష సర్వై ర్వాలికృతే మహాన్ ।
మలయోఽయం గిరివరో భయం నేహాస్తి వాలినః ॥ 2-14 శ్లో

"శ్రతువు పాటు పడకుము. ఇది ఋశ్యమూకము. ఇచటకు వాలిగాని, వాలి సంబంధులు గాని రాలేరు. ధైర్యముగా నుండు" మని చెప్పాడు.

సుగ్రీవుని ఆదేశముచే హనుమ వారిని తెలుసుకొనుటకు కపిరూపమును విడిచి సన్యాసి (భిక్షు) రూపముతో రామలక్ష్మణులను సమీపించి నమస్కరించి మనోహరమైనగు వాక్కుతో వారిని ప్రశంసించుచు ఇట్లు పలికాడు.

మీరు రాజర్షితుల్యులు. దేవతుల్యులు మనోహరమగు రూపము కలవారు. తాపసవేషమును దాల్చి వనమునకెట్లు వచ్చారు? శ్రీమంతులు రూపసంపన్నులు, కాంతిమంతులగు మీరు దివ్య ధనస్సులను ధరించి ఇక్కడ వచ్చారు? దేవరూపులగు మీరు దేవలోకమునుండి గాని దిగి వచ్చిరా? జటామండలధారులునగు మీరు భూమికి దిగివచ్చిన చంద్ర సూర్యులా ప్రకాశించుచున్నారు. పొడవైన వర్తులములైన మీ బాహువులు ఆభరణములతో అలంకరించుకొనదగినవి కదా! అట్టి బాహువులను అలంకరించుకోకుండా ఏల వదిలారు? ఈ భూమండలమునంతను రక్షించుటకు మీరు తగుదురు ఇంతగా మాటాడుచున్న నాతో మాటాడరేమి? సుగ్రీవుడను వానరరాజొకడు కలడు. అతని సోదరుడు వాలి. ఆ వాలి సుగ్రీవుని దేశమునుండి వెడలగొట్టాడు. సుగ్రీవుడు పంపగా వచ్చిన హనుమంతుడను పేరు గల వానరుడను. సుగ్రీవుడు మీతో మైత్రిని కోరుచున్నాడు. అతని మంత్రిని నేను. అతనికి ప్రియమొనర్చవలెనని మీ వద్దకి భిక్షు రూపముతో వచ్చితినని రామలక్ష్మణులతో పలికాడు.

హనుమంతుని వాక్యములను విని రాముడు తమ్ముడగు లక్ష్మణునితో...

లక్ష్మణా! ఇతడు మహాత్ముడగు సుగ్రీవుని మంత్రి. నేనెవ్వరిని కలిసికోవలెనని గోరుచుంటినో, ఆ సుగ్రీవుడే మంత్రి ద్వారా నాకడకు వచ్చినాడు. ఈ వానరుడు నాయందును సుగ్రీవునియందు కూడ స్నేహము కలవాడు; మాటలాడుటలో కౌశలము కలవాడు. ఎట్లనగా...

**నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః ।**
**నా సామవేద విదుష శ్శక్య మేవం ప్రభాషితుమ్ ॥ 3 -28 శ్లో**
**నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతం ।**
**బహు వ్యాహరతా౽నేన నకించిదప శబ్దితమ్ ॥ 3-29 శ్లో**
**న ముఖే నేత్రయోర్వాపి లలాటే చ భ్రువోస్తథా ।**
**అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్ ॥ 3-30 శ్లో**

ఋగ్వేదమున శిక్షితుడు కాని వానికి, యజుర్వేదము మనస్సునందు ధరింపని వానికి, సామవేదమున పండితుడు కాని వానికి యిట్లు మాటడలాడుట సాధ్యము కాదు. ఇతడు వ్యాకరణశాస్త్రము ఆమూలాగ్రము అనేకమార్లు గురు ముఖమున వినియుండును. కావుననే చాలసేపు మాటలాడినను ఇతని మాటలలో కొంచెమైనను అపశబ్దము వెలువడలేదు. ఇతడు మాటలాడు సమయమునందీతని ముఖమందుగాని, నేత్రములందుగాని, లలాటమునగాని, కనుబొమలందుగాని, తక్కిన అవయములందుగాని ఎచ్చటను ఏంతమాత్రము వికారము నాకు తెలియకున్నది. కావున నీవితనితో మధురముగా మాటాడుము. అంతట లక్ష్మణుడు హనుమంతునితో ఇట్లు పలికెను.

హనుమా! మేము అయోధ్యా నగరాన్ని పరిపాలిస్తున్న దశరథ మహారాజు కుమారులము. రామలక్ష్మణులము. పితృవాక్య పరిపాలనగా అరణ్యంలో నివసించుచుండగా ఎవడో రాక్షసుడు మా వదినను (సీతమ్మను) అపహరించాడు. మేము సుగ్రీవునే వెదకుచున్నాము.

అంతట హనుమ రామా! మా ప్రభువు తన అన్న అయిన వాలివల్ల రాజ్యభ్రష్టుడయ్యాడు. అంతేకాదు, సుగ్రీవుని భార్యను అపహరించాడు. సుగ్రీవుడు తప్పక సీతాన్వేషణ మాచే జరిపించి మీకు తోడ్పడగలడు. అని పలికి హనుమ భిక్షు రూపం విడిచి, స్వస్వరూపం ధరించి, రామలక్ష్మణులను సుగ్రీవుని వద్దకు తీసుకెళ్ళి, వారి వృత్తాంతమంతా నివేదించాడు. హనుమ సమక్షంలో రామసుగ్రీవులకు అగ్ని సాక్షిగా మైత్రి ఏర్పడింది. ఇరువురు ప్రతిజ్ఞ చేశారు. రాముడు ప్రతిజ్ఞానుసారముగా ఒకే ఒక బాణముతో వాలిని సంహరించాడు. కిష్కింధారాజ్యానికి హనుమ సమక్షంలోనే సుగ్రీవుని పట్టాభిషిక్తుని చేశాడు.

తరువాత సుగ్రీవుడును రామునకిచ్చిన మాట ప్రకారంగా సీతామాత జాడ తెలుసుకునేటందుకు నలుదిక్కులకు వానరులను పంపాడు. దక్షిణదిక్కుకు జాంబవంత, అంగద, హనుమ మొదలగు వానరవీరులను నియోగించి నెలరోజుల గడువులో మీరు తిరిగి రావాలి అని ఆదేశించాడు. పిమ్మట రాముడు - హనుమను చూచి హనుమా! ఇదిగో ఈ అంగుళీయకం భద్రంగా నీ దగ్గర వుంచు నా నామాంకితమయిన ఈ ముద్రిక చూపితే జానకి నిన్ను విశ్వసిస్తుంది. నీ వల్లనే జానకి నాకు లభిస్తుంది అన్నాడు. సుగ్రీవుని ఆజ్ఞానుసారం వానరవీరులు నాలుగు దిక్కులకూ బయలుదేరారు.

దక్షిణ దిక్కునకు బయలుదేరిన హనుమ మొదలగు వానరవీరులకు ఋక్షబిలం ఎదురయింది. అలా ఋక్షబిలంలో ప్రవేశించి చాలాదూరం పోగా అచట కృష్ణాజినాంబరంతో ఓ వృద్ధ తపస్విని సాక్షాత్కరించింది. సహచరులతో హనుమ ఆమెను సమీపించి, వినయంగా అంజలి ఘటించి అమ్మా! మీరెవరు? ఈ బిలంలో ఎలా వుంటున్నారు. దీని కథ ఏమిటి ఇక్కడ ఏ వస్తువును చూచినా బంగారుమయంగా కనిపిస్తున్నది. ఇది ఎవరి తపః ప్రభావం వల్ల నిర్మితమయింది. అని ప్రశ్నించగా నాయనా! మయుడు పూర్వము దానవులకు విశ్వకర్మగా నుండెను. ఆ విశ్వకర్మ ఎన్నో సంవత్సరములు తపస్సు చేసి వర ప్రభావంతో

దీన్ని నిర్మించాడు. హేమ అనే అప్సరయందు మోహితుడయ్యాడు. అది తెలుసుకొని దేవేంద్రుడు పరాక్రమించి వజ్రాయుధంతో వానిని వధించాడు. అయితే ఈ మహాభోగాలన్నీ బ్రహ్మానుగ్రహం వల్ల హేమకు లభించాయి. నేను మేరు సావర్ణి పుత్రికను. నా పేరు స్వయంప్రభ. హేమ నా ప్రాణసఖి. ఇంతకూ మీరెవరు? ఈ బిలం లోకి ఎలావచ్చారు. అని ప్రశ్నించగా ఆమెయిచ్చిన ఆతిథ్యం స్వీకరించి పిమ్మట హనుమ తల్లీ! అయోధ్యా నగరాన్ని పాలించిన దశరథ రాజకుమారుడు శ్రీరాముడు పితృ వాక్యపరిపాలకుడై, తమ్ముడైన లక్ష్మణునితో, భార్య జానకితో దండకారణ్యానికి వెళ్ళగా, అక్కడ రావణుడు జానకిని అపహరించాడు. వారు సీతను వెదుకుతూ ప్రభువయిన సుగ్రీవునితో స్నేహం చేశారు. మా చక్రవర్తి ఆజ్ఞానుసారం మేము సీతాన్వేషణం చేస్తూ యిలా వచ్చాము. ఆయన పెట్టిన గడువు దాటుతున్నది. మేము బిలంనుండి బయటపడే మార్గము చెప్పు తల్లీ! అన్నాడు.

నాయనా! ఇందులో అడుగుపెట్టినవారు ప్రాణాలతో బయటపడరు. అయినా ఒక మంచి పని కోసం మీరు తిరుగుతున్నారు. కనుక మిమ్మల్ని ఉద్ధరిస్తాను. అందరూ కన్నులు మూసుకోండి, అంది అంతేవారు కళ్ళు తెరిచేసరికి వానరులందరు సముద్రం ఒడ్డున వున్నారు.

పిమ్మట అపారమైన సముద్రమును దాటుటకు శక్తిలేక వానరులు దుః ఖితులై విచారించుచుండిరి. వారు దక్షిణదిక్కున వెదకి నెల దాటుటచే ప్రాణములందాశ వదలి సముద్రతీరమున మరణించుటకు ప్రాయోపవేశము చేయుటకు సంసిద్ధులయ్యారు. ఆ వానరుల మాటలను వినిన జటాయువు సోదరుడయిన సంపాతి లంకలో సీతమ్మ ఉన్నదనియు, నూరు యోజనముల సముద్రమును దాటి వెళ్ళిన చూడగలరని తెలియచేసింది. అప్పుడు వానరులందరు తమతమ బలము యేపాటిదో తెలియజేశారు. హనుమ మాత్రము ఏకాంత ప్రదేశమున మౌనము వహించి యుండగా, అపుడు జాంబవంతుడు

హనుమంతుని సమీపించి, జనన వృత్తాంతము తెలియజేశారు హనుమా! వంద యోజనములు కలిగిన మహాసముద్రమును దాటిరాగల శక్తి సామర్థ్యము లున్నవాడవు. అని ఇలా ప్రోత్సహించాడు.

**బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్త్వంచ హరిపుంగవ ।**
**విశిష్టం సర్వభూతేషు కిమాత్మానాం న బుధ్యసే ॥ 66 -7 శ్లో**

వానరశ్రేష్ఠుడా! బలము, బుద్ధి, తేజము, ధైర్యము, నీకు సకల భూతములంకంటెను విశిష్టములు. నీవేల నిన్ను తెలియకున్నావు.

హనుమా! నీ పరాక్రమము నీ వానర సేనయంతయు చూడ గోరుచున్నది. వానరోత్తమా! నీవింక లేచి యీ మహాసముద్రము లంఘింపుము. అప్పుడు అంగదుడు మొదలగు వానరులందరూ హనుమను ప్రశంసచేస్తూంటే హనుమ మేరు పర్వతమంత మహాకాయము ధరించినవాడై వానరులతో ఓ వానరులారా! నేను వేగమున వాయువునకు సాటియైన వాడును. గరుడునకు సమానుడను. నేను పదివేల యోజనముల వరకు దాటగలనని నా అభిప్రాయము.

**వాసవస్య సవజ్రస్య బ్రహ్మణో వా స్వయంభువః ।**
**విక్రమ్య సహసా హస్తా దమృతం తదిహానయే ।**
**లంకాం వాపి సముత్క్షిప్య గచ్ఛేయమితి మేమతిః ॥ 67-29**

వజ్రాయుధము దాల్చిన యింద్రుని గాని, స్వయంభువగు బ్రహ్మను గాని నా పరాక్రముచే జయించి వారి చేతి నుండి అమృతము ఇచటకు తెచ్చెదను. లంకనే లేవనెత్తికొని రాగలనని నాయభిప్రాయము. అని పలికి హనుమ గర్జించుచుండగా, వానరులు పరమానందము నంది ఆశ్చర్యముతో హనుమను చూశారు.

హనుమ మహేంద్రపర్వతమును అధిరోహించి సముద్రమును దాటుటకు ప్రయత్నించడముతో సుందరకాండ ప్రారంభమగును.

### 9.8. సుందరకాండ

బ్రహ్మాండపురాణము రామాయణ మొక్క మంత్రమని చెప్పి సుందరకాండము సమస్త మంత్ర రాజోఽయమ్మని ప్రశ్నించినది. ఈ సుందరకాండ వాల్మీకీయ రామాయణమునకు హృదయము. బ్రహ్మాండ పురాణములో రామాయణ పారాయణమునకై శ్రీరామధ్యాన పద్ధతులను ఒక్కొక్క కాండమునకు ఒక్కొక్కటి చొప్పున చెప్పుచు సుందరకాండకు ఇట్లు చెప్పినది.

చంద్రబింబ సమాకారం వాంఛితార్థ ప్రదాయకమ్ ।
హనుమత్సేవితం ధ్యాయేత్ సుందరేకాండ ఉత్తమమ్ ॥

### 9.8.1. సుందరకాండలో హనుమ

హనుమ సముద్రమును దాటుటకు ఉద్యుక్తుడై మహేంద్ర పర్వతమును అధిరోహించి -

"తతో రావణ నీతాయాః సీతాయాః శత్రుకర్శనః । (సుందరకాండ)
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి ॥ 1-1

తరువాత శత్రువులను కృశింపచేయగల హనుమ రావణునిచే తీసికొని పోబడిన సీత స్థానమును అన్వేషించుటకు దేవగాయకులగు చారణులు సంచరించు ఆకాశమార్గమున వెళ్ళవలెనని సంకల్పించాడు. పిమ్మట

స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే । (సుందరకాండ)
భూతేభ్యశ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్ ॥ 1-8
అంజలిం ప్రాఙ్ముఖః కుర్వన్ పవనాయాత్మ యోనయే ।
తతో హి వవృధే గన్తుం దక్షిణో దక్షిణాం దిశమ్ ॥ 1-9

హనుమ సూర్యునకు, ఇంద్రునకు, వాయువునకు, బ్రహ్మకు భూతములకు నమస్కరించి తూర్పు దిక్కుగా తిరిగి తన ఆత్మకు కారణమైన వాయువునకు నమస్కరించి, దక్షిణ దిక్కునకు పోదలంచి శరీరమును పెంచాడు.

సముద్ర లంఘనము చేయదలచిన హనుమ తన చుట్టునున్న వానరులతో ఇట్లు పలికెను.

**యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసన విక్రమః । (సుందరకాండ)**
**గచ్ఛేత్తద్వద్గమిష్యామి లంకాం రావణపాలితామ్ ॥**
**నహిద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్ ॥ 1-40**

రాముడు వదలిన బాణము ఎట్లు వాయువేగముతో పోవునో అట్లే నేను రావణుడు పాలించు లంకలో ప్రవేశిస్తాను. లంకలోగాని సీతమ్మ కనపడకపోతే అదే వేగముతోనే స్వర్గమునకు వెళ్ళుతాను. అక్కడ కూడా సీతమ్మ కనిపించకపోతే రావణుని బంధించి తెస్తాను లేదా లంకానగరాన్ని పెకలించి తీసుకువస్తాను. ఏమైనను పని పూర్తి చేసికొనే తిరిగి వస్తానని పలికి వానరోత్తముడగు హనుమ మహేంద్ర పర్వతమునుండి ఆకాశమున కెగిరాడు.

ఇట్లు త్వరితముగ సాగుచున్న హనుమను జూచి దేవతలు పుష్పవృష్టిని కురిపించిరి. సూర్యుడు ఎక్కువ తాపము లేకుండా చేశాడు. వాయువు అనుకూలముగ సేవించాడు. ఇలా సాగరము దాటుతున్న హనుమకు కష్టం కల్గరాదు. ఇతను మార్గ మధ్యమున విశ్రమించునట్లు చేయుట నా కర్తవ్యము అని తలచి సాగరుడు తనలో దాగియున్న పర్వత శ్రేష్ఠుడగు మైనాకునితో ఓ మైనాకా! హనుమ రామకార్యమును సాధించుటకు నీ మీదుగా ఆకాశమార్గమున పోవుచున్నాడు.

ఇక్ష్వాకు వంశజుడగు రాముని సేవించు ఈ హనుమకు నీవు సహాయము చేయవలెను. నాకు ఇక్ష్వాకు వంశీయులు పూజనీయులు. నీకు కూడా పూజనీయులు. నీవు నీటినుండి పైకి రమ్ము. ఇతనిని నీ శిఖరములపై విశ్రమింపనిమ్ము. అని పలుకగా వెంటనే మైనాకుడు సాగరుని ఆజ్ఞగా సముద్రము నుండి బంగారు శిఖరములతో పైకి రాగా హనుమంతుడు ఆ పర్వతమును చూచి తన ప్రయాణమునకు విఘ్నముగా తలచి ఆ హనుమంతుడు మైనాకుని

పడగొట్టగా అంతట ఆ మైనాకుడు హనుమంతుని బలమును తెలిసికొని పులకిత గాత్రుడై ఆనందముతో ఆ మైనాకుడు వెంటనే మనుష్యరూపమును ధరించి తన శిఖరముపై నిలచి హనుమంతునితో హనుమా! నీకు నమస్కారము. నీకు ఆతిథ్యమిచ్చి నీ శ్రమ తగ్గించడానికి వచ్చిన మైనాకుణ్ణి నేను. రామదూతకు తోడ్పడవలసిందని సాగరుడు నన్ను ఆదేశించాడు. ఏలనగా సగరు వంశజుల చేతనే కదా సముద్రుడు వర్ధిల్లినది? ఈ బాంధవ్యాన్ని గౌరవించి నీవు నా శిఖరముపై కొంత విశ్రాంతి తీసుకువెళ్ళితే రామకార్యాన్ని చక్కగా నిర్వహించగల్గుతావు. నిన్ను పూజించినచో ఆ వాయువునే పూజించినట్లగును. కావున నా ఆతిథ్యమును స్వీకరించి, నాకును సముద్రమునకును, సంతోషము కల్గింపుము. అని మైనాకుడు పలుకగా, అంతట ఆ హనుమ ...

> ప్రీతో౽స్మి, కృత మాతిథ్యం, మన్యురేషో౽పనీయతాం ।
> త్వరతే కార్యకాలో మే, అహశ్చాప్యతి వర్తతే ॥ (సుందరకాండ)
> ప్రతిజ్ఞా చ మయా దత్తా, న స్థాతవ్య మిహాన్తరే । 1-131,132

ఓ మైనాకుడా! నీ అతిథ్యానికి నేను సంతోషించాను. దిగులుని పట్టుపట్టకుము. కార్యమునకు వేళ మీరుచున్నది. ప్రొద్దుపోవుచున్నది. ప్రతిజ్ఞ చేసితిని? మధ్యలో ఆగరాదు. హనుమ ఇట్లు పలికి పర్వతమును చేతితో స్పృశించి మందహాసముతో ఆకాశములో ముందుకు సాగాడు. ఇది హనుమ చేసిన రెండవ దుష్కర కర్మ. దానిని జూచి ఋషులు, సిద్ధులు ప్రశంసించిరి. పిమ్మట దేవేంద్రుడు మైనాకుని యెదుట ప్రత్యక్షమై నేను నీకు అభయమిచ్చుచున్నాను. అని పల్కగా మైనాకుడు పరమానంద భరితుడయ్యాడు.

వాయువేగముతో వెళుతున్న హనుమంతుని బలపరాక్రమాలు చూడదలచి దేవతలు, గంధర్వులు, ఋషులు నాగమాత సురసతో – సాగరము మీద సాగుతున్న హనుమకు ముహూర్తకాలము విఘ్నమొనరించవలెను. ఎలా విఘ్న మొనరించాలంటే...

రాక్షసం రూపమాస్థాయ సుఘోరం పర్వతోపమమ్ । (సుందరకాండ)
దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్ ॥1-147 శ్లో

నిన్ను ఉపాయముతో జయించునో లేక భీతిల్లి విషాదము నొందునో చూడవలెనని కోరిరి. దేవతలు వచనానుసారం సురస రాక్షస రూపమును దాల్చి హనుమ మార్గమును అడ్డగించి ఓ వానరా! దేవతలు నిన్ను నాకాహారముగా నిర్ణయించారు. నేను నిన్ను భక్షించెదను. నాముఖమున ప్రవేశించుము. అపుడు హనుమ సంతోషముతో నాగమాతకు నమస్కరించి, సురసతో అమ్మా! శ్రీరాముడు ధర్మ పత్నియైన సీతమ్మను రావణాసురుడు అపహరించాడు. రాముని ఆజ్ఞగా ఆమె వద్దకు నేను దూతగా వెళ్ళుచున్నాను. నీవు కూడ ఆ రామునికి సాయము చేయుము.లేదా, సీతమ్మను దర్శించి, మరల రామచంద్రునకు తెలియజేసి నీ నోటిలో ప్రవేశించెదను. నామాట విశ్వసించుము అని పలికాడు.

అంతట సురస నన్నుదాటి వెళ్ళుటకు వీలులేదు. ఇది నాకు దేవతలిచ్చిన వరము. ఇప్పుడే నానోట నీవు ప్రవేశింపవలెనని వందయోజనములు నోరు తెరచింది. హనుమ వెంటనే తన శరీరమును సంకోచింపజేసి అంగుష్ఠమాత్రుడై ఆమె నోటిలో ప్రవేశించి, వెలువడి ఆకాశమున నిలచి ఉత్సాహంతో సురసతో....

ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తుతే ।
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీద్వరస్తవ ॥ 1-160 శ్లో

దాక్షాయణీ! నీ నోటిలో ప్రవేశించితిని నమస్కారము. వైదేహియున్న చోటునకు వెళ్ళగలను. నీకు దేవతలిచ్చిన వరము సత్యమాయెను కదా! అని పలుకగా, అంత సురస స్వరూపమును పొంది హనుమతో....

'అర్థ సిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్ ।
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా ॥ 1-162 శ్లో

ఓ వానరశ్రేష్ఠా ! హాయిగా ముందునకు సాగి కార్యసిద్ధి నొందుము.

మహాత్ముడగు రామునితో సీతమ్మను చేర్చుము." అని ఆశీర్వదించి అదృశ్యమయింది. ఇది మూడవ దుష్కర కర్మ. సాధు సాధు అని భూతములన్నియు ప్రశంసించినవి.

హనుమ వాయు వేగముతో సముద్రము మీదుగా సాగుతుండగా కామరూపిణియైన సింహిక అను రాక్షసి హనుమను జూచి "ఇంత కాలమునకు నాకు భోజనము దొరికినది. ఇంత పెద్ద జంతువు నాకు స్వాధీనమైనదని అనుకొని హనుమ నీడను పట్టి లాగుచుండెను. హనుమ ముందుకు వెళ్ళలేక వెనుకకు లాగివేయబడుతున్నాడు. ఇరుప్రక్కలకు మీద క్రింద చూచాడు. క్రింద సముద్రములో ఆ మహాభూతమును జూచి, సుగ్రీవుడు సముద్రములో నీడను బట్టి లాగెడి ఒక మహాసత్త్వమున్నదని చెప్పిన విషయము తలంచి అది యిదియే సింహికయని తెలుసుకొన్నాడు.

వెంటనే హనుమ తన శరీరమును పెంచగా, సింహికయు తగినంతగా నోరు పెద్దది చేసి అతనిని మ్రింగుటకు మీదకు రాగా, వెంటనే హనుమ తన శరీరమును సంకోచింప చేసి, దాని నోటిలో దూరి తన గోళ్ళతో దాని మర్మములను త్రుంచి మరల ఆకాశమున నిలచి, తన శరీరమును యథా పూర్వకముగ పెంచాడు.

సింహిక హృదయమును హనుమ త్రుంచుటచే ఆమె సముద్రములో పడెను. హనుమ చేసిన ఆ మహా భయంకరమగు కార్యమును జూచి దేవతలు, మహర్షులు వానరేంద్ర! నీ కథిమతమగు అర్థమును సాధించుము. అని పలుకుతూ......

**యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ ।**
**ధృతిః దృష్టిః మతిః దాక్ష్యం స్వకర్మసు న సీదతి ॥ 1- 189 శ్లో**

నీవలె ఎవనికి ధృతి, దృష్టి ,మతి, దాక్ష్యము ఉండునో అతడు తన కర్మలలో ఎన్నడును దిగులు పొందడు. అని పలికింది. ఈ సింహికను చంపుట

నాల్గవ దుష్కర కర్మ

అలా ముందుకు సాగిన హనుమకు అల్లంత దూరంలోనే సముద్ర తీరమున పర్వత పంక్తులు కనిపించాయి. తన దేహ పరిణామమును, వేగమును చూడగానే రాక్షసులు నేనెవ్వరో తెలిసికొనవలెనని, పట్టుకొనవలెనని సాహసించెదరని తలచి, తన దేహ పరిణామమును తగ్గించుకొన్నాడు. శోభాయమానంగా ప్రకాశిస్తున్న లంబ శిఖరంపై త్రికూట పర్వతం మీద దిగాడు. అమరావతివలె నున్న లంకానగరమును చూచి సంధ్యా సమయం కోసం నిరీక్షిస్తున్నాడు.

విశ్వకర్మ నిర్మించిన రావణ పాలిత లంకాపట్టణమును ధనుర్ధారులగు రాక్షసులు అంతట సంచరిస్తూ పరిరక్షిస్తున్నారు. అపుడా హనుమ లంకా పట్టణమును చూచి తనలో – ఇచటకి వానరులు వచ్చియు ఏమి చేయగలరు? దేవతలు కూడ లంకను యుద్ధములో జయింపలేరు. వాలిపుత్రుడగు అంగదుడు, అగ్ని పుత్రుడగు నీలుడు వాయుపుత్రుడునగు నేను, సూర్య పుత్రుడగు మారాజు సుగ్రీవుడు. ఈ నలుగురే ఇచటకు రాగలరు.

బలవంతులగు రాక్షసులచే పరిరక్షింపబడుచున్న వారిని వంచించి నేను లంకలో సీతమ్మను వెదకవలెను. నేను ఈ వానర రూపంతోనే బహు చిన్న దేహంతో రాత్రివేళ ప్రవేశింపవలెనని నిశ్చయించుకొన్నాడు. సూర్యుడు అస్తమించగానే తన శరీరమును సంకోచింపచేసికొని పిల్లి అంతయై హనుమ లంకా పట్టణములోకి ప్రవేశించి అడుగు ముందుకు వేయగా, రావణ పాలిత యగు లంక వికృతమగు ముఖము, వికృతమగు చూపులు కలదియై లేచి నిలచింది. భీకర గర్జన చేస్తూ, ఓ వనాలయా! నీవు ఎవడవు? నీకిచట ఏమిపని? నీ ప్రాణములుండగానే సత్యమును చెప్పుము. రావణ సైన్యముచే రక్షింపబడుచున్న ఈ లంకలో నీవు ప్రవేశింపజాలవు. అని లంక హనుమతో పలికెను.

అంతట హనుమ ఎదురుగా నున్న లంకను జూచి నీవు నన్నడిగిన

ప్రశ్నలకు సమాధానం అంతట చెప్పెదను. కాని నీవు ఈ పట్టణ ద్వారమున నిలచి, నన్నడ్డగించి, ఏల భయపెట్టుచున్నావు? నీవెవరవు? అని పలికాడు.

హనుమ మాటలను విని కామరూపిణియగు లంక కోపముగలదై పరుషముగా ఇట్లు పలికెను.

**అహం రాక్షస రాజస్య రావణస్య మహాత్మనః ।**
**ఆజ్ఞా ప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీమిమామ్ ॥**
**అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ । 3-28,29**

"మహాత్ముడు రాక్షసరాజగు రావణుని ఆజ్ఞను పాలించుచు నేనీ లంకానగరిని కాపాడుతున్నాను. నేనే లంకను. నన్ను ధిక్కరించి నీవు పట్టణమున ప్రవేశింపలేవు. నాచే దెబ్బతిని నీవిప్పుడే నేల కూలెదవు. అని లంక పల్కిన మాటలను విని ఏమియు జంకక కొండవలె నిలచి హనుమ..........

ప్రాకార తోరణములతో కూడిన లంకను చూడవలెనని వచ్చితిని. పట్టణమునంతను చూచుటయే నా రాకకు మూలమని చెప్పగా, అపుడు లంక ఓరీ దుర్బుద్ధీ! నన్ను జయింపనిదే నీవు ఈ నగరంలో ప్రవేశించలేవు. అపుడా కపిశ్రేష్ఠుడు నిశాచరితో ఒక్కసారి పట్టణమును చూచి మరల వెళ్ళి పోవుదునని పలుకగా, వెంటనే ఆమె భీకర గర్జన చేస్తూ, తన అరచేతితో వానరుని కొట్టినది. అప్పుడా వానరరాజు కోపముతో తన ఎడమచేతి పిడికిలితో ఆమె తలమీద కొట్టాడు. ఆ దెబ్బతో నిశాచరి నిశ్చేష్టురాలై, నేలకూలి గద్గద స్వరముతో వానరోత్తమా! అనుగ్రహించుము. రక్షించుము. నీవంటి బలవంతులు మర్యాదను పాటింతురు గదా! నీచే ఓడిపోయాను. పూర్వము బ్రహ్మ నాకొక వరము యిచ్చారు. ఏనాడొక వానరుడు పరాక్రమముచే నిన్ను జయించునో, అపుడు రాక్షసులకు కీడుకల్గునని గుర్తించుమని పలికాడు. ఆ సమయము నేడు ఆసన్నమైనది. సీతా నిమిత్తముగా రావణునికి, రాక్షసులకు వినాశము సమీపించింది. నీవు స్వేచ్ఛగా నగరంలో ప్రవేశించి సీతమ్మను వెదుకుము

అని పలికింది.

ఆ విధముగా హనుమ కామరూపిణియగు లంకను జయించిన వాడై శత్రువుల పట్టణము ప్రవేశించునపుడు ద్వారము గుండా ప్రవేశింపరాదు గనుక హనుమ అద్వారమున తన ఎడమ పాదము పెట్టి లంకలో ప్రవేశించి....

**భవనాద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః ।**
**వివిధాకృతి రూపాణి భవనాని తతస్తతః ॥ 4-9**

హనుమ వివిధాకృతి రూపములలో నున్న భవనముల యందొక భవనము నుండి వేరొక భవనమునకు పోవుచు సీతమ్మను వెదకాడు.

అలా ఆ హనుమ వెదకుతుండగా అప్సరసల వలె పాడుతున్న మధుర గానమును, రాక్షస సింహనాదములను, వేదమంత్రములను విన్నాడు. అంతేగాక రావణుని స్తోత్రం చేయుచున్న వారిని, భయంకరాకృతి కల్గిన రాక్షసులను, చిత్ర విచిత్రాలుగా నున్న రాక్షసులను వివిధ రకాలైన ఆయుధాలు ధరించిన వారిని లావుగా, సన్నముగా, నలుపుగా, తెలుపుగా, పొట్టిగా, పొడుగుగా వివిధ రూపములు గల రాక్షసుల నెందరనో చూశాడు. గాని సీతమ్మ జాడ కనిపించలేదు. బంగారు పూతతో ముత్యములతో అలంకరింపబడిన రావణుని అంతఃపురమున ప్రవేశించి, వివిధ భయంకరాకృతులైన స్త్రీలను చూచి సీతను కానక దుఃఖించాడు. మరల మఱియొక సారి వేగంగా సీతాన్వేషియై లంకలో రావణుని అంతఃపురములోని కక్ష్యలనన్నిటిని జూచి, పిమ్మట దగ్గరలో నున్న ప్రహస్త మహాపార్శ్వ, కుంభకర్ణ, విభీషణ, మహోదర, విరూపాక్ష, ఇంద్రజిత్తు మొదలగు వారి భవనములనన్నిటిని వెదకాడు.

ఇలా రాక్షస గృహములన్ని వరుసగా వెదకి, తిరిగి రావణుని భవనమునకు వచ్చాడు. అచట తిరుగుచు చతురంగబలాలను, లతాగృహములను, చిత్రశాలలను, క్రీడాగృహములను, రావణుడు కుబేరుని జయించి తెచ్చిన పుష్పకవిమానమున వెదకాడు. అట్టి పుష్పక విమానమున

హనుమ సీతమ్మ కానరాకపోవుటచే మిక్కిలి దుఃఖితుడయ్యాడు.

సప్త కక్ష్యలను దాటిన తరువాత ఆ హనుమ రావణ పత్నులు, రావణుడు శయనించు శయన మందిరమును దర్శించాడు. ఆ శయనమందిరమునందు రాజర్షికాంతలు, దైత్యకాంతలు, గంధర్వకాంతలు కామపరవశులై అస్తవ్యస్తంగా నిద్రించుచున్నారు. ఆ కామినీ జన గోష్ఠిలో అలసి హాయిగా దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసలతో నిద్రిస్తున్న రావణుని చూడడానికి హనుమ తానున్న చోటనుండి మరొక ఉన్నత స్తంభమును అధిరోహించాడు. వీరందరు పరున్న చోటగాక వేరుగా శయనముపై శయనించియున్న రూపసంపన్నయగు ఒక స్త్రీని చూశాడు. అంతఃపుర స్త్రీలలో ప్రధానురాలగు మండోదరిని జూచి హనుమ సీతమ్మ యనుకొని మహానందమును పొందాడు.

**ఆస్ఫోటయామాస చుచుంబపుచ్ఛం, ననన్ద చిక్రీడ జగౌజగామ ।**
**స్తంభానరోహత్ నిపపాత భూమౌ నిదర్శయన్ స్వాంప్రకృతింకపీనామ్॥**
**(10-54)**

మరల నేను దర్శించినది సీతమ్మ కాదని నిశ్చయించుకొన్నాడు. రామునితో వియోగమునొందిన సీత నిద్రింపదు, భుజింపదు, అలంకరించుకొనదు, పానము సేవింపదు, ఇంద్రుడైనను సరే పరపురుషుని సేవింపదు.

ఈమె రావణ పత్నులలో ఒకత్తె యుంటుందని తలచాడు. మరల హనుమ ఆ ప్రదేశమును విడిచి పానశాల, భోజనశాల యందు వెదకుతూ అర్ధ నగ్నంగా వివశలై నిద్రించే నారీ సమూహమును చూశాడు.

హనుమంతుని మనస్సు చివుక్కుమంది. పరస్త్రీని చూడటమే పాపంకాగా, ఈ నారీమణులను నగ్నంగా ఉన్నప్పుడు చూడడం మరెంత దోషం కల్గునో అనుకొని, మరుక్షణంలోనే ఇందరిలో సీత కనిపిస్తుందేమో అని చూశానే తప్ప, నా మనస్సులో మరే వికారమూ లేనప్పుడు నేను బాధ పడనవసరంలేదు.

సర్వ పుణ్య పాపాలకు మనస్సే ప్రధానం. నా మనస్సు ఇందరు స్త్రీలను చూచినా నిశ్చలంగా, నిర్మలంగానే వుంది. పైగా సీతాదేవి స్త్రీ జనమధ్యంలో కాక మరెక్కడ ఉంటుంది.అని అనుకుంటూ ఆ భవనమంతా మరోసారి వెదకి వెలుపలకు వచ్చి లతాగృహాలు,చిత్ర మండపాలు ఇలా అన్నీ గాలించినా సీతమ్మ కనపడలేదు! సీతామాత కానరాకపోవడముతో నేను సీతమ్మను చూడక సుగ్రీవుని వద్దకు వెళ్ళుట సాధ్యపడదు. సుగ్రీవుడు తీక్ష్ణముగ దండించు స్వభావము కలవాడు. అంతఃపురమంతయు వెదకాను. అంతఃపుర స్త్రీలనందరినీ చూశాను. పతివ్రతయగు సీత మాత్రము కన్పడలేదు. నా శ్రమ అంతయు వ్యర్థమయ్యెనని దుఃఖితుడయ్యాడు.

> **అనిర్వేద శ్రియో మూలం అనిర్వేదః పరంసుఖం ।**
> **అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ॥** (12-10)

దిగులు పడకుండ ఉత్సాహము కల్గియుండుట ఐశ్వర్యమునకు మూలము. ఉత్సాహమే ఉత్తమమగు సుఖము. ఉత్సాహమే సర్వార్థముల యందు మానవుని ప్రవర్తింప చేయును. మనము చేయు ఏ పనినైనను ఉత్సాహమే ఫలవంతముగా చేయును. అందుచే ఉత్సాహముతో మరల ప్రయత్నించదలచాడు. హనుమ వెదకిన ప్రాంతాలను విడచి భూబిల గృహములను, స్వేచ్ఛా విహారములను ఇలా పలుప్రాంతములలో వెదకిన హనుమ ఇచ్చట కూడ దేవ, దానవ,యక్ష, కిన్నెర, విద్యాధరుల స్త్రీలను చూచెనే కాని, సీతను కానక చింతించాడు. ఆ హనుమ **'చతురంగుళ మాత్రోఽపి నావకాశః న విద్యతే'** రావణాంతపురములో నాలుగు అంగుళముల మేరయైనను వెతకకుండ వదలలేదు.

హనుమ లంకలో సీతాదేవి కానరాకపోవడముతో చింతాక్రాంతుడై, సీతా రావణ భవనమున నున్నదని గృధ్రరాజగు సంపాతి చెప్పినది. కాని అమె ఎచ్చటను కానవచ్చుట లేదే అని పరిపరివిధములుగా తన మనసులో తలచాడు.

రామ బాణములకు భయపడి రావణుడు సీత నెత్తుకొని వెళ్ళుచుండగా ఆమె సముద్రమును జూచి హృదయమాగిపోయి యుండునా? లేదా రావణుని చేతులనిండి విడిపించుకొనుటకు ఇటునటు గింజుకొనుచు సముద్రములో పడియుండును? లేదా సీతమ్మ తన శీలమును కాపాడుకొనుచున్న ఈమె పట్టుదల నోర్వలేక రావణుడు భక్షించి యుండునా? లేదా రాక్షసరాజు భార్యలచే భక్షింపయుండునేమో? లేదా రామునినే ధ్యానిస్తూ సీత ప్రాణములను వదలి యుండునా? అట్లు సీత మరణించదు. రాముని కొఱకు ఆమె జీవించి యుండును.

సీతమ్మను చూడకుండ నేను వెనుకకు తిరిగి కిష్కింధకేగినచో ఏమి లాభము? నేనీ 100 యోజనముల సముద్రమును దాటుట వ్యర్థము. లంకలో ప్రవేశించుట వ్యర్థము. రాక్షసులను చూచుట వ్యర్థము.

కిష్కింధ కేగి రాముని చూచి 'సీతాదేవి కనపడలేదు' అని నేను చెప్పినచో రాముడు ప్రాణములను వీడును. రాముని యందు అధికమగు అనురాగము గల లక్ష్మణుడు, రాముడు ఆపదను పొందినాడని వినగానే తానును మరణిస్తాడు. సోదరులిద్దరు మరణించారని విని భరతుడు కూడా మరణిస్తాడు. మరణించిన భరతుని చూచి శత్రుఘ్నుడునూ మరణిస్తాడు. కుమారులు మరణించినారని తెలియగానే కౌసల్య, కైకేయి సుమిత్ర కూడ మరణింతురు. వీరేగాక సుగ్రీవుడు, రుమ,తార, అంగదుడు జాంబవంతుడు వానరులందరు ప్రాణములను వీడుదురు. నేను వెళ్ళినచో ఇక్ష్వాకుల కులము, వానరకులము కూడ నశించును. గనుక నేనిచట నుండి కిష్కింధా నగరికి వెళ్ళను. నేనిచటనే యున్నచో ధర్మాత్ములగు ఆ రామ లక్ష్మణులు ఆశచే బ్రతికియుందురు. వానరులు కూడ బ్రతికియుందురు.

కావున నేనిచటనే పండ్లు తినుచు వానప్రస్థుడనై యుండెదను. లేదా ప్రాయోపవేశము చేసి కాకులు, క్రూరమృగములు ఈ శరీరమును తినునట్లు వదలివైచెదను. అని తలచి మరల తనలో తాను ఇట్లనుకొనెను.

"వినాశే బహవో దోషాః జీవన్ భద్రాణి పశ్యతి"

చనిపోవుటచే ఎన్నో దోషములు సంభవించును. బ్రతికి యుండిన సుఖములను చూడవచ్చును. అందువల్ల ప్రాణములతో వుంటాను.

ఇప్పటినే నియతాహారుడైన ఇంద్రియ నియమముతో వుంటాను. నేను తిరిగి వెళ్ళిన నా వల్ల నరవానరులందరు నశిస్తారు. ఇట్లు [illegible]చుచుండగా అశోకవనము కన్పడినది. ఈ వనమును నేను వెతకలేదు. దీనియందు వెదుకుతానని తలచి ముందుగా...

**నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై ।**
**నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥**
**13-59**

సర్వదేవతలు, ఋషులు నాకు సిద్ధినొసంగుదురు గాక! బ్రహ్మ అగ్ని వాయువు, ఇంద్రుడు, వరుణుడు, సూర్యచంద్రులు,అశ్వనీ దేవతలు, మరుత్తు, శివుడు, సర్వభూతములు, సర్వభూతాధిపతియగు విష్ణువు నాకు సిద్ధి నొసంగుదురు గాక! అని సిద్ధిని ఒసంగునట్లు సర్వదేవతా సమూహమును ప్రార్థించి అన్ని వైపుల చూచి అశోకవనమును గూర్చి బయలుదేరాడు.

సీతాన్వేషణ తత్పరుడైన హనుమ అశోకవనమంతా తిరుగాడుతూ దట్టముగా ఆకులతో అలముకొనిన శింశుపా వృక్షమును అధిరోహించి సంధ్యా సమయమున సూర్య నమస్కారము చేయ సంకల్పము గల సీతమ్మ బ్రతికియున్నచో తప్పక ఈ నది వద్దకు వచ్చును. అని భావించి, ఎవరికి కానరాకుండా కూర్చిండి అంతయు చూచుచున్నాడు.

హనుమ సుందరమయమైన అశోకవనమందు బంగారుమయముగా ప్రకాశిస్తున్న వెయ్యి స్తంభములు కల్గిన చైత్యప్రాసాదమును చూచాడు. ఆ చెట్టు మీదనుండి చైత్యప్రాసాదమును చూచుచుండగా సీతమ్మను చూచాడు. ఆమె

మలినమైన వస్త్రమును దాల్చియున్నది. రాక్షసస్త్రీలు ఆమె చుట్టును ఆవరించి వున్నారు. ఉపవాసములచే కృశించి దీనురాలైయున్న ఆమెను చూచి హనుమకు ఈమె సీతమ్మ అవునా కాదా! యని సందేహము కల్గెను. ఈ క్రింది కారణముల వల్ల హనుమ ఆమె సీతమ్మయని తలచాడు.

సీతమ్మ అవయవముల యందు ఏ ఆభరణములుండునని రాముడు పేర్కొనెనో ఆ ఆభరణములన్నియు ఈ కొమ్మలపై కన్పడుచున్నవి. అచట ఋశ్యమూక పర్వతమున ఏ ఆభరణములను ఈమె పడవేసినదో అవి ఇచట లేవు. ఇచట నున్న ఆభరణములు అచట లేవు. కావున ఈ యాభరణములు సీతమ్మవే! ఈమె దాల్చిన వస్త్రము అనాడు కొండమీద నగలు మూట కట్టి పడవేసిన వస్త్రము వలె పచ్చగ బంగారురంగు కల్గియున్నది. అనాడీమె నగలకు కట్టిపడవేసిన వస్త్రము ఈమె ధరించిన వస్త్రములోని భాగమే. ఈమె శ్రీరామచంద్రమూర్తి ధర్మపత్ని సీతమ్మే అని నిశ్చయించి, మరల తనలో తాను ఇట్లనుకొనెను.

> అస్యా దేవ్యా మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్ ।
> తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి ॥ 15-52 శ్లో

ఈమె మనసు ఆ రాముని యందే యున్నది. ఆ రాముని మనసు ఆమె యందే ఉన్నది. అందుచే వీరు ఒకరి మనసు వేరొకరి యందుండుటచే జీవించియున్నారు. గాని ఎవరి మనసు వారిలోనే యున్నచో క్షణకాలము కూడ జీవింపరు.

సీతమ్మకు దూరమై రాముడింతకాలము శరీరము నెట్లు నిలపెట్టుకొనగల్గినాడో! చాలదుష్కరమైన పనిని చేసినాడు. శోకముతో శరీరము క్రుంగి యుండవలసియుండెను. కాని కఠినుడు గనుక బ్రతికియున్నాడు అనుకొనెను. సీతమ్మ కూడ దుఃఖముతో బాధపడుచుండుటము జూచి "కాలో హి దురతి క్రమః" ఎవ్వరికైనను కాలము మీర రానిది" అని తెలియుచున్నది.

ఆ సీతమ్మ...

**నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్ ।**
**ఏకస్థ హృదయా నూనం రామమేవాను పశ్యతి ॥ 16–25 శ్లో**

ఈమె రాక్షసస్త్రీలను చూచుటలేదు. పుష్ప వృక్షములను గాని, ఫలవృక్షములనుగాని కాంచుటలేదు. రామునియందే మనస్సు నిల్పి రామునే చూచుచున్నది. అలా శోకిస్తున్న సీతమ్మను దర్శించాడు.

ఆ వృక్షము పైననే ఆకుల మధ్య రహస్యంగా దాగికొని సమయానుకూలంగా ఆమెను పలకిరిద్దామని ఎదురుచూస్తున్నాడు. అంతలో తెల్లవారగుతుండగా, లంకా పట్టణమంతా వేదఘోష విరాజిల్లుతుండగా, రావణాసురుడు తన తల్పముపైనుండి లేచి సీతాదేవిని చూచుటకు అశోకవనమున ప్రవేశించాడు. సీతాదేవిని సమీపించి రావణాసరుడు ఎలాగైనా వశపరచుకోవాలని పరిపరివిధాలుగా ప్రలోభపెట్టాడు. అయినను సీతాదేవి రావణుని గడ్డిపోచతో సమానంగా భావించి మాట్లాడింది. అంతట రావణుడు ఆరునెలలు సమయమిచ్చి వెళ్ళిపోయాడు. ఇలా రావణుని దౌష్ట్యం ప్రత్యక్షంగా చూశాడు హనుమంతుడు. సీత ప్రాయోపవేశమునకు ప్రయత్నించింది. అంతలోనే శుభసూచకములు గోచరించింది.

అప్పుడు హనుమ సీతమ్మకు ఏ రూపంలో కనిపించాలి? ఏ భాషలో మాట్లాడాలి అని సందేహిస్తూ, తనది కూడా రాక్షస మాయ అని ఆమె భావిస్తే, కార్యం చెడుతుంది. దూతకార్యం చెడకూడదు. దేశకాల ఔచిత్యాలను దృష్టిలో పెట్టుకొని ప్రవర్తించాలి. తనను చూసి సీత భయపడకూడదు. అనుకొని చెట్టు కొమ్మల మధ్యలో నుండి చిన్నగా ఆమెకు రామవృత్తాంతము మృదు మధురముగా వినిపించేటట్లు ఇట్లు పలికాడు. కోశల దేశమునకు అయోధ్యానగరాన్ని రాజధానిగా చేసుకొని ధర్మయుక్తముగా రాజ్యాన్ని పరిపాలించిన దశరథ

మహారాజు కుమారుడు శ్రీరాముడు. తండ్రి ఆదేశానుసారము శ్రీరాముడు పితృవాక్యపరిపాలకుడై, తమ్ముడైన లక్ష్మణునితో, భార్య అయిన జానకితో రాజ్యమును వీడి వనమున కెళ్ళాడు. అచట మహారణ్యమునందు మృగము వెంట వేటకై రాముడేగి అనేకమంది కామరూపులగు రాక్షసులను సంహరించాడు. రాముడు జనస్థానమందు రాక్షసులను సంహరించాడు. ఖర దూషణులను సంహరించాడు. రావణుడు మోసముచే మాయతో మృగ రూపమున నున్న మారీచుడను రాక్షసునిచే రాముని వంచించి జానకిని అపహరించాడు.

రాముడు అడవిలో ఆ సీతనన్వేషించుచు వచ్చి సుగ్రీవుడను వానరునితో అగ్నిసాక్షిగా మైత్రి చేసుకొని వాలిని చంపి కిష్కింధా రాజ్యమున సుగ్రీవుని పట్టాభిషిక్తుని చేశాడు. సుగ్రీవునిచే ఆజ్ఞాపింపబడిన కామరూపులగు వానరులు అన్ని దిక్కులయందు సీతకై అన్వేషించుచు, సంపాతి మాటల వలన వంద యోజనముల సముద్రమును దాటి ఈ సీతమ్మ కొరకు వచ్చినాను.

> యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీం చ నిశ్చితామ్ ।
> అశ్రౌషం రాఘవస్యాహం సేయమాసాదితా మయా ॥ 31-15 శ్లో

ఎటువంటి రూపముతో ఎటువంటి రంగుతో, ఎటువంటి కాంతితో సీతమ్మ యుండుననీ రాముని వలన నేను వింటినో అట్టి సీతను నేను చూడగల్గితిని. అని హనుమ రామవృత్తాంతమును వివరించాడు.

రాముని వృత్తాంతమును ఆసక్తిగా వినిన సీతమ్మ అటు చెట్టు వైపు చూసింది. పరమాశ్చర్యము చెందినదై ఏమి ఈ వానరరూపము? చూచుటకు శక్యము గాకున్నదే అనుకొని ఇది స్వప్నమేమో తలచి, మరల ఈతడు స్పష్టమైన రూపముతో నాయెదుట మాటాడుచున్నాడని ఆలోచించినది ...

అపుడు హనుమ వినయముతో ఆ చెట్టుకొమ్మల పైభాగము నుండి క్రిందకుదిగి శిరస్సుపై అంజలి ఘటించి మధురమైన వాక్కుతో చెట్టు కొమ్మను

పట్టుకొని నిలచియుంటివేల? నీవెవరమ్మా? నీవు దుఃఖించుటకు కారణమేమి? దేవతలకు,రాక్షసులకు, నాగజాతికి, గంధర్వజాతికి, యక్షజాతికి, కిన్నెర జాతికి చెందినదానవా నీవు? లేదా రుద్రులకు, మరుత్తులకు వసువులకు చెందినదానవా? లేదా రోహిణివా? కోపమువలనగాని, మోహమువలనగాని వశిష్ఠునిపై కోపముతో ఈభూలోకమునకు దిగివచ్చిన అరుంధతి కావుగదా! అమ్మా! జనస్థానమున రావణునిచే బలత్కారముగ అపహరింపబడిన సీతవు నీవు కావు కదా! అట్లయినచో చెప్పుము.

సీత, హనుమ పల్కిన రామవృత్తాంతమును విని సంతోషముతో ఆ వానరునితో నేను దశరథుని కోడలను. మహాత్ముడు, విదేహాధిపతి అగు జనకుని కుమార్తెను. నా పేరు సీత, ధీమంతుడగు రాముని భార్యను అని పలికింది.

సీతమాటలను వినిన హనుమ సీతను ఓదార్చదలచి సీతాదేవితో..అమ్మా! నేను రాముని సందేశము వలన నీవద్దకు వచ్చినాడను. అమ్మా సీతమ్మా! రాముడు కుశలముగా నున్నాడు. నిన్ను కుశలమడిగినాడు. నీ భర్తకు అనుచరుడు ప్రియుడైన లక్ష్మణుడు దుఃఖితుడై శిరసుతో నీకు నమస్కారము చేసినాడు.

ఇట్లు హనుమ చెప్పిన రామలక్ష్మణుల కుశల వార్తను విని పులకిత గాత్రురాలై హనుమంతునితో 'ఏతి జీవన్త మానందో నరం వర్షశతా దపి'. జీవించియున్న మానవునికి నూరేండ్లకైనను ఆనందము కల్గును. అని లోకములో నున్న వాడుక నావిషయమున సత్యమైనది.

హనుమ దగ్గరకు వచ్చే కొద్ది సీత మాయా రూపములో వచ్చిన రావణుడవు. అని సందేహించి ఓ వానరా! నీవు రాముని దూతవే ఐనచో నీకు మంగళమగుగాక!

సీతమ్మ సందేహించగా అంతట హనుమ సీతమ్మతో అమ్మా! నేను

సుగ్రీవుని మంత్రిని వానరుడను. నా పేరు హనుమ. సముద్రమును లంఘించి లంకలో ప్రవేశించాను. దురాత్ముడగు రావణుని లెక్కచేయక నిన్ను చూచుటకు వచ్చాను. అమ్మా! నీవు అనుకొనినట్లు నేను రావణుడను కాను. మాయారూపమున వచ్చినవాడను కాను సందేహమును వీడుము. నా మాటను నమ్ముము. అని పలికి సీతమ్మకు నమ్మకము కలిగించుటకు సీతమ్మతో...

రామః కమల పత్రాక్షః సర్వసత్త్వ మనోహరః ।
రూప దాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే ॥ 35-8 శ్లో

అని రామలక్ష్మణ రూప చిహ్నములను వర్ణించి మరల రామ వృత్తాంతమంతయు తెలియజేశాడు.

హనుమ తన వృత్తాంతమును తెలుపుతూ - పర్వతములలో కెల్ల ఉత్తమమైన పర్వతము మాల్యవంతము. అచట మా తండ్రి నివసించుచుండెడివాడు. అతని పేరు కేసరి. అతడు దేవర్షులచే నియోగింపబడి గోకర్ణమను పర్వతమునకేగి అచట పుణ్యతీర్థమునందున్న శంబసాదనుడను రాక్షసుని సంహరించాడు. ఆ కేసరి భార్యయగు అంజన యందు ఆ కేసరి దేశాంతరమున యుండగా వాయువు అనుగ్రహముచే జన్మించాను. హనుమ అను వానరుడను నేను అని పలికి మరల సీతాదేవితో...

వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।
రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగులీయకమ్ ॥36-2 శ్లో

అమ్మా! నేను వానరుడను. ధీమంతుడుగు రాముని దూతను. రామ నామాంకితమగు ఈ ఉంగరమును చూడుము. ఈ ఉంగరము రాముడిచ్చినాడు. నీకు నమ్మకము కల్గుటకై తెచ్చితిని. ఇక నీవు దుఃఖించవలదు. నీకు శుభము కల్గును.

సీతాదేవి ఆ ఉంగరమును తీసికొని భర్తను పొందినట్లుగనే ఆనందమును

పొందినది.సీత హనుమను ప్రశంసిస్తూ వానరోత్తమా! నీవు గొప్ప బుద్ధి బల పరాక్రమముతో వందయోజనముల విస్తీర్ణమగు సముద్రమును గోష్పదము వలె నీవు దాటినావు. రామలక్ష్మణులు ఎలా ఉన్నారో అడిగి తెలుసుకొనినది.

హనుమతో మాట్లాడిన సీతాదేవి శ్రీరాముని గుణములనూ, పరాక్రమాదులనూ స్మరించుకుంటూ భర్త వియోగదుఃఖంతో ఆమె విలపించగా, అపుడా హనుమ సీతాదేవిని ఓదార్చుతూ...... అమ్మా! నా మాటలను వినగానే శ్రీరాముడు వానర, భల్లూక సేనా సమేతంగా ఇక్కడకు వస్తాడు. లేదంటారా! మీరు నావీపుపై కూర్చుండుము. ఈరోజే సముద్రమును దాటించెదను. అమ్మా! నాలో రావణ సహితంగా లంకా నగరాన్ని ఎత్తుకు పోయే శక్తి ఉంది. ఇక్కడ నుండి నేను నిన్ను తీసుకవెళ్ళే సమయాన రాక్షసులందరూ కలిసినా నన్ను వెంబడించలేరు. వెంటనే నేను నిన్ను రాముని సన్నిధికి చేర్చుతానని పలికాడు.

హనుమ మాటలను విని సీతాదేవి హనుమతో, హనుమా! ఇంత దూరము నన్ను నీవు తీసుకువెళ్ళగలనని తలచుచున్నావు. నీవు ఇలా తలంచుటచే నీ కపిత్వము స్పష్టమగుచున్నది. ఇంత స్వల్పమైన శరీరము గల నీవు నన్ను రాముని వద్దకు ఎట్లు తీసుకొని వెళ్ళగలవు. సీతమాటలు వినిన హనుమ ఇంతకు ముందెన్నడును పరాభవమెరుగనివాడు పరాభవమును పొందినవాడై సీతకు నా బలముగాని శక్తి గాని తెలియదు. అందుచే ఈమెకు నా రూపమును చూపించెదనని తలచి, సీతమ్మకు నమ్మకము కల్గుటకై...

మేరుమందరసంకాశో బభౌ దీప్తానలప్రభః ।
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః ॥
హరిః పర్వతసంకాశస్తామ్రవక్త్రో మహాబలః ।
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీమిదమబ్రవీత్ ॥ 37-35,36

హనుమ మేరుపర్వతం వలె ప్రకాశిస్తూ మండుచున్న అగ్నిహోత్రమువలె

ప్రకాశించుచూ సీతాదేవి ఎదుట నిలిచాడు. పర్వతమంత పెరిగిన హనుమ మహాబలవంతుడును, ఎఱ్ఱని ముఖము గలవాడును వజ్రములవలె కఠినములయిన కోఱలును, నఖములును గలవాడు. చూపరులకు భయము పుట్టించువాడగు హనుమ సీతాదేవితో...కొండలు, వనములు, ప్రాకారములతో గూడిన ఈ లంకాపట్టణమునైనను రావణునితో గూడ పెకలించి తీసికొని పోగలనని పలికెను.

అపుడా సీతాదేవి హనుమ విశ్వరూపమును జూచి ఓ హనుమా! నీ బలము, నీశక్తి నాకు తెలిసినది. వాయువువంటి గమనము అగ్నివంటి తేజస్సుగల వాడవు. సామాన్యుడగు వానరుడైనచో సముద్రమును దాటి దక్షిణతీరమున నున్న ఈ లంకకు రాలేడు. నీవు నన్ను తీసుకొని సముద్రమును దాటగలవు. కాని వాయువేగముతో నన్ను తీసుకొని పోవుచున్నప్పుడు ఆ వేగములో పైనుండి సముద్రమును జూచి భయపడి నేను క్రిందకు పడవచ్చును. అందుచే నీతో నేను వచ్చుట తగదు. ఓ వానరశ్రేష్ఠా! నేను శ్రీరాముని శరీరమును తప్ప పరపురుషుని శరీరమును స్పృశింపను. కాని రావణుని శరీరంతో నాకు కలిగిన స్పర్శ బలవంతముగా జరిగింది. ఆ తరుణంలో నేను అసమర్థురాలను, నిస్సహాయురాలనై యుంటిని. ఇపుడు శ్రీరాముడు రాక్షసుల సహితంగా రావణుని సంహరించి, నన్ను ఇచ్చటినుండి తీసుకువెళ్ళడమే అతనికి తగిన పరాక్రమం అనిపించుకుంటుంది. అందుచే ఓ వానరోత్తమా! వానరసేనలతో, లక్ష్మణునితో కూడి రాముడిచటకు వచ్చునట్లు చేయుము.

సీతమ్మ చెప్పిన మాటలను విని హనుమ సంతోషముతో అమ్మా! నీవు చాల యుక్తముగా, స్త్రీ స్వభావమునకు, పాతివ్రత్యమునకు వినయమునకు తగినట్లు పలికావు. స్త్రీ వైన నీకు సముద్రమును దాటుట శక్యము కాదు. అదియుక్తమే. నాపై కూర్చుండి వచ్చునపుడు జరిగెడి ప్రమాదమును చెప్పావు. అదియుక్తమే.నీవు పలికినవి స్త్రీ స్వభావమునకు తగియున్నవి. వినయముతో

పాతివ్రత్యమునకు తగినట్లు రామునికంటె ఇతర పురుషుల శరీరమును స్పృశించనని చెప్పావు. మహాత్ముడగు రాముని భార్యవగు నీకు ఆమాట తగును. నీవు తప్ప వేరొకరెవ్వరు ఇట్టిమాట పల్కగలరు? నీవు చెప్పిన మాటలు నీవద్ద నేను చూచిన చేష్టలు అన్నియు రామునితో చెప్పెదను. రామునకు ప్రియము చేయవలెను తలంపుతో, ప్రేమచే అనేక కారణముల వల్ల నిన్ను నాతో తీసికొని పోవుదునని పలికాను. రాముడు గుర్తించగల అభిజ్ఞానము యివ్వుము. అని అడుగగా సీత కాకాసురవృత్తాంతాన్ని చెప్పి చూడామణిని జ్ఞాపికగా ఇచ్చింది. హనుమ ఆ చూడామణిని గ్రహించి అమ్మా! రాముని రాకను గూర్చి అనుమానించవలసిన అవసరం లేదని సుగ్రీవుని సైన్యంలో బల పరాక్రమాలు గల వీరులు ఎందరో ఉన్నారని రావణుని వధించి తిరిగి రాముని చేరదం తథ్యమని హితవు పలికాడు. సీత శుభాశీస్సులను స్వీకరించి హనుమ ఆమె వద్ద సెలవు తీసుకున్నాడు.

సీతమ్మచే పూజింపబడిన హనుమ ఆ ప్రదేశము నుండి తొలగి, వెనుకకు పోదలంచి ఇట్లు ఆలోచించాడు. కార్యమంతయు పూర్తి అయినది. ఇకకొద్దిగా మిగిలియున్నది. రాక్షస బలాబలములను, రావణుని మనస్సు తెలుసుకొనుటకు పరాక్రమము తప్ప వేరొకమార్గము లేదని తలచి రావణునికి ప్రియమైన అశోకవనమును ధ్వంసం చేయుదలచాడు.

ఈవిధముగ హనుమ అశోకవనమును ధ్వంసం చేసి రావణుని మనస్సునకు అప్రియమును కల్గించి, మహాబలులగు రాక్షసులతో ఒక్కడే యుద్ధము చేయుదలంచి కాంతిమంతుడై తోరణము నధిరోహించాడు. అంతవరకు నిద్రలో వున్న రాక్షస స్త్రీలు శబ్దము విని మేల్కొని, ఒక వానరుడు వనమంతా పాడుచేయుట చూచి ఆ రాక్షస స్త్రీలు వీడెవడు? ఎవనివాడు? ఎచటనుండివచ్చెను? ఎందుకు వచ్చెను? నీతో వీడేమి మాటాడెను? చెప్పుము. భయపడకుము అని సీతమ్మ నడిగారు.

అప్పుడు పతివ్రతయగు సీత భీమ రూపులగు రాక్షసులగూర్చి నాకేమి తెలియును? ఎవడో? ఏమి చేయునో? మీరే తెలిసికొనుడు.

"అహి రేవహ్యహేః పాదాన్ విజనాతి న సంశయః"

"పాము జాడ పాముకే తెలియును. సంశయము లేదు. నేను కూడ వీనిని జూచి భయపడ్డాను ఎవడో తెలిసికొనలేక పోయాను. కామరూపముతో వచ్చిన రాక్షసుడే అనుకొనుచున్నానని పలికెను.

ఇట్లు సీతమ్మ పల్కిన మాటలను విని రాక్షస స్త్రీలు రావణుని సమీపించి ఆ వానరుని గూర్చి రాజా! భీమశరీరుడగు ఒక వానరుడు అశోకవన మధ్యమున సీతతో మాట్లాడినాడు అతనిని గూర్చి మేమంత అడిగినను సీతమ్మ చెప్పుట లేదు. అతడు ఇంద్రుని దూతయో,కుబేరుని దూతయో, సీతను వెతకుటకు రాముడే పంపినాడో తెలియదు. అతడు ఆ వనమంతా ధ్వంసం చేశాడు. పాడుచేయని ప్రదేశము లేదు. కాని సీత వసించిన ఆ వృక్షప్రాంతమే అతడు పాడుచేయలేదు. ఆ రాక్షస స్త్రీల మాటలు వినిన రావణుడు కుపితుడై హనుమంతుని నిగ్రహించుటకు ఎనుబది వేలమంది కింకరులనెడి రాక్షసులను నియమించాడు. వారు ఆయుధములను ధరించి, హనుమను చుట్టుముట్టగా హనుమ వారితో యుద్ధము చేస్తూ పర్వతమంత పెరిగి ఇట్లు తనను గూర్చి పలికాడు.

జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥

దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః ।
హనుమాన్ శత్రు సైన్యానాం నిహంతా మారుతాత్మజః ॥42-33,34శ్లో

అధిక బలుడగు రాముడు, మహాబలుడగు లక్ష్మణుడు అతిశయముతో వర్ధిల్లుచున్నాడు. రామునిచే రక్షింపబడిన సుగ్రీవుడు జయము కల్గి

ప్రకాశించుచున్నాడు. నేను కోసలేంద్రుడగు రాముని దాసుడను. శత్రుసైన్యములను చంపువాడను. వాయువు పుత్రుడను. వేయిమంది రావణులు వచ్చినను యుద్ధములో నన్నెదిరించి నిలువలేరు. అని పలికాడు.

ఆ హనుమ తోరణమునకు చెందిన పరిఘను పట్టుకొని ఆ కింకరుల నందరిని చంపి, మరల యుద్ధమును కోరి తోరణము నధిరోహించాడు. కొందరు రాక్షసులు భయపడి పరుగెత్తి, హనుమ కింకరులను చంపెనని రావణునకు నివేందించిరి. కింకరులు చనిపోయినారని వినిన వెంటనే రావణుడు పరాక్రమవంతుడగు ప్రహస్తుని కుమారుని హనుమపై పంపాడు. ప్రహస్తుని కుమారుడగు జంబుమాలిని సంహరించాడు.

అంతట రావణుడు కోపముతో ఆ హనుమను పట్టుకొనదలచి క్రమముగా మహాపరాక్రమవంతులైన ఏడుగురు మంత్రి కుమారులను, విరూపాక్ష, యూపాక్ష, దుర్ధర, ప్రఘస, భాసకర్ణ అను అయిదుగురు సేనానాయకులను, అక్ష కుమారుని పంపాడు. అలా పంపిన వారందరిని క్రమముగా హనుమ వారితో యుద్ధము చేసి సంహరించాడు.

అక్ష కుమారుడు కూడ సంహరింపబడ్డాడని తెలుసుకొనిన రావణుడు కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని ఇంద్రతుల్యుడగు ఇంద్రజిత్తును ఆజ్ఞాపించాడు. ఇంద్రజిత్తు రావణాసురునికి నమస్కరించి హనుమను పట్టుకొనుట యుద్ధానికి బయలుదేరాడు. ఇరువురు యుద్ధానికి తలపడ్డారు. ఇంద్రజిత్తు ఎన్ని అస్త్ర శస్త్రాలన్నీ ప్రయోగించినా హనుమ వాటిని వ్యర్థం చేశాడు. ఎన్ని బాణాలు ప్రయోగించినా ఒక్క బాణము తగులకుండా ఆకాశమున హనుమ తిరుగుచున్నాడు.

అప్పుడు ఇంద్రజిత్తు ఆలోచించి ఈ హరివీరుడు అవధ్యుడు. ఇతని వేగమును ఎట్లయినను తగ్గించి పట్టుకొనవలెనని నిశ్చయించి చివరికి బ్రహ్మాస్త్రము ప్రయోగించాడు. ఏ అస్త్రమునకును వశము కాకుండునట్లు బ్రహ్మ నాకు

వరమిచ్చెను. కదా! అని ఆలోచించి బ్రహ్మ ఆజ్ఞననుసరించి ఆ అస్త్రమునకు కట్టుబడి యుండెను. ఈ రాక్షసులు నన్ను బంధించుటయే మేలు. రావణునితో సంవాదము లభించును. బంధింపనిమ్ము అని నిశ్చయించుకొన్నాడు.

అపుడు రాక్షసులు కదలిక లేకుండ పడియున్న ఆ వానరుని చూచి జనపనారతో గట్టిగా కట్టి బంధించిరి. నారలతో కట్టిన హనుమను చూచి ఇంద్రజిత్తు తనలో వేరొకకట్టు కట్టినచో బ్రహ్మాస్త్రము యొక్క కట్టునిలువదు. బ్రహ్మాస్త్రము వీడిన తరువాత మరియొక అస్త్రము వానిపై పనిచేయదు. మరల బ్రహ్మాస్త్రము వేసినను పనిచేయదు. అని ఇంద్రజిత్తు విచారించుచుండెను. రాక్షసులు త్రాళ్ళతో బిగించి కట్టి లాగుచున్నారు. పిడికిళ్ళతో కొట్టుచూ రావణాసురుని సమీపమునకు లాగుకొని పోయిరి.

హనుమ సింహాసనముపై అధిష్ఠించిన రాక్షస రాజైన రావణాసురుని చూచి ఇట్లు తన మనసులో

**అహో! రూపమహో ! ధైర్యమహో సత్త్వ మహోద్యుతిః ।**
**అహో రాక్షస రాజస్య సర్వ లక్షణయుక్తతా ॥**
**యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః ।**
**స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా ॥ 49-17,18 శ్లో**

అహో ఏమి రూపము? ఏమి ధైర్యము? ఏమి బలము? ఏమి కాంతి? ఈ రాక్షసరాజు సర్వలక్షణములతో ప్రకాశించుచున్నాడు. ఈతనిలో అధర్మమనునది లేకుండినచో ఇంద్రునితో కలిపి మూడు లోకములకు పాలకుడై యుండెడివాడని అని హనుమ మనసులో అనుకొన్నాడు.

రావణాసురుడు ఎదురుగానున్న హనుమను చూచి ఆశ్చర్యచకితుడై తన మనసులో ఇట్లు తలంచాడు.

పూర్వము నేను కైలాసమును కదల్చినపుడు నందీశ్వరుడు నన్ను

శపించినాడు. అతడే ఈ వానరరూపమున వచ్చి యుండునా? లేక ఈతడు బాణాసురుడైయుండునా? అని తలంచి కోపముతో ప్రహస్తుదను ప్రధానమంత్రితో ఈ వానరుడు ఎవడు? ఎటునుండి వచ్చాడు? ఏమి పని? మన వనమును ధ్వంసం చేయుటకు కారణమేమిటి? మన వారితో ఇతనికి యుద్ధం చేయుటకేమి ప్రయోజనము అడిగి తెలుసుకొనుము అని ఆజ్ఞాపించాడు.

అంతట ప్రహస్తుడు ఓ వానరా! నువ్వు నిర్భయంగా నిజం చెప్పితే నీకేం భయంలేదు. ఎవరు పంపారు నిన్ను దేవేంద్రుడా! వరుణుడా! కుబేరుడా! యముడా! విజయవాంఛతో విష్ణువు పంపించాడా? కంటికి వానర రూపంలో వున్నా నీశక్తి తేజస్సు వానర సహజంగా లేవు. నిజం చెప్పు, నిన్ను విడిచిపెడతాం అన్నాడు.

అప్పుడు హనుమ : నేను దేవేంద్రుని దూతను కాను. యముని దూతను కాను. వరుణుని దూతను కాను. కుబేరునితోగాని, యమునితోగాని నాకు స్నేహము లేదు. విష్ణువు నన్ను పంపలేదు. మా జాతియే వానరజాతి. నేను వానరుడను. మీ దర్శనము దుర్లభమని దర్శనము కొరకు వనమును ధ్వంసం చేశాను. యుద్ధమును చేయుటకు బలవంతులగు రాక్షసులు రాగా, దేహరక్షణమునకు వారినెదరించి నేను యుద్ధము చేశాను. దేవతలు గాని, రాక్షసులు గాని అస్త్రములతోగాని, పాశములతోగాని, నన్ను బంధింపలేరు. ఇది నాకు బ్రహ్మ ఇచ్చిన వరము.

రాక్షసరాజును చూడవలెను కోరికచే బ్రహ్మాస్త్రమునకు నేను లొంగి కట్టుపడ్డాను. ఒకానొక రాజకార్యముచే నీవద్దకు వచ్చాను. అమిత పరాక్రముడగు రామదూతను. వానర ప్రభువైన సుగ్రీవునకు మంత్రిని. ఓ లంకేశ్వరా! నీకు మేలు కల్గించు కొన్ని మాటలను చెప్పెదను వినుము.

ఓ రాక్షస రాజేంద్ర! సుగ్రీవుని సందేశము గైకొని దూతగా వచ్చాను. వానరాధీశుడైన సుగ్రీవుడు సోదర స్నేహముతో నిన్ను కుశలమడిగినాడు. ఆయన

నీకు పంపిన సందేశసారమే నా భాషణము.

ఓ రాక్షసేంద్రా! వినుము. చతురంగ బలసమేతుడైన దశరథుడను రాజు ఉండెను. ఆయన జ్యేష్ఠ పుత్రుడైన శ్రీరాముడు తండ్రి ఆదేశము వలన రాజ్యమును విడచి సోదరుడైన లక్ష్మణునితో, భార్యయైన సీతతోను దండకావనమున ప్రవేశించాడు. పతివ్రతయైన సీత వనములో అపహరించబడగా రాముడు తమ్మునితో కలసి సీతాదేవిని వెదకుచు ఋశ్యమూక పర్వతమును చేరి సుగ్రీవునితో మైత్రి చేశాడు. సీతను వెదకించినచో వానర రాజ్యమును తిరిగి సుగ్రీవున కిప్పించెదనని రాముడు ప్రతిజ్ఞ చేశాడు. పిమ్మట ఆ రాజ పుత్రుడు వాలిని చంపి సుగ్రీవుని వానరాధిపతిగా చేసాడు. ఓ రాక్షసేంద్రా! వాలి ప్రభావము నీకు తెలియనిది కాదు. అటువంటి వాలిని 'రామేణ నిహత స్సంఖ్యే శరణైకేన వానరః' రాముడొక్క బాణము చేతనే సంహరించాడు.

పిమ్మట సుగ్రీవుడు సీతను వెదకుటకు వానరులను నలుదిక్కులకు పంపాడు. వారిలో నేనొకడను. వాయువునకు ఔరసపుత్రుడను హనుమంతుడని ప్రసిద్ధి గన్నవాడను. సీతాదేవిని వెదకుటకు శతయోజన విస్తీర్ణమైన సముద్రమును అవలీలగా దాటి నీ పురమును ప్రవేశించి తిరుగుచు నీ గృహమున ఆమెను కనుగొన్నాను. ధర్మార్థ విదుడవు, తపస్వివైన నీవు పరస్త్రీల నిట్లు బంధించుట అయుక్తము కాదా? మహాప్రాజ్ఞ ! నీవంటి విజ్ఞులు అపాయకరములు, మూల విచ్ఛేదకరములునైన ధర్మవిరుద్ధ కర్మలందు ప్రవర్తించరాదు.

ఓ దానవేంద్రా! రాముని కోపమునుసరించి లక్ష్మణునిచే విడువబడు బాణముల ధాటిని తట్టుకొనగలవాడు దేవదానవులలో ఎవడున్నాడు? రామునికి అపకారము చేసి సుఖపడువాడు ముల్లోకములలో ఎవ్వడును లేడు. కావున రాక్షసరాజా! త్రికాలములందు నీకు హితమును కలిగించు మాటను చెప్పెదను. వినుము. సీతను రామునకు తిరిగి సమర్పించుము.

**తత్త్రికాలహిత వాక్యం ధర్మ్యమర్థానుబంధి చ ।**
**మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్ ॥ 51-21**

ఓ రాక్షసేంద్రా! దుర్లభమైన సీతాదర్శనము లభించినది. ఇక మిగిలిన కార్యమును రాముడే నిర్వర్తించును. శోకపరాయణురాలై నీ గృహమున కనిపించిన సీత నీపాలిట ఐదుతలల భయంకర సర్పము. విషమిశ్రితమైన అన్నము జీర్ణము కానట్లు సీత దేవాసురులకైనను అలవికానిది. అసురేంద్రా! కఠోరమైన తపస్సు చేసి సుదీర్ఘ జీవనమును స్వయముగా నాశనము చేసుకొనకుము. నీవు పొందిన అవధ్యత్వ వరమును గూర్చి విచారించుము. దేవతల వలన, రాక్షసుల వలన నీకు మరణ భయము లేదు. కాని ఆ గణములలో చేరని సుగ్రీవుని నుండి నీ ప్రాణములు నెట్లు రక్షించుకొనగలవు? నీవార్జిన యీ అధర్మము ఫలితమును వెంటనే అనుభవించక తప్పదు. వాలి వధను బాగుగా తలచి నీవు రామునితో సుగ్రీవునితోను స్నేహము చేయుట శ్రేయస్కరము.

రాక్షసేంద్రా! నీ సమస్త లంకాపురమును నాశనము చేయుటకు నేనొక్కడను చాలు. కాని రాముని నిర్ణయమదికాదు. తన భార్యయైన సీతను అపహరించిన వానిని సంహరించెదనని రాముడు వానరుల, సమక్షములో ప్రతిజ్ఞ చేసాడు. రామునికపకారమును చేసిన వాడింద్రుడైనను సుఖించలేదు. ఇక నీవంటి వాడెట్లు సుఖపడును?

**యాం సీతేత్యభి జానాసి యేయం తిష్ఠతి తే వశే ।**
**కాలరాత్రీతి తాం విద్ధి సర్వలంకావినాశినీమ్ ॥ 51-34**

ఓ రాక్షసేశ్వరా! నీవు ఎవ్వతెను సీతయని తలంచియున్నావో, అట్టి నీ వశమందున్న సీత లంకా వినాశినియైన కాళరాత్రి యని తెలుసుకొనుము. నీ కారణముగా నీ మిత్రులు, మంత్రులు, జ్ఞాతులు, సోదరులు, సుతులందరును నశించిపోగలరు. కావున వారిని రక్షించుకొనుటకైన ధర్మమార్గమవలంబించుము. ప్రభువైన రాముడు సర్వలోకములను, చరాచరాత్మకమైన సమస్త ప్రాణికోటిని

ఉపసంహరించి మరల యథాతథముగా సృష్టించగలడు.

యుద్ధరంగమున రాముని యెదుట నిలబడి విక్రమించగల వాడెవవడు? రామ కోపాగ్నికి గురియైన వానిని చతుర్ముఖుడైన బ్రహ్మగాని, త్రిపురాంతకుడైన రుద్రుడుగాని, సురనాయకుడైన మహేంద్రుడుగాని, రక్షించజాలరు. ఓ రాక్షసాధీశా! నా సత్యవచనమును ఆలకించుము. సీతను తిరిగి రామునకిమ్మ్ము.

ఈవిధముగా చాల చక్కగ, ధైర్యముగ పల్కిన హనుమ మాటలను విని కోపముతో ఆ వానరుని చంపుమని రావణుడు ఆజ్ఞాపించాడు.

దేశకాలోచితముగ పల్కిన విభీషణుని మాటలను విని రావణుడు నీవు చెప్పినది బాగున్నది దూతను చంపుట నింద్యమే! వీనికి వేరొక శిక్ష విధించెదను. కోతులకు తోక చాల ఇష్టమైనది గాన, ఈతని తోక కాల్చి కాలుచున్న తోకతో ఊరంతయు త్రిప్పుడని ఆజ్ఞాపించాడు. అంతట ఆ రాక్షసులు హనుమ తోకకు పాతనూలు బట్టలను చుట్టి, నిప్పంటించి లంకంతయు త్రిప్పసాగిరి. హనుమ అప్పడిట్లా ఆలోచించాడు. లంక అంతయు రాత్రివేళ తిరిగినను దుర్గములను బాగుగ చూడలేదు. వీరిప్పుడు త్రిప్పినచో మరొకసారి లంక చూచుటయగును. ఈ రాక్షసులు నన్ను కట్టినను, నా తోకకు నిప్పంటించినను నా మనసున కేమియు శ్రమ కల్గుట లేదు. అని యనుకొనెను.

ఈవిధముగా లాంగూలము దహింపబడుచుండుట చూచి అప్రియమైన ఆ వృత్తాంతమును రాక్షసస్త్రీలు సీతమ్మకు చెప్పిరి. ఆ మాటను వినిన సీతమ్మ దుఃఖితురాలై హనుమకు మంగళము కలుగవలెనని శుచియై అగ్నిహోత్రుని ప్రార్థించింది. అపుడు తీవ్రముగు జ్వాలలతో అధికముగ ప్రజ్వలించుచున్న హనుమ తోకనున్న అగ్ని సీతమ్మకు శుభమును సూచించుచున్నట్లుగా ప్రదక్షిణ జ్వాలలతో తిరుగుచుండెను. హనుమ తోకకంటియున్న అగ్ని జ్వాలలతో వెచ్చనైన వాయువు సీతమ్మకు స్వస్థతను కల్గించువదై మంచుగాలి చల్లగా వీచినది.

హనుమ లాంగూలము దహింపబడుచున్నను బాధకలుగక పోవుటను

చూచి ఆశ్చర్యముతో ఇట్లాలోచింపసాగెను. సీతమ్మకు నాపై గల జాలి, రాముని తేజస్సు, మా తండ్రికి అగ్నితో గల స్నేహము... ఈ కారణములచే అగ్ని నన్ను దహింపలేదు. అని ఆలోచించి ఒక్కసారి గర్జించి పైకెగిరాడు.

మహావేగము గలవాడై ప్రహస్తుని భవనముపై దూకి అచ్చట నిప్పంటించాడు. మహాపార్శ్వుని, వజ్రదంష్ట్రుని ఇంద్రజిత్తు భవనములకు నిప్పంటించుచు ఇలా చాలా భవనములను కాల్చుచు విభీషణుని భవనమును మాత్రము విడచి, తరువాత రావణుని భవనమునకు నిప్పంటించాడు.

హనుమ ఈవిధముగ అనేకులగు రాక్షసులను చంపి, వనమును పొడు చేసి, రాక్షస భవనములను అగ్నికి ఆహుతి చేసి, మనసులో రాముని స్మరించుచు నిలిచాడు. దేవతలందరు హనుమను స్తుతించారు.

లంకనంతను కాల్చి ఆ తోకయందలి నిప్పును హనుమ సముద్రములో చల్లార్చాడు. కొండ మీదనుండి మండి ధ్వంసమగుచున్న లంకాపట్టణమును చూచి హనుమ ఇట్లనుకొనెను.

లంక యంతయు కాలిపోయింది. సీతమ్మ కూడ తప్పక కాలియే యుండును. సీతమ్మ నశించుట నిశ్చయము లంకలో ఏ ఒక్క భాగము కూడ కాలనిది కన్పడుట లేదు. లంకయంతయు భస్మమైంది. అని హనుమ బాధపడుచుండగ వెనుక కన్పించిన శుభశకునములు మరల కాన్పించుటచే సీతమ్మ జీవించియే యుండును. ఆమె నశింపదు-

"నాగ్ని రగ్నే ప్రవర్తతే". (సుంద. 55-23)

అగ్ని అగ్నిని దహింపదు. సీతమ్మ నెట్లు దహించును. ఈవిధముగ హనుమ భావించుచుండగా మహాత్ములగు చారణులు ఆకాశమున లంక అంతయు దహింపబడుచున్నదే కాని, సీతమ్మ మాత్రము దహింపబడలేదు. అని పలికిన ఆ మాటలు విన్న హనుమ సంతసించి, సుఖముగా నున్న సీతమ్మను చూచుటకు హనుమ మరల అశోకవనమున ప్రవేశించెను. అందు శింశుపా

వృక్షమూలమున కూర్చుండియున్న సీతమ్మను చేరి, అమ్మా అదృష్టవశమున సుఖముగానున్న నిన్ను చూడ గల్గితిని" అని బయలుదేర బోవుచున్న హనుమను జూచి సీతమ్మ భర్త యందు ప్రేమతో మరల హనుమంతునితో ఇట్లు పలికెను.

ఈ కార్యమును సాధించుటలో నీవొక్కడవే సమర్థుడవు. నీ బలము ప్రశంసనీయము. బాణములతో లంకను జయించి శ్రీరాముడు నన్ను తీసికొని వెళ్ళుట అతనికి తగినపని. అతని పరాక్రమమునకు అనురూపమగు విధముగా కార్యమును నెరవేర్చునట్లు నీవు చేయవలెను. సీతమ్మ చెప్పిన మాటలను హనుమ విని, అమ్మా! రాముడు వానరసైన్యముతో వచ్చి యుద్ధములో శత్రువులను జయించి నీ శోకమును తొలగిస్తాడు. అని సీతమ్మనోదార్చి అచటనుండి బయలుదేరదలచి హనుమ అరిష్టమనెడి పర్వతమును ఆరోహించి సముద్రమును దాటదలంచినవాడై హనుమ ఆకాశములోనికి ఎగిరాడు.

లంక నుండి తిరిగి వచ్చిన హనుమ జాంబవనాదులకు నమస్కరించి, సముద్ర లంఘన వృత్తాంతమును, లంకాదర్శనమును, సీతాదర్శనమును రావణ దర్శనమును మొదలగు విషయములను తెలియజేయగా, అంగదుడు సంతోషించాడు. వానరులు ఆనందముతో రామసుగ్రీవులకు 'సీతమ్మను చూచితిమి" అన్న విషయమును తెలియజేయుటకు బయలుదేరి మార్గమధ్యములో మధువనంలో ప్రవేశించి మధువును త్రావి కిష్కింధకు బయలుదేరారు.

ఆ వానరులు ప్రస్రవణ పర్వతమున నివసించియున్న రామలక్ష్మణులకు నమస్కరించి అంగదుని ముందుంచుకొని సుగ్రీవునకు నమస్కరించారు. సీతమ్మ కుశలముగా నున్నదని తెలియజేశారు. అంతట రాముడు ఇట్లు అడిగెను. సీతమ్మ ఎచటనున్నది? ఎట్లున్నది నావిషయములో ఎట్లున్నది చెప్పుడు అని అడుగగా అంతట వానరులు హనుమను చెప్పమని ప్రేరేపించిరి.

అంతట హనుమ రామునితో రామా! సీత వృత్తాంతమును తెలియజేస్తూ, అశోకవనంలో నిర్బంధింపబడి యుండుట, రాక్షసస్త్రీలచే భయపెట్టబడు

చుండుట, సీతకు రామునియందు గల అనురాగము, మరియు సీతమ్మ చెప్పిన విషయములను చెప్తూతూ, రామా! చిత్రకూట పర్వతమున కాకి విషయమున మీరు అనుసరించిన విధానము మీకు గుర్తుగా చెప్పినది. ఇచట నీవు చూచిన దంతయూ రామునితో విన్నవింపుమని కోరింది.

సీతమ్మ ఈ మణిని పదిలముగ దాచి రామా! మీకు ఇమ్మని యిచ్చినది. ఆనాడు బొట్టు చెరిగినపుడు మనశ్శిలతో బొట్టు పెట్టిన సంగతి జ్ఞాపకము చేయమన్నది. రామా! సీతాదేవి ఒక నెల మాత్రము జీవించును, నెలదాటిన జీవింపనని సీతమ్మ నాతో చెప్పింది. అంతట నేను సీతమ్మతో అమ్మా! శత్రువులను జయించి వనవాసమును పూర్తి చేసి రాముడయోధ్యలో నీతో పట్టాభిషిక్తుడగుటను త్వరలో చూడగలవు. అని సీతమ్మను ఓదార్చగా ప్రసన్నురాలై శాంతిని పొందినది. ఆమె కొరకు నీవు శోకించుచున్నావని సీతమ్మ కూడ శోకించుచున్నది. అని హనుమ సీతమ్మ చెప్పిన విషయాలను రామునకు తెలియజేశాడు. రామా! చూచిన దానిని చూచినట్లుగా తెలియజేశాను. ఇక సముద్రమును దాటుటకు ప్రయత్నము చేయుడు.

## 9.9. యుద్ధకాండ

హనుమంతుడు లంకా నగర విషయములను, సీతమ్మ చెప్పిన విషయములను ఉన్నదున్నట్లుగ చెప్పగా ఆ మాటలను విని రాముడు సంతోషించుచు ఇట్లు పలికెను. హనుమంతుడిప్పుడు సీతను చూచి వచ్చి నన్ను, రఘువంశమును, లక్ష్మణుని రక్షించినాడు. కాని నేను, ప్రియవార్తను చెప్పిన ఈతనికి తగు ప్రియమును చేయజాలకున్నాను. ఈ సమయమునందు నేను నా సర్వస్వమైన ఆలింగనమును ఇచ్చుచున్నానని పలికి తన కార్యమును పూర్తి చేసి వచ్చిన హనుమంతుని కౌగలించుకొన్నాడు.

తరువాత రాముడు హనుమా! లంకానగర దుర్గ నిర్మాణ విశేషాలేమిటయ్యా అని ప్రశ్నించాడు. అంతట హనుమ రామా! రావణుడు

స్వయముగా యుద్ధము చేయుటకు సన్నద్ధుడైయున్నాడు. అయినను తన మనస్సులో భయమనేది లేదు. సైన్యములను పరీక్షించుటలో ఏమరిపాటు లేక ఉత్సాహవంతుడై యున్నాడు. ఆ లంకలో దేవతలు కూడా ప్రవేశించజాలరు. ఆ లంకాపట్టణము చుట్టూ నదీ దుర్గము, పర్వత దుర్గము, వన దుర్గము, ప్రాకారముండుటచే కృత్రిమ దుర్గము అను 4 దుర్గములు ఆ లంక చుట్టూ ఉన్నవి. ఆ లంకకు పరిఘలు, శతఘ్నులు, అనేకవిధములైన యంత్రములు అలంకారములుగా ఉన్నవి. తూర్పు ద్వారమునందు పదివేలమంది రాక్షసులు, దక్షిణ ద్వారమునందు లక్షమంది రాక్షసులు, పశ్చిమ ద్వారమునందు పదిలక్షలమంది రాక్షసులు ఉత్తర ద్వారమునందు ఒక కోటి రాక్షసులు కాపలాకాయుచున్నారు. ఇక లంక లోపల కోటికిమించిన రాక్షసులున్నారు.

లంకలో ప్రవేశించుటకు వానరసైన్యమంతయు కలిసివచ్చునట్లు ఆజ్ఞాపించి మంచి ముహూర్తమునందు ప్రయాణము చేయుటకు నిశ్చయించుము. అని పలికాడు.

ఇచ్చట లంకాపట్టణములో రావణునిచే అవమానింపబడిన విభీషణుడు శ్రీరాముని శరణాగతి చెందగా, పిమ్మట సాగరుడు రామునితో రామా! విశ్వకర్మ కుమారుడైన నలుడను వానరునిచే సేతువు నిర్మింపమని పలికి నిష్క్రమించాడు. నలుడను వానరుడు సేతువు నిర్మించగా, విభీషణుడు రక్షకుడుగా సాగుతూ వానర, భల్లూకసేనలను సముద్రం దాటించారు.

హనుమంతునకు ధూమ్రాక్షునకు జరిగిన యుద్ధంలో ఆ రాక్షసుడు ముండ్లతో నిండిన గదను హనుమంతుని శిరస్సుపైకి విసరగా ఆ గదచే కొట్టబడగా హనుమ ఆ దెబ్బను లక్ష్యపెట్టక పర్వత శిఖరమును ధూమ్రాక్షునిపై పడవేయగా ఆ రాక్షసుడు మరణించాడు.

అకంపనుని చతురంగ బలాలు హనుమంతునికెదురురాగా అశ్వంతో అశ్వబలాన్నీ ,ఏనుగులతో, గజబలాన్నీ ఇలా చతురంగబలాన్నీ చూర్ణం చేస్తున్నాడు

హనుమ. క్షణకాల వ్యవధిలో అకంపనుడు ఏకాకి అయినాడు. ఆ అకంపనుడు హనుమపై అనేక బాణములను ప్రయోగించాడు. అగ్ని వలె ప్రకాశించుచున్న హనుమ ఒక వృక్షమును పెకలించి రాక్షసనాయకుడైన అకంపనుని శిరస్సు మీద కొట్టగా ఆ రాక్షసుడు మరణించాడు. అప్పుడు వానరులందరు హనుమను పూజించిరి.

రామలక్ష్మణులతో యుద్ధం చేయదలచి రావణాసురుడు యుద్ధమునకు రాగా, అప్పటికే హనుమంతుడు, రావణునికి ఎదురువచ్చి ఓ రావణా! నువ్వు దేవ, దానవ, గంధర్వయక్ష, రాక్షస గణాలకు అవధ్యుడవు. కాని నర వానరుల చేతిలో నువ్వు అంతిమ శ్వాస విడుస్తావు. అని పలికి కొంతసేపు రావణునితో యుద్ధంచేయగా, కొంతసేపటికి లక్ష్మణుడు రావణునకు ఎదురుగా వెళ్ళి రావణునితో యుద్ధంచేయగా, ఆ రావణుడు శక్తి అనే ఆయుధాన్ని ప్రయోగించగా లక్ష్మణుడు మూర్ఛిల్లాడు. రావణుడు తన రెండు చేతులతో లక్ష్మణుని ఎత్తుకు పోవడానికి ప్రయత్నిస్తుండగా హనుమ వచ్చి రావణుని వక్షస్థలం మీద కొట్టి లక్ష్మణుని రాముని దగ్గరకు తీసుకురాగానే లక్ష్మణుడు తేరుకొన్నాడు.

రాముడు రావణునితో యుద్ధం చేయదలచి అడుగు ముందుకు వేయగా, అపుడు హనుమ రామా! నామూపు పై అధివసించండి, అనగా రాముడు అంగీకరించాడు.

రథాధిరూఢుడయివున్న రావణునికి ఎదురుగా హనుమద్వాహనం మీద రాముడు వచ్చి ధనుష్టంకారం చేసి రావణునితో హోరాహోరిగా పోరాడి రావణుని కిరీటము నేలకూలగా, అపుడు రాముడు రాక్షసేశ్వరా! ఇంతవరకూ ఎందరో మహాయోధులతో యుద్ధంచేసి బాగా అలసియున్నావు. ఇప్పుడింక నీతో యుద్ధం చేయడం నాకు ఉచితం గాదు. ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకుని సర్వసంభారాలతో రేపురావడం మంచిదని చెప్పగా, రావణుడు వెను దిరిగాడు.

హనుమ రావణాసురుని కుమారులైన దేవాంతకుడు, త్రిశిరులను

రాక్షసులను యుద్ధరంగమున సంహరించినాడు.

రామలక్ష్మణులకు, ఇంద్రజిత్తుకు జరిగిన యుద్ధంలో ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమును గౌరవించదలచి రామలక్ష్మణులు మూర్ఛితులు కాగా వానరసైన్యము గూడ ఇంద్రజిత్తు బాణాలకు గాయపడిరి. ఒక ఇంద్రజిత్తే 67 కోట్ల వానరులను ఒక సాయంకాలము 5 గడియలలో వధించినాడు. పిమ్మట హనుమంతుడు విభీషణుడు రాత్రివేళ దివిటీలను పట్టుకొని వెదకిసాగినారు. అలా వెదకుతుండగా జాంబవంతుడు కనబడ్డాడు. శరీరమునిండ బాణాలు గ్రుచ్చుకొన్న కారణముగా బాధపడుతున్నాడు. విభీషణుడు జాంబవంతుని సమీపించి జాంబవంతా! ఈ బాణములు నీ ప్రాణములను హరింపలేదుగదా! అని పలుకరించగా,'హనుమాన్వానర శ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్' విభీషణా! వానరోత్తముడైన హనుమంతుడు జీవించియున్నాడా?

అంతట విభీషణుడు జాంబవంతా! రామలక్ష్మణుల క్షేమమును గూర్చి అడగక హనుమంతుని క్షేమమును గూర్చి అడుగుచున్నావేమి? అని అడుగగా జాంబవంతుడు విభీషణునితో - దానికి గొప్ప కారణమున్నది వినుము.

> **తస్మిన్ జీవతి వీరే తు హతమప్యహతంబలమ్** ।(యుద్ధకాండ)
> **హనుమత్యుజ్ఝిత ప్రాణే జీవంతోఽపి వయం హతాః** ॥ 74-22
>
> **ధరతే మారుతి స్తాత మారుతి ప్రతిమో యది ।**
> **వైశ్వానర సమో వీర్యే జీవితాశా తతో భవేత్ ॥ (74-23)**

హనుమంతు డొక్కడు బ్రతికియున్నచో సైన్యమంతయు మరణించినను బ్రతికి యున్నట్లే తలంపుము. హనుమంతుడు మరణించునేని మనమందరము బ్రతికియుండియు చనిపోయిన వారమే అగుచున్నాము. హనుమంతుడు వాయుదేవునికి సరివచ్చువాడు. అగ్నిదేవునివంటి పరాక్రమవంతుడు. ఆ మహావీరుడు జీవించియుండునేని మాకు జీవితాశ కలుగును.

అంతలో హనుమంతుడు జాంబవంతుని సమీపించి తాతా! నేను కుశలం, అనడంలో జాంబవంతుడు సంతోషంతో హనుమంతుని గాఢాలింగనం చేసుకుని నాయనా! బ్రహ్మాస్త్రం ప్రయోగంతో వెలువడిన బాధ నుండి మనవారినీ, రామలక్ష్మణులనూ నువ్వే రక్షించాలి. తక్షణం ఉత్తర దిశగా హిమాలయ ప్రాంతమున రెండు శిఖరాలున్నాయి కాంచన, కైలాస శిఖరములు ఆ శిఖరముల మధ్యలో ఓషధి పర్వతమున్నది. అందు విశల్యకరణి, సంధానకరణి సువర్ణకరణి మృతసంజీవని అను నాలుగు ఓషధులు కలవు. వాటిని తెచ్చి వీరికి ప్రాణదానం చెయ్యాలి అన్నాడు.

జాంబవంతుని మాట వింటూనే హనుమ ఓషధి పర్వతమునకు వెళ్ళి ఆ నాలుగు ఓషధుల కోసం చూస్తుండగా అంతవరకు కాంతులతో వున్న అవి తమను హరించడానికెవడో వచ్చాడని అవి కాంతిహీనములయ్యాయి. అంతట హనుమ ఓషధులున్న గిరి శిఖరం పెకలించి తీసుకురాగానే ఆ ఓషధుల గాలి సోకి క్షతగాత్రులయిన వానరులందరు బ్రతికినారు. రామలక్ష్మణులు విశల్యులై సుఖముగా యున్నారు. పిమ్మట ఓషధి పర్వతమును తీసికొని యథా స్థానములో చేర్చి శ్రీరాముని సన్నిధికి చేరుకున్నాడు.

మరుసటిరోజున మాయావి అయిన ఇంద్రజిత్తు తన రథం మీద మాయా సీతను ఉంచి వానరులు, హనుమ చూస్తూండగానే మయా సీతను సంహరించాడు. ఈ విషయము వానరులు హనుమ రామునకు తెలియజేయగా దుఃఖితుడయ్యాడు. అప్పుడచటకు విభీషణుడు రాగా లక్ష్మణుడు జరిగినదంతా చెప్పాడు. లక్ష్మణుని మాటలు వినిన విభీషణుడు వారితో ఇది అసంభవం లంకేశ్వరుని స్వభావం నాకు తెలుసు. అయన ప్రాణాలుండగా సీతను సంహరింపనివ్వడు. అంతేకాక సీతాదేవి ఉన్న ప్రాంతానికి వెళ్ళలేడు. ఇంద్రజిత్తు మాయావి. ఏదో మోసం చేసి నికుంభిలకు వెళ్ళి అగ్నిని తృప్తుని చేసి అజేయుడయి వస్తాడు. అది జరగకుండా మనం వెళ్ళాలి. లక్ష్మణా! వానరయోధులతో నావెంట

బయలుదేరు. ఇప్పుడు వెళ్ళి వాని ప్రయత్నం ధ్వంసం చెయ్యకపోతే వాడు బ్రహ్మశిరోనామకాస్త్రం సాధించి వస్తాడు. అప్పుడింక మనం చెయ్యగలంది లేదు. ఈ నికుంభిలా యజ్ఞం విఘ్నం చేసినవాడే ఇంద్రజిత్తును వధిస్తాడని బ్రహ్మవాక్కు ఇంద్రజిత్తు మరణించిన క్షణంలో రావణుడు సర్వశక్తి శూన్యుడయినట్లే అన్నాడు.

అంతట రాముడు లక్ష్మణుని ఆశీర్వదించి పంపాడు. జాంబవంతుడు, హనుమంతుడు మరికొందరు ప్రముఖులు వెంటరాగా లక్ష్మణునితో నికుంభిలా చైత్యం చేరి విభీషణుడు లక్ష్మణునితో లక్ష్మణా! అదిగో కారుమేఘం కనిపిస్తున్నదే అది రాక్షస సేనా సమూహం. మనవారు వారిని సంహరించాలి. అప్పుడు గాని ఇంద్రజిత్తు మనకు అందడు. అని చెప్పగా లక్ష్మణుడు నారి సారించాడు. వానరులు రాక్షసులను సంహరించారు. దానితో ఇంద్రజిత్తు తన హెూమకార్యం ఆపి రథంమీద ప్రళయ స్వరూపంతో వస్తున్నాడు. ఇంద్రజిత్తు విభీషణుని దూషించగా అంతట విభీషణుడు ఇంద్రజిత్తుతో నా స్వభావము నీకు తెలియదా, పుట్టింది రాక్షసవంశమయినా నా స్వభావం దానికి విరుద్ధం. మీ తండ్రికీ నాకు ఎప్పుడూ ధర్మ విషయమై ఏకాభిప్రాయం లేదు. ఇక నీ అస్త్ర విద్య చూపి లక్ష్మణునితో యుద్ధం సాగించు అని పలికాడు.

అప్పటికే హనుమ లక్ష్మణుని తన భుజం మీద అధిరోహించుకోగా లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో హోరా హోరిగా పోరాడినాడు. విభీషణుడు కూడా రాక్షసులతో యుద్ధం సాగించి వానరులను ఉత్సాహపరుచుచున్నాడు.

చివరగా లక్ష్మణుడు ఐంద్రాస్త్రం సంధించి...

**ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।** (యుద్ధకాండ)
**పౌరుషే చాప్రతి ద్వంద్వః శరైనం జహిరావణిమ్ ॥** 90-69

రాముడు ధర్మపరుడూ, సత్యసంధుడూ అప్రతి ద్వంద్వ పౌరుషయుతుడూ అయితే దీనితో ఇంద్రజిత్తు నేల కూలుతాడు, అంటూ ఆకర్ణాంతం లాగి విడిచాడు.

అది అత్యంత వేగంతో వచ్చి ఇంద్రజిత్తు శిరస్సును క్రిందపడవేసింది. ఆవిధంగా లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపాడు.

ఇంద్రజిత్తు మరణముచే దుఃఖితుడై రావణునకు తన మంత్రి సుపార్శ్వుడు సాహసించి ఎదురుగా నిలిచి! ప్రభూ! నేడు కృష్ణచతుర్దశి. రేపు అమావాస్య రణయాత్రకు చక్కని ముహూర్తం అని ప్రబోధించగా రావణుడు వెనుదిరిగి సభాభవనం చేరి యుద్ధ సన్నద్ధులుకండి అని ఆదేశించాడు.

రావణాసురుడు రామలక్ష్మణులతో యుద్ధం చేయదలచి హోరాహోరిగా పోరాడుతున్నాడు. రావణుడు శక్తి అనే ఆయుధాన్ని విడిచాడు. అది విభీషణాభిముఖంగా వస్తుండగా లక్ష్మణుడు అడ్డువచ్చి నిలిచాడు. అది లక్ష్మణుని వక్షఃస్థలం మీద గాయపరచగా మూర్ఛితుడయ్యాడు. రాముడు లక్ష్మణుని చూచి సామాన్య మానవుని వలె విలపించగా అప్పుడు సుషేణుడు వచ్చి రామా! లక్ష్మణుడు మరణించలేదు. అని పలికి హనుమంతునితో హనుమా! ఓషధ పర్వతానికి వెళ్ళి విశల్య కరణి, సావర్ణ కరణి, సంధాన కరణి, సంజీవకరణి ఉన్నాయి. వెంటనే తీసుకురా అన్నాడు.

వెంటనే హనుమ సంజీవిని తెచ్చుటకు వెళ్ళగా, ఇది తెలుసుకొనిన రావణుడు ఉపాయముతో హనుమను చంపుటకు మాల్యవంతుని కుమారుడగు కాలనేమిని పంపాడు. కాలనేమి హనుమంతుని కంటి ముందుగా వెళ్ళి ఒక ముని వేషమున ద్రోణపర్వత సమీపమున తపస్సు చేసికొనువానివలె కూర్చున్నాడు. ఇతని కడకు వచ్చిన హనుమంతుని పలుకరించి తాను రామభక్తునని మాట్లాడినాడు. హనుమంతుడు దప్పిగొని యుండుట తెలిసి ఆ సమీపమున నున్న కొలనులో జలమును త్రావుమనెను. ఆ కొలనులో మొసలి కలదు. అది యెవరినైనను అందదుగిడగనే పట్టి సంహరించుచుండెడిది. అది ఆ మడుగున దిగిన హనుమంతుని పట్టుకొనినది. కాని అతడు దానిని సంహరించగా, అది శాపవిమోచనమొంది, ధ్యానమాలియై లేచి తన

వృత్తాంతమంతా తెలియపరచి రావణుడును, కాలనేమియును హనుమంతుని వంచించుటకు జేసిన యత్నము చెప్పినది. హనుమ తిరిగి వచ్చుచు కాలనేమిని చూచి వానిని సంహరించాడు. పిమ్మట సంజీవనిని సమీపించగా అచట నున్న వారు ఆటంకము కలిగించారు. హనుమ వారితో పోరాడి వారిని ఓడించి పర్వతమును పెకలించి తీసుకొని వచ్చుచుండగ, ఇది తెలుసుకొనిన రావణుడు హనుమంతుని అడ్డగించుటకు మాల్యవంతుని పంపాడు. మాల్యవంతుడు పరివార సమేతుడై హనుమంతుని ఎదుర్కొనగా వారిని పరాజితులను చేసి సంజీవని తీసికొని వచ్చాడు.

పిమ్మట వానరోత్తముడైన సుషేణుడు కావలసిన ఓషధిని పెకలించి దానిని లక్ష్మణునకు ఆఘ్రాణింపజేయగా, అంత లక్ష్మణుని గాయములు, బాధలు తొలగిపోయి పునర్జీవుతుడయ్యాడు. అపుడు వానరులు సుషేణుణ్ణి, హనుమంతుని ప్రశంసించారు.

శ్రీరాముడు రావణునితో యుద్ధం చేయదలచగా, అప్పుడు దేవేంద్రుడు మాతలిని రథంతో వెళ్ళమని చెప్పగా, ఇంద్రరథం రాముని సమీపించింది. అపుడు మాతలి రామా! దేవేంద్రుడు నీకోసం పంపిన ఈ రథం అధిరోహించు దీనిమీద దివ్యచాపమూ, బాణ, కవచ, తూణీర శక్తి ఆయుధాలున్నాయి. వీటితో శత్రుసంహారం సాగించు అన్నాడు.

రామ రావణయుద్ధం హోరాహోరిగా జరిగింది. యుద్ధపరిశ్రాంతుడై యున్న రాముని సమీపించి అగస్త్యుడు రామా! శత్రునాశన సమర్థమయిన నూతన మంత్రం నీకు ఉపదేశిస్తున్నాను. దీన్ని ఆదిత్యహృదయం అంటారు. మంగళ ప్రదమయిన దీనిని ముమ్మారు పఠించి నువ్వు ధనుర్ధారివై నిలిస్తే నీకు ఎదురు లేదన్నాడు.

పిమ్మట రాముడు రావణునితో యుద్ధం చేస్తూ చివరగా బ్రహ్మాస్త్రం ప్రయోగముతో రావణుని సంహరించాడు.

పిమ్మట విభీషణునిచే దహనక్రియలు జరిపించాడు. తదనంతరం లక్ష్మణునిచే విభీషణునకు పట్టాభిషేకం నిర్వర్తించిన పిమ్మట హనుమంతునితో హనుమా! నువ్వు విభీషణ ప్రభువుల అనుమతి తీసుకుని సీతాదేవి క్షేమం తెలుసుకురావాలి. అంతట హనుమ అశోకవనానికి వెళ్ళి రాముని కుశలవార్త చెప్పి అమ్మా! ఇప్పుడు నువ్వు స్వగృహంలో ఉన్నట్లే భావించు. నిన్ను చూడడానికి వస్తారన్నాడు. అంతటసీత ఇంతటి సంతోషకర వార్త తెచ్చిన నిన్ను ఏమని ప్రశంసించాలో బోధపడటం లేదు. అపుడు హనుమ అమ్మా! మీకు సంతోషం కలిగించడం కంటె నేను కోరేది లేదమ్మా! అని విన్నవించి, తిరిగి హనుమంతుడు రామునకు సీతాసందేశం వినిపించగా, పిమ్మట రాముని ఆదేశానుసారంగా విభీషణుడు అశోకవనం నుండి సీతమ్మను తీసుకువచ్చి రామునికి సమర్పించాడు.

సీతరామ లక్ష్మణులు అయోధ్యానగరము వెళ్ళుటకు విభీషణుడు పుష్పకవిమానము ఏర్పాటు చేయుగా, సీతరామలక్ష్మణులతో పాటు, వానరవీరులు, రాక్షసవీరులు అధిరోహించారు. పుష్పకవిమానం భరద్వాజాశ్రమం వద్ద దింపి, భరద్వాజమహర్షి ,రాముడు ఇరువురు కుశల ప్రశ్నలు గావించిన పిమ్మట రాముడు హనుమతో హనుమా! నువ్వు ఈ క్షణమే బయలుదేరి శృంగిబేర పురంలో గుహుని కలిసి నా క్షేమవార్త చెప్పి అయోధ్య చేరి నా క్షేమమును నివేదించి, సీతాపహరణం మొదలు రావణ సంహారం వరకూ జరిగిన విషయాలన్నీ భరతునికి నివేదిస్తూ ఆ సమయంలో భరతుని మనసు ఎలా వున్నదో అతని ఆకారాన్ని బట్టి గ్రహించి రావాలి అని అన్నాడు.

అంతట హనుమంతుడు గగనానికి లేచి శృంగిబేర పురం చేరి గుహునికి వార్త చెప్పి, కోసల జనపదాలు చూస్తూ గోమతీ నదినిదాటి నందిగ్రామం చేరాడు. అయోధ్యకు క్రోసెడు దూరంలో నందనవనంలా వున్నచోట భరతుని ఆశ్రమం చేరాడు.

కృష్ణాజినధారియై ఉపవాస కృశీభూతదేహుడై యున్న భరతుని

చూడగానే హనుమంతునికి ఆయన హృదయం అర్థమయింది. ఆయనతోపాటు చతురంగ బలాల అధిపతులున్నా, కాషాయాంబరాలతోనే వున్నారు. మనోహర ప్రశాంత వాతావరణంలో ధర్మ స్వరూపం వలె ఉన్న భరతుని సమీపించి మహాత్మా! మీ అన్నగారు రామభద్రులు మీ కుశలం అడిగి రమ్మని నన్ను పంపారు. త్వరలోనే వారు రానున్నారు, అన్నాడు.

భరతుని హృదయం ఆనంద తరంగాలలో వివశమై కొంతసేపటికి తేరుకొని ఆర్యా! నువ్వు ఎవరో నాకు తెలియదు. ఇంతటి ప్రియవార్త చెప్పిన నిన్ను ఎలా సన్మానించాలో తెలియదు. అయితే మా అన్నగారికి వానరులతో సమాగమం ఎలా జరిగింది. అని ఎన్నెన్నో ప్రశ్నలు వేయగా, హనుమంతుడు వృత్తాంతమంతా భరతునకు వివరించాడు.

భరతుని ఆజ్ఞ మీద శత్రుఘ్నుడు స్వాగత సన్నాహాల ప్రారంభింప జేశాడు. మంగళ వాయిద్యాలతో బయలుదేరి నందిగ్రామం చేరుకొని భరతుడు హనుమంతుని వైపు చూశాడు. అంతట హనుమ, ఓ భరతా! భరద్వాజుల వారి అనుగ్రహం వల్ల ఈ దారిలో వృక్షాలన్నీ ఫలాలతో నిండాయి. ఈ పాటికి సీతరామలక్ష్మణులు గోమతీనది దాటి ఉంటారు. అదిగో పుష్పకవిమానం. సీతారామలక్ష్మణ, సుగ్రీవ, విభీషణులు దాని మీద వస్తారు. అని అన్నాడో లేదో పుష్పక విమానం వారి ముందు దిగింది. భరతుడు ముందుకు నడిచి విమానం దిగిన అన్నగారికి, లక్ష్మణునికి పాదాభివాదం చేశాడు. అనంతరం సుగ్రీవ, విభీషణ, జాంబవంతాదులందరినీ ఆలింగనం చేసుకుని, సుగ్రీవుని వైపు తిరిగి, ఇది మొదలుగా నువ్వు కూడా మా సోదరుడవే. అని దగ్గరగా తీసుకున్నాడు. మరల అందరూ భరతుని ఆశ్రమం చేరారు. తరువాత నిశ్చయించిన మూహూర్తములో సీతరామ పట్టాభిషేకము అత్యంత వైభవోపేతముగా జరిగింది. అక్కడికి వచ్చిన వారందరికి రాముడు గోవృషభ అశ్వదానాలతో, మణిరత్న సువర్ణ దానాలు చేశాడు. సుగ్రీవునకు మణిమాలను, అంగదునకు వజ్రవైదూర్య ఖచితమైన హారాన్ని ఇచ్చాడు.

శ్రీరామ పట్టాభిషేక సమయంలో దేవేంద్రుడు కానుకగా పంపిన వస్త్రములు, రత్నమణిమయకాంచనమాలను శ్రీరాముడు సీతమ్మకిచ్చి నీ మనస్సుకు మహానందం కలిగించిన వానికి నీవే స్వయంగా సమర్పించు అన్నాడు. అంతట సీతాదేవి ఆ హారాన్ని ఆంజనేయునకు సమర్పించింది. ఇలా సీతారాముల అనుగ్రహానికి పాత్రుడై వారి నుండి సత్కారాన్ని పొందిన మహానుభావుడు ఆంజనేయస్వామి. భవిష్యకల్పంలో ఈయన బ్రహ్మ పదవి పొంది సృష్టికర్త అవుతాడు.

హనుమంతుడు మహద్భాగ్యంగా దానిని ధరించాడు. పిమ్మట శ్రీరాముడు హనుమను తన అంకపీఠంపై కూర్చోండపెట్టుకొని తన అలంకారాలతో స్వయంగా అలంకరించాడు. ఏదైనా వరం కోరుకోమన్నాడు హనుమను. నీమీద తరగని భక్తి వరం ఇమ్మన్నాడు హనుమ. శ్రీరాముడు హనుమను కౌగిలించుకొని నీ కీర్తి అజరామరంగా రామచరితం లోకంలో వ్యాప్తంగా వున్నంత కాలం వుంటుందని దీవించాడు.

## 9.10. మహాభారతములో హనుమ

పాండవులు అరణ్యమున భాగీరథీ తీరమందలి నరనారాయణాశ్రమమును దర్శించి, మైనాక పర్వతమును, బిందుసరస్సును దర్శించిరి. ఆ మనోహర వనమునందే అర్జునుని చూచు కాంక్షతో వారు ఆరు రాత్రులు నివసించిరి.

అప్పుడు ఈశాన్య దిక్కునుండి వీచిన గాలి ద్వారా వేయిరేకుల గల పద్మము పాండవుల యెదుటపడింది. ఆ పద్మమును ద్రౌపది తీసికొని భీమసేనునితో ఇట్లనెను. నాథా! ఈ పుష్పము ఎంతో మనోహరముగా నున్నది. దీనిని ధర్మరాజునకిచ్చెదను. నాకు ఇట్టి పువ్వులనేకములు తెచ్చియిమ్ము. వానిని నేను కామ్యక వనమునకు తీసికొని పోయెదను. అంతట భీముడు ద్రౌపది కోరికను తీర్చుటకు ఆ పుష్పగంధము వచ్చిన ఈశాన్యదిక్కునకు బయలుదేరాడు.

మార్గ మధ్యమున నున్న కదళీవనమును సంక్షోభింపజేశాడు. ఆపైన ఒక సరోవరమును చూశాడు. అందులో జలక్రీడ చేసి శంఖమును ఊదాడు. అతని సింహనాదము శంఖనాదముచే అచటి మృగముల పక్షులు భయపడినవి.

ఆ ధ్వని విని అచట కదళీ వనమునందున్న హనుమ ఆ వచ్చువాడు తన సోదరుడగు భీముడని తలచి, ఇతడీ మార్గమున స్వర్గమునకు పోయినచో చాల కష్టపడునని తలచి ఆ మార్గమును అడ్డగించి శయనించాడు. భీముడు హనుమంతుని చూచి పెద్దగా సింహనాదము చేసి దారి విడువమన్నాడు. అపుడు హనుమ ఈ పర్వతము నందు పోవజాలవు. ఇది దేవలోక మార్గము. మానవులకిది అగమ్యము అని చెప్పగా, అంతట భీముడు నేను చంద్ర వంశమునందలి క్షత్రియుడను. వాయు పుత్రుడను నా పేరు భీమసేనుడు. నీవెవడవు అని యడుగగా అపుడు హనుమ నేను వానరుడను. అని చెప్పగా ఓ వానరా! త్వరగా లేచి నాకు త్రోవయిమ్ము. అని పలుకగా హనుమ భీమునితో నాకు లేచుటకు సామర్థ్యము చాలకున్నది. నీకు మార్గము కావలసినచో నా తోకను ప్రక్కకు తొలగించుము. నీకు మార్గము దొరుకును. ఆ మాట విని భీముడు తన ఎడమచేతితో తోకను లేపబోయాడు. అతనికి సాధ్యము కాలేదు. తిరిగి రెండు బాహువులతో దానిని కదలించుటకు తన బలమంతయు ప్రయోగించి మహాప్రయత్నము చేశాడు. కాని అతనికి వీలుకాక శరీరమంతయు చెమటపట్టగా అలసిపోయి భీమసేనుడు హనుమకు నమస్కరించి యిట్లనెను.

కపిరాజా! నా గర్వపు మాటలను క్షమించి ప్రసన్నుడవుకమ్ము. వానర రూపమును ధరించియున్న మీరెవరు? నిన్ను శరణుజొచ్చితిని అని ప్రార్థించగా ఆమాటలు విని హనుమంతుడు వీరుడా! వాయుదేవునకు కేసరిదేవియందు జన్మించిన హనుమంతుడను వానరుడను. సుగ్రీవునకు మంత్రిని శ్రీరామచంద్రునకు దాసుడను. అని పలికి రామకథను సంక్షిప్తముగా తెలియజేశాడు. యుగ ధర్మములను తెలియజేయగా పిమ్మట భీముడు

హనుమతో- నీ విశ్వరూపమును చూడగోరుచున్నాను. అని పలుకగా అంతట హనుమ నాయానా! కలియుగము అచిరకాలములోనే రానున్నది. చిరంజీవులు మాత్రమే ఈ యుగమును అనుసరించియుందురు. కనుక నాపూర్వ శరీరమును నీవు ఇపుడు చూడగోరుట సరికాదని పలికాడు.

ఎంత చెప్పినను భీమసేనుడు హనుమంతుని పూర్వరూపమును చూడకుండ తిరిగిపోవుటకు ఇష్టపడకపోవడంతో హనుమ తన విశ్వరూపమును చూపించి నాయనా! నీవు నా విశ్వరూపమును ఇంత మాత్రమే చూడగలుగుదువు. అని పలికాడు.

అపుడు భీముడు మహాత్మా! మిక్కిలి విశాలమైన నీ శరీరమును చూచితిని ఇంక దీనిని ఉపసంహరించుకొనుము. సూర్యప్రభవలె వెలుగుచున్న యీ శరీరమును నేను చూడజాలకున్నాను.

అంతట హనుమ భీమసేనునకు ధర్మోపదేశము చేసి తన విశ్వరూపమును ఉపసంహరించుకొని భీమసేనుని కౌగలించు కొన్నాడు. పిమ్మట భీముడు హనుమా! నీవు ఒక్కడివే రాక్షసులతో పాటు లంకేశ్వరుడైన ఆ రావణుని నీవొక్కడవే సంహరింపగలవు గదా! ఆ రాముడే రావణుని సంహరించడానికి కారణమేమి? దీనిలో గల పరమార్థము తెలియజేయుము. అంతట హనుమ భీమసేనా! నీవన్నమాట యథార్థమే. నేను ఆ రావణుని త్రుటికాలంలోనే వధించగలను. అయితే శ్రీరాముని ప్రతిష్ఠ సర్వత్ర వ్యాపించవలెనని సంకల్పించి ఇకనేనా విషయం తలపెట్టలేదు.

పిమ్మట భీమసేనుడు హనుమతో వానరశ్రేష్ఠా! నాయెడల నీవెల్లపుడును ప్రసన్నుడవై నన్ను అనుగ్రహించుచుండుము. ఇదియే నా కోరిక. పాండవులకు నీవే దిక్కు, నీ తేజస్సు చేతనే మేము శత్రువులను జయించగలము. ఆ మాటలు విని హనుమంతుడు భీమసేనునితో ఇట్లనెను. నాయానా! నీ యెడల నాకు గల సోదరభావము చేతను, స్నేహభావము చేతను నీకొక హితము చేసెదను.

యదితావన్మయా క్షుద్రాః గత్వా వారణ సాహ్వయమ్ । (అరణ్యపర్వం)
ధార్తరాష్ట్రా నిహంతవ్యా యావదేతత్కరోమ్యహమ్ ॥

శిలయా నగరం వాపి మర్దితవ్యం మయాయది ।
బద్ధ్వా దుర్యోధనం చాద్య ఆనయామి తవాంతికమ్ ॥ 150-8,9

హనుమ భీమునితో ఓ భీమసేనా! వరము కోరుము. హస్తినాపురమునకు వెళ్ళి క్షుద్రులైన ధార్తరాష్ట్రులను హతము జేయుమందువా? శిలాపాతముచే ఆ పురమును మర్దింపమందువా? ఆ దుర్యోధనుని కట్టి తెచ్చి యిప్పుడు నీ పాదములకడ పడవేయమందువా? అంతట భీముడు హనుమా! నీ అనుగ్రహము చేత మేమే శత్రువులను జయింపగలుగుదుము. అపుడు హనుమ : భీమసేనా! నీకు నేను ప్రియము కలిగింతును. నీవు శత్రుసేనలో ప్రవేశించి సింహనాదము జేయునపుడు దానిని సింహనాదముతో రెట్టింపుజేయుదును. మరియు

విజయస్య ధ్వజస్థశ్చ నాదాన్ మోక్ష్యామి దారుణాన్ ।
శత్రూణాం యే ప్రాణహరాః సుఖం యేన హనిష్యథ ॥ 150-15

పార్థుని రథ ధ్వజముపై నధిష్ఠించి శత్రుప్రాణహరములు, మీకు విజయ హేతువులునగు దారుణ నాదములను చేయుచుందును. అని యనుగ్రహించి అదృశ్యుడయ్యాడు.

## 9.11. పరాశర సంహితలో హనుమ విశ్వరూపము

మైత్రేయ మహాముని ఇట్లడిగెను. ఓ పరాశర మహామునీ! రామలక్ష్మణ భరత, శత్రుఘ్న హనుమ, సుగ్రీవులుండగా శతాననుని సీత ఎందుకు చంపెనో చెప్పవలసిందని యడుగగా, అంతట శ్రీపరాశర మహర్షి ఇట్లు చెప్పిరి.

శ్రీరాముడు యుద్ధరంగమున రావణాసురుని సంహరించి కృతార్థుడనైతినని తలచుచుండగా, ఆకాశవాణి ఇట్లు పలికెను. పందయోజనముల

అవతల పదితలలు గల రావణుని దేమున్నది? శ్రీరామా! వేల యోజనముల దూరమున నుండు ఆకాశమునందు తిరుగు మహా బలపరాక్రమములు గల వంద తలలవాడున్నాడు. వాడు సర్వప్రాణులకు జయింప నలవికాడు. కాన నీవు ఆ దేవతా శత్రువును చంపుము. అది విని రాముడు ఇప్పటికే వానరులు కష్టదశ పొందియున్నారు. వేయి యోజనముల దూరము సముద్రమునకు వారధిగట్టుట మిక్కిలి అసాధ్యము కదా! యని రాముడు చింతించగా, అప్పుడు హనుమ రామునితో....

> ప్రసార్య లాంగూల మహం సహస్రయోజనాదధి ।
> అత్యంతకాయ సంయుక్తః తిష్ఠామి వరుణాలయే ॥ (పరాశర సంహిత)
>
> సప్త సాగర పర్యన్తం వర్ధయిష్యామి సేతువత్ ।
> లాంగూలే నాంబుధిం తీర్త్వా-జహి తం హి శతాననమ్ ॥ పుట 113.

రామా! నేను వేయి యోజనములు మించి తోకను పెంచి మిక్కిలి పెద్దదైన దేహము దాల్చి సముద్రముననుండును సప్త సముద్రముల వరకును వంతెన వలె నాతోకను పెంచుదును. ఆ తోక ఆధారముతో సముద్రమును దాటి ఆ శతాననుని చంపుము. అని పల్కి ఆంజనేయుడు తోకను పొడిగించి సముద్రమంతను చివరి వరకు మార్గమేర్పడునట్లు నిలిచాడు.

పిమ్మట శ్రీరాముడు చతురంగ బలములతో, వానరసేనలతోడ కూడి వెడలి యుద్ధమునకు సిద్ధమై నిలిచాడు. ఆ శతాననునిది అంతరిక్షపురము. ఎవరికిని అది వెళ్ళ గల్గినది కాదు. కన్పడునది కాదు. దేవతలకు, రాక్షసులకు కూడ అసాధ్యమైనది. ఆ పట్టణ ప్రాకారము అగ్నిమయము. పరాక్రమముచే సాధింపదగినది కాదు. అని ఆకాశవాణి పలుకులు విని శ్రీరాముడు మిక్కిలి విచారించాడు. అంత హనుమ ఉగ్రుడై ప్రాకారాగ్ని సముద్రమున పడవైచి ఆ పట్టణము వరకు తనతోకను పెంచాడు. అపుడు ఆ పట్టణమున శతానన

రాములకు, వానర రాక్షసులకు భయంకర యుద్ధము జరిగింది. రాముని బాణములచే శతాననుని శిరస్సులు నరుకబడుచుండగా మరల ఘోరమగు శిరములు ఉద్భవించుచున్నవి. అంతేగాక శతాననులనుండి యెన్ని రక్త బిందువులు భూపరాగములనెన్నిటిని తడుపుచున్నవో అందరు శతాననులు పుట్టుచుండిరి. ఆవిధంగా శతాననులు యుద్ధమునకు తలబడి యుద్ధమున రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులను మూర్ఛితులను చేసిరి.

అలా మూర్ఛిల్లిన రామాదులను చూచి సీత మిక్కిలి దుఃఖించగా ఇంతలో గర్గ మహాముని వచ్చి సీతకు ద్వాదశాక్షరి మంత్రమును ఉపదేశించగా అంతట ఆమె ఆ మంత్రమును జపించగా, అందులకనుగ్రహించిన హనుమ విశ్వరూపమును దాల్చాడు. ఆ విశ్వరూపము యెట్టిదనిన

> వానరం ముఖమేకం తు-ద్వితీయం సింహవక్త్రమ్ ।
> తృతీయం గారుడం వక్త్రం – చతుర్థం సౌకరంముఖమ్ ॥
> హయాననం పంచమం చా-ష్యేకైకం నయనైస్త్రిభిః (పరాశరసంహిత)
> దశబాహు సమోపేతం – దశాయుధ సమన్వితమ్ ॥ పుట.118

ఆ విశ్వరూపమున మొదటిది వానర ముఖము,రెండవది సింహముఖము, మూడవది గరుద్మంతుని ముఖము. నాల్గవది వరాహ ముఖము, ఐదవది గుఱ్ఱపు ముఖమునై ఒక్కొక్కటి మూడు నేత్రములు కలదై యుండ పదిచేతులు, ఆ పది చేతులందు పది ఆయుధములు ధరించియున్నాడు.

అప్పటినుండి హనుమ పంచముఖ హనుమానుడు అయ్యెను. అతని రూపము త్రిపురాసుర సంహార మందలి రుద్రుని ముఖము వలె ప్రకాశించెను. శతాననులందఱకు యెన్ని ముఖములన్నవో అన్ని పంచముఖాంజనేయ రూపములుగా అతడయ్యాడు. పిమ్మట హనుమ సీతాదేవిని తన భుజముపై ఎక్కించుకొని రాక్షసులకు భయమును కల్గించాడు. వెంటనే ఆ సీతమ్మ కాళీ

రూపమై భయంకరమై ఆ రాక్షసునితో తలపడింది. ఆ రాక్షసుల రక్తముచే తడిసిన రేణువుల నుండి రాక్షసులు ఉద్భవించగా, అంత హనుమ తన తోకను బాగుగా విస్తరింపజేసి రక్తము పడుచోటంతను వ్యాపింపజేశాడు. రక్తము నేలపై పడకపోవుటచే చివరకు ఒక శతాననుడు మాత్రము మిగిలాడు. అపుడు ఆ సీత వింటినారి యందు బాణం సంధించి, తనలో...

> ఏకపత్నీవ్రతో రామో-యద్యహం పతిదేవతా । (పరాశర సంహిత)
> ఏతత్యనేన బాణ్యే శతానన శిరోహహత్ ॥ పుట. 119

శ్రీరామచంద్రుడు ఏక పత్నీవ్రతుడైతే, నేను పతియే దైవముగా నెంచుదాననైతే ఈ బాణము చేతనే శతానసుని శిరస్సు పడిపోవలెను. అని సీతాదేవి బాణము వీడి వాని శిరస్సును ఛేదించింది. దేవతలు పుష్పవర్షము కురింపించిరి.

సీత విజయము, హనుమంతుని ప్రభావము ఎవరు పఠింతురో లేక విందురో వారు సమస్తములగు కోర్కెలను పొందుదురు.

## 9.12. హనుమ వ్యక్తిత్వము

సప్త చిరంజీవులలో హనుమ ముఖ్యుడు. హనుమ సూర్యునకు శిష్యుడుగా, రామునకు దాసభక్తుడుగా, సుగ్రీవునకు మంత్రివర్యునిగా పరమేశ్వరుని అపరవతారమూర్తిగా, కొలువబడినవాడు హనుమంతుడు రావణాది రాక్షసులను ఎదిరించి సీత ఉనికిని తెలిసికొని లంకేశ్వరుని హతమార్చుటలో శ్రీరామునకు ఎనలేని సేవ చేసిన మహాభక్తుడు హనుమ. మహాభారత యుద్ధంలో అర్జునుని ధ్వజమున వెలసి పాండవుల విజయమునకు కూడ దోహదకారి అయినాడు. ఈ హనుమను చిరంజీవిగా మనవారు కొలుస్తుంటారు.

పరాశర సంహితలో కూడ హనుమను రుద్రావతారమని చెప్పి "ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా స్సర్వే దేవతాః" ఆంజనేయుని పూజిస్తే

దేవతలందరూ పూజింపబడినట్లే అని చెప్పబడింది.

> వందే వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాంచితం
> నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్య మానం రుచా
> హస్తాబ్జై రసిఖేట పుస్తక సుధాకుంభా న్కుశాద్రీన్హలం
> ఖట్వాంగం ఫణి భూరుహంచ దధత సర్వారి గర్వాపహమ్ ॥

వానర, నారసింహ, గరుడ, వరాహ, అశ్వముఖములచే నొప్పునట్టియు, వివిధాలంకారములతోను, మూడైదుల నేత్రములు కల్గి ప్రకాశించు దేహకాంతి గల కర కమలములందు కత్తి, డాలు, పుస్తకము, అమృత భాండము, దర్భలు, కొండ, నాగలి, మంచపుకోడు, పాము, వృక్షములు ధరించినట్టియు, సమస్త గర్వములనణుచు హనుమంతుని నమస్కరించుచున్నాను.

## 10. విభీషణుడు

కైకసి విశ్రవసునకు జన్మించినవాడు విభీషణుడు. విభీషణ శబ్దమునకు రెండు అర్థములున్నవని చెప్పవచ్చును. ఎట్లనిన...శత్రువులకు (భగవద్విముఖులగువారికి) విశేషభయము కలిగించువాడనియు, మిత్రులకు (భగవదభిముఖులగువారికి) భయమును పోగొట్టువాడని అర్థము. విభీషణుడు సప్తచిరంజీవులలో ఒకడు.

### 10.1. విభీషణుని జననము

బ్రహ్మదేవుడి మానసపుత్రులు ఆరుగురు. వారు మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనే పేర్లు కలవారు. వారిలో చతుర్థ ప్రజాపతియునైన పులస్త్యుడు ముఖ్యుడు.

పులస్త్యుడు వేదాధ్యయనము చేయుచుండగా, తృణబిందుని కుమార్తెకు జన్మించినందున నితనికి 'విశ్రవసుడను' నామము సార్థకమయినది.

విశ్రవసుడు తపస్సు చేసుకొనుచుండగా, సుమాలి అను రాక్షసుడు పోవుచు జూచిరి. ఈ విశ్రవసునకు తన కుమార్తెను నీయదలచుకొని, 'కైకసిని' అతని కడకు పంపాడు. కైకసి వచ్చి యితనికి పరిచర్యలు చేయుచుండగా, నితడు నీవెవ్వరని ప్రశ్నించగా, నేను సుమాలి కూతురను. కైకసి యనుదానను పుత్రుని గోరి వచ్చితిని అనుగ్రహింపుము. అని ఆమె పలికింది. అంతట అతడు సంధ్యాకాలమునందు అట్లు కోరుటచే నీకు జన్మించువారు రాక్షసలగుదురని చెప్పాడు. ఆమె యందితనికి రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, శూర్పణఖ జన్మించిరి. ఆమె ప్రార్థనపై చివరి పుత్రుడు విభీషణుడు ధర్మాత్ముడయ్యాడు.

విభీషణుడు శైలూషుడను గంధర్వుని కుమార్తె 'సరమ'ను పరిణయమాడెను. ఈమె లంక యందు రాక్షసుల మధ్యనుండినను వారి దుర్గుణములు ఈమెకు లేవు.

## 10.2. బ్రహ్మ విభీషణునకు అమరత్వమును ప్రసాదించుట

విభీషణుడు అయిదువేల సం॥లు ఒంటికాలిపై నిలిచి తపస్సు చేసాడు. ఆ పిదప శిరసును, బాహుద్వయమును మీదికెత్తి నిల్చి స్వాధ్యాయన పరాయణుడై అయిదు వేల యేండ్లు సూర్యునారాధించాడు. అతని తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై... "పరితుష్టోస్మి ధర్మాత్మన్ వరం వరయ సువ్రత"

ఓయి ధర్మాత్మా ! సువ్రతా! సంతసించితిని. వరము వేడుకొనుము. నీయందు పరితుష్టి జెందితిని. నీకే వరం కావలెనో కోరుకో అని పలుకగా, అంత విభీషణుడు బ్రహ్మదేవునకు నమస్కరించి ఓ బ్రహ్మదేవా !

> ప్రీతేన యది దాతవ్యో వరో మే శృణు సువ్రత । (ఉత్తరకాండ)
> పరమా పద్గత స్యాపి ధర్మే మమ మతిర్భవేత్ ॥ 10-30
> అశిక్షితం చ బ్రహ్మాస్త్రం భగవన్ ప్రతిభాతు మే ।
> యాయా మే జాయతే బుద్ధిర్యేషు యేష్వాశ్రమేషు చ ॥ 10-31
> సాసా భవతు ధర్మిష్ఠా తంతం ధర్మం చ పాలయేఽ ।
> ఏష మే పరమోదారో వరః పరమ కో మతః ॥ 10-32
> నహి ధర్మానురక్తానాం లోకే కించన దుర్లభమ్ ॥ 10-33

నీవు నా యందు ప్రసన్నుడవైనచో, మహాత్మా ! ఎట్టి ఘోర విపత్తుతో నైనను నా బుద్ధి ధర్మమును విడువకుండ నుండునట్లు వరమిమ్ము. అభ్యసించకుండానే బ్రహ్మాస్త్రము నాకు సిద్ధించునట్లు అనుగ్రహింపుము. ఏ ఆశ్రమమును గూర్చి, ఏయే ఆలోచన చేసెదనో, అది ధర్మానుకూలమగు నట్లును, దానిని నేనాచరించునట్లును వరము ప్రసాదింపుము. ఇదే నాకన్నిటికన్న ఉత్తమమైన వరదానము. ధర్మానురక్తునకు దుర్లభమేదియు లేదు. అని పల్కగా బ్రహ్మ సంతసించి విభీషణునకిట్లనెను – విభీషణా! నీ కోరిక ప్రకారము అభ్యసించకుండానే బ్రహ్మాస్త్ర సిద్ధిని, ధర్మ పరతంత్రమైన బుద్ధిని ప్రసాదించుచున్నాను.

యస్మాద్రాక్షస యోనౌ తే జాతస్యామిత్ర నాశన ।
నాధర్మే జాయతే బుద్ధి రమరత్వం దదామి తే ॥ 10-34

కుమారా ! రాక్షస కులమున పుట్టినప్పటికిని నీ బుద్ధి అధర్మము వైపు మొగ్గలేదు. కనుక నేను నీకు అమరత్వము వరముగా నిచ్చుచున్నాను.

## 10.3. సరస్వతీనది విభీషణుని చిరంజీవిగా అనుగ్రహించుట

పూర్వము సరస్వతీదేవి తీర్థ రాజములలో తాను గొప్ప తనమును పొందగోరి తపమాచరించుచుండగా, పులస్త్య మహాముని అచటకురాగా ఆదేవి తన పుత్రుడను అభిప్రాయముతో అతనిని పూజింపకుండెను. అందువలన పులస్త్యుడు కోపించి సరస్వతీ! నీవే కోరికతో నుంటివో అది 'నదీ రూపమున నీకెన్నడును సిద్ధింపజాలదు. గంగానదియే నదులకన్నిటికన్నను గొప్పనది కాగలదని శపింపగా, సరస్వతియు కోపించి ఆ మహామునికి ప్రతిశాపమిచ్చినది.

రాక్షసస్తే భవేద్వంశో విష్ణోరప్రియకారకః ॥
పునః ప్రసాదితా తేన విశాపమపి సా దదౌ ॥ (2-24)
అన్తిమో వైష్ణవో భూయాత్ కల్పస్థాయీ విభీషణః ॥ (బ్రహ్మపురాణం)

నీ వంశము శ్రీమన్నారాయణునకు అపకారము నొనరించు రాక్షసవంశమగునని శపించెను. మరల ఆ పులస్త్య మహర్షి ప్రార్థించగా, మీ వంశములో చివరివాడగు విభీషణుడొక్కడు మాత్రము విష్ణుభక్తి కలిగి కల్పమంతయు జీవించి చిరంజీవియై పులస్త్య వంశమునంతను తరింజేయుగాక యని అనుగ్రహించినది.

## 10.4. సుందరకాండ

హనుమ రావణాసురునకు రామ, సుగ్రీవ సందేశాన్ని తెలియజేసి రావణా! నా సత్యమును ఆలకించుము. సీతను తిరిగి రామునకివ్వుము. అని పలుకగా, అప్రియములగు మాటలను విని కోపముతో రావణుడు ఈ వానరుని చంపుడని ఆజ్ఞాపించాడు.

దూతగా వచ్చిన హనుమను చంపుట న్యాయము కాదని తలచి, విభీషణుడు కోపములోనున్న రావణాసురుని చూచి లంకేశ్వరా! క్షమించుము. రోషమును వీడుము. ప్రసన్నుడవగుము. నామాటను వినుము. చేయదగినది, చేయరానిది తెలిసిన ప్రభువులు దూతను చంపరు. దూతగావచ్చిన ఈవానరుని చంపుట రాజధర్మమునకు విరుద్ధము. లోకపుతీరులో నింద్యము. నీ వంటి వీరుడు చేయుటకు తగనిది ధర్మములను తెలిసినవాడవు. నీవంటి విద్వాంసులు కూడ కోపమునకు లొంగిపోయినచో శాస్త్రములలో పరిశ్రమ చేయుట శ్రమయే అనిపించుచున్నది. అందుచే అనుగ్రహించి, యుక్తాయుక్తములను ఆలోచించి, దూతకు తగినదండమును విధింపుము.

రావణాసురుడు విభీషణుని మాటలను విని రోషావేశముతో పాపాత్ములను చంపుటలో పాపము లేదు. అందుచే ఈ వానరుని చంపెదను. అనెను. ఆ మాట వినగానే విభీషణుడు, ఆ వాక్యము అధర్మమూలము. బహుదోషయుక్తము అని తలచి రావణునితో ...

ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర ధర్మార్థ యుక్తం వచనం శృణుష్వ ।
దూతానవధ్యాన్ సమయేషు రాజన్ సర్వేషు సర్వత్ర వదంతి సన్తః ॥ (52-13)

రాక్షసరాజా! ప్రసన్నుడవగుము. ధర్మార్థములతో కూడిన నామాటను వినుము. అన్ని దేశములలో, అన్ని జాతులలో దూతలను చంపకూడదని సత్పురుషులందరు చెప్పుచుందురు. ఈతడు కేవలము దూతయే కాదు. అక్షకుమారుడు మున్నగువారిని చంపుటచే శత్రువు కూడ అని నీవనవచ్చును. సందేహములేదు. నిశ్చయమే! ఈతడు చాల బలమైనవాడు. మనకు చెప్పలేనంత అపకారము చేసినాడు. కాని దూతలను చంపుట పెద్దల ఆచారము కాదు. దూతకు అనేక రకములగు శిక్షలు విధింపదగినవని పెద్దలు చెప్పినారు. కొరడాలతో కొట్టించవచ్చును. గుండు చేయవచ్చును. కొన్ని గుర్తులను శరీరముపై కాల్చివేయవచ్చును. ఈవిధముగ ఏవో శిక్షలను విధింపుమని పెద్దలు చెప్పుచున్నారు గాని, దూత వధ మాత్రము ఎచ్చటను చెప్పబడలేదు. ధర్మార్థముల

తెలిసినవాడవు. కావున నీవంటి వాడు కోపమునకు వశమగుట తగదు. నీవంటివారు కోపమును నిగ్రహించుకొనవలెను.

ఈ వానరుని చంపుట ధర్మవిరోధమనియే కాదు. మనకు ఎటువంటి ప్రయోజనము కూడ లేదు. ఈ వానరుని చంపిన మనకు వచ్చెడి లాభమేమి? వీనిని పంపినవారు ఎవరో వారిని చంపవలెను. మంచివాడే కానిమ్ము. చెడ్డవాడే కానిమ్ము. ఈతడు ఇతరులచే పంపబడిన వాడు కదా! కావున దూతను చంపుట తగదు.

అంతేకాదు. ఈతనిని చంపినచో వేరొకదెవ్వడును వంద యోజనముల సముద్రమును దాటి ఆకాశములో ఎగిరి రాలేడు. అందుచే ఈతనిని చంపుటకు ప్రయత్నము చేయకుము. ఈతడు చనిపోయినచో ఆ రాజకుమారుడు వేరొక దూతను ఎవనిని పంపలేడు. యుద్ధమునకు ఉత్సాహపడుచున్నవారు వీని మాటలను విని మనపైకి యుద్ధమునకు రాగలరు. పరాక్రమము, ఉత్సాహము, పౌరుషము గల దేవదానవులకు కూడ దుర్జయుడవగు నీవు రాబోవుచున్న యుద్ధమునకు అవకాశమును కల్పించుకొనవలెను గాని, పాడుచేయరాదు. గొప్పబలపరాక్రమవంతులు, యోధులు, కోట్లకొలది నీవద్ద నున్నారు. వారిలో ఏ కొద్ది మందినో నీవు ఆజ్ఞాపించి పంపినచో ఆ రాజపుత్రుడు బంధించి నీ ప్రభావమును తెలియజేయుదురు. అని పలికాడు.

తమ్ముడగు విభీషణుని ఉత్తమమగు వాక్యమును ఆ రాక్షసరాజు విని యుక్తమే అని దానిని అంగీకరించాడు.

### 10.5. యుద్ధకాండ

రావణుని సభలో ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, విరూపాక్షుడు మొదలగు రాక్షసులు రామలక్ష్మణ సుగ్రీవులను, లంకను పాడుచేసిన ఆ హనుమంతుణ్ణి ఇప్పుడే చంపివేసెదము. అని పలుకగా అపుడు విభీషణుడు, ఆయుధములు ధరించి లేచిన ఆ రాక్షసులనందరినీ నివారించి వాళ్ళను మరల కూర్చుండునట్లు

చేసి నమస్కరించి ఇట్లు పలికాడు.

ఒక కార్యమును సామదాన భేదోపాయములచే సాధించలేనప్పుడే పరాక్రమమును చూపుటకు తగిన కాలమని బుద్ధిమంతులు చెప్పుదురు. మన ప్రభువు రావణుడు రాముని భార్యను జనస్థానము నుండి అపహరించినాడు కదా! అట్లు చేయుటకు రాముడు పూర్వమేమైన అపకారము చేసినాడా! మితిమీరి ప్రవర్తించిన ఖరుణ్ణి రాముడు యుద్ధములో చంపినాడనగా అందులో తప్పేమి? ఏ ప్రాణియైనా తన బలమునననుసరించి ప్రాణములను తప్పక రక్షించుకొనవలెను. ధర్మతత్పరుడైన రామునితో వైరమపెట్టుకొనుట మంచిది కాదు.

అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్ ।
అర్థక్షయకరం ఘోరం పాపస్య చ పునర్భవమ్ ॥ 9-15

అపకీర్తి పొలగుటయేకాక మన అర్థ ప్రాణములు భస్మమై పోవును. పాపము కూడ మనలను ఆవరించును. సీత కారణమున మనకు గొప్ప ఆపద సంభవింపగలదు. సీతను వదలుకొన్నచో వైరము తీరు పోవును. రాముని విరోధము పెట్టుకొనుట క్షేమకరము కాదు. అట్టి ధర్మాత్ముని భార్యను ఆయనకు సమర్పించుట మనకు మేలు. అని విభీషణుడు పలుకగా, ఆ మాటలు విన్న రావణాసురుడు రాక్షసులనందరినీ పంపివేసి ఇంటిలోనికి వెళ్ళిపోయాడు.

మరల విభీషణుడు వేకువజామున రావణుని సమీపించి, నమస్కరించి ఓ రావణా! సీతవచ్చినది మొదలు ఇక్కడ మనకు అశుభమును సూచించు శకునములు కనబడుచున్నవి. కాకులు గుంపులు గుంపులుగా చేరి అరచుచున్నవి. గ్రద్దలు మండలాకారముగా తిరుగుచు వ్రాలుచున్నవి. ఇట్టివి కనపడుటచే వాటికి పరిహారము చేయవలసియున్నది గాన, రామునకు సీతను ఇచ్చివేయుటయే తగిన పరిహారమని నేను తలచుచున్నాను. ఈ విషయమును నీకు చెప్పుటకు మంత్రులందరూ సందేహించుచున్నారు. నేను చూచినది విన్నది తప్పక నీకు చెప్పవలెను గాన చెప్పుచున్నాను. అందుచేత నీవు న్యాయానుసారముగా ఏమి

చేయవలెననో అది చేయుము. అంతట కోపముతో రావణుడు, రాముడు ఏనాటికీ సీతను పొందజాలడు. ఇంద్రాది దేవతలతో కలిసి వచ్చినను రాముడు యుద్ధములలో నా యెదుట నిలువగలడా? అని పలికి తనకు హితమును బోధించుచున్న విభీషణుని పంపివేశాడు.

మరల సభాభవనంలో విభీషణుడు లంకేశ్వరా! వానరులు లంకను చుట్టుముట్టక ముందే సీతను రామునకు ఇచ్చివేయుము. అని పలుకగా విభీషణుని మాటలు విని ప్రహస్తుడు ఇట్లు పలికాడు. మాకు భయమనేది తెలియదు. ఎవరి వలన మాకు భయము లేదు అని పలుకగా అప్పుడా విభీషణుడు, ప్రహస్తుడా! దేవ దానవ యక్ష గంధర్వ యక్షులు గాని యుద్ధములో రాముని ఎదుట నిలువజాలరు. నేను అందరికీ హితపూర్వకమైన వాక్యమును చెప్పుచున్నాను. రామునకు సీతను సమర్పించుము. 'వదేత్ క్షమం స్వామి హితం స మన్త్రీ' ప్రభువునకు హితమైన విషయమును ఉపదేశించువాడే ఉత్తముడైన మంత్రి అని పలికాడు.

ఇంద్రజిత్తు విభీషణుని మాటలను అధిక్షేపించగా, అంతట విభీషణుడు ఇంద్రజిత్తుతో నాయనా! నీ వింకా చిన్నవాడవు. మంత్రణ విషయమున నీకు నిశ్చయము లేదు. అందుచేతనే నీవు ఆత్మ వినాశమునకు హేతువైన అర్థము లేని మాటలు పలుకుచున్నావు. రాముని బాణము బ్రహ్మదండము వంటివి. గాన ఓ రాజా! సీతాదేవిని రామునకు సమర్పించి మనమందరము సుఖముగా నివసించెదము. అని పలికాడు.

అప్పుడు రావణుడు కోపముతో మనకు అస్త్ర శస్త్రముల వలన గాని భయములేదు. స్వార్థముతో ప్రవర్తించు జ్ఞాతుల వల్లనే మనకు భయమని విభీషణుని తిరస్కరిస్తూ ఓ విభీషణుడా! మరొక్కడెవ్వడైనా ఈవిధముగా మాటాలాడినచో ఈ ముహూర్తము నందే సంహరించెడి వాడను అని పరుషముగా పలుకగా, అంతట విభీషణుడు గదధరించి ఆకాశము లోనికి ఎగిరాడు. అతనితో పాటు నలుగురు రాక్షసులు కూడ అనుసరించిరి.

ఆకాశములో నిలచిన విభీషణుడు సోదరుడైన రావణునితో.....

సర్వం క్షమామి మే రాజన్ బ్రూహిమాం యద్యదిచ్ఛసి ।
జ్యేష్ఠో మాన్యః పితృ సమో నచ ధర్మపథే స్థితః ॥ 16-19

రాజా ! నీవు నా అన్నవు నీకిష్టము వచ్చినట్లు అనుము. అన్నగారు తండ్రి వంటివాడు. ధర్మమార్గములో లేకున్నా గౌరవింపవలసిన వాడే. కాని నీవు అన్నవే అయినా ఈ పరుష వాక్యములను సహింపజాలను.

మనో నిగ్రహము లేనివారు హితము కోరి వారి చెప్పిన మాటలను వినరు. నీవు అన్నవగుటచే నీ హితమును కోరి నేను చెప్పినమాటలు క్షమింపుము. నిన్ను రాక్షసులను ఈ నగరమును అన్ని విధాలా రక్షించుకొనుము. నీకు క్షేమమగుగాక! నేను వెళ్ళిపోవుచున్నాను. నేను లేకుండా సుఖముగా నుండుము. అని పలికి విభీషణుడు లక్ష్మణ సహితుడైన రాముడున్న చోటికి వచ్చి ఆకాశమునందే నిలచి సుగ్రీవుణ్ణి ఆ వానరులను చూచి ఇట్లనెను. రావణుడు నన్ను బానిసను అవమానించినట్లు అవమానించినాడు. అందుచేత నేను భార్యా పుత్రాదులను విడచి వచ్చి రాముణ్ణి శరణు పొందుచున్నాను. అని పలుకగా అంతట సుగ్రీవుడు రాముణ్ణి సమీపించి రామా ! ఈ రాక్షసులను నమ్మకూడదు. వీరు కపటోపాయములు తెలిసినవారు. రావణుడే వీరిని పంపియుండవచ్చును. కావున వీరికి తీవ్రమైన దండనమిచ్చి చంపించివేయుము. అని సుగ్రీవుడు పలికాడు. అంగదుడు ముందుగా విభీషణుని పరీక్షించవలెనని పలికాడు. జాంబవంతుడు, ఈ విభీషణుడు రావణుని వద్ద నుంచి దేశముకాని దేశమునకు, కాలముకాని కాలమునందు వచ్చినాడు గనుక అన్నివిధాలా సందేహించ వలసియున్నదని పలికాడు. పిమ్మట హనుమ రామునితో రామా ! రావణుని దుష్టత్వమునూ, నీ పరాక్రమమునూ చూచి, ఈ కాలమునందు, ఈ దేశమునందు అతడు వచ్చుట యుక్తమే కదా! ఇది అతని బుద్ధికి తగినట్లున్నదని పలికాడు.

వానరుల మాటలను వినిన రాముడు విభీషణుని స్నేహమును

అంగీకరించుటయే యుక్తమని తలచి వానరులతో...

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**

**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥** 18 – 32

ఎవ్వడైన వచ్చి నేను నీవాడను అని చెప్పుచు ఒక్క మారు నన్ను శరణు పొందిన చాలును. వానికి సకలప్రాణులనుండి అభయమునిచ్చెదను. ఇది నావ్రతము.

ఆ వచ్చినవాడు విభీషణుడైనా, లేదా సాక్షాత్తు రావణుడే అయినా ఇతనిని తీసికొనిరమ్ము. నేను ఇతనికి అభయము ఇచ్చినాను.అని పలుకగా,

అంతట విభీషణుడు రాముని పాదపద్మములకు నమస్కరించి

**అనుజో రావణస్యాహం తేన చాస్మ్యవమానితః ।**

**భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణం గతః ॥** 19-4

నేను రావణుని తమ్ముడను. అతడు నన్ను అవమానించినాడు. సకలప్రాణులకు రక్షకుడనైన నిన్ను శరణు పొందినాను.

నేను లంకను మిత్రులను ధనమును పరిత్యజించి వచ్చినాను. నా రాజ్యము, జీవితము, సుఖములూ కూడ నీపై ఆధారపడి ఉన్నవి. అని శరణాగతి చెందాడు. పిమ్మట రాముడు విభీషణుని రాక్షసుల బలాబలములను చెప్పుము అనగా, విభీషణుడు రామునితో రామా! బ్రహ్మవరములిచ్చి ఉండుటచే, రావణుని గంధర్వులుగాని, ఉరగులుగాని, యక్షులుగాని, మరి ఏ ప్రాణులుగాని చంపజాలవు. రావణుని సోదరుడు నాకంటె పెద్దవాడు అయిన కుంభకర్ణుడు యుద్ధములో దేవేంద్రుని ఎదిరించగలిగిన బలము కలవాడు. ఇక సేనాపతియైన ప్రహస్తుడు కైలాసపర్వతము మీద జరిగిన యుద్ధములో మణిభద్రుణ్ణి ఓడించినాడు. రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు అగ్నిని హోమములచే తృప్తిపొందించి అంతర్ధానము చెంది, గొప్ప సేనావ్యూహములు గల యుద్ధములో శత్రువులను సంహరించును. మహోదర మహాపార్శ్వులు, అకంపనుడు అను ముగ్గురు

సేనానాయకులు లంకాపురములో పదివేలకోట్లమంది రాక్షసులు నివసించుచున్నారు అని చెప్పెను. అప్పుడు రాముడు విభీషణునితో...

**అహం హత్వా దశగ్రీవం స ప్రహస్తం స బాంధవమ్ ।**
**రాజానం త్వాం కరిష్యామి సత్యమేతద్బ్రవీమి తే ॥ 19-19**

విభీషణా! నేను రావణుని సబాంధవముగా వధించి లంకారాజ్యమునకు నిన్ను రాజుగాచేయింతును. ఈ మాట సత్యము అని పలికి లక్ష్మణా ! సముద్రజలమును తెచ్చి విభీషణుని రాక్షసరాజుగా అభిషేకమొనర్చుము. అంత లక్ష్మణుడు విభీషణునికి వానర ప్రముఖుల సమక్షమున అభిషేకము చేసినాడు. అందరు ఆనందమయులై శ్రీరాముని ప్రశంసించినారు.

తరువాత హనుమసుగ్రీవులు, విభీషణుని సముద్రమును దాటుట ఎట్లు అని అడుగగా విభీషణుడు వారి మాటలు విని

**'సముద్రం రాఘవో రాజా శరణం గన్తు మర్హతి'**

రాజైన రాముడు సముద్రమును శరణు పొందుట మంచిది. బంధువైన సాగరుడు రాముని కార్యమును చేయగలడు.

విభీషణుని సలహాప్రకారము రాముడు సాగరుని ఉపాసించదలచి సముద్ర తీరమునందు దర్భలు పరచుకొని వాటిపై వేదిలో అగ్నివలె ఉపాసించాడు. రావణుని ఆజ్ఞగా వానర సైన్యమెంత తెలుసుకొనదలచి శుక సారణులు వానర సైన్యములో ప్రవేశించిరి. విభీషణుడు రూపాంతరములలో ఉన్న శుక సారణులను ఇద్దరినీ చూచి, పట్టుకొని రామా! వాళ్ళిద్దరూ రావణుని మంత్రులైన శుక సారణులు లంకనుండి గూఢచారులుగా వచ్చినారు. అని చెప్పగా వారిని సంహరింపవలదు వారిని పంపివేయుము అని చెప్పాడు.

విభీషణుని మంత్రులైన అనలుడు, పనసుడు, సంపాతి, ప్రమతులను వారు పక్షి రూపములు ధరించి శత్రుసైన్యములో ప్రవేశించి, శత్రువులు చేసికొనిన ఏర్పాటును తెలియజేస్తూ రామా! ప్రహస్తుడు తూర్పుద్వారమువద్ద, మహాపార్శ్వ

మహోదరులు దక్షిణద్వారము వద్ద, ఇంద్రజిత్తు పశ్చిమద్వారము వద్ద, రావణుడు ఆయుధములు ధరించిన వేలకొలది రాక్షసులతో కూడి స్వయముగా ఉత్తర ద్వారము వద్ద ఉన్నాడు. అని లంకలోని వార్తలను తెలియజేశాడు.

ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో మాయ యుద్ధంచేసి నాగపాశములచే రామలక్ష్మణులను బంధించి, మర్మ స్థానములయందు బాణములను ప్రయోగించి మూర్ఛితులను చేసి, లంకకు వెళ్ళిపోయాడు. విభీషణుడు రామలక్ష్మణులను చూచి దుఃఖితుడయ్యాడు. సుగ్రీవుడు దుఃఖితుడు కాగా, విభీషణుడు సుగ్రీవుని ఓదార్చి, రాముడు మరణించలేదు. ముఖ కాంతి విడువలేదు అని ధైర్యము పలికి వానరసైన్యమును ఉత్సాహపరచుము అని పలికెను. అంతలో గరుత్మంతుడు అచటకు రాగా నాగపాశములు విడిపోయాయి. గరుత్మంతుడు రామలక్ష్మణులను స్పృశించగానే గాయములన్నీ మాయమయ్యేను.

రావణాసురుని ఆజ్ఞగా యుద్ధరంగమునకు వచ్చిన అతి కాయుడను రాక్షసుని చూచి రాముడు ఆశ్చర్యచకితుడై విభీషణా! గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తున్న ఈ రాక్షసుడెవడు? అని అడుగగా అంతట విభీషణుడు. రామచంద్రా! నాడు రావణునికి ధ్యానమాలివల్ల కలిగిన వాడు వేదవిదుడు. ధనుర్విద్యలో రావణునంతటివాడు. ఖడ్గచాలనంలో నిపుణుడు. రాజనీతికోవిదుడు. ఇతని బాహుబలం లంకకు పెట్టనికోట. ఈ అతికాయుడు తపోదీక్షతో బ్రహ్మను మెప్పించి వరాలు పొంది అస్త్రాలు గ్రహించినవాడు. వీని విషయంలో జాగ్రత్త అవసరం అన్నాడు. పిమ్మట లక్ష్మణుడు ఆ రాక్షసునితో యుద్ధంచేసి చివరికి బ్రహ్మాస్త్రం ప్రయోగించి అతికాయుడుని సంహరించాడు.

యుద్ధమునకు వచ్చుచున్న ప్రహస్తుని చూచి రాముడు విభీషణా! యుద్ధమునకు సంసిద్ధుడైయున్న ఈ రాక్షసుని గూర్చి నాకు చెప్పుము.

రాముని మాటలు విని విభీషణుడు, రామా! ఇతడు ఆ రావణుని సేనాపతియైన ప్రహస్తుడను రాక్షసుడు లంకలోని మూడువంతుల సైన్యమునకు నాయకుడని తెలియజేశాడు.

నీలుడు ప్రహస్తుని చంపెను. రావణుడు యుద్ధము చేయుటకు బయలుదేరగా ఆ మహాసైన్యమును చూచి రాముడు విభీషణా! ఈ సైన్యము ఎవనిది. అనేకమంది యోధులు కనబడుచున్నారు. అని అడుగగా అంతట విభీషణుడు. రామా! ఏనుగుపై ఎక్కి ముందుకు వస్తున్నవాడు అకంపనుడు. సింహ ధ్వజము కలిగి రథము మీద ఉన్నవాడు ఇంద్రజిత్తు. మహేంద్ర పర్వతము వలెనున్నవాడు అతికాయుడు. ఏనుగునెక్కి ఘంటాధ్వనులతో ఎక్కువ శబ్దము చేస్తూ వస్తూన్నవాడు మహోదారుడు. వృషభమును ఎక్కివచ్చుచున్నవాడు త్రిశిరస్కుడు. కుంభుడు, నికుంభుడు, తరువాత వింధ్యపర్వతము వంటి శరీరము కల్గినవాడు రావణుడు. నిన్ను స్వయంగా ఎదుర్కొనడానికి వస్తున్నాడని పలికాడు.

అహో దీప్త మహాతేజాః రావణో రాక్షసేశ్వరః । (యుద్ధకాండ)
ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యో రశ్మిభ్రాతి రావణః ॥ (59-26)

అప్పుడు రాముడు విభీషణునితో విభీషణా! దేవధానవ గణాలలో ఇటువంటి ప్రభాపూర్ణ దేహం కనిపించదు. ఏమి దీప్తి, ఏమి తేజస్సు. దుర్నిరీక్ష్యుడయిన సూర్యుని వలె ఉన్నాడు.

రావణ లక్ష్మణునకు హోరాహోరిగా జరిగిన యుద్ధములో రావణుడు శక్తిని ప్రయోగించగా లక్ష్మణుడు మూర్ఛితుడు కాగా, రాముడు రావణునితో పోరాడి ఆ రావణుడి రథ, ఖడ్గ చాపాలు ముక్కలయ్యాయి. అంతే గాక రావణుడి కిరీటం కూడ నేలకూలగా అప్పుడు రాముడు, ఇప్పుడు నీతో యుద్ధం చెయ్యడం ఉచితం కాదు. రేపు రావడము మంచిది. అని వెనుదిరిగాడు.

రావణుని సోదరుడైన కుంభకర్ణుడైన యుద్ధం చేయదలచి యుద్ధరంగమునకు వచ్చి శరీర పరిమాణం పెంచుచుండగా, రాముడు ఆ రాక్షసుని చూచి ఆశ్చర్య చకితుడై విభీషణునితో విభీషణా ! ఇంత పెద్ద దేహము గల ఈ రాక్షసుడెవ్వడు? అని అడుగగా అంతట విభీషణుడు రామా! ఇతడు విశ్రవసుని కుమారుడైన ప్రతాప వంతుడైన కుంభకర్ణుడు. ఇతడు యుద్ధములో

యముణ్ణీ, ఇంద్రుణ్ణీ ఓడించినాడు. ఇతని దేహ ప్రమాణముతో సమానమైన ప్రమాణము గల మరియొక రాక్షసుడెవడూ లేదు. ఈ కుంభకర్ణుడు పుట్టీపుట్టగానే ఆకలితో బాధపడుచూ ఎన్నో వేల ప్రాణులను భక్షించాడు. అప్పుడు ప్రజలు భయపీడితులై ఇంద్రుని శరణుజొచ్చి అతనికి ఆ విషయమును తెలిపిరి. దేవేంద్రుడు కూడా కుంభకర్ణుని జయించలేక భయపీడితుడై సంతాపము చెందాడు. దేవేంద్రుడు దేవతలతో, ఋషులతో కలిసి బ్రహ్మ లోకమునకు వెళ్ళాడు. కుంభకర్ణుడు ప్రజలను భక్షించుచున్నాడనీ, దేవతలను ఎదిరించుచున్నాడనీ, ఆశ్రమములను నశింపచేయుచున్నాడనీ, పరస్త్రీలను హరించుచున్నాడనీ, వారు బ్రహ్మదేవునకు కుంభకర్ణుని దుష్టబుద్ధిని గూర్చి తెలిపిరి.

ఇంద్రుని మాటలు విని బ్రహ్మదేవుడు రాక్షసులను తన దగ్గరకు రప్పించుకొని కుంభకర్ణుని చూచాడు. అపుడు బ్రహ్మ కుంభకర్ణునితో విశ్రవసుడు నిన్ను నిశ్చయముగా లోకనాశము కొరకే సృష్టించినాడు. అందుచే నీవు నేటి నుండి చచ్చినవాడవువలె పడి ఉందువు. అని శపించగా రావణుడు బ్రహ్మదేవునితో ఓ పితామహా! నీ ముని మనుమడైన వీనిని ఇట్లు శపించుట న్యాయము కాదు. కాని ఇతడు నిద్రించుటకూ, మేల్కొనుటకూ కాలమును నిర్ణయించి చెప్పుము. రావణుని మాటలువిని బ్రహ్మదేవుడిట్లు పలికాడు.

**'శయితా హ్యేష షణ్మాసానేకాహం జాగరిష్యతి'**

ఇతడు ఆరుమాసములు నిద్రించగలడు. ఒకరోజున మేల్కొన గలడు. రామా! ఇపుడు కష్టములలో చిక్కుకొని నీ పరాక్రమమునకు భయపడిన రాక్షసరాజైన రావణుడు కుంభకర్ణుణ్ణి నిద్రనుంచి లేపించినాడని తెలియజేసెను. రామలక్ష్మణులు, సుగ్రీవుడు, హనుమ, వానరులందరూ యుద్ధరంగంలో కుంభకర్ణునితో పోరాడిరి. చివరగా యుద్ధరంగంలో రాముడు కుంభకర్ణుడిని సంహరించాడు.

ఇంద్రజిత్తు యుద్ధరంగమున రామలక్ష్మణులను జయించదలచి

బ్రహ్మాస్త్రమును ప్రయోగించగా, రామలక్ష్మణులు వానరులందరహా మూర్ఛితులయిరి.

ఆ అస్త్ర ప్రభావం సోకని విభీషణుడు నెమ్మదిగా వానరయోధులందరి దగ్గరకు వెళ్ళి వారిచెవులలో ధైర్యవచనాలు పలుకుతూంటే, హనుమ కూడా లేచి తనవారికి ఉత్సాహం కల్పించే ప్రయత్నం ఆరంభించాడు. అలా విభీషణుడు జాంబవంతుని సమీపించి తాతా! ఈ క్రూరుని బాణాలు నీ ప్రాణాలు తియ్యలేదు కదా! అనగా జాంబవంతుడు ఈ బాణ తీవ్రతకు నా కనులు మూసుకొనియున్నవి. కంఠస్వరాన్ని బట్టి నువ్వు విభీషణుడవనుకుంటున్నాను. మా హనుమ వాయునందనుడు సజీవంగా ఉన్నాడా! అని అన్నాడు. అంతట విభీషణుడు. తాతా ! రామ లక్ష్మణులు అంగద సుగ్రీవులు ఏమయినారని అడగకుండా ఒక హనుమ విషయమే ఎందుకు అడుగుతున్నావు? ఏమిటింత హనుమపై మమకారం అని యడుగగా, అప్పుడు జాంబవంతుడు. నాయనా ! హనుమ ఒక్కడు జీవించి యుంటే అందరూ జీవించి యున్నట్లే అని సమాధానమిచ్చాడు.

జాంబవంతుని ఆజ్ఞగా హనుమ సంజీవని గాలిసోకగానే రామలక్ష్మణవానరులందరును లేచి ఉత్తేజితులయ్యారు.

ఇంద్రజిత్తు తన రథం మీద మాయాసీతను ఉంచి ఈమెను సంహరిస్తే చాలు, మీరంతా నేల కూలుతారు. అని పలికి ఇంద్రజిత్తు నికుంభిలా చైత్యం వైపు హోమ కార్యానికి సాగినాడు. ఇంద్రజిత్తు సీతను చంపేశాడని చెప్పగా, లక్ష్మణుడు జరిగిన కథ అంతా విభీషణునికి తెలియజేశాడు. ఆ మాటలను విన్న విభీషణుడు ఇది అసంభవం. లంకేశ్వరుని స్వభావం నాకు తెలుసు. ఆయన ప్రాణాలుండగా జానకిని సంహరింప నివ్వడు. మరొక్కమాట జానకీ దేవి ఉన్న ప్రాంతానికి వెళ్ళలేదు. ఇంద్రజిత్తు వాడు మాయావి. ఏదో మోసం చేసి నికుంభిలకు వెళ్ళి అగ్నిని తృప్తుని చేసి అజేయుడయి వస్తాడు. అది జరగకుండా మనం వెళ్ళాలి లక్ష్మణా! వానరయోధులతో నావెంట బయలుదేరు. మరల రామునితో రామా ! ఇప్పుడు వెళ్ళి ఇంద్రజిత్తు ప్రయత్నం ధ్వంసం

చెయ్యకపోతే వాడు బ్రహ్మశిరోనామకాస్త్రం సాధించివస్తాడు. అప్పుడింక మనం చెయ్యగలంది లేదు. ఈ నికుంభిలా యజ్ఞము విఘ్నం చేసినవాడే యింద్రజిత్తును వధిస్తాడని బ్రహ్మ వాక్కు. వీడు కన్ను మూసిన క్షణంలో రావణుడు సర్వశక్తి శూన్యుడయినట్లే అన్నాడు.

అంతట రాముడు, లక్ష్మణా ! బయలుదేరు నీ వెంట మన హనుమ,వానరవీరులు, విభీషణుడు ఉంటారు. పిమ్మట రాముని ఆశీర్వాదం తీసుకొని లక్ష్మణుడు హనుమ, వానరవీరులు, విభీషణునితో బయలుదేరి ఇంద్రజిత్తుతో హోరాహోరిగా పోరాడుతున్నాడు. విభీషణుడు గూడా ఇంద్రజిత్తుతో యుద్ధంచేసి, తన గదను ప్రయోగించి ఇంద్రజిత్తు గుర్రాలను నేలకూల్చాడు. చివరగా లక్ష్మణుడు ఐంద్రాస్త్రం సంధించి ఇంద్రజిత్తుని సంహరించాడు.

రావణాసురుడు రామునిచే సంహరింపబడగా, విభీషణునితో రావణునకు అంత్యక్రియలు సాగించు అన్నాడు. అపుడు విభీషణుడు రావణుని వంటి సాధుహింసకునికి అంత్యక్రియలు అవసరమా, అనగా రాముడు... విభీషణుడా! ఎంతటి వైరమైనా మరణంతో పోవాలి. పైగా మీ అన్నగారు ఎంతటి మహాయోధుడు. దేవేంద్రాదులను జయించినవాడు. రణరంగంలో వెన్నుచూపని పరాక్రమం కలవాడు. ఆయనకు దహనక్రియలు జరగాలి అన్నాడు.

**మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్ ॥**
**క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ ॥ 109-25**

విభీషణుడు లంకలో ప్రవేశించి చందనకాష్ఠాలు తెప్పించి వేదవిదులను రప్పించి, బంగారు పల్లకి మీద రావణుని దేహం శ్మశానానికి తెప్పించి, చితి ముట్టించాడు. అగ్ని సంస్కారం పూర్తికాగానే అందరినీ విభీషణుడు నగరంలోకి పంపి రామ దర్శనానికి రాగా, రాముడు లక్ష్మణునితో లక్ష్మణా! నువ్వు వెళ్ళి విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుచేసి రా అన్నాడు. రాముని

ఆజ్ఞానుసారం లక్ష్మణుడు విభీషణుని సింహాసనం మీద అభిషేకించాడు.

## 10.6. పద్మపురాణము

దశరథ మహారాజు కుమారుడైన శ్రీరాముడు భూమియందు అవతరించి లంకాపట్టణమందున్న రాక్షసరాజైన రావణుని చంపి, విభీషణుని ఆ లంకారాజ్యమునందు నిలిపి తనకు స్వస్థానమైన వైకుంఠమునకు వెళ్ళాడు. విష్ణుపూజ చేయుటయందు నియమము గలవాడై ఆ విభీషణుడు వైకుంఠమునకు వెళ్ళగా, అప్పుడు విష్ణువు అతనిని జూచి ఓ విభీషణా ! నేను నీకు లంకాపట్టణమును ఇచ్చి ఏలుకొమ్మని చెప్పితినే. అది మాని యిప్పుడు ఇక్కడికి ఏల వచ్చినావు? అని విష్ణుదేవుడు అడుగగా, అంతట విభీషణుడు శ్రీమన్నారాయణా!

**త్వామనారాధ్య దేవేశ నాహం భోక్ష్యామి మే వ్రతమ్ ।**
**భవదభ్యర్చనం దేహి భగవన్భవనాశనమ్ ॥**

నిన్ను పూజింపక భోజనము చేయకూడదు అను వ్రతమును పూనియున్నాను. జన్మములను నశింపజేయునదియైన నీ పూజ నాకు కలుగనిమ్ము. అని ప్రార్థింపగా, విష్ణుదేవుడు విభీషణునితో నీవు ప్రతిదినము తెల్లవారి ఆకాశమార్గమున ఇక్కడికి వచ్చి నన్ను భక్తితో పూజించి, పోయి నీ రాజ్యమును పాలించుకొనుము అనెను.

అందులకు విభీషణుడు ప్రజలను ఏలునట్టి రాజులకు కొంచెమయినను తీరిక యుండదు. రాజైన వాడు ప్రజల యొక్క క్షేమములను పట్టించుకోకుండా యుంటే అతడు నరకమును పొందును. గనుక ఓ శ్రీమన్నారాయణా! నేను ప్రజలను పాలింపవలయుట ఆవశ్యకమయిన యెడల నీవు నా వెంట వచ్చి ఆరాధనతో కూడిన వాడవు అగుము. అట్లుకాని పక్షమున నేను నా రాజ్యము వదలుకొని నిన్ను అర్చించుచు నిచ్చటనే యుండెదనని విభీషణుడు చెప్పగా, శ్రీవిష్ణుదేవుడు విభీషణునితో నీవు ఎచ్చట ఉండగలవో అచ్చటికి నీవెంటనే

నేను వచ్చెదను అని చెప్పగా అంతట విభీషణుడు ఒక బంగారు ప్రాకారమును, గోపురమును ఏర్పరచి, ఓ స్వామి! నీవు ఈ బంగారు ప్రాకారములోని పెట్టెలో వేంచేయుము. నేను దీనితోనే నిన్ను ఎత్తుకొని నా పట్టణమునకు పోయెదను అనగా, ఆ శ్రీహరి అతని మాటను కాదనక ప్రణవాకారమయినా ఆ బంగారు పెట్టెయందు నివసించెను. వెంటనే విభీషణుడు పెట్టెతో గూడ శ్రీ విష్ణుదేవుని ఎత్తుకొని ఆకాశమార్గమున లంకాపట్టణమునకు వెళ్ళుచుండగా, కావేరినదిని జూచి అప్పటికి మధ్యాహ్నకాలమయినందున ఆ నదియందు స్నానము చేసి మధ్యాహ్నిక క్రియలన్నియు ఆచరించదలచి శ్రీరంగ క్షేత్రమందున పెట్టెను దించి తన అనుష్ఠానమును తీర్చుకొని మరల పెట్టెను ఎత్తుకొనుటకు శక్తుడు కాకపోయెను.

విభీషణుడు ఆ పెట్టెను యెత్తుటకు శక్తిచాలనివాడై, భగవంతుని ప్రార్థించగా, విష్ణుదేవుడు అనుగ్రహించినవాడై ఓ విభీషణా! నా మాటను వినుము. ఈప్రదేశము శ్రీ వైకుంఠము కంటె రమ్యమైన ప్రదేశముగా నున్నది. ముక్తికి సాధనమయిన యిట్టి పుణ్యక్షేత్రమును నేను విడువజాలను. అదిగాక ఈ కావేరీనది గంగానది కంటె శ్రేష్ఠమైనదని నాకు తోచుచున్నది. కాబట్టి నీకు నేను హితము చెప్పెదను. నా మాట వినుము.

**కృత త్రేతా ద్వాపరేషు స్వరూపేణ కలౌయుగే ।** (పద్మపురాణం)
**వైశాఖే వాయురూపేణ పూర్ణిమా మాసిసంగతా ॥**
**విశాఖయా యదాసాస్యా ద్రాకాసోమగ్రహోపమా ।**
**తస్యామాగత్య విధివదరాధయ విభీషణ ॥**

నీవు కృత త్రేతా ద్వాపరాయుగములందు ఈ రూపముతోను, కలియుగమునందు వాయు రూపముతోను ప్రతి వైశాఖ శుక్ల పూర్ణిమ యందును ఇచ్చటికి వచ్చి నన్ను ఆరాధించి పొమ్ము. ఆ ఒకనాటి ఆరాధనము నీకు సంవత్సర కాలము ఆరాధించిన ఫలము నిచ్చును. విశాఖ నక్షత్రముతో గూడినదైన వైశాఖ

శుక్ల పూర్ణిమ రాగా వచ్చి యథావిధిగా నన్ను ఆరాధింపుము. అని యిట్లు విష్ణుదేవుడు ఆజ్ఞగా, మహాత్ముడైన విభీషణుడు చాల సంతోషించినవాడై లంకా పట్టణమునకు వెళ్ళెను. అది మొదలుకొని కావేరి దక్షిణ గంగానది యనియు, 'శ్రీరంగము' దక్షిణ కాశియనియు చెప్పబడుచున్నది.

## 10.7. విభీషణుని వ్యక్తిత్వము

సప్త చిరంజీవులలో విభీషణుడు ఒకడు. విభీషణుడు రాక్షస వంశంలో జన్మించినప్పటికి ఇతనిలో రజోగుణ,తమో గుణముల కోసంత మాత్రాన లేవు. ఇతడు సాత్త్విక గుణమును కల్గియున్నాడు.విభీషణుడు సుస్వభావుడు, ధర్మపరాయణుడు, జితేంద్రియుడు, స్వాధ్యాయనిరతుడు, వినయ వివేకశీలుడు, రాక్షసకులమున జన్మించినను ఇతని మనసెప్పుడును అధర్మము వైపునకు పోలేదు.

**'విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షస చేష్టితః, ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠః'** అని స్వభావ సిద్ధముగ ఇతడు మహాసాత్వికుడునూ, ధర్మమునే అనుష్ఠించువాడగు విభీషణుడు మహాప్రాజ్ఞుడు.

విభీషణుడు అతి వివేకము గలవాడై ధర్మమునే అనుసరించి తన్నును, ఇతర రాక్షసులను, లంకారాజ్యమును కాపాడుటకై అన్నయగు రావణునకెంత మంచి మాటలెన్ని పర్యాయములు చెప్పినను అతడు వినకుండుటయే గాక! తన్ను సభలో అవమానపరచినందున నిష్టము లేకున్నను జ్యేష్ఠుని, తన జన్మ భూమిని, భార్యా పుత్రాదులను, బంధుమిత్రులను, భోగభాగ్యములను విడిచిపెట్టిన విభీషణుడు వివేకవంతుడగుటచే శ్రీరాముని పర్వతమును గ్రహించి శరణాగతి చెందాడు.

# 11. కృపాచార్యుడు

ఏకాదశరుద్రాంశమున జన్మించినవాడు గోతముని వంశమున జన్మించిన వాడగుటచే ఈ కృపాచార్యునికే గౌతముడని మరియొక పేరు గలదు.

కృపాచార్య అనగా కృపతో కూడిన చిత్తము గల శంతనునిచే పెంచబడినవాడు గనుక 'కృప' అని, ఆచార్య అనగా 'ఆచినోతి చ శాస్త్రార్థాన్ స్వయం ఆచరత్య ఆచారే స్థాపయత్యన్యాన్ ఇతి ఆచార్యస్య లక్షణమ్' అంటే తాను స్వయముగా ఆచరించి ఇతరుల ఆచరింపజేయువాడు ఆచార్యుడు. కావున కృపాచార్య అను నామము సార్థకమయ్యెను.

## 11.1. కృపాచార్య జననము

వైశంపాయనుడు, జనమేజయ మహారాజుకు కృపాచార్యుని జన్మ వృత్తాంతము తెలియజేస్తూ రాజా! గౌతమమహర్షి కుమారుడు శరద్వంతుడు శరసమూహంతోనే సముద్భవించాడు. ధనుర్వేదము ఆ మహర్షికి అభిమాన విద్యయైనది. శరథ్వంతుడు తపమాచరించి అపూర్వ శస్త్రాస్త్ర లెన్నెన్నో సంపాదించుకొన్నాడు. అంతటితో సంతృప్తి పొందక తిరిగి తీవ్ర తపశ్చర్యకు ఉపక్రమించాడు. దేవేంద్రుడు అంతట శరద్వంతుని తపస్సుకు అవరోధం కలిగించవలెనని నిశ్చయించి జానపది అను దేవకన్యను పిలిపించి ఆ శరథ్వంతుని తపస్సుకు విఘ్నం కల్గించుమని ప్రార్థించాడు.

ధనుర్బాణాలు ధరించి తదేకధ్యానంతో తపో నిమగ్నుడయిన శరద్వంతుడు ఆ దేవకన్యను చూచి మోహపరవశుడయినాడు. ఆ తపస్వి హస్తాలలో ధనుర్బాణాలు అప్రయత్నంగా జారి నేలపై పడింది. ఆ దేవకన్య సునిశిత కటాక్షా ఘాతంతో శరద్వంతుని కంతట రేతః పతనమయింది.

ధనుశ్చ సశరం త్యక్త్వా తథాకృష్ణాజినాని చ । (ఆదిపర్వం)
స విహాయాశ్రమం తం చ తాం చైవాప్సరసం మునిః ॥ 130 -12

అప్పుడు ఆ మునీశ్వరుడు అచటనే ధనస్సు, బాణమును, కృష్ణాజినములను వదలి ఆశ్రమం విడిచి వేరొక ప్రశాంత ప్రదేశానికి పోయి తిరిగి ధ్యాన దీక్ష స్వీకరించాడు. పూర్వాశ్రమం ప్రదేశంలో భూతలంపై జారిన శరద్వంతుని రేతస్సు ఒక రెల్లు గుబురులో పడి రెండు విభాగలుగా విడిపోయింది. దానినుండి బాలికాబాలకు లిరువురు ఉద్భవించారు. అనంతరం శంతన మహారాజు ఆ పరిసరంలో మృగయా విహారంతో వినోదించాడు. అతని సేనాపతి అనతిదూరంలో ధనుర్బాణ కృష్ణాజినాల సమీపంలో తేజోవంతులైన శిశువులనిద్దరిని చూచి మిక్కిలి ఆశ్చర్యపడి ఆ విషయం ఆ శంతన మహారాజుకు తెలియజేశాడు. ఆ బాలికాబాలకులు ధనుర్వేదవేత్త అయిన ఒకానొక ద్విజుని పుత్రికాపుత్రులు కావచ్చునని స్వాభిప్రాయం వెల్లడించాడు. శంతనుడు అత్యంత కృపాభావంతో ఆ పసివారినిద్దరినీ హస్తినాపురమునకు తీసుకొనిపోయి కన్న తండ్రివలె సంరక్షించాడు. ఆ హేతువు చేతనే వారిద్దరికి 'కృపీ', 'కృప' అన్న లోకవిఖ్యాత నామధేయాలు ఏర్పడ్డాయి.

మరికొంతకాలానికి శరద్వంతుడు తన దివ్య దృష్టి ప్రభావం వల్ల కవలలై అవతరించిన ఆ కృపీ, కృప లిరువురును తన సంతానమే అని గ్రహించుకొని శంతనుని సన్నిధికి విచ్చేసి తన పూర్వ వృత్తాంతమును తెలియజేశాడు. శంతన మహారాజు శరద్వంతునికి అర్ఘ్య పాద్యములిచ్చి సత్కరించి బాలికాబాలురను ఆ తపోమూర్తికి అర్పించాడు.

శరద్వంతుడు తన కుమారుడైన కృపునకు శస్త్రాస్త్ర ప్రత్యస్త్ర పరమాస్త్ర భేదాలతో చతుర్విధమైన ధనుర్వేదం సాంగోపాంగంగా సంపూర్ణంగా బోధించాడు. అదియునుగాక చతుర్వేదాలను యథావిధిగా అధ్యయనం చేయించాడు. ఆవిధంగా అస్త్రవిద్యా రహస్యవేత్త అయిన శరద్వంతుని కుమారుడు ఆనాటినుంచి కృపాచార్యనామధేయంతో ప్రసిద్ధుడై ధనుర్వేదవేత్త లందరిలోను అగ్రేసరుడయినాడు.

భీష్ముడు కృపాచార్యుని రావించి కౌరవపాండవులకు ఆచార్యత్వం నిర్వహించవలసిందని ప్రార్థించాడు. అమూల్య ధనకనక వస్తు వాహనాలర్పించి అనేక విధాల ఆదరించి గౌరవించాడు.

## 11.2. అదిపర్వము

ప్లవ సంవత్సర వైశాఖ శుక్లపక్ష పూర్ణిమయందు ద్రోణాచార్యులు కుమారాస్త్ర సందర్శన మనెడి విద్యా పరీక్ష జరిపించాడు. కుమారాస్త్ర విద్యా ప్రదర్శనలో కర్ణుడు తన నైపుణ్యాన్ని సామర్థ్యాన్ని ప్రదర్శించదలచి, దుర్యోధనుని అనుమతి స్వీకరించి అర్జునునితో తలపడి పోరాడానికై సర్వ సన్నద్ధుడై నిలుచున్నాడు. కర్ణార్జునుల మధ్య ఘోరసంగ్రామం ప్రారంభమయింది. ప్రతి యస్త్రమును కర్ణార్జునుల దివ్యత్వమును ప్రదర్శించుచున్నవి. కర్ణుడు అర్జునునిపై పర్జన్యాస్త్రం ప్రయోగించాడు. అంతట రంగస్థలంలో గాఢాంధకారం కమ్ముకోగా అర్జునుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించి, దివ్య తేజస్సును ప్రకాశింపజేశాడు.

క్షణక్షణానికి అత్యంత భయంకరమై పెచ్చు పెరిగిపోతున్న కర్ణార్జునుల దారుణ సంగ్రామ ధోరణి పరిశీలించి, ఆచార్యుడంతట అతి శీఘ్రంగా వారిద్దరి మధ్యన నిలిచి మేఘ గంభీర స్వరంతో కర్ణుని ఈవిధంగా ఆదేశించాడు.

కర్ణా! అర్జునుడు కౌరవవంశ వర్ధనుడు. కుంతీ పాండు మహీధరుల కనిష్ఠ నందనుడు. ఈకూరునితో ఈవిధంగా ద్వంద్వ యుద్ధం కొనసాగించదలిచిన యెడల మున్ముందుగా నీవంశ విఖ్యాతి, తల్లిదండ్రుల నామధేయాలు మాకందరికి విశదంగా వెల్లడించవలెను. ఆపైన అన్నివిధాల తులతూగ జాలిన పక్షంలోనే అర్జునుడిక నీతో పోరాడగలడు. అంతవరకు ఈ ద్వంద్వయుద్ధం ధర్మవిరుద్ధమే.

ఆచార్యుని మాటలను విని, రోషావేశంతో సుయోధనుడు ఆచార్యుని సమీపించి, ఆచార్యా! .....

**ఆచార్య త్రివిధా యోనీ రాజ్ఞాం శాస్త్ర వినిశ్చయే ।**
**సత్కులీనశ్చ శూరశ్చ యశ్చ సేనాం ప్రకర్షతి ॥ 136-35**

శాస్త్ర ప్రకారము రాజులకు మూడు విధములైన పుట్టుక గలదు. 1. సత్కులము నందు పుట్టినవాడు 2. శూరుడగువాడు 3. గొప్ప సేనగలవాడును రాజు కాగలడు.

అట్లుగాక ఈ అర్జునుడు రాజుకాని వానితో యుద్ధము చేయకోరనిచో ఇదిగో ఈతడు ఇప్పుడే నాచే అంగరాజ్యమునందు పట్టాభిషిక్తుడు చేయబడుచున్నాడు. అని పలికి అందరి సమక్షంలో అంగరాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసాడు.

## 11.3. విరాటపర్వము

**కృపాచార్యుడు దుర్యోధనునకు సలహా యిచ్చి హితోపదేశము చేయుట :-**

అజ్ఞాతవాసముగ జీవనాన్ని గడుపుతున్న పాండవులను గుర్తించదలచి దుర్యోధనుడు సమాలోచన చేయగా, అపుడు భీష్ముడు తన మనోభిప్రాయాన్ని వ్యక్తం చేసిన పిమ్మట. శరద్వంతుని కుమారుడగు కృపాచార్యుడిట్లు పలికాడు.

ఓ దుర్యోధనా! భీష్ముడు పాండవులను గూర్చి ఉపపత్తులతో కూడినదియు, కాలమునకు తగిన మాటలు పలికారు. అది ధర్మార్థములతో కూడి సూటిగా ఉన్నది. అందు భ్రాంతికి తావు లేదు. మిక్కిలి యోగ్యమైనది. ఈవిషయమున నామాట కూడ వినుము. అని దుర్యోధనునితో ఇట్లు పలికాడు.

ఓ ధుర్యోధనా! పాండవుల స్థితిగతులను చారులతో తెలుసుకొనుము. ఇప్పటికి మనకేది హితమగునో ఆ నీతిని ప్రయోగింపుము. అంతేకాదు నాయనా! మేలు కోరువాడు శత్రువు సామాన్యుడైనను వానిని చులకన బుద్ధితో చూడరాదు. అట్టి యెడ సర్వాస్త్రములలో ఆరితేరిన పాండవుల మాట చెప్పనేల? అందువల్ల పాండవులు మారు వేషములతో గుట్టుగా తెలియరాకుండ ఉన్నారు. వారు ప్రతిజ్ఞ చేసిన కాలమూ గడువ వచ్చినది.

**తస్మాత్ సత్రం ప్రవిష్టేషు పాండవేషు మహాత్మసు ।**
**గూఢభావేషు ఛన్నేషు కాలే చోదయమాగతే ॥ 29- 5 శ్లో**

మనరాష్ట్రమునందును, మన మిత్రుల దేశములందును, మన బలమెంతటిదో చక్కగా తెలుసుకొనవలెను. అజ్ఞాతకాలము ముగిసిన వెంటనే పాండవులు పైకి వత్తురు. సందేహము లేదు. ప్రతిజ్ఞలు తీర్చుకొన్న పాండవులు, గొప్పబలము, గొప్ప ఆత్మశక్తి కలవారు కనుక గొప్ప ఉత్సాహము కలవారగుదరు.కావున మనము సేనను, ధనకోశమును, నీతిని చక్కగా అమర్చుకొనవలయును. యుద్ధము వచ్చి పడినచో వారితో తలపడ వచ్చును. పాండవులకు అభివృద్ధి కాలము వచ్చినచో వారితో సంధి చేసికొనవచ్చును.

నాయనా! దుర్యోధనా! మన మిత్రులందరిలో వారు బలవంతులైనను, దుర్బలులైనను - నీబలమెంతటిదో, నీబుద్ధితో దృఢముగా తెలుసుకొనుము. అంతేకాక ఎక్కువ తక్కువలు సమస్థితులు గల బలమును చక్కగా నెరిగి అనురాగ ద్వేషభావములను గుర్తించి మనము పరులతో తలపడవలెను.

శత్రువులను సామము, దానము, భేదము, దండము, అను పద్ధతులతో స్వాధీనము చేసికొని, అంతగా బలము లేనివారిని బలముతో లొంగదీసికొని మిత్రులను మంచిమాటలతో వశపరచుకొని, సేనను సుఖముగా పలుకరించుచుండవలయును. ఇట్లు ధనాగారమును, సేనను బాగుగా పెంచుకొన్న వాడవై జయమును పొందగలవు. ఇట్లైనచో ఎంతటి బలవంతులగు శత్రవులు వచ్చి పడినను వారు సేనవాహనములు లేని పాండవులే కానీ, ఇతరులే కానీ, వారితో యుద్ధం చేయగలము. కావున నీధర్మము ననుసరించి ఓ మహారాజా! ఒక కర్తవ్యమును కాలమునకు యోగ్యమైన దానిని నిర్ణయించి చిరకాలము సుఖమును పొందగలవు. అని కృపాచార్యుడు దుర్యోధనునికి హితవు పలికాడు.

కృపాచార్యునితో అర్జునుని సంగ్రామము

ఉత్తరగోగ్రహమున అర్జునుడు తన రథాన్ని దుర్యోధనుని వైపు మరలించగా, అపుడా కృపాచార్యుడు ఇట్లు పలికాడు.

నైషోఽన్తరేణ రాజానం బీభత్సుః స్థాతుమిచ్ఛతి ।
తస్యపార్ష్ణిం గ్రహీష్యామో జవేనాభిప్రయాస్యతః ॥ 53- 17

రాజులేని యెడ అర్జునుడు నిలువగోరడు. వేగముగా పోవుచున్నాడు. వాని ప్రక్కగా మనమును పోవుదము. ఈ అర్జునుని దేవేంద్రుడో లేక కృష్ణుడో, ద్రోణాచార్యుడో కాక మరియొకడు యుద్ధమున యెదుర్కొనజాలరని పలికాడు.

కృపాచార్యుడు ధనంజయునితో తలపడి హోరాహోరిగా పోరాడినాడు. ఆ సమయంలో కౌరవవీరులు అనుక్షణము కృపాచార్యుని స్యందనచక్రాలెంతో జాగరూకతతో సంరక్షిస్తూ అర్జునునితో పోరాడుతున్నారు. అయినను అర్జునుడు యుద్ధరంగంలో విజృంభిస్తూ వాడి బాణాలతో కృపాచార్య రథపు కాడిని విరిచాడు. బాణాలతో చక్రాలను అశ్వములను మరియు ఇరుసును ముక్కలు ముక్కలుగా ఖండించాడు. మరి రెండు బాణాలతో సారథిని వధించి క్షణంలో కృపునిచే నున్న వింటినారిని ఖండించాడు. మరియొక బాణముతో ధ్వజమును విరిచాడు.

కృపుడావిధంగా భగ్నరథుడై మరి గత్యంతరం కానలేక అర్జునునిపై గదను ప్రయోగించాడు. అయితే దుర్నిరీక్ష్యమైన ఆ గదను అర్జునుడు తన బాణములతో మార్గమధ్యముననే దూరముగా పడునట్లు కొట్టాడు. కృపాచార్యుడు అటుపిమ్మట హతాశుడై అశ్వత్థామ రథంపై అధిరోహించి పరాజయదైన్యంతో వెనుదిరిగాడు.

## 11.4. భీష్మపర్వము

భీష్మపర్వంలో కృపాచార్య చేకితానుల ద్వంద్వయుద్ధము :-

భీష్మపర్వమున కృపాచార్యునకు చేకితానునకు జరిగిన ద్వంద్వ

యుద్ధములో చేకితానుడు కృపాచార్యుని బాణములతో ముంచాడు. ఆ బాణములను కృపుడు నివారించి చేకితానునిపై బాణప్రయోగము చేసి అతని ధనస్సును ఛేదించి సారథిని పడగొట్టి అశ్వములను చంపాడు. అప్పుడు చేకితానుడు గదతో కృపాచార్యుని అశ్వములను సారథిని సంహరించాడు. అపుడు కృపుడు నేలపై నిలచి పదియారు బాణములతో చేకితానుని కొట్టాడు. అంత నతడు క్రుద్ధుడై కృపున్ని ఇంద్రుడు వృత్రుని వధించునట్లు వధింపదలచి అతనిపై గదను విసరగా, దానిని కృపుడు బాణములతో నివారించాడు. తరువాత చేకితానుడు ఖడ్గధారియై కృపునిపైకి రాగా అంతట కృపాచార్యుడు కూడ ఖడ్గము ధరించి చేకితానుని ఎదుర్కొన్నాడు.

ఆ యిరువురు ఖడ్గములచే శరీరములను గాయపరచుకొనిరి. అపుడు కరకర్ముడు చేకితానుని తన రథమెక్కించుకొన్నాడు. అట్లే శకుని కృపాచార్యుని తన రథముపై ఎక్కించుకొని పోయాడు. అని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధ విషయములను తెలియజేశాడు.

**కృపాచార్య, సాత్యకీల యుద్ధము :-**

భీష్మున కెదురుగానున్న అర్జునుని పై కృపాచార్యుడు ఇరువదియైదు బాణములను ప్రయోగించాడు. అప్పుడు సాత్యకి పాండవుల హితము కోరుచు, పెద్దపులియేనుగుపై బడినట్లు కృపాచార్యుని ఎదిరించి యతనిని నిశిత బాణములతో కొట్టాడు. కృపాచార్యుడు సాత్యకిపై అతిక్రుద్ధుడై కృపాచార్య నాశనకరమైన బాణమును ఎక్కుపెట్టవిడిచాడు. అట్లు కృపుని పైకి వచ్చుచున్న బాణమును అశ్వత్థామ మధ్యలోనే దానిని రెండుగా ఛేదించాడు.

**కృపాచార్య, సహదేవుల యుద్ధము :-**

కృపాచార్యుడు భీష్ముని రథము పైకి వచ్చుచున్న సహదేవుని క్రోధముతో నివారించి ఎదుర్కొన్నాడు. కృపాచార్యుడు సహదేవునిపై డెబ్బది బాణములు

ప్రయోగించాడు. అతడు కృపాచార్యుని ధనస్సును ఛేదింపగా అతడు మరియొక ధనస్సును తీసికొని సహదేవుని యెదపై పది బాణములతో కొట్టాడు. అతడు కూడా కృపాచార్యుని యెదపై కొట్టాడు. భీష్ముని రక్షించుటకు కృపాచార్యుడు, సహదేవునితో హోరాహోరిగా పోరాడాడు.

**ధర్మరాజు, కృపాచార్య ఆశీస్సులను పొందుట :-**

భీష్మపర్వమున ధర్మరాజు భీష్ముని వద్దకు వెళ్ళి, భీష్ముని మరణోపాయమును ఆశీస్సులను తీసికొని, ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి, ద్రోణుని మరణోపాయమును తెలుసుకొని, మరియు ఆశీస్సులను తీసుకున్నాడు. తరువాత కృపాచార్యుని సమీపించి నమస్కరించి, ప్రదక్షిణ మొనరించి ఈవిధముగా పలికాడు. ఓ గురుదేవా! నేను మనస్సులో ఎలాంటి పాప చింతనము లేకుండా నీతో యుద్ధము చేయతలపెట్టినాను. ఆజ్ఞయిమ్ము! నీ ఆజ్ఞను పొంది యుద్ధము నందు శత్రువులందరిని జయించగలచాను.

ఆ మాటకు కృపాచార్యుడు ఇట్లనెను ఓ ధర్మరాజా!

**యది మాం నాభి గచ్ఛేథా యుద్ధాయ కృతనిశ్చయః ।**
**శపేయం త్వాం మహారాజ పరాభావాయ సర్వశః ॥ 43-70**
**అర్థస్య పురుషో దాసో దాసస్త్వర్థో న కస్యచిత్ ।**
**ఇతి సత్యం మహారాజ బద్ధోఽస్మ్యర్థేన కౌరవైః ॥ 43-71 శ్లో**

నీవు నాతో యుద్ధము చేయుటకు నిశ్చయించుకొని తరువాత, నావద్దకు రాకయుండినచో తప్పక అపజయము కలుగునట్లు శపించియుండెడి వాడను. మానవుడు ధనమునకు దాసుడు. అర్థము ఎవరికిని దాస్యము చేయదు. ఇది సత్యము. నన్ను కౌరవులు అర్థముతో బంధించినారు.

కనుక వారి కొరకు నేను వారివైపు నిలిచి యుద్ధము చేయుట నా కర్తవ్యము. నేను నపుంసకునివలె చెప్పుచున్నాను. యుద్ధ సహాయము తప్ప

మరియేదైనా కోరుకొనుము నెరవేర్చెదను. అని పలుకగా, ధర్మరాజు అచేతనుని వలె కృపాచార్యుని ఏమియు అడుగలేక పోయాడు. అపుడు ధర్మరాజు తనను ఏమి అడగుదలచుకున్నాడో కృపాచార్యుడు కనిపెట్టి ఇట్లు పలికాడు.

> అవధ్యోహం మహీపాల యుద్ధ్యస్వ జయమాప్నుహి ॥
> ప్రీతస్త్వేఽభిగమేనాహం జయం తవ నరాధిప ।
> ఆశాసిష్యే సద్యోత్థాయ సత్యమేతద్బ్రవీమి తే ॥ 43-75 శ్లో

ధర్మరాజా! నేను అవధ్యుడను. నన్నెవరును చంపజాలరు పొమ్ము. యుద్ధమెునరించి జయమును పొందుము. నేనెల్లప్పుడునూ నిన్ను ఆశీర్వదించుచుందును. యిది యధార్థమును పలుకుచున్నాను.

ధర్మరాజా! నీవిపుడు నావద్దకు వచ్చుట చేత నాకు చాలా సంతోషము కల్గినది. నీ విజయము కొరకు శుభాకాంక్షలు నేను సర్వదా చేయుచుందును. ఇది సత్యము. అని కృపాచార్యుడిట్లు చెప్పిన తరువాత ధర్మరాజు కృపాచార్యునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి, అనుమతి తీసికొని బయలుదేరాడని సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధ విషయాలు తెలియజేశాడు.

## 11.5. ద్రోణపర్వము

### కృపాచార్యుడు కర్ణుని అధిక్షేపించుట :

ద్రోణపర్వమున కర్ణుడు యుద్ధరంగములో ప్రగల్భాలు పలుకుతుండగా, ఆ మాటలు వినిన కృపాచార్యుడు కర్ణుని వైపు చూచి కఠోర వచనాలతో అధిక్షేపించాడు.

కర్ణా! మేలు మేలు నీవన్నమాట అక్షరశః యథార్థమే, సందేహం లేదు నీవట్టి ప్రగల్భ ప్రసంగంవల్లనే పాండవేయులు ఆత్మీయ బాంధవులతో బాటు పరాజితులై పారిపోగలరు. ఘోషయాత్రలో గోగ్రహణ సమయంలో మహాపరాక్రమవంతుడని శాశ్వత ప్రతిష్ఠ గడించుకొన్న నీకు ఇటువంటి ప్రసంగం

సముచితమే! ఇకనయినా లేనిపోని వీరాలాపాలు విడిచి లోలోపల పేరుకొన్న గర్వోద్ధతి నిశ్శేషంగా నిర్మూలించుకొందువు గాక! ఈ వృథా ప్రగల్భాలు భయంకర యుద్ధసమయంలో ఇవి నిన్ను ఆదుకొని సంరక్షించగలవని భ్రమిస్తున్నావు. ఇతః పూర్వము అర్జునుడు ఒక్కడే మనలనందరిని జయించిన విషయం నీకు తెలియనిది కాదు. ఇప్పుడుఆ వీరునికి అన్నదమ్ములు, ఆప్త బాంధవులు, ఘటోత్కచుడు వీరందరూ సర్వదా తోడ్పడుతున్నారు. ఇక మనకు ఎన్నటికయినా జయం లభించగలదా? లేనిపోని వట్టిపోటు మాటల వల్ల ప్రయోజనమేమి ఉన్నది? అని కర్ణుని అధిక్షేపించాడు.

## 11.6. శల్యపర్వము

### కృపాచార్యుడు దుర్యోధనునకు హితవు పలుకుట :

కర్ణుడు, మహావీరులందరూ పాండవేయులచే మరణించగా, కృపాచారుయడు దుర్యోధనుని శిబిరానికి వెళ్ళి ధరణీశ్వరా! యుద్ధము మీవంటి సుక్షత్రియులకు ఉత్తమధర్మమే. సందేహం లేదు. భీష్మ,ద్రోణ, కర్ణులు ముగ్గురు అతి లోక బలపరాక్రమవంతులు, యుద్ధవీరులు వీరే గాక, మిత్ర బాంధవులు మొదలగు వారందరు యుద్ధరంగంలో సంహరింపబడ్డారు.

అయినా నాతో బాటు శల్య, కృతవర్మ, అశ్వత్థామలు ఉన్నారు కదా, అన్న అచంచల ధైర్యంతో నీవు అరివీరులను సంహరించవచ్చునని సంకల్పిస్తున్నావు. కాని సాత్యకి భీమసేనులు ఇరువైపుల నిలిచిన సవ్యసాచి, దుర్వార శౌర్యావేశంతో విజృంభించిన సమయంలో మేము అందరము ఏకీభవించి పోరాడినప్పుడు మాత్రమే అతనితో తులతూగగలమన్నమాట విస్మరించవలదు. ఆ భీముడు తన ప్రతిజ్ఞ యావత్తు యథాతథంగా నెరవేర్చుకొన్నాడు. ఇక శేషించిన ప్రతిజ్ఞ అక్షరశః నిర్వర్తించుకోగలడని వేరుగా చెప్పనక్కరలేదు గదా! కనుక మనకి ఇక అజాత శత్రువునితో సామరస్యమే సముచితమయిన పద్ధతి. నిష్కారణ వైరం వల్లనే ఈ ఘోరయుద్ధం జరిగింది. అనేక భూపాలకులతో బాటు భరతవంశ

శ్రేష్ఠులందరు యుద్ధభూమిలో కూలి స్వర్లోకం చేరుకొన్నారు. కనుక ఇకనయినా క్రోధావేశం విసర్జించి సంధికి అంగీకరించవలసినది. కనుక వెంటనే ఆత్మ సంరక్షణకు ఉపక్రమించవలసినది. నీవు ఉన్నపుడే సమస్త సంపత్తి కరతలామలకమై భోగయోగ్యం కాగలదు. కనుక మరి ఆలసించక ఆ ధర్మరాజును ఒక్కమారు సందర్శించవలసినది.

> తదత్ర పాండవైః సార్ధం సన్ధిం మన్యే క్షమంప్రభో ।
> వైచిత్ర వీర్య వచనా త్కృపాశీలో యుధిష్ఠిరః ॥
> వినియుంజీత రాజ్యే త్వాం గోవింద వచనేన చ ।
> నాతిక్రమిష్యతే కృష్ణోవచనం కౌరవస్యతు ॥
> ధృతరాష్ట్రస్య మన్యేహం నాపి కృష్ణస్యపాండవః ।
> ఏతత్ క్షేమమహం మన్యే న చ పార్థేశ్చ విగ్రహమ్ ॥ (4-47,48,49)

దుర్యోధనా ! ఇప్పుడు పాండవులతో సంధి చేసికొనుటే మంచిది. ధృతరాష్ట్రుని మాటను శ్రీకృష్ణుడు మన్నించును. శ్రీకృష్ణుని మాటను ధర్మరాజు మన్నించును. దయగల ధర్మజుడు నిన్ను రాజ్యమందు నియోగింప గలడు. పాండవులతో విరోధము మంచికాదు.

ఈ సంధి నీకు ఇప్పుడు అవశ్యం శ్రేయస్కరం కాగలదు. దుర్యోధనా! ఈ మాటలన్నీ నేను ప్రాణాలమీది తీపితో, యుద్ధభీతితో చెప్పడం లేదు. స్వామికి హితవు చెప్పడం నావిధి కనుక చెప్పుతున్నాను.

అంతట సుయోధనుడు ఆచార్యా! నామీద ఆదరంతో మీరు హితవు చెప్పారు. రజస్వలమై యేక వస్త్రమై యున్న ద్రౌపది సభామధ్యమున దుశ్శాసనునిచే పరిక్లిష్టురాలైనది. ఆవిధముగా వివస్త్రయై దీనురాలైన ఆమె స్వరూపమును పాండవులిప్పటికీ మనస్సులో పెట్టుకొని యున్నారు. ఆ శూరులను యుద్ధమునుండి మరల్చ శక్యము కాదు. అంతేకాక మొన్నటి వరకూ వారిని క్లేశాల పాలు చేసి ఇప్పుడు యుద్ధములో ఇన్ని జరిగాక, నిన్నటికి నిన్న భీముడు

తన ప్రతిజ్ఞానుసారం నా తమ్ముడి రొమ్ము చీల్చి రక్త పానం చేశాక, ఈనాడు సంధికి సాగితే ప్రాణాల మీది తీపితోనే అని అనుకోరా! మహాయోధులయిన భీష్మ ద్రోణ కర్ణులతో నేనూ వీర స్వర్గంచేరుతానని పలికాడు.

## 11.7. సౌప్తికపర్వము

దుర్యోధనుడు అశ్వత్థామను సేనాపతిగా అభిషేకించిన పిమ్మట ఆ రోజు రాత్రి సేనాశిబిరాలకు చేరి కృపాచార్యుడు, కృతవర్మ నిద్రపోయారు. కాని అశ్వత్థామ నిదురించక శత్రుసంహారము ఎలా సాగించాలా అని ఆలోచించుచుండగా, మర్రిచెట్టుమీద గుడ్లగూబ పక్షిసంహారం చేయడం కనిపించింది. ఏఉపాయముతో నయినా శత్రువును చంపడం రాజనీతి విరుద్ధం కాదు. కనుక యిప్పుడు నీకీ ఉలూకమార్గం శ్రేష్ఠమని తలచి, కృపాచార్య కృతవర్మలను మేలుకొలిపి తనకర్తవ్యాన్ని తెలిపాడు. అప్పుడు కృపాచార్యుడు అశ్వత్థామా! ప్రయత్నాలన్నింటికి పురుష ప్రయత్నము, దైవము ప్రధాన సాధనాలని విజ్ఞులు ఉపదేశిస్తున్నారు. వీనిలో ఏ ఒక్క దానిచే కార్య సాఫల్యం నెరవేరదు. వాన కురిసినంత మాత్రాన పొలం పండదు కదా! అదేవిధంగా తగినంత వృష్టి సమకూరకపోయిన యెడల దున్నినంత మాత్రాన పంట చేజిక్కనేరదు. కనుక యథావచ్ఛక్తి వినియోగించి నేల దున్నినప్పుడు వాన కురిసిన యెడల తగినంత పంట పండగలదు. అదేవిధంగా పురుష ప్రయత్నానికి అన్నివిధాల దైవం తోడ్పాటు చేకూరిన యెడల అనాయాసంగా ఫలితం స్వాధీనం కాగలదు. అదిన్నీగాక అన్నివిధాల తగిన కార్యం ప్రారంభించినపుడు ఉచితానుచిత వేత్తలయిన హితుల ఆనతి బౌదల ధరించవలసియున్నది. అప్పుడే తగినంత దైవానుకూల్యం లభించగలదు. నీతిపద్ధతి విడిచి కేవలం దురాగ్రహ ధోరణితో కార్యాలు ఆరంభించిన యెడల అభీష్టం నెరవేరినా, లోలోపల భీతి నిరంతరమై వేధించగలదు. ఆపైన లోకంలో జనులు ఇదేమని నిందించగలరు. అదిన్నీగాక చెడుదారిలో తలపెట్టిన పనులు నెరవేరకపోవడమేగాక నిరంతర మనో వైకల్యంతో పాటు ఘోరాపదలు కలుగుతాయి.

క్రోధలాభాలు ఆవహించిన చిత్తంతో కార్యసాధనకు ఉపక్రమించిన యెడల సిరి దూరంగా తొలగిపోతుంది. కౌరవపతి దుర్యోధనుడు వివేకహీనుడు. దురాగ్రహావేశంతో మైమ ాచి ఆప్తులు ఎన్నెన్ని విధాల హితవు ఉపదేశించినా అలక్ష్యం చేసి సత్పురుషులయిన పాండవేయులను అనేకవిధాల పరాభవించి ఎడతెగని లోకనింద కొనితెచ్చుకొన్నాడు. మా హృదయాలు ఏ మాత్రము కలత చెందక పోయిన యెడల తప్పక ఘోరాపదలు కలుగగలవు.

ఇప్పుడు ప్రస్తుత కర్తవ్యమేమో మనము ఇదమిత్థంగా నిర్ణయించలేము కదా! ఇందువల్ల మనమందరము ధృతరాష్ట్ర నరేశ్వరుని సన్నిధికిపోయి కర్తవ్యపద్ధతి గ్రహించుకోవలసియున్నది. ఆ ధృతరాష్ట్రుడు ఏమి ఆదేశించినా మనము అది తప్పక ఔదల ధరించవలసియున్నది. అదియునుగాక ధృతరాష్ట్రుడు సాన్నిధ్యంలో గాంధారి విదురులు ఉన్నారు గదా! వారు ముగ్గురు తమలో తాము ఆలోచించుకొని నిశ్చయించిన మార్గమే సర్వదా సముచితమై మనకందరికి తప్పక శిరోధార్యం కాగలదు. ఇందువల్ల నీవు కొంత ఆలోచించిన అనంతరమే కర్తవ్య నిర్వహణకు ఉపక్రమింతువుగాక! అని అశ్వత్థామ హితోపదేశము చేశాడు.

అప్పుడు అశ్వత్థామ కృపాచార్యునితో ఆర్యా! నేను విప్రవంశంలో పుట్టి నా రాజధర్మం చేపట్టాను. నాతండ్రిని చంపిన యోధుడింకా జీవించివుండగా, నేను సుఖంగా వుండలేను. పాండవబలం సుఖనిద్రలో వుంటుంది. ధృష్టద్యుమ్నుని తెగనరికి మిగిలినవారిని సంహరిస్తేగాని నాపగ చల్లారదు అన్నాడు. అంతట కృపాచార్యుడు, అశ్వత్థామా ! లోలోపల రాజుకొంటున్న పగచల్లార్చుకోవలెనని ప్రయత్నిస్తున్న నీసంకల్పం సర్వథా సముచితమే. సందేహం లేదు. దైవయోగం వల్ల శూరోచితమయిన సంగ్రామ ప్రయత్నం నీలో చెలరేగింది. మేము ఉభయులము సర్వదా నీ పద్ధతి అనుసరించగలము. ఈ విషయమై కృతవర్మ నేను నీకు ఎల్లప్పుడు తోడునీడలమై సంచరించగలము. కాని నిద్రలేక నీవు ఇప్పుడు మిక్కిలి అలిసి ఉన్నావు. కనుక కొంత విశ్రమించిన పిదప వేకువ

జామున మాతోబాటు శత్రువుల మీదికి ఉరికి అనాయసంగా నిర్మూలించవచ్చును. మహనీయ దివ్యాస్త్రవేత్త అశ్వత్థామ అజేయుడై విజృంభించినప్పుడు మానవ యోధాగ్రేసరులే కాదు, దేవతాధీశ్వరులైనా క్షణకాలమైనా వారితో తలపడి పోరాడజాలరు. ఇంకొక్కమాట. కృతవర్మ నిరుపమాన శస్త్రాస్త్రవేత్త. మహాబలశాలి. ఆపైన నేను అతనిని అనుసరిస్తున్నానని నీకు తెలుసును కదా! మరినీవు సాక్షాత్తు ద్రోణాచార్యునితో తులతూగజాలిన మేటి వీరుడవని లోకులు ఏకగ్రీవంగా వినుతిస్తున్నారు. ఇటువంటి రథికులు ఏకీభవించి శత్రువుల మీదకి ఉరికినప్పుడు వారు ఎవ్వరయినా ప్రాణాలతో బ్రతికి బయటపడగలరా! కనుక కవచం విసర్జించి మారు మాటాడక మైమరచి నిద్రించవలెను. నిద్రాభారంతో మేము ఉభయులము చైతన్య శూన్యులమైనాము. ప్రభాతవేళ మేల్కొని మనమందరము శత్రువులపై విజృంభించి నిశ్శేషంగా నిర్మూలించవచ్చును అని కృపాచార్యుడు అశ్వత్థామకు హితవు ఉపదేశించినప్పటికీ అశ్వత్థామ అతని పట్టు వీడలేదు. మరల కృపాచార్యునితో ఆర్యా! కాముకుడికీ, క్రోధవశుడికీ నిద్రవస్తుందా? అదీకాక వసుదేవుడు తోడుండగా, అర్జునుడు ధనుర్ధారియై నిలబడితే వారిని ఓడించడం మన తరం కాదు. ఇక నన్ను కాదనవద్దు అని పలికాడు. మరల కృపాచార్యుడు అశ్వత్థామను శాంతింపచేయదలిచి అశ్వత్థామతో...

**అశ్వత్థామ మాటలు విని కృపాచార్యుడు సముచిత హితోపదేశం ప్రసాదించాడు.**

అశ్వత్థామా! ఆగ్రహావిష్టుడయిన మానవునికి ఆత్మ విస్మృతి కలుగుతున్నది. ఇతరులు ఎన్నెన్ని విధాల బోధించినా అట్టివానికి ఏ మాత్రము కర్తవ్యాకర్తవ్య నిర్ణయం ప్రతిభాసించనేరదు. అంతేకాదు, ధీమంతులయిన మిత్రులు, బాంధవులు, సర్వదా సముచిత కర్తవ్యము ఉపదేశింపవలసియున్నది. సదా ధర్మస్థితి పర్యాలోచిస్తున్న మానవుడు జితేంద్రియుడయి అహంకారము విసర్జించి కార్యనిర్వహణకు ఉపక్రమించిన యెడల శుభ పరంపరలు

అందుకోగలడు. ఆత్మీయులు తమవారిని ఎల్లప్పుడు దుష్టపద్ధతి వైపు పోనీయక సంరక్షిస్తున్నారు. వారి హితవు ఆలకించిన బుద్ధిమంతులు అన్నివేళల పుణ్యఫలితాలు అందుకొంటున్నారు. వారి సూక్తులు ఆలకించక పెడచెవిని పెట్టిన వారు భాగ్యవిహీనులై నశిస్తున్నారు. కనుక నా పలుకులు ఆలకించి ఆగ్రహావేశం విసర్జించి నిశ్చల మహానైర్మల్యంతో సుస్థిరుడవై దుష్ట ప్రవృత్తిని విడిచిపెట్టుము.

ఈప్రకారంగా ప్రవర్తించిన యెడల మున్ముందు నీకు ఎన్నడు పశ్చాత్తాప పడవలసిన ఆవశ్యకత సంభవించదు. "నిద్రించిన వారిని, ఆయుధాలు విడిచి పెట్టినవారిని వాహన విహీనులయిన వారిని, శరణన్న వారిని, జుట్టుముడి వీడినవారిని, వధించరాదని, అది మిక్కిలి అధర్మమనీ, ఆర్యజనులు ఉపదేశిస్తున్నారు". ఈ తరుణంలో పాండవేయులందరూ తమ తమ చతురంగ సైన్యాలతో బాటు ప్రగాఢనిద్రా పారవశ్యంలో యుంటారు.

సుషుప్తి కేవలం మృత్యువు వంటిదే అని విజ్ఞులు ఆదేశిస్తున్నారు. శవప్రాయులై విశ్రమించిన వారి పైబడి నిశ్శేషంగా నిర్మూలించి ఘోరపాప భారంతో నరక లోకంలో ప్రవేశింపవలెనని సంకల్పిస్తున్నావు. నీకు ఇది న్యాయమేనా? మహాస్త్రవేత్తలయిన రథిక ముఖ్యులలో సాటిలేనిమేటివి నీవు. అదియును గాక ఇంతకు మునుపు ఒక్క దుష్కృత్యమయినా ఆచరించలేదు. అటువంటి నీకు ఈ తరుణంలో కేవలం క్రూరకర్మాచరణం ధర్మమేనా? నీవు సూర్యోదయమయిన పిమ్మట గొప్ప పరాక్రమంతో శత్రువులపై విజృంభించి జయశ్రీ సహితుడవై మరలి వత్తువు గాక! అని కృపాచార్యుడు అశ్వత్థామకు హితోపదేశము చేశాడు.అయినను అశ్వత్థామ కృపాచార్యుని మాటలు వినక, రథారూఢుడై పాండవశిబిరాలవైపు బయలుదేరాడు. కృపాచార్య, కృతవర్మలు అశ్వత్థామను అనుసరించిరి.

## 11.8. స్త్రీపర్వము

స్త్రీపర్వమున ధృతరాష్ట్రుని ధర్మపత్ని అయిన గాంధారిదేవి తన

కుమారులు కురుక్షేత్రంలో మరణించారని విని విలపిస్తుండగా, కృపాచార్యుడు ఆమెను సమీపించి...

మహారాణీ! నీ కుమారులు అందరూ వివిధ భయంకర అస్త్రాల ప్రయోగాలతో శత్రుసైన్యం నిర్విశేషంగా నిర్దహించి అమరుల జేజేలు అందుకొని స్వర్లోక సౌఖ్యాలు అనుభవిస్తున్నారు. మరి ఈ విషయమై నీకు ఇంతటి చింత ఏల? వారిలో ఒక్కడయినా యుద్ధ భూమిలో అలజడిపడి వెనుదిరిగి పారిపోలేదు. సుక్షత్రియులకు అందరికీ వీరమరణం పరమ ప్రశస్తమని వేదాలు ఘోషిస్తున్నాయి. అనేక యజ్ఞయాగాలతో నిరంతర దాన ధర్మాలతో లభించనేరని పుణ్యలోకాలు అవలీలగా వీరమృతివల్ల చేకూరుతున్నవని ధర్మవేత్తలు ఉద్ఘోషిస్తున్నారు. ఇందువల్ల కుమారుల పరలోకగమనం సంస్మరించి నీవు ఏ మాత్రము చింతించనక్కరలేదు.

"మరి ఆ పాండునందనులకు అయినా కొంతైనా విజయానందం లభించలేదు. మారుతి అధర్మయుద్ధ పద్ధతిలో కౌరవక్షితి పతిని యుద్ధభూమిపై కూల్చినంతలోనే కోపగ్రస్తులమై మేము అందరము ఆనాటి అర్ధరాత్రివేళ పాండవేయ శిబిరంలో ప్రవేశించి పాంచాల వీరులతో, చతురంగ సైన్యాలతో ద్రౌపదీ పుత్రులను ఐదుగురిని నిశ్శేషంగా నిర్మూలించి పిశాచ సమూహాలకు అమందానందం కలిగించాము. అందువల్ల పాండవేయుల సంపూర్ణ విజయం ఎందుకు కొరగాక వ్యర్థమై వారికి ఎడతెగని దుఃఖావేశం కలిగించినది.

ద్రౌపదీపుత్రుల మరణ వార్త విన్న పాండవేయులు వెంటనే మమ్ములను అనుసరింపగలరు. కనుక మేము ఇక ఒక క్షణమయినా ఆలసించక వేరొక చోటికి తొలగిపోవలసి ఉన్నది. కరుణించి మాకు అనుజ్ఞ దయచేయవలసినది అని ప్రార్థించిన పిమ్మట కృపాచార్యుడు ధృతరాష్ట్రుని ఉద్దేశించి మహారాజా! మాకు ధర్మరాజాదులు ఎదురుపడక మునుపే వేరొక ప్రదేశమునకు చేరుకోవలసి ఉన్నది. వెంటనే అనుమతి ప్రసాదింతువుగాక!.

విధి బలీయమైనదని భావించి దుఃఖావేశం నిగ్రహించుకొని బాంధవుల

కందరికి యథావిధిగా పరలోకక్రియలు ఆచరింతువు గాక! అని విన్నవించాడు. కృపకృతవర్మ అశ్వత్థాములు ఆపైన గాంధారి ధృతరాష్ట్రు లిరువురికి నమస్కరించి, వారి అనుమతితో మువ్వురు రథాలు అధిరోహించి, గంగాతీర ప్రదేశం చేరుకొన్నారు. అచటనుండి కృపాచార్యుడు హస్తినాపురం బయలుదేరాడు. కృతవర్మ తన రాజధానికి బయలుదేరగా, అశ్వత్థామ వెను వెంటనే వ్యాసమహర్షి ఆశ్రమంలో ప్రవేశించాడు.

## 11.9. కృపాచార్య వ్యక్తిత్వము

సప్త చిరంజీవులలో ముఖ్యుడైన కృపాచార్యుడు, కౌరవ పాండవులకు ఆచార్యునిగా మన్నన పొందాడు. పాండవులకు కౌరవులు చేసిన అపకృతిని సహించలేదు. సమయము వచ్చినపుడు దుర్యోధనుడు చేసినది నీతిగాదని చెప్పినాడు. తనయేలికలైన భీష్మ ధృతరాష్ట్ర, దుర్యోధనులతో నుండి వారి అన్నమును తినుచుండెనుగాన ప్రభుభక్తిని మాత్రమే తలచి న్యాయాన్యాయములు ఏమాత్రము విచారింపక కౌరవులకు పాండవులను పరిమార్చుటకు సలహాలిచ్చాడు. అజ్ఞాతవాసములో నున్న పాండవులను తెలుసుకొనుట ముఖ్యమని యితడే సలహా యిచ్చాడు. దుర్యోధనునకు హితోపదేశము చేశాడు. గోగ్రహణమునకు యితడు వెళ్ళెను గాని అర్జునునిచే ఓడి అతని పరాక్రమాన్ని మెచ్చుకొన్నాడు.

యుద్ధరంగమునందు కర్ణుడు గూడ మరణించగా, ఇకనైనా యుద్ధము మాని పాండవులతో సంధి చేసికొనుమని కృపాచార్యుడు చెప్పెనుగాని దుర్యోధనుడు వినలేదు. రణరంగ మందోడి దుర్యోధనుడు జలాశయమున దాగుకొనగా, కృపాచార్యుడు మిక్కిలి విచారము నొంది దుర్యోధనునకు మనశ్శాంతి కలుగునట్లు సంభాషించినాడు.

కొన ప్రాణముతో నున్న దుర్యోధనునకు ప్రీతి సేయుటకై, అశ్వత్థామ పాండవులను 'నిశి' యందు చంపుదునని తెలుపగా, అంతట కృపాచార్యుడు

ఇది మంచిది గాదని, నిద్రించియున్న వారిని చంపుటపాడి గాదని చెప్పెను. గాని అశ్వత్థామ వినలేదు.

యుద్ధరంగమునందు కౌరవులు మరణించగా పుత్రశోకముతో దుఃఖిస్తున్న గాంధారి ధృతరాష్ట్రులను ఓదార్చాడు. చివరగా ధర్మరాజు పరీక్షిన్మ మహారాజుకు గురువుగా కృపాచార్యుని నియమించాడు. చిరంజీవి అయిన కృపాచార్యుడు సూర్య సావర్ణిక మన్వంతరములో సప్తర్షులలో నిథడొకడగును.

## 12. పరశురాముడు

జమదగ్నిమహర్షికి రేణుకాదేవికి జన్మించినవాడు పరశురాముడు. పరశురామునకు మొదటి నామధేయం రాముడు. ఈశ్వరానుగ్రహముచే 'పరశువు'ను ధరించిన కారణాన పరశురామ అను నామధేయం సార్థకమైనది. విష్ణుమూర్తి దశావతారములలో పరశురామావతారం ఒకటి.

శత్రువులను హింసించే గండ్ర గొడ్డలిని 'పరశుః' (పరాన్ శృణాతీతి పరశుః) అంటారు. కనుక అంతవరకు అతనికున్న రాముడనే పేరు పరశురాముడిగా మారి సార్థకమైంది.

శ్రీ మహాభారతంలో, అరణ్యపర్వ, శాంతిపర్వాలలో పరశురాముని కథాకథనం పర్యాయోక్తంగా ఉన్నది. వక్తృ భేదంచే ఈ కథ బహురూపాలను పొంది ఉంటుందని, ఆయాపాఠాలను కవి సందర్భోచితంగా గ్రంథస్థం చేశాడనీ మనం ఊహించవచ్చు. భాగవతం నవమ స్కంధంలోనూ, బ్రహ్మాండ పురాణంలోనూ ఈషద్భేదమ్యంతో కనిపిస్తుంది.

### 12.1. అరణ్యపర్వములో పరశురామ వృత్తాంతము

అరణ్య పర్వంలో ధర్మరాజు మహేంద్రాదిపై విడిది చేసినప్పుడు అకృత వ్రణుడు ధర్మరాజునకు పరశురామ వృత్తాంతము ఇట్లు చెప్పెను.

ఓ ధర్మరాజా ! పూర్వము హైహయా దేశాధీశ్వరుడు కార్తవీర్యార్జునుడను రాజుకు వేయి బాహువులు కలవు. దత్తాత్రేయస్వామి వరప్రసాదముచే అతనికి దివ్యమైన బంగారుమయమైన విమానము లభించింది. అంతేగాక ఈ భూమి మీద సర్వ జంతువుల పైనను ఆధిపత్యము సాగించుటకు గూడ వరము అనుగ్రహింపబడింది. వర ప్రభావముచే కార్తవీర్యార్జునుడు అంతట సంచరించుచు దేవతలను, ఋషులను, సమస్తభూతములను పీడించుచున్నాడు. అప్పుడు దేవతలు, ఋషులు శ్రీహరి కడకు పోయి కార్తవీర్యార్జుని ఆగడములు

తెలియజేసి ఎలాగైనను సంహరింపవలసినదని ప్రార్థించారు. శ్రీహరి వారికి అభయమిచ్చి అనుగ్రహించాడు.

ఆ సమయము నందే కన్యాకుబ్జ నగరమును గాధియను అను మహారాజు పరిపాలిస్తున్నాడు. చక్కగా రాజ్యమును పరిపాలిస్తున్న ఆ రాజుకు ఒక కుమార్తె జన్మించినది. ఆమె పేరే సత్యవతి. అనంతరం ఆ రాజు రాజ్యమును విడిచి తపశ్చర్యకు సంకల్పించి అరణ్యములో నివాసమేర్పరచుకొన్నాడు. ఆ రాజు కుమార్తె యుక్తవయస్సుకు వచ్చినది. భృగువంశోత్పన్నుడగు ఋచీకుడు అను మునీశ్వరుడు గాధిరాజును సమీపించి నీకుమార్తెను నాకిచ్చి వివాహం జరిపించవలసినదని అర్థించాడు.

అపుడు గాధిరాజు ఋచీక మునితో బ్రాహ్మణోత్తమా! మా వంశములో పూర్వమునుండి శుల్కమును తీసుకొని కన్యనిచ్చు నియమము మా పూర్వులు ఏర్పరచినారు. ఆ నియమమును తప్పక నేను గూడ పాటింపవలెను. ఆ శుల్కము ఏమనగా – ఒక చెవినల్లగా నుండి మిగిలిన శరీర భాగమంతా తెల్లగా యున్న వేయి గుర్రములు సమర్పించిన యెడల తప్పక నీ కోరిక నెరవేర్చగలను.

అంతట ఋచీకుడు ఆ శుల్కనియమానికి అంగీకరించి వరుణేశ్వరుని ప్రార్థించి అటువంటి విశిష్ట లక్షణాలతో ప్రకాశిస్తున్న వేయి గుర్రాలు ఒకేమారు సంపాదించి గాధికి అర్పించాడు. ఆ యశ్వములు సముద్భవించిన ప్రదేశము 'అశ్వతీర్థము' అను నామముతో ప్రసిద్ధిగాంచింది. గాధి అటు పిమ్మట తన కుమార్తె సత్యవతిని ఋచీకునకిచ్చి వివాహము జరిపించాడు.

ఒకనాడు ఋచీకమహర్షి ఆశ్రమమునకు భృగుమహర్షి రాగా అర్ఘ్య పాద్యము లిచ్చి సత్కరించి నమస్కరించిరి. సత్యవతి అణకువతో చేసిన సేవలకు భృగువు సంతష్టుడై తల్లీ నీకేమి వరము కావలెనో కోరుకొనుము. నేను అది ప్రసాదించెదను.

అంతట ఆమె మహాత్మా! నాకు మాతల్లికి పుత్రభాగ్యం ప్రసాదించ

వలసిందని వేడుకొన్నది. అపుడు భృగువు ఈవిధంగా ఉపదేశించాడు.

**ఋతౌ త్వం చైవ మాతా చ స్నాతే పుంసవనాయ వై ।** (వనపర్వం)
**ఆలింగేతాం పృథక్ వృక్షౌ సాశ్వత్థం త్వముదుంబరమ్ ॥** (115-35)

అమ్మా ! నీ కోరిక నెరవేరగలదు. నీవు నీ జనని ఋతుస్నానము చేసి పుత్రార్థినులై, నీవు ఉదుంబర వృక్షమును మీ తల్లి అశ్వత్థ వృక్షమును కౌగలించుకోవలెను.

నేను భగవంతుని ధ్యానించి రెండు చరువులను సిద్ధము చేసినాను. ఒకటి నీకు, మరియొకటి నీ తల్లి కొరకు యిచ్చుచున్నాను. మీమీ చరువులను (పాత్రలోని అన్నమును) భుజించుడని పలికి అదృశ్యుడయ్యాడు.

భృగుమహర్షి వెళ్లిన పిదప సత్యవతి తల్లి, తన కూతురు ఆలింగనము చేసుకొనవలసిన ఉదుంబర వృక్షమును ఆమె కౌగిలించుకొని కూతురి చరువును భక్షించినది. కూతురు అశ్వత్థవృక్షమును ఆలింగనము చేసుకొని తల్లి చరువును భుజించినది.

కాలము గడచుచుండగా, భృగుమహర్షి దివ్యదృష్టితో తెలుసుకొని ఆశ్రమమునకు వచ్చి సత్యవతితో అమ్మా ! మీ తల్లి నిన్ను మోసగించి నీ వృక్షమును ఆమె ఆలింగనము చేసికొని నీ చరువును భుజించినది. నీవు ఆమె కొరకు ఏర్పరచిన వాటిని భుజించావు. అందుచే క్షత్రియవృత్తి గల బ్రాహ్మణుడు నీకు జన్మించుతాడు. బ్రాహ్మణాచారముగల క్షత్రియుడు మీ తల్లికి జన్మించుతాడు. ఆ మాట విని సత్యవతి భృగుమహర్షికి భక్తితో నమస్కరించి మహాత్మా! అట్టి కుమారుడు నాకక్కరలేదు. ఒకవేళ నా పౌత్రుడు క్షత్రియుడైనను అగుగాక! నాకు బ్రాహ్మణ పుత్రుడే కలుగునట్లు అనుగ్రహింపుము. ఆమె ప్రార్థనకు ఆయన సంతసించి అట్టి వరమును ప్రసాదించాడు. పిదప కొంతకాలమునకు గాధిపత్నికి విశ్వామిత్రుడు జన్మించాడు. సత్యవతికి జమదగ్నిమహర్షి జన్మించాడు. ఈ మహర్షి వేదవేదాంగములను అభ్యసించి ధనుర్వేద పారంగతుడయ్యాడు.

జమదగ్ని యుక్తవయస్సుడైన పిమ్మటనే ప్రసేనజిత్తు అను రాజు కుమార్తె రేణుకాదేవిని వివాహమాడి, ఆశ్రమంలో తీవ్ర తపోనిష్ఠ ప్రారంభించాడు. ఆ మునీశ్వరునికి రుమణ్వంతుడు, సుషేణుడు, వసువు, విశ్వావసువు, పరశురాముడు అను అయిదుగురు కుమారులు జన్మించారు. 'సర్వేషామజఘన్యస్తు రామ ఆసీజ్జఘన్యజః' అతడు సోదరులలో వయస్సుచే కనిష్ఠుడైనను గుణములలో నందరి కన్న రాముడు శ్రేష్ఠుడుగా నుండెను.

పరశురాముడు వైశాఖ శుక్ల తృతీయనాడు జననమందినట్లు స్కంద, బ్రహ్మాండపురాణాలు పేర్కొన్నాయి.

ఒకప్పుడు రేణుకాదేవి తన కుమారులు ఫలముల కోసము అడవికి వెళ్ళగా దగ్గరలోనే ఉన్న కొలనులో స్నానానికి వెళ్ళింది. ఆ సమయంలో అక్కడ మార్తికావతకం అను దేశమునకు రాజైన చిత్రరథుడు మెడలో నీలోత్పలాల శృంగార పద్మమాలికలను అలంకరించుకొని భార్యతో జలక్రీడలాడుతున్నాడు. ఆ దంపతుల పరస్పరాను రక్తిని చూచి, ఆ మానసిక వ్యభిచారము వలన ఆమె ద్రవించి మైమరచి నీటిలో పడిపోయెను. తిరిగి తన ఆశ్రమమునకు వెళ్ళగా జమదగ్ని దివ్యదృష్టితో తెలుసుకొని ధైర్యము సడలి, బ్రహ్మ తేజమునుండి భ్రష్టురాలైన రేణుకను చూచి జమదగ్ని ధిక్కార పూర్వకముగా నిందించాడు. తరువాత వనానికి వెళ్ళిన రుమణ్వంతుడు, సుషేణుడు, వసువు, విశ్వావసువు అను నలుగురు ఆశ్రమమునకు వచ్చిరి. తల్లిని వధించమని క్రమముగా ఒక్కొక్కరిని జమదగ్ని ఆజ్ఞాపించాడు. కాని మాతృప్రేమచే ఒక్కడు గూడ మాతృ వధ చేయుటకు సాహసించక అందరూ ఊరకుండిరి.

తతః శశాప తాన్ క్రోధాత్తే శప్తాశ్చేతనాం జహుః ।
మృగపక్షి సధర్మాణః క్షిప్రమాసం జడోపమాః ॥ (116-12)

తరువాత వెంటనే ఆ ముని కోపించి ఆ నలుగురు కుమారులను శపించాడు. శాపగ్రస్తులైనవారు మృగ-పక్షి సమానముగా జడబుద్ధిలైరి.

ఆ తరువాత చివరకు కనిష్ఠుడగు పరశురాముడు రాగా అతనిని గూడ తల్లిని చంపుమని ఆజ్ఞాపించాడు. తండ్రి ఆజ్ఞగా పరశురాముడు తన పరశువుతో తల్లి శిరస్సును ఛేదించాడు.

అంతటితో జమదగ్ని ప్రసన్నుడై నాయనా పరశురామా! నీవు నా ఆజ్ఞపై అతి దుష్కరమైన మాతృ వధ కార్యము చేశావు. నేను నీ యెడల చాల ప్రసన్నుడయ్యాను. కనుక నీవు కోరినన్ని వరములు యిచ్చెదను కోరుకొనుము. ఆ మాటలు విని పరశురాముడు తండ్రిని ఈ విధముగా వరములు కోరినాడు.

> స వవ్రే మాతురుత్థానమస్మృతిమ్ చ వధస్య వై ।
> పాపేన తేన చాస్పర్శం భ్రాతౄణాం ప్రకృతిం తథా ॥ (116-17)
> అప్రతిద్వంద్వతాం యుద్ధే దీర్ఘ మాయుశ్చ భారత ।
> దదౌ చ సర్వాన్ కామాంస్తాన్ జమదగ్నిర్మహాతపాః ॥ (116-18)

తండ్రీ! నాతల్లి జీవించునట్లును, నేను ఆమెను వధించినట్లు ఆమె స్మృతికి రాకుండునట్లును, మాతృ వధ పాతకము నాకు అంటకుండునట్లును, నా అన్నలు నలుగురు స్వస్థులై పూర్వము వలె ఉండునట్లు, యుద్ధములో నన్ను ఎదిరించగల వీరులు లేకుండునట్లును, నాకు దీర్ఘాయువు కలుగునట్లును వరములు ప్రసాదించమని వరములను కోరుకోగా తండ్రి జమదగ్ని ప్రసన్నుడై పరశురాముడు కోరిన వరములన్నియు ప్రసాదించాడు.

ఇట్లుండగా ఒకనాడు జమదగ్ని కుమారులందరు అడవికి వెళ్ళినప్పుడు అనూప దేశాధిపతియగు కార్తవీర్యార్జునుడు జమదగ్నిమహర్షి ఆశ్రమమునకు రాగా, రేణుకాదేవి అర్ఘ్య పాద్యములిచ్చి సత్కరించి పూజించింది. యుద్ధోన్మత్తుడగు ఆరాజు ఆమె చేసిన పూజలకు ఇష్టపడక ఆశ్రమమును ఛిన్నా భిన్నా మొనర్చి అచ్చట ఆక్రోశించుచున్న హోమధేనువు యొక్క దూడను బలవంతముగా లాగి కొనిపోవుచు ఆశ్రమ వృక్షములను విరిచి కూలద్రోసిరి.

తరువాత కొంతసేపటికి వచ్చిన పరశురామునకు జమదగ్ని మహాముని

జరిగిన విషయమంతా తెలుపగా, పరశురాముడు అది విని యచట ఏడ్చుచున్న హోమధేనువును చూచి మిక్కిలి కోపించాడు. పరశురాముడు మహామహిమాన్వితమైన సముద్దంద కోదండాన్ని చేతబూని కార్తవీర్యుని రాజధానికి వెళ్ళి అతనిపై పరాక్రమించాడు. పరశురాముడు వింటినారికి బాణాలు సంధించి పరంపరగా ప్రయోగిస్తూ అతని సహస్ర బాహువులను మరియు కంఠాన్ని ఛేదించాడు.

తండ్రి వధచే దుఃఖితులైన కార్తవీర్యార్జుని పుత్రులు పగ సాధింపుతో పరశురాముడు లేని సమయమున ఆశ్రమములో దూరి ఒంటరిగానున్న జమదగ్ని ముని ఆర్తనాదాలను లెక్క చేయకుండా ఆయనను హతమార్చారు.

ఆశ్రమంలో నిత్యాగ్ని హోత్రానికి కావలసిన సమిధలను అడవినుంచి తీసుకొని ఇంటికి తిరిగి వచ్చిన పరశురాముడు తండ్రి మృతశరీరం యెదుట శోకవిహ్వలమై హృదయవిదారకంగా విలపిస్తున్న తల్లిని చూడగానే జరిగిన వృత్తాంతాన్ని గ్రహించాడు.

పరశురాముడు మిక్కిలి దుఃఖించి తండ్రీ! ఘోరమైన అపకారం చేసి దుష్టాత్ములకు కూడా కలలోనైనా ప్రతీకారం తలపెట్టి యెరుగని నీవంటి కరుణా మూర్తిపై కత్తి యెత్తడానికి సాహసించిన ఆ హైహయుల పాపకృత్యానికి వైరశుద్ధిని నేను సాధిస్తాను. నాతో యుద్ధానికి రాలేక ఆశ్రమానికి వచ్చి ఏ పాపం తెలియని నన్ను వన్యమృగం వలె చుట్టు ముట్టి హతమార్చిన ఆ హైహయులతో పాటు రాజు ధర్మాన్ని కోల్పోయిన నీచ క్షత్రియులను ఊచకోత కోసి ధాత్రిని నిఃక్షత్రియం కావిస్తాను' అని ప్రతిజ్ఞ చేశాడు. తండ్రికి నిర్వర్తింపవలసిన అంత్య విధులన్నిటినీ నెరవేర్చి, గార్హపత్యాగ్ని హోత్రం నుంచి జ్వలతా హ్యాన్ని తీసి చితికి నిప్పంటించాడు. ప్రేత కార్యములు ముగిసిన తరువాత పరశువును చేతధరించి తొలుత కార్తవీర్యార్జునుని పుత్రులనందరిని సంహరించాడు. వారికి సహాయముగా వచ్చి క్షత్రియులను గూడ సంహరించాడు.

త్రిః సప్తకృత్వః పృథివీం కృత్వా నిఃక్షత్రియాం ప్రభుః ।
సమంతపంచకే పంచ చకార రుధిరహ్రదాన్ ॥ 117–9

తరువాత ఇరవైఒక్క పర్యాయములు భూమండలమంతయు ప్రదక్షిణముచేసి సర్వక్షత్రియులను సంహరించి వారి నెత్తుటితో సమంత పంచక క్షేత్రములో అయిదు మడుగులుగా నిర్మించాడు.

ఆ నెత్తుటి మడుగులలో పరశురాముడు భృగువంశోత్తమ్నులగు తన పితరులకు సమంతక పంచకములో తర్పణ క్రియలాచరించాడు. ఇవియే సమంత పంచకములని ప్రసిద్ధిచెందినవి. అపుడచటికి ఋచీక మహాముని ప్రత్యక్షముగా వచ్చి ఆ క్రూర కర్మనుండి పరశురామున్ని నివారించాడు. పిదప పరశురాముడు యజ్ఞము చేసి దేవేంద్రుని సంతృప్తిపరచాడు.

ఋత్విక్కులకు దక్షిణగా తాను క్షత్రియులను చంపి సంపాదించిన భూమి నంతయు దానము చేసాడు. నెలువది మూరల వెడల్పు, నలువది మూరల పొడవు, ముప్పదియారు మూరల యెత్తుగల స్వర్ణ వేదికను నిర్మించి, దానిని కశ్యపునకు దానము చేశాడు.

కశ్యపుని ఆజ్ఞచే ఆ సువర్ణ వేదికను బ్రాహ్మణులు ముక్కలు చేసి పంచుకొనిరి. అందుచే వారు ఖండవాయనులు అని ప్రసిద్ధులైరి. ఈవిధముగా పరశురాముడు సమస్త భూమండలమును కశ్యపునకు దానము చేసి ధర్మరాజా! ఈ మహేంద్రపర్వతము మీద నివసించుచున్నాడు.

ఈ విధముగా పరశురామునకు సమస్త క్షత్రియ జాతితో వైరమేర్పడినది. అని అకృతవ్రణుడు చెప్పిన పరశురాముని కథ ధర్మరాజు విన్నాడు. ధర్మరాజు ఆ మరునాడు చతుర్దశి గనుక అచటికి వచ్చిన పరశురాముని దర్శించి తమ్ములతో సతనిని పూజించి అతని కోరికపై ఆ రాత్రి మహేంద్రపర్వతమున నివసించాడు.

## 12.2 శాంతిపర్వములో పరశురామ వృత్తాంతము

శాంతిపర్వములో శ్రీకృష్ణుడు ధర్మరాజుకు సమంత పంచకాన్ని చూపించి

క్షత్రియవంశ నాశనం కావించిన పరశురాముడు పుణ్య చరిత్రను ఉపదేశించాడు.

జహ్నుని కుమారుడు అజుడు. అజునికుమారుడు బలాకాశ్వుడు. బలకాశ్వుని కుమారుడు కుశికుడు. ఆ కుశికునకు దేవేంద్రుడే పుత్రుడై వచ్చి 'గాధి'గా జన్మించాడు. అతనిని సత్యవతి యను పేరు గల కన్య జన్మించింది. గాధి తన కుమార్తె సత్యవతిని భృగుపుత్రుడగు ఋచీకునకు యిచ్చి వివాహము జరిపించాడు.

ఆమె పరిశుద్ధికి ప్రీతినొందిన ఋచీకుడు, ఆమెకును, గాధికిని పుత్రులు కలుగుటకై రెండు చరువులను ఉపకల్పించాడు. భార్గవుడగు ఋచీకుడు భార్యను పిలిచి యిదిగో యీ చరువును నీవు ఉపయోగింపుము. ఇది నీ తల్లి భుజింపవలెనని పలికాడు.

ఆమెకు గొప్ప తేజస్సు కలవాడు, లోకమున ఏ క్షత్రియునకు గెలువరాని వాడు, క్షత్రియ శ్రేష్ఠులను నాశనము చేయువాడగు క్షత్రియ వరేణ్యుడు పుట్టును. కల్యాణీ! నీకును చక్కని ధృతి, శాంతి తపస్సు గల బ్రాహ్మణ శ్రేష్ఠుడగు పుత్రుని ఈ చరువు కూర్పగలదు అని పలికి తపమునందు ప్రీతి కలవాడై శోభతో వెలుగొందుచు అరణ్యముల కెళ్ళాడు.

ఇదేకాలమున గాధి రాజు తీర్థయాత్రల యందాసక్తి కలవాడై భార్యతో కూడి ఋచీకుని ఆశ్రమమునకు రాగా, సత్యవతి ఆరెండు చరువులను పట్టుకొని సంతోషముతో భర్త మాటను తల్లికి తెలిపింది.

పిమ్మట తల్లి, చరువులను తారుమారు చేసి తాను భుజించవలసిన చరువును సత్యవతికిచ్చి, సత్యవతి భుజించవలసిన చరువును ఆమె భుజించింది. అనతికాలములోనే సత్యవతి గర్భమును ధరించింది. అంత ఋచీకుడు గర్భవతి అయిన తన భార్యను కళ్యాణీ! నీతల్లి చరువులను తారుమారు చేసి నిన్ను వంచించినది. నీకు క్రూర కర్ముడు తీవ్ర క్రోధుడునగు కుమారుడు ఉదయిస్తాడు. నీ తల్లికి బ్రాహ్మణుడు ఉదయిస్తాడు. ఋచీకుడు యిట్లు పలుకగా సత్యవతి

తన భర్త పాదములకు నమస్కరించి ...

> ఇచ్ఛన్ లోకానపి మునే సృజేథాః కిం పునస్సుతమ్ ।
> శమాత్మకమృజుం పుత్రం దాతుమర్హసి మే ప్రభో ॥ (49-24)

ప్రభూ! మీరు అనుకున్నచో లోకములనైన సృజింపగలవు. ఇక కుమారుని గూర్చి చెప్పనేల? నాకు శాంత స్వరూపుడు, ఋజువునగు పుత్రుని ప్రసాదించుము.

అప్పుడా ఋచీకుడు తన భార్యతో కల్యాణీ! నేను ముందే తపస్సుచే తెలిసికొంటిని. నీ తండ్రి కులమంతయు బ్రహ్మభూతము కలదు. అంతట సత్యవతి ఇట్లనెను.

> కామమేవం భవేత్పౌత్రో మమేహ తవ చ ప్రభో ।
> శమాత్మకమహం పుత్రం లభేయం జపతాం వర ॥ (49-27)

ప్రభూ ! ఇదియే నీ కోరిక యగుచో నీ మనుమడట్టి వాడగుగాక! నాకు మాత్రము శాంతచిత్తుడగు పుత్రుడే కలుగు గాక! అని ప్రార్థించింది. ఆమె ప్రార్థనకు అయన సంతుష్టుడై అట్టి వరమును ప్రసాదించాడు.

అంత సత్యవతి తపమునందు శ్రద్ధ కలవాడు, చెడని వ్రత నిష్ఠ కలవాడు, శాంతుడగు జమదగ్నిని పుత్రునిగా పొందింది. అతడు పెరిగి పెద్దవాడై మహాతేజస్వి అయ్యాడు. సమస్త వేద శాస్త్రములు అతనికి స్వయముగా భాసించెను. ధనుర్వేదము నందు గూడ పారంగతుడయ్యాడు. జమదగ్ని, ప్రసేనజిత్తు అను రాజుకుమార్తె రేణుకను పెండ్లియాడాడు. ఆమె వల్ల జమదగ్నికి అయిదుగురు కొడుకులు పుట్టిరి. రుమన్వంతుడు, సుషేణుడు, వసువు, విశ్వావసువు, చివరివాడు పరశురాముడు.

ఇదే కాలమున కార్తవీర్యార్జునుడను రాజు అశ్వమేధ మహాయాగమున విప్రులకు దానధర్మాలు చేయగా, ఆశ్రితవత్సలుడైన ఆ మహారాజును అభ్యర్థించి

అగ్నిదేవుడు ఆయన రాజ్యంలోని కొన్ని అరణ్యాలను ఆహారంగా భుజించడానికి అనుమతి పొందాడు. ఆవిధంగా అరణ్యాలను దహిస్తూ, అగ్ని జమదగ్ని ఇంటలేని సమయంలో ఆయన ఆశ్రమాన్ని కూడా భస్మ పటలం కావించాడు.

సమిత్కుశాదుల కోసం ఆశ్రమ బహిర్వనాలకు వెళ్లిన జమదగ్ని ఇంటికి తిరిగివచ్చి సర్వభక్షకునికి రక్షణగా వెంట వచ్చిన కార్తవీర్యుని చూసి కుపితుడై ఋషి ఆశ్రమాలను ధ్వంసం చేయడం తగదని తెలిసికూడా చేశావు. నీ గర్వానికి శిక్షగా అస్మత్ సుతుడైన రాముడు నీ బాహువులను ఖండించును గాక! అని శపించాడు.

ఆ శాపానికి విషాదము చెంది కార్యవీర్యార్జునుడు రాజధానికి తిరిగివచ్చి యథోచితంగా రోజులను గడపసాగాడు. శాపమహిమ వల్ల అతనికి అవినీతులైన కుమారులు జన్మించి అధర్మ వర్తనులయ్యారు. జమదగ్ని ఇంటలేని సమయాన ఒకప్పుడు వారు ఆశ్రమంపైకి దండెత్తి హోమధేనువును,దూడను తమ మందిరానికి ఈడ్చుకొనిపోయారు. పరశురాముడు ఆశ్రమానికి రాగ రాజనందనులు కావించిన అకృత్యానికి కోపించి కార్తవీర్యార్జుని వద్దకు వెళ్ళాడు. అక్కడ వారిరువురికీ భీకరమైన యుద్ధం జరిగింది. పరశురాముడు తన పరశువుతో కార్తవీర్యార్జుని సహస్రబాహువులనూ ఛేదించివేశాడు.తండ్రికి సంభవించిన అవధీరణానికి హైహయ రాజపుత్రులు కుపితులై పరశురాముడు సమిధలు, దర్భలు మున్నగు వాని కొరకు బయటకు వెళ్ళినపుడు ఎవ్వరు లేని సమయమున కార్తవీర్యార్జునుని కొడుకులు జమదగ్ని ఆశ్రమంలో ప్రవేశించి, అతను ఏకాంతంలో ఉండగా, వారు జమదగ్ని శిరస్సును ఖండించి వెళ్ళిరి.

తండ్రిని చంపిన కారణమున పుట్టిన కోపముతో పరశురాముడు తీవ్ర శోకముచే భూమిని క్షత్రియులు లేనిదిగా చేయుదునని ప్రతిజ్ఞ చేసి ఆయుధమును చేపట్టి పరాక్రమముతో కార్తవీర్యార్జుని కొడుకులను, మనుమలను వెదకి వెదకి చంపాడు. బాలురుగా నున్నవారిని, గర్భములందున్న వారిని అతడు చంపలేదు.

ఆవిధముగా క్షత్రియకులము మిగిలింది. ఆవిధంగా శత్రు వినాశానంతరం చిత్తశాంతిని పొంది తపోవనానికి వెళ్ళాడు. ఇలా అనేక సంవత్సరాలు గతించాయి.

అట్లు కొన్నివేల సంవత్సరాలు గడువగా విశ్వామిత్రుని మనుమడు, రైభ్యుని కొడుకైన పరావసువనువాడు వేళాకోళముగా మాట్లాడుతూ ఏమయ్యా! పరశురామా! యయాతిపడిన వేళ యజ్ఞమునకు వచ్చిన ప్రతర్దనుడు మొదలగువారు క్షత్రియులు కారేమి? ఆ భూమి మరల వందలకొలది క్షత్రియులతో అన్ని వైపుల నిండియున్నది. పరావసుని మాట విని భార్గవుడు మరల శస్త్రమును చేపట్టాడు. మునుపు ఆతడు చంపక వదలిన వందలకొలది క్షత్రియులను ఇపుడతడు పుట్టిన వానిని పుట్టినట్లుగా చంపివైచాడు. కొందరు క్షత్రియ వనితలు కుమారులను కాపాడుకొనిరి. ఇట్లా పరశురాముడు ఇరువది యొక్క మారులు భూమిని క్షత్రియ రహితగా చేసి అశ్వమేధయాగం చేశాడు. యాగాంతంలో భూతలాన్ని కశ్యపునకు దక్షిణగా సమర్పించాడు.

కశ్యపుడు స్రుక్కును పట్టుకొన్న చేతితో నిర్దేశించుచు క్షత్రియులను మిగుల్చుట కొరకై రామునితో ఇట్లన్నాడు. రామా! దక్షిణగా ఇచ్చినచోట తిరుగాడే అధికారం నీకింక లేదు. మహాముని! దక్షిణ సముద్రపు టొడ్డునకు పొమ్ము. అంత సముద్రుడు వడివడిగా దక్షిణాగ్రమునందలి భూతలమున పరశురాముని కొరకై శూర్పారకమును దేశమును నిర్మించాడు. కశ్యపుడట్లు రాముడిచ్చిన భూమిని గ్రహించి బ్రాహ్మణుల అధీనము గావించి వనమునకెళ్ళాడు.

నీవు దానం చేసిన ఈ భూమిపై శేషించిన రాజులను ఇక నీవు చంపరాదు. అని ఆదేశించాడు. పరశురాముడు విరక్తుడై తపోవనాలకు వెళ్ళిపోయాడు. కశ్యపుని పేరిట భూమండలం కాశ్యపి అయింది.

### 12.3. భాగవతములో పరశురామ వృత్తాంతము

శ్రీ మహాభాగవతం నవమస్కంధంలో ఉన్న పరశురాముని జన్మ ప్రకారం

భారతంలో శ్రీకృష్ణుడు ధర్మనందనునికి ఉపదేశించినట్లే చిత్రీకరింపబడింది.

హైహయవంశరాజులలో గొప్పవాడైన అర్జునుడు దత్తాత్రేయుని ఆరాధించి అణిమాది సిద్ధులనూ, సహస్రబాహులనూ, అనంత ఐశ్వర్య సంపదలనూ పొంది తనవంటి మహావీరుడు ముల్లోకాలలోనూ లేడన్న కీర్తి గడించాడు. రేవానదీజలాలలో సతీసమేతంగా స్నానం చేస్తూ తన సహస్ర బాహువులను ప్రవాహానికి అడ్డు నిలిపి జలాలను ఒక్కుమ్మడిగా వెనుకకు మళ్లించాడు. రేవా జలప్రవాహం వెనుకకు పొంగి విశ్వవిజిగీషతో ఆ ప్రదేశానికి వచ్చిన లంకేశ్వరునికి అడ్డు నిలిచింది. రావణుడు ఆగ్రహించి అర్జునునితో యుద్ధానికి వచ్చి పరాజితుడయ్యాడు. అతనిని మాహిష్మతీ పురానికి తీసుకొనివెళ్లి హైహయరాజు తగురీతిగా బుద్ధి చెప్పి పంపించివేశాడు.

ఒకనాడు అర్జునుడు సపరివారంగా వేటకు వెళ్ళి మార్గమధ్యంలో జమదగ్ని ఆశ్రమాన్ని సందర్శించాడు. ఆ మహర్షి కామధేనువు వంటి తన హోమధేనువును అర్థించి సర్వసంభారాలతో రాజుకు ఘనసత్కారం చేశాడు. అటువంటి దివ్య ధేనువు ముని ఆశ్రమంలో కంటె తనవద్ద ఉంటే మేలని భావించి, రాజు దానిని బంధించి రాజధానికి కొనిపోయాడు.

ఈ వృత్తాంతం తెలుసుకొని పరశురాముడు ప్రతీకారం తీర్చుకోవాలని మాహిష్మతికి వెళ్లాడు. రామార్జునులకు ఘోరయుద్ధం జరిగింది. పరశురాముడు తన కుఠారముతో రాజు శిరస్సును సహస్ర బాహువులను నరికివేశాడు. హోమధేనువు ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి పరశురాముడు తండ్రికి తోబుట్టువులకు తన పరాక్రమాన్ని వర్ణించి చెప్పాడు. అంతట జమదగ్ని చేసిన పని చాల పొరపాటని చెప్పి యిట్లు బోధించాడు.

> క్షమయా రోచతే లక్ష్మీః బ్రాహ్మీ సౌరీ యథా ప్రభా ।
> క్షమిణామాశు భగవాంస్తుష్యతే హరిరీశ్వరః ॥ (భాగవతం)

రామా! మానవునకు ఓర్పు చాల అవసరము. దానిచేతనే అతని శోభ

సూర్యుని ప్రభ వలె ప్రకాశించుచుండును. సర్వశక్తిమంతుడైన భగవంతుడు శ్రీహరియు ఓర్పు కలవాని యెడలనే శీఘ్రముగ ప్రసన్నుడవుతాడు.

**రాజ్ఞో మూర్ధాభిషిక్తస్య వధో బ్రహ్మవధాద్గురుః ।**
**తీర్థ సంసేవయా చాంహో జహ్యాంగాచ్యుత చేతనః ॥** (భాగవతం)

సార్వభౌముడగు రాజును వధించుట బ్రహ్మ హత్యకంటెను గొప్ప పాపము. కావున నీవు భగవంతుని స్మరించుచు తీర్థములను సేవించి నీ పాపములను కడిగి వేసికొనుము అని ఆదేశించాడు. పరశురాముడు ఓర్పువహించి ఒక సంవత్సరం పాటు పుణ్యక్షేత్రాలకు వెళ్ళి తీర్థ సేవనలతో పాపవిముక్తుడైనాడు.

ఒకప్పుడు రేణుకాదేవి నదీ స్నానానికి వెళ్ళి అప్సరసలతో జల క్రీడలాడుతున్న చిత్రరథ గంధర్వుని చూచి కామమోహితురాలై కొంతసేపు వారిని కన్నార్పక తిలకించి పతి హోమార్చనకు ఆలస్యము చేసింది. జమదగ్ని ఆమెపై ఆగ్రహించి తల్లి శిరస్సును నరికి వేయమని కొడుకులను ఆజ్ఞాపించాడు. వారెవరూ మాతృ హత్యకు ఉపక్రమింపక పోయేసరికి జమదగ్ని చిన్న కొడుకును రాముని పిలిచి నాయనా! నామాట తప్పిన నీ అన్నలను కూడ నీ తల్లితో పాటు హతమార్చి నాకు సంతోషాన్ని కలిగించు అని ఆదేశించాడు. తండ్రి ఆనతిని పాటింపకపోతే తనకూ ముప్పేనని, ఆయనకు సంతోషాన్ని కలిగిస్తే మృతులను జీవింపజేయగలడని ఆలోచించి రాముడు పితృవాక్యానుసారం వారిని వధించి, మళ్ళీ ఆయన కరుణ వల్ల తల్లి తోబుట్టువులను బ్రతికించుకొన్నాడు.

పరశురాముని చేతిలో పరాజితులైన హైహయరాజు సుతులు జమదగ్ని ఇంటికి రహస్యంగా వెళ్ళి రేణుకను అవమానించి, జమదగ్ని శిరస్సును ఖండించి వెళ్ళారు. వారితో వైరం పూనిన పరశురాముడు రాజుల నీచప్రవర్తనకు జుగుప్స కలిగి ఇరవైఒక్కమార్లు భూమండలంలోని రాజులనందరినీ సంహరించి, భూతలాన్ని నిఃక్షత్రియం కావించాడు.

శమంత పంచకానికి వెళ్ళి యుద్ధంలో మరణించిన రాజుల రక్తాన్ని తొమ్మిది మడుగులు చేసి తండ్రి శిరస్సును శరీరానికి సంధించి పితృ శ్రాద్ధాన్ని నిర్వర్తించాడు. సర్వ దేవాత్మకుడైన శ్రీమన్నారాయణుడు తానే కనుక, తననే యజ్ఞేశునిగా భావించి, యాగం చేశాడు. హోమాంతంలో హోతకు తూర్పును, అధ్వర్యునికి పశ్చిమదిక్కును, ఉద్గాత్రునికి ఉత్తర దిక్కును, ఆర్త్విజ్యానికి అవాంతరదిశలను, బ్రహ్మకు దక్షిణదిక్కులను, కశ్యపునికి మధ్య దేశాన్ని, ఉపద్రష్టకు ఆర్యావర్తాన్ని సదస్యులకు శేషభూమిని దక్షిణలుగా సమర్పించి సరస్వతీ నదీలో అవభృథ స్నానం ఆచరించాడు.

ఈవిధంగా పరశురాముడు భక్తి శ్రద్ధలతో ఆచరించిన పితృ శ్రాద్ధం వలన పుణ్య భోగశరీరాన్ని పొంది జమదగ్ని సప్తర్షి మండలంలో ఏడవ వానిగా విరాజిల్లాడు. పితృభక్తి పరాయణుడైన భార్గవ రామునికి సావర్ణి మన్వంతరంలోని సప్తర్షిమండలంలో స్థానం లభించింది.

## 12.4. బ్రహ్మాండపురాణములో – పరశురామ వృత్తాంతము

రేణుక జమదగ్నులకు జన్మించిన పరశురాముడు ఒకరోజు తండ్రి అనుమతి తీసుకొని పరశురాముడు తాతగారైన ఋచీకుని ఆశ్రమమునకు వెళ్ళి అచట కొన్ని రోజులుండి ఔర్వుని ఆశ్రమమునకు వెళ్లాడు.

ఆ ఆశ్రమమున కొన్ని రోజులుండి ఆ ముని వద్ద సెలవు తీసికొని పరశురాముడు జమదగ్ని పితామహుడగు భృగుముని ఆశ్రమమునకు రాగా, పరశురాముని తేజస్సునకు తాళలేక భృగుముని శిష్యులు కనులు మూసికొనిరి. భృగువాతని నాదరించి పుత్రక! నీకును, మాకును హితముగు దానినొకటి చెప్పెద, అది లోక హితము. నీవు హిమాచలమున కేగి శివుని గూర్చి తపసు చేయుము. నీ కోర్కెలు ఫలించును. అని చెప్పగా, పరశురాముడు హిమాచలమునకేగి తపమాచరించాడు. అతని నిశ్చల తపమును జూచి మునులు విస్మితులగు చుండిరి. ఇతని తపస్సు పరీక్ష చేయుటకు శివుడు వ్యాధుని రూపమున వచ్చి

గట్టిగ నలుచుచు, నీవెవ్వడవు?. ఇటకేల వచ్చితివి? అని యడిగిన కొంతసేపునకు రాముడు కన్నులు తెఱచి వినయముగ ప్రత్యుత్తర మిచ్చాడు. అయినను వ్యాధుడు వెళ్లకపోవుటచే ఓయీ! నీవు నా దగ్గర నుండిన నాకు దోషమగును. దూరముగ పొమ్ము. పోలేని నీవు కూడ ఇక్కడ కూర్చుండి తపస్సు చేసికొనుము. అని పరశురాముడు పలికాడు. అపుడా యిరువురికి వాదోపవాదము జరిగింది. తుదకు ఆ వ్యాధుడెవరో మహానుభావుడై యుండునని పరశురాముడు తెలుసుకొని ఆ వ్యాధునకు సాష్టాంగ ప్రణామములాచరించాడు. రాముని భక్తికి మెచ్చుకొని లేవదీసి రామా! నీవింకను చిన్నవాడవు. రౌద్రాస్త్రము భరింపశక్తి నీకింకను జాలదు. తీర్థ యాత్రలు చేసి రమ్ము అని చెప్పి శివుడంతర్ధానము నొందాడు. రాముడు తపమాపి తీర్థయాత్రలు సేవించి తిరిగి యథాస్థానమునకు వచ్చి తపమాచరించుచున్నాడు. ఇట్లుండగ ఇంద్రాది దేవతలు శివుని దగ్గరకు వెళ్ళి దేవా! దానవులు మా నగరము ధ్వంసము చేయుచున్నారు. నీవే మాకు దిక్కు రక్షింపుమని వేడిరి. పరశురాముని తీసికొని రమ్మని శివుడు మహోదరుడను వానిని పంపాడు. అంతట ఆ మహోదరుడు రాముని తీసుకురాగా, అపుడు కైలాసవాసుడు రామా! నీవింద్ర నగరమునకు పోయి దానవులను వెడలగొట్టి రమ్మని శివుడు చెప్పగా, అంతట రాముడు దేవా! నీకు తెలియనిదేమున్నది? దానవులు శక్తి సంపన్నులు వారిని నేనెట్లు జయించగలను? అని రాముడు పలుకగ అపుడు శివుడు 'పరశు' అను అస్త్రమును రామునకిచ్చాడు. మరియును శివుడు తన తేజస్సును రామునందు ప్రవేశపెట్టాడు. రాముడింద్ర నగరమునకు పోయి దానవుల నటనుండి తరిమి దేవతలకు ఆ పట్టణమప్పగించి తన స్థానమునకు పోయి యథాప్రకారము తపమాచరించాడు. శివుడతని భక్తికి మిక్కిలి మెచ్చుకొని నిశ్చల భక్తిని, భార్గవాస్త్రమును అతనికి ప్రసాదించాడు. (ఈవిషయము భారతమునందు వివరింపబడింది.)

పిమ్మట తల్లిదండ్రులను జూచుటకై వచ్చుచు మార్గమందు ఒక బ్రాహ్మణ బాలకునిపై దుముకుచున్న పులిని బాలుని రక్షించు నుద్దేశముతో పులిపై

బ్రహ్మాస్త్రము ప్రయోగించాడు. పులి క్రిందపడి గంధర్వరూపమున వచ్చి నమస్కరించి శాపవశమున పులినై యుంటినని చెప్పి గంధర్వ లోకమునకు వెళ్ళాడు. భయముచే వణుకుచున్న బాలునకు అభయమిచ్చాడు.

ఆ బాలుడు శాంతుడను ముని కుమారుడు అకృతవ్రణుండని అతని పేరు. ఇతడు రామునకు శిష్యుడును,మిత్రుడును అయ్యాడు.అకృతవ్రణుని వెంట పెట్టుకుని రాముడు భృగువు ఆశ్రమమునకు, ఔర్వ, ఋచీకుల ఆశ్రమములకు వెళ్లి వారిని సంతోషింపజేసి తిరిగి జననీజనకుల వద్దకు వెళ్ళాడు. వారికి తాను చేసిన కార్యములన్నిటిని నివేదించాడు.

ఒకరోజు కార్తవీర్యార్జునుడు దైవయోగమున వేటకై అడవిలో సంచరించుచు జమదగ్నిమహర్షి ఆశ్రమముచేరి ఆతనిని దర్శించాడు. జమదగ్ని-మహర్షి రాజును, సేవకులను ఆకలితో యుండుట చూచి వారిని పూజించి తన హోమధేనువును రప్పించి యిష్టాన్నములు కురిపించగా, కార్తవీర్యార్జునుడు బ్రహ్మానందముతో షడ్రసోపేతమైన పదార్థములను భుజించి, తన పురమునకు వెళ్ళాడు.

కాని, ఆ ధేనువుపై గల మక్కువచే దానిని తీసుకురండని కార్తవీర్యార్జునుడు తన భటులను ఆదేశించాడు. వారు జమదగ్నితో యుద్ధమునకు సిద్ధపడిరి. జమదగ్ని సురభితో ఈ విషయము తెలుపగా వెంటనే ఆ సురభి తన రోమకూపముల నుండి మహావీరులగు సైనికులు, ఉత్తమ రథాశ్వములు వెలువడి కార్తవీర్యుని సేనలతో పోరాడిరి. కార్తవీర్యుని సైనికులు సంహరింపబడగా, ఆ సంగతి తెలిసికొని ససైన్యుడై వచ్చి స్వయముగా జమదగ్నితో పోరాడినాడు. కార్త వీర్యార్జునుడు రెండు మూడు పర్యాయములు ఓడిపోయాడు. ఈ ప్రకారముగా ఇరువది పర్యాయము లోడిపోయి ఇరువది ఒకటమారు సురభి వాక్యమును విస్మరించిన జమదగ్నిని సంహరించి, సురభిని వెదకగా ఆ కామధేనువు అతనికి లభింపక ఇంద్రుని కడకుపోయి సురక్షితముగా నుండినది.

కార్తవీర్యార్జునుడు రిక్త హస్తములతో నింటికి పోయాడు. రేణుకాదేవి భర్తతో సహగమనము చేయనుండ ఆకాశవాణి వలదని వారించింది.

ఇంతలో పరశురాముడు అరణ్యము నుండి ఆశ్రమమునకు రాగా, హైహయనునిచే చంపబడిన తండ్రి శవముపై పడియేడ్చుచున్న తల్లిని చూచాడు. ఆమె దుఃఖముతో ఇరువది ఒక్కమారులు గుండెలు బాదుకొన్నది. ఆమెనోదార్చి నిష్కారణముగ తన తండ్రిని హైహయుడు చంపాడు. కావున ఇరువది యొక్క మారులు క్షత్రియులను వధింతునని రాముడు శపథము చేసి తండ్రికగ్ని సంస్కారము చేయబోయాడు. ఇంతలో భృగుమహర్షి వచ్చి మంత్రపూత జలమును చల్లి జమదగ్నిని బ్రతికించాడు. పరశురాముడట్లు బ్రతికిన తన తండ్రికి ఉపచారములు చేయుచూ తన శపథమును తెలియజేశాడు. అంతట జమదగ్ని కుమారుని శాంతచిత్తుని జేయచూచాడు. కాని అకారణముగ వధించువారిని ఊరక విడువరాదని రాముడు పలికాడు. పట్టినపట్టు విడువని కుమారుని జూచి నీవు బ్రహ్మకడకు పోయి, ఆ బ్రహ్మ చెప్పిన ప్రకారముగ జేయుమని తండ్రి ఉపదేశించాడు. రాముడంత బ్రహ్మ వద్దకు వెళ్ళి విషయము తెలియజేయగా, అపుడా బ్రహ్మ తాను జేసిన సృష్టి యందలి క్షత్రియులందరిని వధింపబడుటకు అంగీకరింపలేక బ్రహ్మ యేమియు జెప్పలేక పరమేశ్వరుని కరుణ లేనిచో నీకిది సాధ్యము కాదు. కావున నీవు ఈశ్వరుని వద్దకు వెళ్ళుము.

పరశురాముడు పరమేశ్వరుని సమీపించి ప్రార్థించాడు. శివుని కృప యుండినచో నీవు చేయజాలని దేమున్నది? అయిన నీకస్త్రములు లేవే?. యని పార్వతి పలికినది. శివుడు అతనికి అస్త్రములను, కవచమును యిచ్చాడు. వానిని తీసుకొని వచ్చుచు, ఒక కొలను గట్టున పెట్టి పరశురాముడు జపము చేసుకొనుటకు కూర్చున్నాడు. ఇంతలో రెండు మృగములు వేటగానిచే తరుమబడినట్లు పరుగిడి వచ్చి ఆ కొలను జేరి నీరు త్రాగినవి. గాని వ్యాధుడెవడును రామునకు గోచరింపలేదు. అంత మృగము మృగికిట్లనియె. ఈ జపము చేయుచున్నవాడు పరశురాముడు. మనకిక ఆపద రాదు. ఇతడిపుడు

కృష్ణ కవచమునకై తపస్సు చేయుచున్నాడు. అగస్త్యాశ్రమమునకేగి కృష్ణామృత స్తోత్రమును వినినగాని అది లభింపదు. ఆమాటలు పరశురాముడు విని ఆశ్చర్యమొంది అగస్త్యాశ్రమమునకు వెళ్ళి, కృష్ణ స్తోత్రమును విని ధన్యుడయ్యాడు. మృగములు గూడ పరశురాముని వెనుకనే వెళ్ళి కృష్ణ స్తోత్రమును వినుటచే స్వర్గలోకమును పొందాయి.

పరశురాముడు శ్రీకృష్ణుని ప్రార్థించగా, అతడు ప్రత్యక్షమై తన తేజంబు నిచ్చాడు. ఇప్పటినుండి నా యంశము నీయందుండును. దీనిని తిరిగి నేను రఘురామునిగ అవతరించి, విశ్వామిత్రుని యజ్ఞమును చూచి, సీతను పరిణయమాడి వచ్చునపుడు గైకొందునని పల్కి కృష్ణుడు అంతర్ధానమయ్యాడు.

తరువాత పరశురాముడు నర్మదయందు స్నానము చేసి కార్తవీర్యార్జుని నగరమునకేగి జమదగ్ని సుతుడు పరశురాముడు నిన్ను వధించుటకై వచ్చియున్నాడని దూతచే రాజునకు వర్తమానము పంపాడు. కార్తవీర్యార్జునుడు బ్రాహ్మణుడడిగిన లేదనను యుద్ధమడిగిన వానికి యుద్ధమిచ్చెదను. అని దూత చేతనే ప్రత్యుత్తరము పంపి యుద్ధమునకు సంసిద్ధులుకండి అని రాజు సేనానులకాజ్ఞ యిచ్చాడు. కార్తవీర్యుని సేనలు పరశురామునిపై యుద్ధమునకు రాగా శివుడొసంగిన పరశువుచే రాముడు వారిని చిందరవందర చేశాడు. మత్స్యరాజువచ్చి యుద్ధము చేసి మరణించాడు. మగధ నిషాదరాజులును, విదర్భ నృపతియగు సోమదత్తుడును, మిథిలాధిపతియగు బృహద్బలుడును, రామునితో యుద్ధము చేయవచ్చిరి. కన్యాకుబ్జాధీశ్వరుడు సౌరాష్ట్రాధిపతి, అవంతి వీరలు ఒక్కసారిగా శరములతో రాముని ముంచివైచిరి. వానినన్నిటిని చెదరగొట్టి రాముడు రాజులను సంహరించాడు. సుచంద్రుడు ద్వంద్వయుద్ధము చేసి శివుని త్రిశూలమును రామునిపై విసిరాడు. అది పుష్పమాలికయై రాముని కంఠమలంకరించెను. రామునకు కాళి ప్రత్యక్షమై ఆగ్నేయాస్త్రముచే సుచంద్రుడు హతుడగునని చెప్పి అదృశ్యమయ్యెను. సుచంద్రుని పిదప వాని కుమారుడు

పుష్కరాక్షుడు వచ్చి యుద్ధము చేసి మృతుడయ్యె. అంతట కార్తవీర్యార్జునుడు స్వయముగావచ్చి యుద్ధమునందు త్రిశూలముతో గొట్టగ రాముడు నేలకూలాడు. ఇంతలో దేవతలందరయి వచ్చిరి. శివుడు సంజీవనిచే పరశురాముని బ్రతికించాడు. రాముడులేచి శివకవచము పఠించి కార్తవీర్యునిపై బాణము వేసి వాని శిరస్సును త్రుంచాడు. అతని పుత్రులను సంహరించాడు. అట్లు క్షత్రియ వీరులను సంహరించిన పిదప నర్మదానదియందు స్నానము చేసి ఆచమించి రాముడు కైలాసమున శివుని మందిరమున ప్రవేశించుచుండగా, విఘ్నేశ్వరుడు అడ్డగించి ఈశ్వరుడు పార్వతితో శయనించి యున్నాడు. నీవిపుడు వెళ్లుటకు వీలు లేదని పలికాడు. అంతట పరశురామునకు, విఘ్నేశ్వరునకు వివాదము జరిగి యుద్ధమునకు సంసిద్ధులైరి. విఘ్ననాయకుడు తన తొండముతో పరశురాము నెత్తగ, అతనికి 14 లోకములు గోచరించినవి. అతనికి భయమయ్యెను. వినాయకుడు చేసిన పరాభవము సహింపలేక రాముడు తన పరశువుతో దంతముపై కొట్టగా, గణేశ్వరుని దంతమొకటి విరిగి క్రిందపడింది. ఆ చప్పుడు విని దేవతలు భయపడిరి. పార్వతియు శివుడును బయటకు వచ్చి చూచిరి. విఘ్నేశ్వరుడు తనకు గలిగిన యాపదను జెప్పుకొన్నాడు. మనవల్ల ఉపకారమొందిన వాడిట్లు నా పుత్రుని గొట్టునా? యని పార్వతికి కోపము వచ్చింది. శివుడేమియు చేయలేక కృష్ణుని దలచుకొన్నాడు. శ్రీకృష్ణుడు వచ్చి పార్వతినోదార్చి పరశురాముని మన్నించి పుత్ర భావమున జూడుమని వేడుకనగా, అంతట పరశురాముడు పార్వతీదేవిని ప్రార్థించాడు.

అచ్చట నుండి పరశురాముడు తన గృహమునకు వెళ్ళి తండ్రికి నమస్కరించి తాను జేసిన కార్యములన్నియు తెలియజేశాడు. రాజులందరిని చంపిన పాతకము పోవుటకై మహేంద్రనగరమునకేగి కొన్ని సంవత్సరాలు తపస్సు చేయమని తండ్రి ఆదేశించాడు. ఆ ప్రకారము పరశురాముడు తపస్సు చేసికొనుచు కొంతకాలము జరిగిన పిమ్మట కార్తవీర్యార్జుని పుత్రుడొకడు తన తండ్రిని చంపెననియు,తన తల్లి సహగమను చేసేననియు మిక్కిలి యార్తి నొంది సకలక్ష్మా

నాథులను వధించి వారి రక్తముచే పితృతర్పణము చేసెదనని శపథము చేసి కార్తవీర్యార్జుని పుత్రులను, రాజులనందఱను వధించి యింకను కోపమాగక ఆగ్నేయాస్త్రము వేసి కార్తవీర్యార్జుని పురమును కాల్చివేశాడు.

పరశురాముడు పితరులకు తర్పణము లిచ్చుచుండగ వారు "నాయనా! నీవు చేసిన పాతకమింకను పోలేదు. వ్రతమాచరింపుము. అని పలుకగా, అంతట అతడు మహేంద్ర పర్వతమున కెళ్ళి తపమాచరించాడు. ఆ ప్రకారముగా తపమాచరించుచుండగా, మునులు వచ్చి అశ్వమేధమును చేయుమనిరి. అశ్వమేధ యాగమును చేయ ప్రారంభించాడు. మునులు చూడవచ్చిరి. వచ్చిన వారిని కుశలమడుగగ గోకర్ణక్షేత్రము సముద్రముచే ముంచబడినదని తెలియజేసి దానినుద్ధరింపవలసినదని వేడిరి. మునీంద్రులారా! నా తండ్రి ఆజ్ఞచే వ్రతము చేయుచున్నాను. ఇపుడు నేను బాణములెట్లు ప్రయోగించగలను? అని రాముడు సందేహించుచుండ, శుష్కుడను ముని దానివల్ల పాపమురాదని తెలియజేశాడు. పరశురాముడు మునుల కోరిక నెరవేర్చదలచి సముద్రుని సమీపించి ఓ వరుణదేవా! గోకర్ణము వీడి అవతలకు పొమ్మని వరుణుని పిలిచాడు. కాని వరుణుడు రాలేదు. శాంతము తోడనే రాముడు మరల పిలిచాడు. అపుడును రాలేదు. పరశురాముడంతట ఆగ్నేయాస్త్రమును ప్రయోగించగా, అగ్ని యంతటా వ్యాపించింది. సముద్రుడు భయపడి రాముని శరణువేడి, నీవెంత దూరము పొమ్మనిన అంత దూరము పోయెదనని అనతిమ్మని పలికాడు. అపుడు పరశురాముడు ప్రదేశమును చూపుటకై రాముడు స్రువమును విసిరాడు. అది రెండు యోజనముల దూరమున పడినది. అంత ప్రదేశము నుండి సముద్రము తొలగిపోయెను.

### 12.5 ఆదిపర్వములో - పరశురాముని నుండి ద్రోణాచార్యుడు అస్త్ర శస్త్రములను దానముగా పొందుట.

నిరంతర దారిద్ర్యంతో సతమతమవుతున్న ఆ ద్రోణాచార్యుడు,

పరశురాముడు బ్రాహ్మణులకు తృప్తి కలిగే విధంగా ధారాదత్తం చేసి తపోవనానికి తరలిపోతున్నాడన్న వార్త ద్రోణుడు విని ఆ మహనీయుని సన్నిధికి పోయి తన దైనందిన సంసార యాత్రకు అవసరమైన ధనం సంపాదించుకోవలెనని నిశ్చయించుకొన్నాడు. ధర్మపత్ని కృపితో ఆ విషయం సంప్రతించి ఆ మరునాడే భార్గవరాముని సందర్శించి మహాత్మా! భరద్వాజమహర్షి కుమారుడను నేను ధనార్థినై తమ సాన్నిధ్యం చేరుకొన్నాను. నన్ననుగ్రహించవలసిందని వేడుకొంటున్నాను అని ప్రార్థించాడు.

ఆ పరశురాముడు అదే సమయంలో తపోనిష్ఠకై మహేంద్రగిరికి ప్రయాణమవుతున్నాడు. ద్రోణుని ప్రార్థన విని పరశురాముడు ఈవిధంగా అనుగ్రహించాడు.

**హిరణ్యం మమ యచ్చాన్యద్వసు కించిదిహ స్థితమ్ ।**
**బ్రాహ్మణేభ్యో మయాదత్తం సర్వమేతత్తపోధన ॥**
**తథైవేయం ధరాదేవీ సాగరాన్తా సపత్తనా ।**
**కశ్యపాయ మయాదత్తా కృత్స్నా నగరమాలినీ ॥**
**శరీరమాత్రమేవాద్య మమేదమవశేషితమ్ ।**
**శస్త్రాణి చ మహార్హాణి శస్త్రాణి వివిధాని చ ॥** 130-61,62,63

నాయనా! నా వద్ద నున్న కాంచన గవాశ్వాది ధనంసపత్తి అంతయు బ్రాహ్మణులకు ఇంతకు పూర్వమే దానం చేశాను. చతుస్సాగరవేలా వలయితమయిన సమస్త భూమండలము కశ్యపమహర్షికి అర్పించాను. ఇక శస్త్రాస్త్రాలు, శరసంపత్తి, శరీరము మాత్రమే శేషించి ఉన్నాయి. వీనిలో నీకేమి కావలెనో కోరుకో వెనువెంటనే నీకు అవి ప్రసాదిస్తాను.

ద్రోణుడదే మహద్భాగ్యమని భావించి పరశురామా! ఆ శస్త్రాస్త్రాలే అత్యుత్తమమయిన ధనం! అవే నాకు అనుగ్రహించవలెనని కోరుకొంటున్నాను అని విజ్ఞప్తి చేసుకొన్నాడు. పరశురాముడు అప్రకారంగా నయినా ద్రోణుని

కోరిక నెరవేర్పగలిగినందులకు ఎంతో ఆనందించి ప్రయోగ ఉపసంహార మంత్రాలతో అపూర్వ శస్త్రాస్త్రాలెన్నో కటాక్షించాడు. ద్రోణుడవి సవినయంగా స్వీకరించి, పరశురాముని అనుమతి పొంది తిరిగి భరద్వాజ ఆశ్రమానికి మరలిపోయాడు.

**12.6. ఉద్యోగపర్వములో – పరశురాముడు దుర్యోధనునకు హితము బోధించుట**

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో మరియు కౌరవసభనుద్దేశించి ప్రసంగిస్తూ పాండవులకు తగినట్లుగా వారి భాగమును వారికిచ్చి తరువాత పుత్రులతో గూడి కృత్యుడవై భోగములననుభవించుము. ధర్మరాజు పెద్ద ధర్మమున నున్నవాడని నీకు తెలియనిదికాదు. శాంతుడగు వానికి కోపము గలిగిన ఈ ప్రపంచమంతయు భస్మము కాగలదు. నేను గూడ వారికిని నీకును శ్రేయస్సును కోరుచున్నాను. లోభమునందు మిక్కిలి ఆసక్తులగు నీపుత్రులను నిగ్రహించుము. పాండవులు నీకు సేవచేయుటకును, లేక మీతో యుద్ధము చేయుటకును సిద్ధముగా నున్నారు. ఓ రాజా! ఈరెండింటిలో నీకేది శ్రేయస్కరమో దానిని అవలంభించుము. ఓ రాజులారా! ఇచ్చటికి విచ్చేసిన ఓ మునులారా! మీరు గూడా వీరికి మీశక్తి కలది బోధింపుము. రాజులందరును ఆ శ్రీహరి వాక్యములను హృదయ పూర్వకముగ పూజించారు. అంతట పరశురాముడు దుర్యోధనునితో ఈ వాక్యము పలికాడు.

సుయోధనా! పూర్వజన్మలో కృష్ణార్జునులెవ్వరో గ్రహించుకోలేక నీవు ఎడతెగని దురాగ్రహంతో సంధి మాటే తలపెట్టరాదని.భీష్మించుకొని కూర్చున్నావు. నాయనా! నీకిది క్షేమంకరమైన మార్గం కాదు. వారి పూర్వ వృత్తాంతం తెలియజేస్తాను. సావధానముగా వినిన పిమ్మట సముచిత కర్తవ్యమేదో నిర్ణయించుకొనుము.

దంభోద్భవుడు అనే పేరుగల రాజు ఉండేవాడు. భుజబలంలో పరాక్రమంలో ఆయనకు సాటివచ్చేవారు లేరు. ఆ రాజు అంతటి మహాయోధుడు.

ఆయన రోజూ ఉదయం లేచి, కాలకృత్యాలు పూర్తి కాగానే బాగా అలంకరించుకొని రత్నకిరీటం ధరించి, సభాభవనానికి వచ్చి, బంగారు సింహాసనం అధిష్ఠించి తన కొలువులో వున్న వారందరితో ఈ భూలోకంలో ఎవడయినా నాతో యుద్ధం చేయగల మహావీరుడున్నాడా? అస్త్రశస్త్రాలతో నన్ను ఎదుర్కోగల వీరుడుంటే చెప్పండి. అంతేకాదు. మల్లయుద్ధం చేయగల వీరుడుఉన్న వాడిని క్షణంలో కడతేరుస్తాను. అని గర్వంగా నవ్వుతూ భుజాలు ఎగురవేసేవాడు. ఆయన బలపరాక్రమాలెరిగిన వారెవరూ యుద్ధానికి దిగేవారు కారు. నానాటికీ అహంకారం పెరుగుతూ వచ్చింది.

అలా ఉండగా ఒకనాడు ఆయనను చూడడానికి సభా భవనానికి వచ్చిన దూరదేశీయులైన విప్రులు మహారాజా! మీరు నిజంగా మహావీరులే బల పరాక్రమ సంపన్నులే అయితే గంధమాధన పర్వతం మీద నర నారాయణులని ఇద్దరు తీవ్రనిష్ఠతో తపస్సు చేస్తున్నారు. వారిని జయించగల వీరులు మూడు లోకాలలో లేరని విన్నాము. తమకు కోరిక ఉంటే వారితో యుద్ధం చేయవచ్చు అన్నారు. అంతట ఆ రాజు చతురంగ బలాలను సన్నద్ధం చేసి ధనుర్బాణాలు తీసుకొని బయలుదేరి గంధమాదన పర్వతం చేరుకున్నాడు.

ప్రశాంతంగా ఉన్న వనంలో వారు తపస్సు చేసుకుంటున్నారు. ఆ రాజు వారిని సమీపించి, యుద్ధానికి పిలిచాడు. ఆ నరనారాయణులు తమ ఆశ్రమానికి వచ్చిన మహారాజుకి సత్కారాలు జరుపబోగా, ఇవన్నీ అనవసరం, యుద్ధానికి రావాలని పలికాడు. ఎవరితోనూ సంబంధం లేకుండా కళ్ళు మూసుకొని యీ ప్రశాంత ప్రదేశంలో తపస్సు చేసుకునే మునులము. మాతో యుద్ధం చేయాలనే కోరిక ఎందుకు కలిగింది మీకు, అన్నారు. వినలేదు మహారాజు యుద్ధం చెయ్యక తప్పదు అన్నాడు.

నరుడది గమనించి అలవోకగా నవ్వి పిడికెడు దర్భలు అభిమంత్రించి చతురంగసేనపై ప్రయోగించాడు. వెనువెంటనే ప్రాదుర్భవించిన తీవ్ర నారాచ

జ్వాలలతో ఆ సేనావాహిని నిమేష కాలంలో నామమాత్రావశిష్టమై రూపుమాసిపోయింది.

అపుడా రాజు ఆయుధాలన్నీ క్రిందపెట్టి, ఋషులైన నరనారాయణుల పాదాల మీద వ్రాలి ఆర్యా! నన్ను క్షమించి అనుగ్రహించండి. నా గర్వానికి ప్రాయశ్చిత్తం అయింది. అని దీనంగా ప్రార్థించాడు. అపుడు వారు నవ్వుతూ మహారాజా! సిరిసంపదలు కలవారు పేదసాదలకు దాన ధర్మాలు చేసే గొప్పవారు కావాలి. అలాగే బలపరాక్రమాలు ఉన్నవారు దుర్మార్గుల బారి నుండి సజ్జనులను రక్షించడానికి ఆశక్తిని వినియోగించాలి. అంతేకాని, అహంకారము ఉండకూడదన్నారు.

సుయోధనా! ఆ నరనారాయణులే అవనీతలిపై వాసుదేవార్జున నామధేయాలతో ప్రాదుర్భవించారు. ప్రస్తుతం నీవు ఆ దంభోద్భవుని వలెనే శ్రీకృష్ణార్జునులతో తలపడవలెనని అహంకరిస్తున్నావు. అవశ్యం నీకది అపకారణం కాగలదు. కనుక నా హితవు ఆలకించి పాండవేయులతో సంధికి అంగీకరించవలసింది. ఇందువల్ల జగద్విఖ్యాతమయిన భరతవంశం వర్ధిల్లగలదు.

> యస్య నారాయణో బంధురర్జునో దుస్సహో యుధి ।
> కస్తముత్సహతే జేతుం త్రిషులోకేషు భారత ॥ 96-46

ఎవరికి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు బంధువో యుద్ధమున దుస్సహుడగు అర్జునుడు కలడో వానిని జయించుటకు మూడలోకముల యందును ఎవడుత్సాహపడును?

పరశురాముని వాక్యమును విని కణ్వమహర్షి దుర్యోధనునితో ! ఓ దుర్యోధనా! పరశురాముని వాక్యమును పరిపాలించుము. ఆలస్యము చేయవద్దు అని పలికాడు.

## 12.7. ఉద్యోగపర్వములో - భీష్మ పరశురాముల ద్వంద్వ యుద్ధము

ఇటు భీష్ముడు నిరాకరించడంతో, అందను సాళ్వుడు అంగీకరించక

పోవడముతో తండ్రి వద్దకు కూడా పోలేకపోయింది. తన యీ దురవస్థకు కారణం భీష్ముడే అని తలచి అంతట ఆమె అరణ్యములో తపమాచరించి తపః శక్తితో భీష్మున్ని ఓడించవలెనని నిశ్చయించుకొని, అరణ్యమునకు బయలుదేరింది.

అచట ఆ హోత్రవాహనుడను రాజర్షి అంబ విషయమంతా తెలుసుకొనిన తరువాత ఈమె నా దౌహిత్రి అని తెలుసుకొని ఆమెను ఓదార్చదలచి, అమ్మా! ఈవయస్సులో నీకీ తపశ్చర్య ఏల? భార్గవరాముడు శరణన్న వారిని ఎవ్వరినయినా సరే ఆదరించి సంరక్షిస్తున్నాడు. అని పలకగా, అదే సమయంలో పరశురాముని శిష్యుడు అకృతవ్రణుడు రాగా, ఆ తపోనిధులు అర్పించిన అతడి పూజలు అందుకొన్నాడు తరువాత హోత్రవాహనుడు అంబ వృత్తాంతమును అకృతవణునకు తెలియజేశాడు.

హోత్రవాహనుడు అతనిని కుశలప్రశ్నలతో ఆదరించి పరశురాముడు ఇప్పుడు ఎచటని వసిస్తున్నాడు? అని ప్రశ్నించగా, అకృతవ్రణుడు అంజలిఘటించి మహాత్మా! ఆ పరశురాముడు నిన్ను ఒకమారు చూడవలెనని సంకల్పముతో రేపు ఉదయమే ఇచ్చటికి విచ్చేయుచున్నాడని విన్నవించాడు. పిమ్మట ఆమె వృత్తాంతాన్ని తెలియజేయగా అప్పుడు ఆమెతో భీష్ముడు పరశురాముని శిష్యుడు అతడు పరశురాముని వద్ద అస్త్ర విద్యాభ్యాసం చేసియున్నవాడు. పరశురాముడు చెప్పిన భీష్ముడు తప్పక వినునని తెలియజేశాడు.

పరశురాముడు మరుసటి రోజు ప్రాతఃకాలమున రాగా, అర్ఘ్య పాద్యము లిచ్చి సత్కరించి ఇరువురు గడచిన వృత్తాంతము చెప్పుకొనిరి. తరువాత అంబ నుద్దేశించి మహాత్మా! ఈమె నా దౌహిత్రి అని పలికి ఆమె విషయమంతా తెలియజేశాడు. పరశురాముడు అది విని రాజపుత్రీ! నీదారుణ అవమానం రెండు విధాల నాకు అవగతమయినది. భీష్మునికిగాని, సాళ్వునికి గాని, నిన్ను ఆదరంతో స్వీకరించి పరాభవ వేదన తొలగించవలసినదని ఆదేశించగలను. ఈ ఉభయ మార్గాలలోను నీకు అభీష్టమయినదేది? అని ప్రశ్నించాడు. అపుడామె

మహాత్మా! సాళ్వుడు ఇక నన్ను స్వీకరించడు. ఎవనివలన నాకింత దుఃఖము కలిగెనో ఆ భీష్ముని వధింపుము అని పలికింది.

పరశురాముడు ఆమె మాటలను విని అంబా! భీష్ముడు నా ఆనతి తప్పక శిరసావహించగలడు. ఒకవేళ వ్యతిరేకించిన యెడల బాణపరంపరలతో నిమేషకాలంలో నేలపై కూల్చివేయగలను. అని ఆమెను ఓదార్చి మరి కొందరు మునీంద్రులతో, అంబతో ప్రయాణమై, కురుక్షేత్రం చేరుకొని, ఒకముని ముఖతః రాకను భీష్మునకు తెలియజేశాడు. సరస్వతీ నదీతీరంలో పరివారసహితుడై విడిది ఏర్పరచుకొనగా, వెంటనే భీష్ముడు పరశురాముని సమీపించి సత్కరించి, నమస్కరించి కుశల ప్రశ్నలతో ఇష్టా గోష్ఠి ప్రారంభించాడు.

పిమ్మట పరశురాముడు అంబవిషయాన్ని ప్రస్తావిస్తూ, నీవు ఈమెను హస్తినాపురికి తీసుకొని పోయినావు. కాని వెనువెంటనే పరిత్యజించావు. నీవంటివానికి ఇది తగదు.జరిగిపోయింది ఏదో జరిగిపోయింది గాని, ఇకనయినా తమ్మునకిచ్చి వివాహం జరిపించవలసింది. అంతేగాని ఈవిధమైన పరిత్యాగం ధర్మ సమ్మతం కాదని ఆజ్ఞాపించాడు. అప్పుడు భీష్ముడు మహాత్మా! ఆమె సాళ్వపతిని ప్రేమించానని, తిరిగి అతని సన్నిధికి పంపించి వేయవలసినదని ఆమె నన్ను వేడుకొన్నది. అందువల్లనే నేను ఆమెను అప్పటికి పంపించాను. ఇంకొకరిని ప్రేమించుచున్న ఆమెను నా సహోదరునికి యిచ్చి వివాహము జరిపించగలనా? అని ప్రశ్నించాడు. మరల పరశురాముడు ఆదేశించాడు. భీష్ముడు తిరస్కరించడముతో అంతట పరశురాముడు కోపముతో అయితే వెంటనే సైన్యాలతో యుద్ధ సన్నద్ధుడవై నన్ను ఎదుర్కొని పోరాడవలసినదని ఆదేశించాడు.

భీష్మ పరశురాముల మధ్య యుద్ధము హోరాహోరిగా సాగుతున్నది. భీష్ముడు పరశురామునిపై వాయవ్యాస్త్రమును ప్రయోగించగా, దానిని కౌబేరాస్త్రముతో మరలించాడు. మరల భీష్ముడు పరశురామునిపై ఆగ్నేయాస్త్రము మంత్రించి ప్రయోగించగా పరశురాముడు వారుణాస్త్రముతో త్రిప్పి కొట్టాడు.

యిరువురును బ్రహ్మాస్త్రములు ప్రయోగించుకొనిరి. చివరగా భీష్ముడు ఎనిమిది మంది వేదవేత్తలు (అష్టవసువులు) చెప్పిన ప్రస్వాపనాస్త్రమును ప్రయోగించబోగా నారదుడు వచ్చి పరశురాముడు తపస్వి, వేదవేత్త, బ్రాహ్మణుడు, నీ గురువు అట్టి వానికెన్నడును నీవవమానము చేయరాదు. అంత పరశురాముడు సంతోషము పొందినవాడై మరలింపబడిన ఆ అస్త్రమును చూచి తెలివిమాలిన నేను భీష్మునకోడితిని అను మాట వెనువెంటనే పలికాడు.

పిమ్మట పరశురాముడు అంబతో నేను నాశక్తి వంచనలేకుండా భీష్మునితో యుద్ధము చేశాను. కాని అతను మహాస్త్రములు ప్రయోగించుట వల్ల నేను ఓడిపోయాను. కావున నీవు భీష్మునినే శరణుపొందుము.

## 12.8. శాంతిపర్వములో – పరశురాముడు కర్ణుని శపించుట

కర్ణుడు పరశురాముని సమీపించి తాను బ్రాహ్మణుడను బొంకి పరశురామునకు సేవచేస్తూ అస్త్ర శస్త్రములను నేర్చుకొనుచున్నాడు.

కర్ణుని యొక్క బాహుబలము, ఇంద్రియ జయము, గురు శుశ్రూష ఇత్యాదులకు సంతుష్టుడై పరశురాముడు బ్రహ్మాస్త్రము ఆ కర్ణునకు ఉపదేశించాడు. ధనుర్వేదయందు కృషి చేయుచు పరశురామ ఆశ్రమమునందు నివసించాడు.

ఒకనాడు పరశురాముడు ఆశ్రమము చుట్టుప్రక్కల కర్ణునితోపాటు తిరుగుచు ఉపవాసము చేత చిక్కి నమ్మకము వలన స్నేహభావము గలవాడై కర్ణుని తొడపై తలనుంచి అలసట చెందిన మనస్సుతో నిద్రించాడు. ఒక పురుగు కర్ణుని సమీపించి నెత్తురుకూడు తిను ఆ పురుగు అతని తొడను తొలువ నారంభించెను. కాని కర్ణుడు గురువునకు నిద్రా భంగమగునను భయముతో దానిని చంపుటకు వీలుగాకుండెను. పరశురాముడు రక్తముతో తడియగా మేల్కొని యిట్లు పలికాడు. నేను మైలపడితిని. నీవు చేసిన దేమి భయపడక ఉన్నదున్నట్లు ఇది యేమోనాకు చెప్పుము. అప్పుడా కర్ణుడు ఆ పురుగు కరచుట గూర్చి

చెప్పాడు. పరశురాముడు ఆ పురుగును చూడగా ఆ పురుగు ప్రాణములు వదలి నల్లని దేహముతో ఆకాశమున నిలచి మునిశ్రేష్ఠా! నీవలన నాకీ నరకము నుండి విముక్తి కలిగినది. నీకు మేలగుగాక! నీకు నమస్కారము. నాకు నీ వలన ప్రియము కలిగినదని పలికాడు.

అపుడా పరశురాముడు నీవెవడవు? ఏకారణమున నీకీ నరకము కలిగింది. అని యడుగగా, అంతట అతను నేను పూర్వము దంశుడను రాక్షసుడను. సత్యము గలవాడను. భృగు భార్యను సంహరించితిని. ఆ మహర్షి శాపము వలన కృమినై పుట్టాను. ఆ మహర్షి శాపవిమోచనము గూర్చి ప్రార్థించగా భృగువంశమువాడగు పరశురాముని వల్ల శాపము పోవునని నాకు చెప్పాడు. ఇప్పుడు నిన్ను కలియుట వలన ముక్తి పొందానని పలికి నమస్కరించి వెళ్ళి పోయాడు.

పిమ్మట పరశురాముడు కర్ణునితో ఓరీ మూఢుడా !

రామః కర్ణం చ సక్రోధమిదం వచన మబ్రవీత్ ।
అతిదుఃఖమిదం మూఢ న జాతు బ్రాహ్మణస్సహేత్ ॥
క్షత్రియస్యైవ తే ధైర్యం కామయా సత్యముచ్యతామ్ ॥ 3-25

అతిదుఃఖకరమైన ఈ పనిని బ్రాహ్మణుడు సహింపలేడు. ఇట్టి ధైర్యము క్షత్రియునకు చెల్లును. నీవెవ్వడవో నిజము చెప్పుము.

తరువాత కర్ణుడు శాపభీతుడై నేను సూతుడను, రాధేయుడని. కర్ణుడని నన్ను లోకులమచుందురు. అస్త్ర లోభమున ప్రవర్తించిన నన్ననుగ్రహింపుము.

కర్ణుడట్లు చెప్పి దీనుడై పాదములపై పడగా, అపుడు పరశురాముడు కోపములో కర్ణునితో...

యస్మాన్మిథ్యోపచరితో హ్యాస్త్ర లోభాదిహ త్వయా ।
తస్మాదేతన్న తే మూఢ బ్రహ్మాస్త్రం ప్రతిభాస్యతి ॥

**అన్యత్ర వధకాలాత్తే సదృశేన సమీయుషః ।**
**అబ్రాహ్మణే నహి బ్రహ్మాధ్రువం తిష్ఠేత్కదాచన ॥ 3-30,31**

ఓ కర్ణా! అస్త్ర లోభమున నీవు నన్ను మోసపుచ్చినావు. కనుక నీవు శూరునితో తలపడి యుద్ధము చేయుచు వధింపబడునపుడు నీకీ బ్రహ్మాస్త్రము స్ఫురింపకుండుగాక! అబ్రాహ్మణుని యందు బ్రహ్మాస్త్రము మరణావధి నిలువదు. అసత్య మాడిన నీకిక్కడ స్థానము లేదు. వెంటనే వెళ్ళుము. అని పలికాడు.

## 12.9. రామాయణములో – పరశురాముని గర్వభంగము

ప్రతాపవంతుడగు ఆ పరశురాముడు ఋషులు యిచ్చిన పూజను స్వీకరించి రామునితో రామా! నీ పరాక్రమము ఆశ్చర్యకరమై వినిపించుచున్నది. నీవు శివుని విల్లు విఱచుట నేను సమగ్రముగా వింటిని. నీవు శివధనస్సు విఱచుట ఆశ్చర్యకరము, ఊహింపరానిది. దానిని విని నేను మంగళకరమగు వేరొక విల్లు తీసుకువచ్చినాను. మా తండ్రి జమదగ్నికి సంబంధించిన యీ గొప్ప వింటిని నీ బాణముతో పూరించుము. నీ బలము జూపుము.

విశ్వకర్మచే చేయబడిన ప్రధానములనగు రెండు ధనస్సులు. త్రిపురాసురులను సంహరించుటకు ఒకటి శివున కీయబడినది. అద్దానిని నీవు విఱిచావు.

మరియొకటి విష్ణు సంబంధమగు ధనస్సు. ఇదియును శివధనస్సుతో సమానమైనది. శివకేశవులకు యుద్ధము జరిగినపుడు శివధనస్సు జడీ భూతము కాగా దేవతలు విష్ణువును అధికముగా తలంచారు. అంతటి మిక్కిలి కోపించిన శివుడు తన వింటిని బాణములను దేవరాత మహారాజుకిచ్చి వెళ్ళినాడు.

శ్రీమహావిష్ణువు తన ధనస్సును భృగువంశమున పుట్టిన ఋచీకున కిచ్చాడు. ఆలా వంశపరముగా ఆ ధనస్సు మాతండ్రి జమదగ్నికి లభించినది. తపోబల సమన్వితుడైన నా తండ్రి ఆయుధములు విడచిపెట్టగా, కార్తవీర్యార్జునుడు

పామర బుద్ధితో నా తండ్రిని చంపాడు. నా తండ్రి మరణమును గూర్చి విని కోపముతో అనేకమార్లు క్షత్రియులను పుట్టినవానిని పుట్టినపుడే చంపుచు, భూమండలమెల్ల జయించి, యజ్ఞాంతమున మహాత్ములగు కశ్యపునకీ భూమి దానము చేసి మహేంద్రపర్వతమునకు వెళ్ళి అచట తపమాచరించుచుండగా, నీవొనరించిన శివధనుర్భంగము గూర్చి విని యిచ్చటకు వచ్చాను. నీతో ద్వంద్వయుద్ధము చేయదనెను. పరశురాముని మాటలను వినిన రాముడు పరశురామునితో ఓ పరశురామా! ఏ పనిచే శత్రు శేషము లేకుండునట్టు చేసి తండ్రి ఋణము తీర్చుకుంటివో ఆ నీ పనిని మేము ప్రశంసించుచున్నాము. క్షత్రియుడైన నన్ను క్షత్ర ధర్మమగు పరాక్రమము లేనివానినిగా అశక్తునిగా అవమానించుచున్నావు. నేడు నీవు నా తేజము, పరాక్రమము చూడుము. అని పలికి పరశురాముని చేతినుండి ధనుర్బాణములు గ్రహించి, వింటినెక్కుపెట్టి, బాణము సంధించాడు. పిమ్మట పరశురామునితో పరశురామా!

బ్రాహ్మణోఽసీతి పూజ్యో మే విశ్వామిత్ర కృతేన చ । బాలకాండ
తస్మాచ్ఛక్తో న తే రామ మోక్తుం ప్రాణహరం శరమ్ ॥76-6

నీవు బ్రాహ్మణుడవగుట చేతను, విశ్వామిత్రునకు, సన్నిహిత బంధువగుట చేతను, నీపై ప్రాణములు తీయ బాణము విడువజాలను.

కాని నీ పాదముల గమనమును లేదా నీవు తపముచే సంపాదించిన పుణ్యలోకములను కొట్టిదను. ఏది నీవు కోరిన దానినే గొట్టెదనెను. అంతట పరశురాముడు శ్రీరాముడు విష్ణువే యని గ్రహించి రామునితో రామా! పూర్వము నేనీ భూమండలమెల్ల కాశ్యపునకు దానమీయగా నాతడీ నాదేశమున నీవు నివసింపకుమని నాకు తెలిపాడు. కాన నేను గురువచనమును పాటించుచు ఈ భూమిపై రాత్రి నివసింపను. నీవు నా పాద సంచారము పోగొట్టదగవు. అపుడు నేను మనోవేగముతో పర్వత శ్రేష్ఠమగు మహేంద్రగిరి కేగెదను. అని పరశురాముడట్లు పలుకగానే రాముడు పరశురామునిపై శ్రేష్ఠమగు బాణము విడిచాడు.

అపుడు పరశురాముడు రామునిచే తాను తపము చేసి సంపాదించిన పుణ్యలోకములు పోగొట్టబడుట చూచి యచటనుండి వెంటనే మహేంద్ర పర్వతమునకు వెళ్ళాడు.

పరశురాముడు భంగపడుటకు కారణము లేక పోలేదు. విష్ణు ధర్మోత్తర పురాణము నందు – పరశురామా! దశరథ రాముడి సందర్శనం అయ్యాక నీవు శస్త్రం పట్టవద్దు. ఎందుకంటే నీ వైష్ణవ తేజస్సు అతనిలో ప్రవేశిస్తుంది. అది సురకార్యం నిర్వహిస్తుంది. నీలో వైష్ణవ తేజస్సు ఉన్నంత కాలమే నీవు శత్రు గణాలను చెండాడగలవు. అని శంకరుడు పరశురాముణ్ణి లోగడ హెచ్చరించడమే దీనికి కారణం. ఒక విష్ణు అవతారం మరో విష్ణు అవతారాన్ని ఓడించిన సందర్భం ఇదొక్కటే!.

## 12.10. పరశురామ వ్యక్తిత్వము

నిర్గుణ స్వరూపుడైన భగవంతుడు అగోచరుడుగా, అదృశ్యంగా వ్యాపించి వుంటాడు. అతడే సగుణ స్వరూపుడై ఇహలోకంలో అవతరిస్తూ వుంటాడు. లౌకిక సృష్టిలోకి వచ్చినపుడు అతనికి 'అవతార పురుషుడు' అనే పేరు కల్గుతుంటుంది. ఆ అవతారములు ముఖ్యముగా దశావతారములు. అవి.

> **మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః ।**
> **రామశ్చ పరశురామశ్చ బుద్ధఃకల్కి రేవచ ॥**

భగవంతుడు ధరించే ప్రతి అవతారం యొక్క లక్ష్యం ధర్మ సంస్థాపనగానే ఉంటున్నది.

> **యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
> **అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 4-7 శ్లో.**

అనే భగవద్గీతా శ్లోకం భగవంతుని అవతార రహస్యాన్ని స్పష్టంగా చాటుతున్నది. వేదాల్లో నిర్వచింపబడిన నియమాలకు మానవసంఘంలో భంగంవాటిల్లినప్పుడు, లోకంలో అధర్మం ప్రబలుతూ వుంటుంది. భగవంతుని

శాసనాలైన ఆ ధర్మాలను పునరుద్ధరించే నిమిత్తమై...... అంటే ఆ ధర్మాలను పరిరక్షించేందుకు దేవుడు అప్పుడప్పుడు అవతరిస్తూ వుంటాడనేది సారాంశం. ఆయన అవతారాలన్నీ ధర్మ పరిరక్షణ కోసమే.

భూభారాన్ని హరించి, క్షత్రియుల గర్వాన్ని అణచి, శాంతిని నెలకొల్పడానికి సాక్షాత్ విష్ణువే సూర్య తేజస్సుతో మనుష్య రూపంలో పరశురాముడుగా అవతరించాడు.

అలాంటి భగవంతుని దశావతారాలలో ఆరవదైన పరశురామావతారం ఒకటి. తాపసుడై పుట్టి, క్షాత్ర ధర్మాన్ని చేపట్టిన పరశురాముడు శాంత, వీరస్వభావాలు సమ్మేళన మొందిన అపూర్వ అవతారమూర్తి. రెండు విరుద్ధ భావాల సమన్వయం. ఒకవైపు సంహారతత్త్వం, మరొకవైపు సృష్టి తత్త్వము. ఈ రెండు విభిన్న తత్త్వాల విచిత్ర సమ్మేళనమే పరశురాముని అవతారం.

పరశురామునిలో శివతేజము, విష్ణుతేజము ఈ రెండూ సమపాళ్ళలో మిళితమైయున్నట్లు గోచరిస్తాయి. శివతేజము నిర్గుణాత్మకము, రౌద్రాత్మకము. శివతత్త్వం నుండి పరశువు అనే అస్త్రాన్ని గ్రహించి శివతేజాన్ని తనలో మిళితం చేసికొన్నాడు. శివుణ్ణి తన ఆరాధ్య దైవంగా భావించి, నిశ్చల భక్తితో పూజించి ఆయన కృపకు పాత్రుడై , భార్గవాస్త్రాన్ని పొంది శివతత్త్వాన్ని తనలో సంలీనం చేసికొన్నాడు. ఆవిధంగా పరశురామునిలో మనకు శివసంబంధి స్వరూపం గోచరిస్తుంది. విష్ణుతేజము సగుణాత్మకము, రక్షణాత్మకము.

**జామదగ్న్యోఽపి భగవాన్ రామః కమలలోచనః ।**
**ఆగామిన్యన్తరే రాజన్ వర్తయిష్యతి వై బృహత్ ॥** 9-16 - 25 శ్లో

భగవానుడు జమదగ్ని పుత్రుడు కమలనయనుడునగు రాముడు రాబోవు మన్వంతరమున వేద ప్రవర్తకుడగును. అనగా సూర్య సావర్ణిక మనుకాలమున ఇతడు సప్తర్షులలో ఒకడగును.

**నమః శ్రీవేంకటేశాయ శుద్ధ జ్ఞాన స్వరూపిణే ।**
**వాసుదేవాయ శాన్తాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**